


దుఃఖ పడువారు ధన్యులు



# మొదటి అధ్యాయం

## 1

కొన్ని వేల బిలియన్ సంవత్సరాల క్రితం, ఓ చిన్న బిందువు ఉండేది. అందులోనే కాలం ఉండేది, దూరం ఉండేది, వేలకోట్లుగా విస్తరించిన విశాల పాలపుంతలు, మహత్తరమైన నక్షత్రాలు, గ్రహాలు, కృష్ణ బిలాలు, మేఘాలు సమస్త పదార్థాలు శక్తి అంతా ఆ చిన్న బిందువులోనే కేంద్రీకృతమైయుండేది. నేనూ అక్కడే ఉండేవాన్ని. నాతో పాటు కుక్కలు, గేదెలు, పందులు అన్ని అక్కడే ఉండేవి. నేను జాగ్రత్తగా అడుగులేస్తున్న ఈ పొలం గట్టు, అట్లాగే పక్కనున్న బురద గుంత కూడా అక్కడే ఉండేది.

ఓవైపు నేనేసుకున్న చెప్పుపట్టు తప్పింది. నన్ను నేను బ్యాలెన్స్ చేసుకోలేక బురదలోకి ఒరిగాను. బురద దాటిన జాఫర్ వెనక్కి తిరిగి నన్ను చూసి నవ్వుతున్నాడు. నా పంచె, కాళ్ళు మొత్తంగా బురద. జాఫర్ కాక ఇంకెవరిదో నవ్వు వినిపించి పక్కకు చూసాను. నాకు ఇటువైపు గట్టు మీది పత్తి పొలంలోని చిన్నదాని నవ్వు. నన్ను చూసే ఆ నవ్వా(?) తన నవ్వుకి తన పక్కని వాళ్ళు కూడా నావైపు చూసి మాటలు ఆపేసి పత్తి విరుపు మానేసి ఒకరికొకరు నవ్వుని అందిపుచ్చుకుంటున్నారు. నేను చూస్తుంటే ఆ చిన్నది నవ్వు ఆపుకుంది, నే తననుండి తల తిప్పగానే మళ్ళీ నవ్వా.. ఆ కూలి వాళ్ళలో తనదే నాకు చిరాకుగా అనిపిస్తుంది. చేతిలో సుత్తె ఉంటే తన తల పగలగొట్టి ఆ మాడుని కాల్చుకొని తినేవాన్ని.

బురద తుడుచుకుంటు, అదే బురదలోనే నడుచుకుంటూ ముందుకెళ్ళాను. ముందున్న బావిలో కడుక్కోవచ్చని జాఫర్ నవ్వుతూ సూచన. కొంచెం దూరం నడిచి వెనక్కి తిరిగి చూసాను. ఆడాళ్లు, ముఖ్యంగా ఆ చిన్నది మాటికి నా వైపు చూస్తూ నవ్వుతూ. ఈ అసహ్యకరమైన సంఘటనకు కూడా బీజాలు బిలియన్ సంవత్సరాల క్రిందటి ఆ చిన్న పదార్థంలోనే ఉన్నాయి. మహా విస్ఫోటనం జరగకపోయుంటే నాకింత అవమానం జరిగేది కాదు.

ఇంతకు మునుపొకసారి ఇదే చిన్నదాని నవ్వు నన్ను గుచ్చిన సంఘటన గుర్తొచ్చింది. ఆ రోజు నేను హైదరాబాద్ నుండి ఇంటికొస్తూ రోడ్డు వైపు నుండి మా పొలంలోకి పోయాను. మా పొలంలో అమ్మవాళ్ళతో, మిగతా కూలివాళ్ళతో పాటుగా ఆ చిన్నది. అడగాల్సిన అన్ని కుశల ప్రశ్నలు, చదువు విషయాలు అయిపోయాయి. గడ్డం పెంచుకొని బక్కగా మారిపోయిన నేను ఏదైనా పెద్ద గాలొస్తే ఎగిరిపోతానని అమ్మ నవ్వింది. అమ్మతో పాటు మిగతా కులోళ్ళు కూడా నవ్వడం. వాళ్ళంటే పెద్దవాళ్ళు, నవ్వినా పోయేదేమి లేదు, కానీ అందరితో పాటే ఆ చిన్నది కూడా నవ్వడం. బుద్ధి లేదు. పెద్దలంటే బొత్తిగా గౌరవం లేదు.

సాయంత్రం పశువులకు మేత వేయడానికి దొడ్డికొచ్చాను. మా దొడ్డికి ఆవల వైపు రెండు గుడిసెలు ఉంటై. ఆ గుడిసెలు రెండు ఆ చిన్నదాని అమ్మవాళ్ళవే. తనకి ఇద్దరు అమ్మలు ఉన్నారు. రెండో పెళ్ళి చేసుకోవాల్సిన అవసరం వాళ్ళ నాన్నకి ఎందుకొచ్చిందో? మొదటి పెండ్లాంకు ఎయిడ్స్(?) అది వొట్టి పుకారై ఉండొచ్చు. ఆమెకు ఇద్దరు బిడ్డలే అయినందుకో, ఇంకేమో? రెండో పెళ్ళి చేసుకున్న మూడేళ్ళకి వాళ్ళ నాన్న చనిపోవడం నేను చూసాను.

మా గడ్డివాము దగ్గర్నుండీ ముండ్ల కంపల పైన ఆ రెండు గుడిసెలు అస్పష్టంగా కనిపిస్తాయి. ఆ చిన్నదే, నేను తలుచుకునే అదే చిన్నది. నడుముకి మెడలో వేసుకునే చున్నీ చుట్టుకొని, తలపై టవల్

కప్పుకొని చేతిలో ములికి కర్రతో కుప్పగా పోసిన ప్యారేంగ కట్టెల దగ్గరకు నిదానంగా నడుస్తున్నట్లుంది. తన వెనకాల గుడిసె దగ్గర ఇద్దరు పిల్లలు. నేను వాము లాగడం ఆపేసి ఏం చేస్తుందోనని చూసాను. కళ్ళు మాత్రమే కనిపించేటట్లు చుట్టుకున్న టవల్ ని ఒక చేత్తో చెంపకు అదుముకుంటూ మరో చేత్తో కర్రని కట్టెల్లోకి గుచ్చింది. ఈగలు ఒక్కొక్కటిగా పైకి లేస్తూ. అయినా లక్ష్యం చేయక మళ్ళి మళ్ళీ కర్రను కట్టెల్లోకి గుచ్చుతుంది. ఒక్కసారిగా ఈగలు గుంపుగా తన మీదకు లేచాయి. తను కర్రని అక్కడే పడేసి వెనక్కి పరిగెత్తింది. పిల్లలూ గుడిసెని దాటేశారు. నాకు నవ్వొచ్చింది. నా నవ్వు వినిపిస్తుందా(?) అలాంటి ఆస్కారమే లేదు. ఆ చిన్నది గుడిసె దగ్గరి నుండి ఎలా చూసిందో నావైపు చూసేసింది. మహా విస్ఫోటనం నాకిచ్చిన గొప్ప అవకాశం. మరింతగా నవ్వాలనుకున్నాను, నా నవ్వు ఆగిపోయింది. తల దించుకొని వెనక్కి మళ్ళాను. ఏం చేయాలనుకున్నాను? అసలేం చేస్తున్నాను? ఎందుకు వెనక్కి తిరిగాను? ఏమైపోయింది ధైర్యం?

నిండుగా విచ్చుకున్న బసిరి చెట్టు కొమ్మల్లో నుండి కుహు మనే శబ్దాలు, గుడి మైకు శబ్దానికి పోటీనిస్తున్నాయి. ఆకాశంలో గువ్వలన్నీ ఓ క్రమ పద్ధతిలో ముందుకు పోతూ ఉంటే, ఓ గువ్వ మాత్రం పద్ధతిని అనుసరించకుండ తోచినట్లు అటు ఇటు రెక్కలాడిస్తుంది. అర్థం కాదు, అదేందుకు క్రమాన్ని తప్పిందో అర్థం కాదు.

లేచి కూర్చొని ఒళ్ళు విరుచుకున్నాను. హైదరాబాద్‌లో ఉంటే ఇంత త్వరగా నేను లేచేవాన్ని కాదు, ఇక్కడా లేవాలనిపించదు. కానీ ఆ గుడి మైక్. ఏదొక రాత్రి లేచెల్లి ఆ మైకు తీగలు కట్ చేయాలనిపిస్తుంది, కానీ ఆ మైకు ఉన్న బసిరి చెట్టు ఎక్కేనా? ఎక్కినా కిందకు దిగేనా? ఒకవేళ ఎక్కి దిగినా వీధి కుక్కలు నన్ను దొంగ అనుకోని అరవకుండా ఉంటాయా? వీధి కుక్కలు, వీటికి బొత్తిగా సంస్కారం ఉండదు. మేమేసే అన్నం తింటూ నన్నే చూసి అరవడం(?)

నామీదున్న పరుపుని తీసేసి మెట్లు దిగాను. వదిన ఇంట్లో సామాను సర్దుతుంది. అన్న ఎద్దుల్ని దొడ్డికి పట్టుకెళ్ళుతున్నాడు. అమ్మ పశుల కొట్టంలో కశువూడుస్తుంది. ఇక నాన్నైతే ఓ బండ మీద కూర్చొని తొడపై తాళ్ళని పేనుతుంటే, పక్కన ఓ పిల్లాడి ఆసక్తి. అందరికి ఏదొక పని...గుడి ఎదురుగా ఉన్న బసిరి చెట్టు కింది కట్ట మీద కూర్చుని గుళ్ళోకి చూడడమే నా పని. ఇది కార్తీక మాసం. గుడిలో ఆడాళ్ళ హడావిడి. నాకు లానే ఏ పని చెయ్యనోళ్ళు కట్ట మీద దూరంగా ఓ ఇద్దరు కూర్చోనున్నారు. గుడిలో జరిగే తంతు మాకు అనవసరం, ఆ తంతుకు వొస్తున్న ఆ అందాలు. అందునా ఆ పట్టీలతో తిరిగే మీనాక్షి ఆంటీ. పిర్రల ఆంటీ, ఆ పిర్రల ఊపుడుకి అనుయుక్తంగ పట్టీల లయ. ఆత్ర పడే మొగాళ్ళంత తన్ని ఉంపుడుగత్తె లాగే కోరుకుంటారు. ఆ ఆంటీ ఊర్లో ఒకాయనకైతే నిజంగానే ఉంపుడుగత్తె అంట. వాడు చూస్తే ముసలోడు. ఏం చూసిందో, ఎలా పడిందో? యువకుణ్ణి, ఉడుకు రక్తం, నన్ను వాడుకోవొచ్చుగా తను. ఆ పిర్రల్ని పైకి కిందకి ఎగరేస్తాను, పెదాల్ని కొరికేస్తాను. ఎదల్ని నలిపేస్తాను.

తన చుట్టూ ఆడాళ్ళని పెట్టుకొని స్త్రీత్వం, పాతివ్రత్యం గురించి చెబుతున్నాడు పూజారి. అవే మాటలు ఆయన రోజూ చెప్తుంటాడు. స్త్రీకి సహనముండాలని, మొగుడెం చేసినా భరించాలని అదే వాళ్ళకి ఆభరణమని వాగే ఆయనతో వాదం పెట్టుకోవాలనిపిస్తుంటుంది. ఎప్పుడైనా తన మాటకు ఎదురు మాట్లాడితే మా అక్కని బావ కుక్కతో పోల్చడం నేను చూసాను. అయినా భరించాలి. అంతా మొగాడికే సపోర్ట్. అక్క ఏడుపు, బాధ ప్రపంచానికి పట్టదు. అట్లాంటి సమాజాన్ని తయారుచేస్తున్న

ఈ పూజారి అంటే నాకు పడదు. ఓ కుక్క గుళ్ళోకి వెళ్ళాలని ప్రయత్నిస్తోంది. పూజారి కొడుకు దాన్ని రాళ్ళతో బెదిరిస్తున్నాడు.

పూజారి చెర నుండి ఓ అమ్మాయి పూజ పళ్ళెంతో బయటకొచ్చి గడస్థంభం చాటుకి నిలబడింది. ఎవతో, ఎలా ఉంటుందో, ఆత్రం. మొఖానికి అడ్డుగా గడస్థంభం. పళ్ళెంని కింద పెట్టి వొంగోని స్థంబానికి బొట్లు పెడుతుంది... పింక్ వోణి, నీలం లంగా కింది అంచు మళ్ళీ పింక్. చెంపలు, ఆ చెవులకు ఉన్న కమ్మలపై పడుతూ లేస్తూ వెంట్రుకలు. తెల్లగా చేతి జబ్బలు. నేనున్న స్థలాన్ని మార్చి కట్ట మీద ఇంకో చోట కూర్చున్నాను. తను నిటారుగా నిలబడి కళ్ళు మూసుకుని స్థంబానికి మొక్కుతుంది. తనే, నన్ను చూసి నవ్విన చిన్నది. అరే, ఏంటి ఇంత ఆకర్షణీయంగా. ఆ ముక్కుకున్న పుడక అదనపు అందం. కళ్ళు తెరిచి స్థంభం నుండి నావైపు చూపు. మత్తు, నన్ను తన వైపు లాక్కుంటూ... తల దించేసాను. మళ్ళీ ఎత్తాను, స్థంభం దగ్గర లేదు. చుట్టూ చూస్తే రోడ్డు మీది లింగం దగ్గర కనిపించింది. ఆ లింగం స్థానంలో నేనుండిపోయాను. నా తలపై నూనె పోసి, నాకు బొట్లు పెట్టి, నా ముందు చక్కెర పోసి కళ్ళు మూసుకొని నన్ను మొక్కుతుంది ఆ చిన్నది. నేను లేచి తన భక్తికి మెచ్చి తన బుగ్గలపై ముద్దు పెట్టేశాను. నన్ను నెట్టేసి చిన్నది గుళ్ళోకెళ్లిపోయింది. ఓ కుక్క నా తల నాకుతుంది అటు, ఇటు.

ఆ చిన్నదాన్నే నా కళ్ళు వెంటాడుతున్నాయి. అప్పుడప్పుడు నా వైపు చూస్తోంది. పూజలు చేస్తూ తనతో పాటే నేనూ నడవాలని ఆశ. అరే, మరిచిపోయావా!!! తను నిన్ను చూసి నవ్వింది ఆరోజు. పగ, కసి... ఏడ్చేంతవరకు తన బుగ్గలు లాగి పారిపోవాలి. తను నా వెంట పడుతుంది. నేను కుక్కలా దొరకకుండ పరిగెత్తుతాను. ఈ పూజారి కొడుకు రాళ్ళని నాపై విసురుతాడు. అయినా ఏ కుక్క వాడికి మాటినదు. బయటకు వొచ్చినట్లే వొచ్చి మళ్ళీ లోపలికెళ్తున్నాయి.

గుడి మైకు ఆపు చెయ్యడంపై మొదటిసారిగా కోపమొచ్చింది. ఆడాళ్ళు ఒక్కొక్కరుగా ఇళ్ళవైపు వెళ్తున్నారు. ఆ చిన్నది వెళ్తూ నాపై ఓరకంట చూసినట్లు గుర్తు, చూసిందా?

తన పేరేంటి? ఏదో ఉంది. క తోనో చ తోనో మొదలవుతుంది. ఏం పేరు? కవిత కాదు, చాముండీనా అదీ కాదు. ఏదో ఉంది. గుర్తు రావడం లేదు. రెండేళ్ళ క్రితం తనింకా చిన్నపిల్ల. బుట్టిలో గోంగూరేసుకొని వీధులు తిరుగుతూ అమ్ముకునేది. మా అమ్మ తన్ని పిలిచేది. ఏం పేరది? జానకి, ఆ అదే... తన పేరు అదే. జానకి.

"ఓ జానకి ఆగు, పుండు కూర ఎంత?"

"కట్ట రెండు రూపాయలవ్వ. "

"రూపాయికి "

పడనివ్వదు, పడ నిచ్చేది కాదు. అవి చిన్న కట్టలే అన్నా వినదు. నవ్వుతోటే బురిడీ కొట్టిస్తుంది.

అరే, ఏంటి? అంత చిన్న పిల్లపై ఆశ పడుతున్నాను. ఎంతుంటుంది తన వయసు? నా వయసెంత? వాళ్ళక్క ఉమ నాకంటే మూడేళ్ళు చిన్న. రెండేళ్ళ క్రితమే పెళ్ళయింది. ఉమ కన్నా తను ఎంత చిన్నదో?

మధ్యాహ్నం జానకి నీకంటే ఎన్ని తరగతులు తక్కువని జాఫర్‌ని అడిగాను. నేనెందుకు అడుగుతున్నానో వాడికర్ధమైందో లేదో. వాడు అన్నాడు జానకి తమ తరగతేనని, ఐదు వరకు చదివిందని. ఐదువరకె, అప్పుడే వాళ్ళ నాన్న చనిపోయాడంట. నీ వయసెంతుండొచ్చని అడిగాను.

వాడు పదహారు అన్నాడు. అంటే జానకికి పదహారు. పదహారు అంటే చిన్నపిల్లేనా? నాకు ఇరవై రెండు. తనకి నాకు ఆరేళ్ళు తేడా.

ఈరోజు పొద్దున తన్ని చూసాను. అదే మొహం. భ్రాంతి! తను నడుస్తుంటే జాఫర్ చెప్పింది గుర్తొచ్చింది. రెండేళ్ళ క్రితం ఊర్లో జరిగిన దేవర సంబరమప్పుడు జానకి కూడా తమతో పాటే కోలేంట్ల నాట్యం నేర్చుకుందంట. తను అందరికన్నా బాగా ఏసేదంట. హైదరాబాద్ లో ఉన్న నేను ఆ నాట్యం చూడలేదు కానీ, నడక నాట్యంకి ఏ మాత్రం తీసిపోదు. అటు ఇటు అడుగులు. మీనాక్షి ఆంటీ గజ్జెలు వెనకాల. బిందువు మా ఇద్దరిని ఒకటిగా చేసేందుకే మహా విస్ఫోటనం సాగించినట్లు అర్థమైంది. నా గురించి, తన గురించి పురాతన నాగరికతల్లో ప్రవక్తలు ఏమైనా ప్రవచించారేమోనని వెతకాలనుకున్నాను, ఎవ్వరూ రాసినట్లు కనిపించలేదు. లేఖనాలు ఎక్కడైనా రహస్యంగా ఉండి ఉండొచ్చు.

బావిలో నేనూ జాఫర్ మాత్రమే ఈత కొడుతున్నాం. ఇక ఈత చాలని నేను బావి పైకొచ్చాను. దూరం నుండి ఈ దారిలో ఇంటివైపు ఆడాల్లొస్తున్నారు. వాళ్ళు పగటి కూలీకి పోయొస్తుంటారు. నా వంటి మీద డ్రాయర్ తప్ప మరేమీ లేదు. వాళ్ళు పోయేవరకు బావిలోనే ఉండాలని మళ్ళీ దూకాను. తిక్క తీత అరుపులు, ఆడాళ్ళ మాటలు, బకిటల గణగణలు, నీళ్ళ గలగలలు, బావిలో కప్పల ఒండ్రు.

ఆడాళ్ళ మాటలు తగ్గాయి, బకిటల గణగణ లేదు. జాఫర్ పైకెళ్ళి తుడుచుకుని బట్టలేసుకున్నాడు. ఎవరు లేరని అందరూ పోయారని వాడన్నాడు.

ఎంత మోసం? నవ్వుతున్నాడు జాఫర్. ఎంత నమ్మొచ్చాను నేను వాణ్ణి. జానకి తనతో పాటుగా ముగ్గురు పిల్లలు. ఎండకు మాడినట్లు కనిపిస్తుంది తన మొఖం. నా ఒంటిపై కేవలం డ్రాయర్. నన్ను వాళ్ళు చూసారా? చూస్తే ఏమవుతుంది. నేను మగోన్ని. మగోడికి ఏం సిగ్గు?

జాఫర్ని తిడుతూ నీళ్ళని తుడుచుకుంటు ముందుకు చూసాను. రోడ్డు మీద ఒక చోట ముగ్గురు పిల్లలు ఆగున్నారు, జానకి లేదు. జాఫరుకి చెప్పాను. వాడూ చూసాడు. జానకి రోడ్డుకి ఓ వైపు పొలంలో చెండు పూల చెట్టు దగ్గర ఉందన్నాడు. చేతిలో కొన్ని పూలు తీసుకొని రోడ్డు మీదకొచ్చింది. బాగోలేవేమో రెండు పూలు కింద పారేసింది. తనతో వొచ్చినవాళ్ళకిచ్చింది. తన జడలో మరొకటి పెట్టుకుంది. ఇంకా తన చేతిలో పూలు ఉన్నట్లున్నాయి.

మేమూ ఇంటి వైపుకి పోతున్నాం. జాఫర్ ముందు వెళ్తుంటే జానకి పూలు పారేసిన చోట నేనాగాను. కొన్ని పూరెమ్మలు. ముడుచుకపోయిన చెండు పూలు రెండు. ముడుచుకపోయిన చెండు పువ్వులో మాడిన జానకి మొఖం. పూలని తీసుకొని జేబులో వేసుకున్నాను.

సాయంత్రం గడ్డి తీస్తుంటే వాళ్ళ గుడిసె వైపు నుండి మాటలు. తనవే. తాను మధ్యాహ్నం దర్గా దగ్గర పాముని చూసిందని అదెంత బారుగా ఉందో చెప్తుంది. వాముని వదిలేసి వాళ్ళ గుడిసె వైపు చూసాను. గుడిసె ముందు వేసుకున్న మంచంపై జానకి వాళ్ళవ్వ. తన కింద కాళ్ళకి నూనె రాస్తూ మోకాళ్ళపై కూర్చున్న జానకి. తన మోకాళ్ళ కింద చున్నీ. జడ పై నుండి కింది బండలవరకు. తను చెప్పే పాము ఆ జడకన్నా తక్కువే ఉంటుంది. దాన్ని పట్టుకొని గుంజాలని అనిపించింది. ముసలిది ఎదురుగా నావైపు చూసింది. ఆ కళ్ళని పొడిచి పక్కకు పాడేయ్యాలి. ఎంత లావు కళ్ళు, అమ్మోరు తల్లిలాగ. నానుండి ఆ ముసల్ది ఎంతకూ తల పక్కకి తిప్పడంలేదు. నేనే వెనక్కి తిరిగాను. దొడ్లోని ఎద్దుల బండి మీద కూర్చున్నాను. జేబులో ఒత్తుగా అనిపించింది. మధ్యాహ్నం వేసుకున్న రెండు

చెండుపూలు. నలిగిపోయాయి. జానకి మొఖం నా జేబులో నలిగిపోయింది. జానకి, తాగాల్సిన మత్తు నువ్వు. నీ నవ్వుని పట్టుకునే నైపుణ్యం లేకే నీపై పగ పెంచుకున్నాను. నిన్న రాత్రి నువ్వు నాకొసమే పుట్టావా లేదానని రూపాయి బిళ్ళ ఎగరేసాను, అది అవుననే బొమ్మ పడింది. నువ్వు నా జేబులో నలిగిపోయావు. అదిగో ఆ జేబు పక్కనే నా హృదయం. నీకిక అక్కడే ఇప్పటి నుండి ఆవాసం.

దొంగ కాకి. ఇప్పుడే ఏరిగింది. నా నెత్తి మీద, నా భుజాల మీద దాని రెట్ట. పువ్వుని పారేశాను. కోపం మీద రాయిని తీసుకున్నాను.

# 2

"పెళ్ళి, పెళ్ళాం"

ఈ పదాలతో సంబంధం నేను పుట్టినప్పటి నుండే సాగింది. వరుసకు అత్తయ్యే వాళ్ళను, వాళ్ళ బిడ్డల్ని పెళ్ళాలుగా వాళ్ళకి మమ్మల్ని మొగుళ్ళుగా పిలుస్తుండేవాళ్ళు పెద్దవాళ్ళు. ఇంకొందరైతే నోరు తిరగని బూతు పదాలను వాళ్ళపై వాడేందుకు నాలాంటి చిన్నవాళ్ళకు నేర్పిస్తుండేవాళ్ళు. మేమలా బూతు పదాల్ని వాడినప్పుడు ఆ ఆడవాళ్ళు మొఖానికి మసి పూసో, లేక నిక్కరుచ్చో ఏదో విధంగా అల్లరిపెట్టి ఏడిపిస్తారు. బూతు పదాలు వాడుతున్నట్లు ఇంట్లో తెలిస్తే ఇంట్లోవాళ్ళు తిట్టేవాళ్ళు, కొట్టేవాళ్ళు. అప్పటికి నాలాంటి పిల్లలకు బూతు పదాలు పలకడం కొట్టించుకునేంత నేరం. కానీ అలా అనడంలో ఆనందం దొరుకుతుంది.

లంజ అంటే తిడతారు, ఇంకేదో బూతు పదం వాడితే తిడతారు. అసలు ఏంటి ఇదంతా? ఆ పదాలకు అర్థాలు తెలుసుకునేందుకు చిట్టి బుర్రలు పరుగులెట్టేవి. అడగకపోయిన బూతులకు అర్థాలను జననాంగాల అవసరాల్ని, అవెక్కడ వాడాలనే విషయాలని నవ్వుతూనే చెప్పేవాళ్ళు చుట్టూరా ఉండే కొందరు. ఆ మాటలతో నా తోటి ఆడపిల్లల్ని బట్టల్లేకుండా హత్తుకునేవాన్ని. బూతు పనులు చేసి దొరికితే ఇంట్లో తంతారని తెలిసి పరుపులు కప్పుకోనో లేకపోతే గోడల చాటుకో.

ఏది తప్పు?

ఇలా ప్రశ్నలు పిల్లల్ని అడిగితే ఏం చెప్తారు? వాళ్ళని కొట్టేందుకు, తిట్టేందుకు సాయపడే ప్రతిదీ తప్పే. అందుకే ఇష్టమైన బూతు పనిని రహస్యంగా చేయొచ్చు కానీ, ఎవరు ఎన్నైనా చెప్పనీ బూతు పని చేయడం నాకప్పటికి తప్పు కాదు. డబ్బులు అడగడం తప్పు, తెలీకుండా నాన్న జేబులోనుండి తీస్కోవడం తప్పుకాదు. రహస్యంగా కూడా తప్పు చేయకుండా ఉండాలంటే? ఏం చెప్పాలి? ఎలా నేర్పించాలి?

“మనల్నంత దేవుడు మన్నుతోటి సేసి అమ్మ కడుపులోన ఏసినాడు. మల్ల ఎప్పుడోసారి దేవుడు ఇట్నుంచి అట్లే పైకి తీస్కపోతాడు. మనం ఈడ ఏమేమి తప్పులు సేసింటమో ఆ తప్పులకల్ల పైన శిచ్చ ఉంటాది. సలసల కాగే నూనెలోన యేస్తారు, పాములతోటి కొరికిపిస్తరు.”

అక్క ఎప్పుడూ చెప్తుండేది నాకు. దేవుడంటే నాన్న కన్నా అందరి కన్నా కూడా పెద్దమంచంట. నాన్నకు భయపడకపోయినా కూడా ఈయనకు ఖచ్చితంగా భయపడాల్సిందేనంట. కళ్ళముందు చనిపోతున్న వాళ్ళంతా వెళ్తుంది ఆ దేవుడి దగ్గరకేనంట. మొదట్లో దేవుణ్ణి ఆకాశంలో ఉండేవాడని

చెప్పేది అక్క. ఆ తరవాత దేవుడు అంతా ఉంటాడంట. ఆయన చూడని, ఉండని స్థలమే లేదంట. తప్పు పని అని ఏదైతే పెద్దవాళ్ళు చెప్తారో ఆ పనులు రహస్యంగా చేసినా కూడా దేవుడు చూస్తాడంట. తప్పొప్పులు నిర్ణయించేది ఆయనేనమాట. ఆయనకు భయపడి భూమ్మీద వుండేవాళ్ళంత మంచిగా ఉంటున్నారంట.

ఇంట్లో నాన్నలు అమ్మల్ని అదే బూతు పని చేస్తుంటారని తెలిసి వాళ్ళంతా అలా చేయడం తప్పుకదా అనిపించేది, కానది ఆలు మొగుడు చేస్తే తప్పు కాదంట. కేవలం పెళ్ళాం మొగుడు అంతే. పిల్లలు చేస్తేనే తప్పంట. అంటే పెద్దయ్యాక పెళ్ళి చేసుకొని అట్లాంటి బూతు పనులు చేసుకోవొచ్చు అన్నమాట. మరి నేను పెద్దగయ్యేది ఎప్పుడు? ఎవర్ని పెళ్ళి చేసుకుంటే బాగుంటుంది?

వయసు, విషయ పరిజ్ఞానం పెరిగేకొద్దీ కళ్ళముందు జరిగే కొన్ని పరిస్థితులు నా చిట్టిబుర్రని చికాకు పరుస్తుండేవి. అమ్మతో కాకుండా వేరేవాళ్ళతో నాన్న బూతు పని చేయడం నేను చూసాను. పెళ్ళాంతో కాకుండా వేరేవాళ్ళతో చేయడం తప్పు కదా? మరి నాన్న చేస్తుందేంటి? కొట్లాడరాదని అక్క చెప్తుండేది కానీ అక్క అన్నతో ఎప్పుడూ కోట్లటా. అమ్మానాన్నలని గౌరవించాలని విన్నాను కానీ ముసలి అయిపోయిన నాన్నని కొట్టే ఇంటి పక్కనాయన. దొంగతనం చేయరాదు, మరి తిరుణాలలో అన్న ఎత్తుకొస్తున్న బొమ్మలు. ఇవే కాదు, ఇలాంటివెన్నో విషయాలు నన్ను చికాకు పరుస్తుండేవి. వాళ్ళంతా ఎందుకు చేస్తున్న తప్పు గురించి ఆలోచించరో అర్థమయ్యేది కాదు. కానీ నేను మాత్రం వాటికి ఎంత వీలైతే అంతా దూరంగా ఉండేందుకు ప్రయత్నించేవాడిని. అయినా పరిస్థితులు నన్నూ మురికికూపంలోకి తోస్తుండేవి. తప్పు చేయకూడదనుకుంటూనే బూతు పనులు చేసేవాణ్ణి, రాత్రుళ్ళు అక్కని గట్టిగా వాటేసుకునేవాణ్ణి. ఎందరితోనో అనవసరంగా గొడవలు పెట్టుకునేవాణ్ని.. అబద్దాలు, దొంగతనాలు. మరోవైపు ఎందుకు ఇదంతా చేస్తున్నాననే భయం, అయినా మానుకోలేకపోవడం.

దేవుడు తప్పు పనులు చేసిన వాళ్ళని శిక్షిస్తున్నాడు. మరి ఆయన చెప్పినట్లే బతినన్నాలు చేస్తూ పోతే! ఇంకేం మనం కూడా ఆ తరవాత దేవుళ్ళుగా మారిపోతామంట. అంటే నేను కూడా వాళ్ళలాగే మాయలు చేయొచ్చు. ఓం భూమ్ అని ఎవరి పూకునైనా భయం లేకుండ చూడొచ్చు. దేవుడైపోయిన నాకిక తప్పొప్పుల భయం అక్కర్లేదు. ఊరట కలిగిస్తున్న నమ్మకం. మరి ఆ అదృష్టం రావాలంటే,

నేనూ దేవుడు కావాలంటే,

తప్పేదు, పెద్దలు చెప్పే తప్పులు మానెయ్యాలి. చచ్చాక నే పొందాలనుకున్నా అదృష్టపు ఆశ. ఈ జీవితం ఇక్కడ ముసలివరకే అంట. కొంతమంది ముసలి కాకుండానే చనిపోతారు కాబట్టి ఈ జీవితం చిన్నదంట. చచ్చాకా దేవుడిగా మారిన జీవితం ఎప్పుడూ ఉంటుందట. అంటే ఈ చిన్న జీవితం మనకొక చిన్నిపరీక్ష.

బళ్ళో టీచర్లు, పూజార్లు, పుస్తకాలు, తాతలు ఇలా చెప్పే వాళ్ళ నుండి నే పోగేసుకుంటున్న తప్పొప్పుల జాబితా రోజు రోజుటికీ పెరిగిపోసాగింది. తెలీకుండానే తప్పులు కొన్ని చేస్తున్నాను కానీ బూతు మాత్రం మానేశాను. బూతు పనే అన్ని తప్పుల్లోకెల్ల అతి పెద్ద తప్పంట. అయినా దాన్ని అందుకోవాలని ఆశ. రహస్యంగా బూతు పనులు చేసేవాళ్ళ గురించి మాట్లాడ్డం, అలా ఆలోచించడం ఓ సరదా, చేయడం మాత్రమే నాకు అర్థమయిన తప్పు.

నాకిష్టమైన ఓ పెద్దతప్పుని ఇష్టంగా మారుస్తుంది పెళ్ళి. మరి ఎవర్ని పెళ్ళి చేసుకోవాలి!!! ఎవరితో ఆ పనిని పెద్దయ్యాక తప్పుకాకుండ చేయాలి? కేవలం మామ కూతుళ్ళని, అది కూడా ఒక్కరిని

మాత్రమే పెళ్ళి చేసుకోవాలంట. ఒక్కరిని మాత్రమే, ఇందరి ఆడపిల్లల్లో ఆ ఒక్కరిని ఎన్నుకోవడం? ఎవరైతే బాగుంటుందో! మా ఊరి పక్కనే ఉండే బట్టనెత్తి మామ కూతురు శిరీషే నా పెళ్ళామని అక్క గేలి చేసేది ఎప్పుడూ. కానీ, ఆ ఒక్కరూ శిరీష అయితే మిగతా వాళ్ళెవ్వరు అక్కరుండదు. మిగతావాళ్ళలో శ్రీలత కూడా ఉంటుంది. శ్రీలత కూడా మామ కూతురే. వయసులో నాకంటే ఆర్నెల్లు పెద్దంటా. శ్రీలత నాతోపాటే బడికొస్తుంది, తన బలపాలు, పెన్నులు ఇస్తుంది. అక్కకి నేనన్నా, శ్రీలత అన్నా ఎంతిష్టమో. మేమిద్దరం ఒకే చోటే కూర్చుంటాం, తిరుగుతాం, ఆడుతాం, పాడుతాం. మరి తను. పోనీ శ్రీలతేనే పెళ్ళి చేసుకుంటే.

తరగతులు పెరిగేకొద్ది పరిస్థితులు చూసేకొద్ది పంథాలు మారుతుండేవి. శ్రీలత కాకపోతే ఇంటి పక్కనుండే సునీత. తను చేతులకు గోరింటాకు తెస్తుంటుంది. సునీత కాకుంటే వాళ్ళింటి పక్కనుండే చాంధుబీ. మూడో తరగతిలో కొత్తగా మా ఊర్లోకొచ్చిన మరాఠీ పిల్ల శ్వేత నవ్వుతూ మాట్లాడుతుంది. కొత్త పాటలు, కొత్త కథలు చెప్తుంటుంది. వీళ్ళు మాత్రమేనా మల్లీశ్వరి,లక్ష్మీ, రమాదేవి. దేవుడు ఒక్కరినే చేసుకోమని చెప్పాడు. లేకుంటే ఎందర్ని చేసుకోవాలని ఆశిండేదో.

ఆరో తరగతిలో నాకు ఓ మాదిగ అబ్బాయి నుండి యేసుక్రీస్తు పరిచయమయ్యాడు. యేసుక్రీస్తు బొమ్మల పుస్తకాన్ని అతడి దగ్గరినుండే చదివి యేసుకి నేనో భక్తునయ్యాను. నేను పుట్టుకతో యాదవ కులంలో పుట్టిన హిందువుణ్ణి. అయినా యేసుక్రీస్తు ప్రభావం హిందుత్వంపై పడలేదు. నాకు యేసు ఇష్టమైనప్పటికి శివుడు ఇంకా ఇష్టమే. అలాగే మా అవ్వ నేర్పిన బ్రహ్మంగారు. వీళ్ళంతా ఒకవేళ నేను తప్పు చేస్తే రక్షించుకునేందుకు వాడాల్సిన కవచాలు.

మా ఊర్లో ఏడవతరగతి వరకే బడి కావడంతో మిగతా చదువుకై పక్కూరికి రోజూ నడిచెల్లెవాడిని. శ్రీలత చదువు మానేసి అమ్మానాన్నలతో కలిసి పనికి వలసెల్లిపోయింది. శ్వేత పట్నంలో గర్ల్స్ హాస్టల్లో జాయినయ్యింది. శ్రీలత మరియు శ్వేత వీళ్ళిద్దరులోనే ఎవరో ఒకరు నా భార్య కావాలని గట్టిగా సంకల్పించుకున్నాను. ఇక వీళ్ళని కాదని మిగతవాళ్ళకు అవకాశాలు మొత్తం తప్పించేసాను. ఆ మాదిగబ్బాయి ఇచ్చిన బైబిల్ కొత్త నిబంధన చదవడం మొదలెట్టాను. యేసు చెప్పిన ఎన్నో వాక్యాలు నన్ను పదే పదే వెంటాడేవి. అందులో మత్తయి సువార్తలోని ఈ పదాలు మరింత గాఢంగా

"వ్యభిచారము చేయవద్దని చెప్పబడిన మాట మీరు విన్నారుగదా; నేను మీతో చెప్పునదేమనగా ఒక స్త్రీని మోహపుచూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును. "

అంటే కామంతో ఆలోచించడం, ఊహించడం కూడా తప్పే. నరకంలో నే పడకుండా ఉండేందుకు నేనిప్పుడు ఆ పనులు వదిలెయ్యాల్సిన గత్యంతరం. లేకుంటే అగ్ని కురిసే ఆ నరకం, ఆ పాపుల అరుపులు. పెళ్ళయేంత వరకు కోరికని అణుచుకుంటే, ఈ చిన్ని జీవితాన్ని పాపానికి దూరంగా పెట్టేస్తే, ఇక ఆ తరువాత రాబోయే శాశ్వత స్వర్గం. స్వర్గంలో బూతు స్వేచ్ఛగా దొరుకుతుందేమో.

నేను మరింత కఠినంగా తయారయ్యేందుకు ప్రయత్నిస్తున్నాను అయినా అవే ఆలోచనలే ఎక్కడినుండి వస్తున్నాయో అలా వచ్చేసేవి. బూతు మాటలు మాట్లాడ్డం మానేశాను, అయినా అవే మాట్లాడాలని నాలుకకు ఆరాటం. ఆ పదాలు వినిపిస్తే దూరం జరిగేవాణ్ణి, అవే వినాలని చెవులకు తాపత్రయం. నాకు పూర్తి ఆప్త మిత్రులుగా అనిపించే ఒకరిద్దరితో మాత్రం ఉండబట్టలేక బూతు కబుర్లు

చెప్పేవాన్ని, వినేవాన్ని. తరవాత దేవుణ్ణి క్షమించమని వేడుకోలు. క్షమాపణలో కన్నీళ్ళ ప్రార్థన అనేది గొప్పదంట. అందుకే యేసుని క్షమించమని అడిగేందుకు కళ్ళు మూసుకొని ఏడ్చేవాన్ని.

నేను తొమ్మిదో తరగతిలో ఉన్నప్పుడు సుధారాణి అనే అమ్మాయి నావైపు తరగతిలో ఎప్పుడూ చూస్తూ కనిపించేది. నా స్నేహితులు తను నన్ను ప్రేమిస్తుందని రూఢీ చేసేసారు. చూడ్డానికి సుధారాణిది అంత ఆకర్షణీయమైన శరీరం కాదు. బక్కగా, ఎత్తుగా, పళ్ళు ముందుకొచ్చి... నన్ను ప్రేమించే వాళ్ళు తరగతిలోని పుష్పవతో, మహేశ్వరో అయితే ఎంత బాగు. వీళ్ళు అందగత్తెలు కాబట్టే ఇద్దర్ని చాలామందే ప్రేమించేందుకు ప్రయత్నిస్తున్నారు. ఆ పనులు తప్పుగా భావించే నేనెవ్వరి కోసం ప్రయత్నించే వాన్ని కాదు. మనసులో వాళ్ళు నన్ను ప్రేమించాలని, బూతు పనికి ఒప్పుకోవాలని బలమైన కోరికలు పెరుగుతున్నా, బయటకు మాత్రం వాళ్ళకూ నాకు ఏ సంబంధం లేనట్లే కనిపించేవాన్ని. బూతు మాటలకు, అలాంటి చేష్టలకు దూరమున్నట్లు కనిపించే నేను తరగతిలో అందరిలో ఉత్తమున్ణి, నా అసలు స్వరూపం వాళ్ళకు తెలీదు, అదీ కేవలం ఊరిలో నాకంటే చిన్నవాళ్ళైన ముగ్గురు నలుగురు స్నేహితులకు తప్ప.

అసలు నా మనసు మహేశ్వరిని, పుష్పవతి లాంటి వాళ్ళని ప్రేమించాలని సుధారాణిని వద్దని ఎలా చెప్తుంది? కేవలం తనకు లేని మరియు వాళ్ళకు ఉన్న ఆ అందమైన శరీరం? ప్రేమ అనేది అందం అనే కొలబద్ధ లేకుండా సహజంగా కలగదా? మరియు ప్రేమ వలన శాంతి వస్తుందంటారు, ఇందులో నిజమనేది ఉందా?

అందం అంటే ఏంటి?
నాకప్పటికి అర్థమయ్యింది
నా చుట్టున్న వాళ్ళు,
నేను చదువుతున్న పుస్తకాలు,
సినిమాలు
వర్ణిస్తున్న స్త్రీ శరీరాలు.

ఇలా ఉంటేనే గొప్పతనం అని నే వినడం. ఎంత మెదడు చించుకున్నా కూడా నా మనసు కేవలం అలాంటి ఆ అందగత్తెలని, వాళ్ళు ఎలాంటి వాళ్ళైనా కూడా నేను నాకోణంలో నా చుట్టున్న వాళ్ళ నుండి గొప్పగా ఊహించుకుంటున్న శరీరాకృతి ఉన్నవాళ్ళనే కోరుకుంటుంది కానీ, దాన్ని దాటి లోపం ఉన్న శరీరాలని మిగతా వాళ్ళని కాదని అర్థమవుతుంది. నేను శ్రీలతను పెళ్ళి చేసుకోగలను లేకపోతే శ్వేతా, పోనీ సునీత. మరీ నల్ల శరీరంతో దొడ్డ పెదాలతో పెద్ద ముక్కుతో చూడ్డానికి వికారంగ కనిపించే మరో స్నేహితురాలు ఈరాక్షిని పెళ్ళి చేసుకోలేను. మరి ఇక్కడ హృదయాలని, సహజత్వాలని ఇష్టపడి కోరుకునే అవకాశం మనసు ఎక్కడ ఇస్తుంది? అందవిహీనంగా అనుకుంటున్నందుకే సుధారాణిని వద్దంటుంది నా మనసు. సినిమాల్లోని హీరోకి జోడిగా అందగత్తెనే ప్రేమికురాలు. అక్కడే కాదు, అంతటా అంతే. అందం అనే ఆ శరీరాలకోసం మాత్రమే ఆరాటం. నేను కూడా వాళ్ళలో ఒకన్నేనా లేదా నేను ముందుగానే శ్రీలతని పెళ్ళిచేసుకోవాలనుకున్నాను కాబట్టే సుధారాణిని ప్రేమించలేకున్నానా. మరైతే పుష్పవతిని, మహేశ్వరిని ఎందుకు కోరుతున్నట్లు? నా హృదయం ఇది అబద్ధమని ఎంత చెప్తున్నా నేను ఒప్పుకోవడం లేదు. అందుకే నన్ను ఇంతలా ఇబ్బంది పెడుతున్న పుష్పవతి,

మహేశ్వరీలపై శ్రద్ధ తగ్గించేసాను. సుధారాణి మాత్రం నా వైపు ఎప్పుడూ చూస్తుండేది. నాతో మాట్లాడేందుకు తన ప్రయత్నాలు.

వలసకెళ్ళిన శ్రీలత అప్పుడప్పుడు ఊరికి వొస్తున్నా మా ఇంటికి రావడం లేదు. కారణమేమో అర్థంకాలేదు. ఊర్లో ఉండే ఆ కాసిన్ని రోజులు తనని చూడాలని, మాట్లాడాలని ఒకటే ఉబులాటం నాలో. త్వరగానే తాను హైద్రాబాదో లేక గుంటురో తిరిగి పనికి వెళ్తుండడంతో మాట్లాడేందుకు గండి పడుతున్న అవకాశాలు. నా పదో తరగతి పరిక్షలప్పుడే తనకు పెళ్ళి కుదిరినట్లు తెలిసింది. అందరిలో మంచివాడిగా, ఉత్తముడిగా పేరున్న నేను ఏమి చేయలేని పరిస్థితి అది. శ్రీలత పెళ్ళినాడే నేను రాసిన పదో తరగతి పరీక్ష ఫలితాలొచ్చాయి. మంచి మార్కులతో బడిలోనే కాదు మండలంలోనే నేనే ఫస్ట్. ఒకవైపు బాధ, మరోవైపు సంతోషం. పెళ్ళికూతురుగా ముస్తాబైన శ్రీలత ముఖం వైపు పదే పదే చూస్తూ తను నావైపు చూస్తుందేమోనని ఆశించాను. నాకు లాగా తనేం నన్ను ప్రత్యేకంగా మాత్రం చూడలేదు.

ఇక పోతే నా రెండవ ఆప్షన్ అయిన శ్వేత హాస్టల్లో జాయినయ్యాక ఊరికి రావడం తగ్గించేసింది. శ్వేత మా ఊర్లో ఒకరిని ప్రేమిస్తుందని, వాళ్ళతో తను చదివే ఆ ఊర్లో తిరుగుతుందని విన్నాను. అయినా శ్వేతకు నేనంటే ఇంకా శ్రద్ద ఉందేమోనని ఆశించాను. తను ఊరికి వొచ్చినప్పుడు తన కళ్ళముందే నేను తిరిగినా కూడా తాను నాపై కనీసం పలకరింపైనా విసిరేది కాదు. తనకు మాట్లాడ్డం సిగ్గేమో. చనువు తీసుకొని నేనే మాట్లాడాలని ప్రయత్నిస్తున్నా కూడా తప్పుకునేందుకు చూస్తున్నట్లు కనిపించేది. ఇక తనని ఆశించడం వృధా అనుకున్నాను. ఆ సమయంలోనే వాళ్ళు ఊరు విడిచి శాశ్వతంగా మరోచోటికి మకాం మార్చేశారు.

శ్వేత పోయింది, శ్రీలతా పోయింది మరిప్పుడు ఎవరు? నా చదువు పూర్తికావడంతో పక్క ఊరికి వెళ్ళే పరిస్థితి కూడా లేదు. లేకుంటే అక్కడుంటే పుష్పవతో, మహేశ్వరో లేకపోతే సుధారాణినో. అయినా అక్కడున్నా కూడా పుష్పవతి, మహేశ్వర్లని ఎందరో ప్రయత్నించారు కాబట్టి నేను వాళ్ళలో ఒకరిని కాలేను. ఇక సుధారాణిని అయితే అస్సలు కుదరదు. మరి నేనెవ్వరిని పెళ్ళి చేసుకోవాలి? నాకిష్టమైన బూతు పని ఎవరితో చేస్తాను? ఆ వొచ్చేవాళ్ళు ఎక్కడున్నారు?

ఆ సమయాల్లో నేను హస్త ప్రయోగాలకు బానిసయ్యాను. ఈ పనిని నేను మా ఇంటికి రోజూ వొచ్చే ఓ పెద్దాయన మొబైల్లో ఎవరికీ తెలీకుండా నీలి చిత్రాలు చూస్తున్నప్పటి నుండి. ఆ రోజు నేను గట్టిగా పరుపులను చుట్టుకొని పడుకున్నాను. నా బుల్లి నుండి కొద్దిసేపుకి ఏదో ద్రవం. ఇలా అంతకు మునుపెప్పుడు కావడం నేను గమనించలేదు. అది నాకు కొత్త అనుభవం, ఏదో తప్పు చేశాననే భావం. ఇంకెప్పుడు ఇలా చేయరాదని అనుకున్నా రోజూ దిండుని హత్తుకొని స్రవించేవాన్ని, తిరిగి దేవుణ్ణి క్షమించమని వేడుకోలు. బైబిల్ దేవుడు క్షమాపణల దేవుడు. మనం ఎన్ని తప్పు పనులు చేసినా కూడా ఆయన్ని ఒక్క క్షమాపణ అడిగితే చాలు, అతడు క్షమించేస్తాడు. అయినా ఇలా క్షమాపణలు ఎన్ని సార్లు అడగాలో? ఇది తప్పని తెలిసినా కూడా నేనేందుకు దీన్ని మానేయ్యడం లేదో. ఎందుకంటే స్త్రీని అలా మోహపు కోరికతో ఊహించుకున్నా కూడా పాపమే. పోనీ ఒకసారి డైరెక్ట్‌గా బూతు పని చేస్తే, ఆ కోరిక పూర్తిగా నానుండి వెళ్ళిపోతుందేమో. ఆ తరవాత మళ్ళీ మళ్ళీ హస్త ప్రయోగాలు చేసుకునే గత్యంతరం ఉండదేమో. ఇంకెప్పుడు తప్పు చేయకుండా ఉండేందుకు ఒక తప్పు. మరి ఆ అవకాశం ఎలా పొందాలి?

బట్టనెత్తి తల మామ కూతురు శిరీష ఒకసారి పండగకని ఊరొచ్చి నా పక్కనే పడుకుంది. ఇదే నాకు చిక్కిన అవకాశమనిపించింది. రాత్రి తన శరీరంపై ఎక్కడంటే అక్కడ చేతులేశాను. నా ప్యాంటు విప్పి గట్టిగా హత్తుకున్నాను. తను మేల్కొని నన్ను విడిపించుకొని కూర్చుంది. నాకు భయమేసి పక్కకు తిరిగి పడుకున్నాను. కొద్దిసేపటికి తనేమనకుండా సాధారణంగానే తిరిగి పడుకుంది కానీ, నాలో ఆలోచనల జ్వాల. అయ్యో! నేనేంటి ఇలా చేస్తున్నాను. ఒకసారి ఇలా తప్పు పని చేశాకా తిరిగి ఆ కోరిక పుట్టదని ఖచ్చితమేంటి? ఖచ్చితంగా తిరిగి హస్తప్రయోగం లాగే ఇంకోసారి ఇదీ చేయాలనిపిస్తుంటుంది. హస్త ప్రయోగం చిన్న తప్పే, కానీ బూతు పని ఎంత పెద్ద తప్పో. ఒక్కసారి తప్పు అనేది తెలియక చేస్తేనే అవుతుంది, తెలిసికూడా కావాలనే చేస్తే, దాన్నెందుకు దేవుడు క్షమిస్తాడు. నేనెందుకు ఇలా పదే పదే బూతు పనికై ఆలోచిస్తుంటాను. నాకిక నరకమే గతా! పోనీ శిరీషనే పెళ్ళి చేసుకుంటే ఇప్పటి తప్పు ఒప్పుకావచ్చు. శిరీష ఇప్పుడు నే చేసిన ఈ విషయం పొద్దున ఎవరికైనా చెప్తే. అప్పటివరకు నాకున్న మంచి పేరు కూడా నాశనమవ్వడం. హస్తప్రయోగం చేసుకొని పడుకున్నా ఇవే ఆలోచనలు. పొద్దున శిరీష మామూలుగానే తిరుగులాడుతూ రాత్రేమి తెలియనట్లే ఉండిపోయింది. ఊపిరి పీల్చుకోగలిగాను.

నేను ఇంటర్ కర్నూల్‌లో బాయ్స్ హాస్టల్లో చేరాను. ఇప్పుడు నా పెళ్ళి కోరిక ఊర్లో ఇంటి పక్కనుండే సునీత మీదకు మళ్ళింది. తను ఎనిమిదిలోనే చదువు మానేసి అమ్మ వాళ్ళతో కూలిపనికి వెళ్తుండేది. ఊర్లోని మిగతా వాళ్ళతో పోల్చుకుంటే ఇప్పుడు తనే నాతో ఆసక్తిగా మాట్లాడుతుంటుంది. తనని పెళ్ళి చేసుకోవాలంటే ముందుగా ఇంట్లో వాళ్ళని ఒప్పించగలగాలి. నేను మంచి మార్కులు తెచ్చుకొని అమ్మవాళ్ళకు ఊర్లో పేరు తెస్తే నా మాటల్ని వాళ్ళు ఖచ్చితంగా ఒప్పుకోగలరు. అందుకే మొండిగా చదివేవాన్ని. ఇక రెండొవది తనకు నా ప్రేమ విషయాన్ని చెప్పెయ్యడం. తీవ్ర మోహమాటమైన నేను తనకి ఈ విషయాన్ని ఎలా చెప్పాలో? అయినా కూడా ధైర్యం చేసేలోగానే నా రూపం గుర్తొచ్చి నేను ఆగిపోయాను. నేను అందవికారంగా ఉన్నవాళ్ళని ప్రేమించడం లేదు, మరి అందవికారంగా ఉన్న నన్ను తను ప్రేమిస్తుందా? నాకు ఉన్న కంటి అద్దాల వలన బడి నుండే నేను గుడ్డివాణ్ణని చాలామంది గేలి చేస్తుండే వాళ్ళు. అద్దాలు తీస్తే ఏవీ సరిగ్గా కనిపించవు, మరియు నాకు ఉన్న బట్టలన్నీ చినుగులు ఉన్నవే. కాలేజీలో నా బట్టల మీద ప్రతిరోజు ఎగతాళిలు, నవ్వులాటలు. ఇలా మంచిబట్టలు వేసుకోకపోడానికి, కాలేజీలో కనీస అవసరాలను నాన్నకు చెప్పుకోకపోడానికి సిగ్గు ప్రధాన కారణమైతే రెండవది ఈ బాహ్య మెరుపులు నీచమనే బ్రహ్మంగారి తత్వాలు. డబ్బు అది అమ్మవాళ్ళది. వాళ్ళ చెమటతో తడిసిన దాన్ని నేను చదువుకోసం మాత్రమే ఉపయోగిస్తేనే న్యాయం, అనవసర ఆడంబరాలకు కాదు. నేను చేసే పనులు పిచ్చోడిలా ఉంటాయని ఊర్లో పిచ్చిరాముడని నాకో బిరుదు. వీటన్నింటి మూలంగా నేను సునీతకు చెప్పాల్సిన ప్రేమ విషయంలో వెనకడుగు వేసాను. అయినా నాలో ఆశ చావలేదు. మంచిగా చదివి ఇంకా మంచి పేరొస్తే తనే నన్ను కోరుకునెందుకు అదో అర్హత అవుతుందని, అది ఏదోనాటికి సాధ్యమవుతుందని బలంగా నమ్మేవాన్ని. సునీత ముందు అద్దాలు తీసి నడిచేవాణ్ణి. సునీత నాతో బాగానే మాట్లాడుతున్న అది కొన్నిసార్లు ఆసక్తితో కాదేమోనని సందేహం.

సునీతని నేను కోరుకుంటున్నాను, తను నాకు దక్కాలని ప్రతి రోజు ప్రార్థనలో విన్నపాలు. కాలేజి వాతావరణం నాలో ఉండే కామత్వాన్ని మరింత పెంచేసింది. ఎంతగా అంటే ముసలివాళ్ళనీ చూసిన కూడా నాలో కామం పుట్టేది కానీ, తప్పు చేస్తున్నావని లోపలి నుండి దేవుడి హెచ్చరిక. నా మనసులో

నేను చేసే హస్త ప్రయోగాలకై ఊహించుకుంటున్న మహిళల వలన పూర్తి అపరాధభావం నిండిపోయింది. ఏదో నేను వద్దు వద్దునుకుంటూనే ఎవరెవర్నో ఉహించుకుంటున్నాను. ఒక్కరినే అనుకుంటే ఇప్పుడు ఇంకా కొందరు. నా జీవితమే ఇంతేనా? తప్పు చేయడం, తర్వాత పశ్చాత్తాప్పడటం. ఈ అపరాధ భావం కూడా నా బాహ్య శరీరంపై శ్రద్ధను పూర్తిగా తగ్గించేసింది. దానికి మెరుపులు అద్దుకొని ఒకరిని ఆకర్షించడం అసహ్యమనిపించేది. ఎప్పుడు తప్పుడు ఆలోచనలతో గడిపే నాకు అమ్మవాళ్ళని డబ్బులపేరు చెప్పి దాన్ని ఆడంబరాలకు ఉపయోగించాలని చూడ్డం మోసమనిపించేది.

నాలోపటి మనిషి నాతో ఎప్పటి నుండో వున్నాడు. ఈ భూమ్మీద ఎన్నో నేరాలు చేస్తూ దర్జాగా తిరిగేవాళ్ళు ఉన్నారు కానీ, వాళ్ళు అలా ఎలా తిరుగుతారో అర్థమయ్యేది కాదు. చాలామందికి తాము చేసే పనిమీదే ఆసక్తి లేనట్లు గమనించాను. కేవలం పక్కవాడి మెప్పుకోసం, నలుగురిలో గౌరవం కోసం మాత్రమే ఆసక్తి ఉన్నట్లు నటిస్తున్నారు. ఆ నలుగురు కూడా తనలాంటి వాళ్ళేనని వీళ్ళకెందుకు అర్థమవ్వదో.

సునీత కూడా నాలాంటిదే. సునీతే కాదు, చాంధుబీ ఇకపోతే ఏ అమ్మాయైనా, అబ్బాయైనా అందరూ నాలాంటి వాళ్ళే. వాళ్ళంతా నాకు ప్రతిబింబాలే. నాకు కామ కోరికలు ఉన్నట్లే నా పరిస్థితిలోనే పెరిగిన వాళ్ళకూ ఉంటాయి. నేను కేవలం అందగత్తెలనే కోరినట్లు వాళ్ళు కూడా అందంగా మెరుస్తూ, సంఘంలో మొనగాడిగా కనిపించేవాళ్ళనే కోరుకుంటారు. అలా మెరిసేందుకు నాకు చేతకాదు. తిరిగి నా మెదడులో ఎప్పుడూ జరిగే యుద్ధాలు. తప్పులు చేస్తున్నానని శరీరం శుష్కించేది. సునీతని పడగొట్టేందుకు ఏ నేరభావం నన్ను బాధించకుండా ఉపయోగపడే ఆయుధం చదువు మాత్రమే. అద్దాలతో ఉండే నేను సునీతని నేరుగా చూడలేక బయటి పరిసరాలలో వెళ్తుంటే తనని ఇంటి అద్దంలో చూసి సంతోషించేవాన్ని. నేరుగా అద్దాలు పెట్టుకొని తనని ఎదురుగా చూడాలంటే సిగ్గేసేది.

రెండవ సంవత్సర దసరా సెలవుల్లో సునీత ఊర్లోనే మరొకరిని ప్రేమిస్తున్నట్లు తెలిసింది. ఆ విషయం చెప్పింది నా స్నేహితుల్లో ఒకరైన మల్లేష్. నా స్నేహితులు ఎవరూ నా తరగతి వాళ్ళు కాదు, అంత చిన్నవాళ్ళే. పొట్టివాడైన మల్లేష్ నా కంటే మూడేళ్ళు మాత్రమే చిన్న అయ్యుండొచ్చు కానీ, పొట్టిగా ఉండటం వలన మరీ పిల్లాడిలా కనిపించేవాడు ఊర్లోని అందరికి. ఆ పొట్టివాడికి, సునీతకు భలే నేస్తం. మల్లేష్ కనిపిస్తున్నట్లుగానే చిన్నోడేనని రాత్రి కట్ట మీద సునీత తన పక్కనే వాణ్ణి పడుకోబెట్టుకున్నా ఎవరు ఎలాంటి తప్పు ఊహించలేదు. ఆ పొట్టోడే మహా ముదురు. సునీతపై ఎక్కడంటే అక్కడ చేతులు వేసేవాడంట. సునీతని హత్తుకున్నా తిరిగి తను సహకరించేదేనట. ఈ విషయాలు గర్వంగా నేను ఊరికి వొచ్చినప్పుడు చెప్తుంటే వాడెంత అదృష్టవంతుడో అనుకునేవాణ్ణి. మరోవైపు అవి కేవలం గొప్పలకే చెప్తున్నట్లు సందేహం. నేను ప్రేమించే విషయాన్ని ఆ పొట్టోడితోనే ఎప్పటికైనా చెప్పించాలనుకున్నప్పుడే వాడే చెప్పాడు సునీత ఊర్లో ఇంకొకరిని ప్రేమిస్తున్నట్లు. ఆ ఇంకొకరు పొడుగ్గా, బలంగా ఉంటాడు. మెరిసే బట్టలు, చక్కగా దువ్వుకునే తల, తెల్లని మొఖం ఇంకేం తక్కువ వాణ్ణి ప్రేమించకుండా ఉండేందుకు. ఎప్పుడూ ఊర్లోనే ఉండే అతడికి ఎంత వ్యవధో సునీతని పడగొట్టేందుకు. ఇక సునీత నాకు గొప్పగా పేరొచ్చేంతవరకు ప్రేమించదని తెలుసు. మనసులో ఎప్పుడూ యుద్ధాలు చేసే నేను అందంగా మెరుస్తూ తనని పడగొట్టలేను. అయినా పర్వాలేదు. సునీత ఎంతమందితోనైనా తిరగని, ఎందరితోనైనా కామ కోరికలు తీర్చుకొని, చివరకు నాతోనే

పెళ్ళవుతుందేమో!!! తను వేరొకరిని ప్రేమిస్తున్నా నన్ను కూడా ఇష్టపడుతుందని అనిపించేది అప్పుడప్పుడు. తను మా ఇంటికి ఒకటే వొచ్చి వెళ్తుండటం, నాతో మాట్లాడేందుకు ఆసక్తి చూపడం నాలోని ఆశా దీపాన్ని కాపాడేవి.

తనను ఏదోరోజు మాత్రం నేనే చేసుకుంటాను. నేను నమ్మే క్రీస్తు ఎవర్ని మోసం చేయలేదే! రెండవ సంవత్సరం పరీక్షల చివర్లో నాకు తెలీకుండానే పెళ్ళై పోయింది తనకి. నేను వేసవి సెలవులకు ఊరికి వస్తే తను ఊర్లో లేదు.

ఇక ప్రేమ రాహిత్యం నన్ను బాధించడం మొదలెట్టింది. హస్త ప్రయోగాలు, కామ రాహిత్యంతో పెరుగుతున్న కొన్ని సమస్యలు మరింత అపరాధ భావంతో శరీరాన్ని దెబ్బ తీసేవి. అయినా కూడా బూతుని ఎలాగైనా తీర్చుకోవాలని ఆశ. ఎన్నో కామపు జాఢ్యాలు అలవాటాయ్యాయి. రాత్రుళ్ళు లేచి ఆడవాళ్ళ మంచాల దగ్గరకు పోవడాలు, పడుకున్న వాళ్ళని తెలీకుండా తాకడలు.. స్ఖలనం అయ్యాక నేను చేసే పనులకు నాపైనే అసహ్యం వేసేది. దేవుణ్ణి క్షమించమని ఎన్నిసార్లు అడగాలో? అసలు ఆ బలహీన క్షణాల్లో దేవుడెందుకు గుర్తుకురాడో. వొచ్చినా కూడా అయితే అయ్యిందిలే అనే తెగింపు ఏంటో! పోనీ ఇంకెప్పుడు తప్పు చేయకుండా బుల్లిని తెగేసుకుంటే, మత్తయి సువార్త ఇదే చెప్తుంది.

"నీ కుడికన్ను నిన్ను అభ్యంతర పరచినయెడల దాని పెరికి నీయొద్దనుండి పారవేయుము; నీ దేహ మంతయు నరకములో పడవేయబడకుండ నీ అవయవములలో నొకటి నశించుట నీకు ప్రయోజనకరము గదా"

మడ్డే లేకపోతే నేను తప్పు చేయలేను, కానీ దాన్ని కోసుకుంటే, పెళ్ళయాక కూడా బూతు పని చేయలేను. ఈ చిన్ని జీవితం కొన్నాళ్ళు మాత్రం మొడ్డ లేకపోతే ఏంటి? నేను తరవాత శాశ్వతంగా స్వర్గంలో ఉండటం.

భాగవతంలో కృష్ణుడు గోపికలతో సరసాలు ఆడుతాడు, పురాణాల్లో కొందరు తపస్వులు కూడా స్త్రీలను మోహిస్తుంటారు. బైబిల్ పాత నిబంధనలో కొన్ని బూతు కథలు కూడా ఉన్నాయి. మరి అదెలా తప్పవుతుందో? కృష్ణుడే బూతు పనులు చేస్తూ కొనియాడబడుతుంటే నేను దాన్ని ఆపుకునేందుకు అనవసరంగా ప్రయత్నిస్తున్నానా! సరసాలు అంటే బూతు పనులు కాదని ఓ ముసలి పూజారి చెప్తే నాకు మొదటిసారిగా నమ్మబుద్ది కాలేదు. బడికెళ్ళే వయసులో నేను కూడా పురాణాల్లో ఉండే సరసాలు బూతు కాదని అనుకున్నాను, కానీ ఇప్పుడు వాటిని తవ్వుతుంటే అభిప్రాయాలు మారిపోతున్నాయి. దాంతో పాటుగా నా ఆలోచనలు కూడా మారసాగాయి. అటువైపు ఆ స్త్రీకి కూడా ఇష్టమైనప్పుడు మనం బూతు పనిని చేయడం తప్పేమీ కాదేమో, కాకపోతే రక్షణ కొరకు గర్భం రాకుండా చూసుకోవాలి.

శ్రీలత దక్కలేదు, శ్వేతా లేదు, ఇప్పుడు సునీత కూడా లేదు. నేను వాళ్ళకు అప్పుడే నా కోరికని చెప్పి బూతు పని చేసి గర్భం రాకుండా చూసుకుంటే ఎంతబాగో. వాళ్ళు ఒప్పుకునే వాళ్ళా? సునీత పోతే ఊర్లో ఇంకా ఉన్నారుగా, వాళ్ళని అడిగి బూతు పని చేస్తే! మనం ఇక్కడ శ్రీ కృష్ణుడు చేసినట్లు ఇష్టంతో చేస్తున్నాం కాబట్టి నేరం కూడా అంటదు. అయినా గర్భం రాకుండా ఆపడమెట్లనో నాకు అవగాహన లేదు, అలా సాయం చేసే స్నేహితులు కూడా నాకు లేరు. ఒకవేళ నేను చేసిన విషయం బయటపడితే నాపై ఎన్నో ఆశలు పెట్టుకున్న అమ్మవాళ్ళ పరువు సంగతి? అయినా బూతు పని చేసేందుకు నన్ను ప్రేమించే వాళ్ళెవరు? ఎవరూ కూడా నా ఆహార్యాన్ని నా రూపాన్ని చూసి

ప్రేమించలేరు. ప్రేమ అంటే వొట్టి బూతు పని కాదని, అది పెళ్ళికి దారి చూపాలని ప్రేమ పేరు చెప్పి బూతు పని మాత్రమే చేస్తే అది పచ్చి మోసమని, మరోవైపు అనిపిస్తుండేది.

నేను ca cpt లో ఉండగా నన్ను ఎగతాళి చేయాలనే నెపంతో మా క్లాస్ లో లావుగా నల్లగా ఉండే సురేఖకి నేను తన్ను ప్రేమిస్తున్నట్లు తనకి తరగతిలోని కొందరు అబ్బాయిలే చెప్పారు. సురేఖ ఆ విషయాన్ని నిజమని నమ్మేసింది. నా వైపు పదే పదే చూస్తుండేది. తను ఓ కామ కోరికను నాపై కోరి ఉంటే ఎగిరి గంతేసే వాన్నేమో. తను కోరిక తీరినా కూడా నన్నే అతుక్కుపోతే. అందం లేనివాళ్ళతో బంధం కోరడం లేదు ఈ మనసు. అందం లేనివాళ్ళు మాత్రమే ఎందుకో? సురేఖ నన్ను మాట్లాడించాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తుండేది. తనతోనే కాదు, తరగతిలో ఏ అమ్మాయి మాట్లాడటానికి ప్రయత్నించినా వాళ్ళతో తిరిగి సమాధానం చెప్పాలంటే తీవ్ర మోహమాటం నాకు. నేను విన్న దేవుడి వాక్యాలు, ఈ ప్రేమలు, అమ్మాయిలు ఒక పొంతనకు వచ్చేవి కావు. Cpt కి వొచ్చిన మొదట్లో వందన అనే కాస్త అందమున్న అమ్మాయి నన్ను చూస్తుంటే నన్ను కోరుతుందేమోనని అనుమానం. తరగతిలో నా అంత అసహ్యంగా ఎవరూ ఉండరని నాకు తెలుసు, మరి నాలో తనకేం కనిపించిందో? బాగా చదువుతున్నానా? తను నాపై ప్రేమలో ఉందేమోనని వొద్దు వొద్దనుకుంటూనే మాట్లాడేందుకు ధైర్యం చేయలనుకున్నాను. నా మనసు నేను కాదు కాదనుకుంటూనే తెలివిగా అందాన్నే వెంటాడటం, బాహ్య మెరుపుల కోసమే ఆరాట పడటం. ఓనాడు నా పిచ్చి రూపంపై, అమాయకుడిగా మరియు మౌనంగా కనిపిస్తున్న నాపై కొందరు గేలి చేస్తుంటే వందన కూడా వాళ్ళతో కలిసి నవ్వుతుంది. నేనంటే ఇష్టమైతే ఇలా నవ్వడం ఏంటో? మరియు అలా నాపై గేలి చేసే ఓ అబ్బాయితో రోజూ ఫోనులో మాట్లాడుతుంటుందని కూడా తెలిసింది. మరెందుకు తను నన్ను చూస్తూ నాకు తనపై ఆశ పుట్టించడం. కాలేజీలో అమ్మాయిల ముందు నన్ను గేలిచేయడం అబ్బాయిలకు సరదా. నేను ఎంత గేలి చేసినా కూడా నవ్వుతూ కనిపిస్తుండటం వాళ్ళకు బలం. ఆ అబ్బాయి ఓనాడు నా ముందే వందనతో ఫోన్లో మాట్లాడాడు. ఆ మాటలు వింటూంటే ఏంటి ఇదంత అనిపించింది. ఓరి దేవుడోయ్! ప్రేమలో ఉండి పోవాలంటే ఇన్ని అబద్ధాలు చెప్పుకోవాలా. అటువైపు నుండి తను కూడా అంతే. మాట్లాడే విషయాలు కూడా అన్ని అనవసరమైనవే. ఇద్దరికి మనసులో ఉండేది బూతు కోరికే అయినప్పుడు డైరెక్ట్‌గా మాట్లాడుకుని తీర్చుకుంటే అయిపోతుంది కానీ, ఇద్దరికీ కోరిక ఉన్నా కూడా లేనట్లే నటించడం. అవన్నీ పిల్లల మాటల్లా నాకు కనిపించాయి. ఇందులో ఎన్నో మోసాలు, అబద్ధాలు చుట్టుకొని ఉన్నట్లున్నాయి. అవి ఎంత హాస్యాస్పదమైనవంటే ప్రేమలో ఉన్న ఇద్దరికి ఒకరికొకరు చెప్పుకునేవి పచ్చి అబద్ధాలని కాస్త బుర్ర పెట్టినా ఇద్దరు సులభంగా తెలుసుకోవొచ్చు.

అందులో ఆ అబ్బాయి వందనపై బాహాటంగానే అధికారాన్ని చూపుతున్నా కూడా వందన ఏమి కోరిందో తనపై వాడికెంత ప్రేమనో అన్నట్లు మాట్లాడుతుంది. అసలు ఆ అబ్బాయి ప్రేమతో పాటుగా తనపై గుత్తాధిపత్యానికై ప్రయత్నిస్తున్నట్లు తనకెందుకు అర్థం కావడం లేదో. తిరిగి వాడి నుండి అలాంటి అధికారాన్నే కోరుతున్నట్లు అనిపించింది. అసలు అలా దర్పం చూపే వాళ్ళనే ఆడవాళ్ళు ప్రేమిస్తుంటారా? ఎందుకు? అలా దర్పం చూపే వాళ్ళే తన్ను జీవితంలో ధైర్యంగా రక్షిస్తారని వాళ్ళ ఆశనా. సహజంగా ప్రతి స్త్రీ తన్ను తాను బలహీనురాలుగానే అనుకుంటుందేమో. తనకు ఈ సమాజంలో కావాల్సింది తన్ను కాపాడే బలం. అది అతడి డబ్బు కావొచ్చు, అతడికి సంఘంలో ఉన్న పేరు కావొచ్చు, అతడికి ఉన్న చాలామంది స్నేహితులు లేకపోతే శారీరక బలమే అయ్యుండొచ్చు. ఏదో

ఒక గొప్పతనం. ఇలాంటి వాళ్ళ కోసం వాళ్ళు ఎంతగానైన లొంగిపోవడం. అతడికి ఆ స్త్రీలో అందం లేదా తను కోరుకున్న శరీరాకృతి కావాలి. అది వాడు నిర్ణయించుకున్న గొప్పతనం. దానికి ప్రేమని మసి పూయడం. ఈ అర్హతలను సంపాదించుకునేందుకు తరగతిలోని అబ్బాయిలు ఎంతైనా ఖర్చు పెట్టేవాళ్ళు. అమ్మవాళ్ళతో చదువుకని చెప్పి వేయించుకున్న డబ్బులతో ఆడంబరాలు పడేవాళ్ళు. వాళ్ళే కాదు తాము కూడా అబ్బాయిలు తమ్ము ప్రేమించాలనే అర్హత కోసం అమ్మాయిలు కూడా అంతే చేసేవాళ్ళు. మొహానికి రంగులు, పౌడర్లు, సెంటు బాటిల్లు. ప్రేమని ఎంత చెప్పుకున్నా లోపల అందరికి ఉండేది బలమైన బూతు కోరికనేనని నా చుట్టూ ఉన్నవారి ప్రవర్తన చూస్తుంటే నాకు పూర్తిగా అర్థమయ్యేది. తమ మధ్య అలాంటి గోడల అర్హతల అవసరం లేకుండానే ఒకరికొకరు ప్రేమించుకుంటున్నామని వాళ్ళు ఒకరికొకరు చెప్పుకుంటారు. ఇంత నాటకం కంటి ముందు కనిపిస్తున్నా కూడా వీళ్ళు అలా ఎలా చెప్పుకుంటారో. అసలు వీళ్ళు ఆలోచించరా? మెదడనేది వీళ్ళకుండదా? ప్రేమలో అలా అర్హత ఉండని సురేఖ వాళ్ళ లాంటి వాళ్ళ పరిస్థితి ఏంటి? వాళ్ళు ప్రేమ రాహిత్యంలోనూ, కామ రాహిత్యంలోనూ బాధపడుతూ ఉండిపోవాలా! ఒకవేళ వాళ్ళకు డబ్బుంటే వారైనా సుఖపడుతుంటారా!

ఈ రంగుల ప్రపంచంలో కేవలం డబ్బే విలువల్ని నిర్దేశిస్తుందని, అదే ఎందరినైన నీ కాళ్ళ ముందు నిలబెడుతుందని మా కాలేజి పవన్ సార్ ప్రతిరోజు ఓ పీరియడ్ తీసుకొని చెప్తుండే వాడు. తను పేదవాడి స్థాయి నుండి ఇప్పటి ఈ స్థితికి వొచ్చిన విధానం చెప్తుంటే వినేవారికెవ్వరికైనా ఆయన లాంటి స్థాయికి వెళ్ళాలని ఇట్టే ఆవేశమొచ్చేస్తుంది. డబ్బు ఉంటే బూతుని కొనెయ్యొచ్చు కూడా. తిరిగి ఆ డబ్బు నేను సంపాదించిందే అయ్యుండాలి, లేకపోతే నా లోపలి వ్యక్తి సంతృప్తి కాలేడు. హైదరాబాద్‌లో నేను చేరిన కాలేజీ వాళ్ళు నా ఫీజు సగానికి తగ్గించేశారు. ఇక్కడ భవిష్యతు కలలను ముందుంచుకొని పవన్ సారు చెప్పినట్లే ఆరోగ్యాన్ని కూడా పట్టించు కోకుండా చదువుతున్నాను. నేను ఎదిగితే అమ్మ, నా కోసం ఇంతవరకు కష్టపడుతున్న అన్న అందరికి మంచి రోజులొస్తాయి. చదువుతోపాటు నాకున్న బూతు బలహీనత పదే పదే అమ్మాయిల బట్టలమీద వారి శరీర ఆకృతుల మీద కూడా చూపు తిప్పమంటుండేది. నేను చదివి మంచి మార్కులు తెచ్చుకుంటే విష్ణుప్రియని పెళ్ళి చేసుకోవొచ్చు. విష్ణుప్రియ ఇక్కడి తరగతిలో నన్ను ఆకర్షించిన మరో అమ్మాయి. తనని నేను కోరుతున్నట్లు, అసలు నాలో బూతు ఆసక్తి ఇంతలా ఉన్నట్లు నేను చదువుకై పెడుతున్న శ్రద్దని చూసి కాస్త కూడా ఎవరూ అనుమానం పట్టలేరు. చదువయ్యాక ఓ గొప్ప ఉద్యోగంలో ఉన్న నేను విష్ణుప్రియని పెళ్ళి చేసుకున్నట్లు కలలు కనేవాన్ని. పరిక్షలయ్యాక నేను పాసు అయిన మొదటినాడే విష్ణుప్రియకు ప్రేమ విషయం చెప్పాలనుకున్నాను. అప్పుడు పాసు అయినా కూడా ఉద్యోగం రావడానికి ఇంకో పరీక్ష ఉంటుంది. దాన్ని అధిగమించాకనే చెప్తే! కానీ అంతలోపే విష్ణుప్రియ మరొకరిని ప్రేమిస్తే?

ఇప్పుడు నేను ఈ బుద్ధిలో చేస్తున్న యుద్ధాల వలన, ఈ చదువు వలన వికారంగా కనిపిస్తుండొచ్చు. కానీ నేనో గొప్ప స్థితిని చేరుకుంటే ఇక యుద్ధాలే ఉండవు. సార్ చెప్పాడు, అలాంటి స్థితే మనకు లభిస్తే ఎన్నో దాసోహమవుతాయి. ఇక విష్ణుప్రియెంత?

పరిక్షాలయ్యాక నేను ఉండబట్టలేక కొత్తగా కొన్న ఫోన్ ఫేస్బుక్ నుండి ప్రేమిస్తున్నట్లు సందేశం పంపితే, తనకు అలాంటి ఆలోచనే లేనట్లు ప్రత్యుత్తరమిచ్చింది. నన్నెవరూ ప్రేమించడం లేదని నా బతుకు ఇంతేనని ఏడుపొస్తుంది.

ఓ వేషధారి! నిన్ను ఎవరూ ఎందుకు ప్రేమించడం లేదు. సుధారాణి ప్రేమించిందే! సురేఖ కూడా ప్రేమించింది. వాళ్ళని నువ్వు ప్రేమించావా? ప్రేమించే అర్హతే వాళ్ళకు లేదన్నట్లు మనసులో చిన్నచూపు. వాళ్ళకి నీకులానే ఏడుపొచ్చిండదా? నువ్వొప్పుకోకపోయినా నీలో నువ్వూహించుకున్న ఆ అందం లేనితనాన్ని చిన్నచూపు చూసే వివక్ష బలంగా ఉంది. నువ్వు కోరింది అందంగా కనిపిస్తున్న ఆ శరీరాన్ని. మళ్ళీ నీ ప్రేమే స్వచ్ఛమైందని ఒకటే ఏడుపు. కానీ నా ఒక్కరి ప్రేమే కాదు, స్వచ్ఛమైందని చెప్తున్నా అందరి ప్రేమలో కూడా శరీరం లేకపోతే వస్తుపరమైన వివక్ష అంతర్లీనంగా ఉంటూనే ఉంది. కథల్లో, నే చూసిన వ్యక్తుల్లో, సినిమాల్లో అంతా అంతే. ఒక గొప్పింటి వ్యక్తి ఓ అనాధని పెళ్ళి చేసుకున్నాడని అతనిని పొగుడుతూ పేపర్లో వార్తొచ్చింది. ఆ అనాధ అయినా అమ్మాయి చూడ్డానికి చక్కగా, అందంగా కనిపిస్తుంది. అదే అనాధాశ్రమంలో బొద్దుగా, వికారంగా ఉంటే ఓ స్త్రీని అతడు పెళ్ళిందుకు చేసుకోలేకపోయాడు. అలాంటి స్త్రీ ఎవరైనా ఆ ఆశ్రమంలో ఒకవేళ ఉండే ఉంటే తనకు ఇలా గొప్పింటి వ్యక్తిని పెళ్ళి చేసుకునే అదృష్టం రాలేదేనని తను ఏడ్చి ఉండదా! మనిషిని మనిషికి కేవలం బాహ్యస్థితులపై వేరు పరుస్తున్న ఈ ప్రేమ గొప్పదెలా అవుతుంది. ఆలోచిస్తే ప్రేమలో కన్నా కామంలో వివక్ష తక్కువున్నట్లు కనిపిస్తుంది.

నా చుట్టున్న వాళ్ళు రహస్యంగానైనా  అనుభవిస్తున్న కామం నాకెందుకు దక్కడం లేదని ఓ పక్కన కామ రాహిత్యం కూడా నన్ను బాధిస్తుంది. ఈ కామ రాహిత్యం ఎన్నో జాఢ్యాలను నాచేత చేయించేందుకు పురిగొల్పుతుంది. మళ్ళీ తిరిగి అపరాదభావం. నరకంలో పడేందుకు, అక్కడే శాశ్వతంగా ఉండిపోయేందుకు ఈ కామం నన్ను దిగజారుస్తూనే ఉంది. పోనీ పెళ్ళి చేసుకుంటే. ఉద్యోగం రాకమునుపే పెళ్ళి చేసుకోవడం కుదరదు. అయినా ఆ తరవాతైనా పెళ్ళెవరిని చేసుకుంటాను? శరీరపరంగా, వస్తుపరంగా ఏదో రకంగా మేలైన స్త్రీనే పెళ్ళి చేసుకుంటాను. అయితే నాలో ఈ బాహ్యపు వాటికి విలువ ఇవ్వనని, లోపలి వ్యక్తిత్వాన్ని పరిశీలించాకే చేసుకుంటాననటం నన్ను నేను మోసపుచ్చుకోవడమే అవుతుంది.

ఒక CA దగ్గర కోర్సులో భాగంగా పని నేర్చుకుంటున్న రోజుల్లో,

నేను రోజూ ఆఫీసుకి నడిచెల్లే దారిలోనే రోడ్డుపై కొందరు వేశ్యలు ఉంటున్నారని గమనించాను. ఈ కామాన్ని అణుచుకోలేక ఎలాగైనా వేశ్యతో గడపాలని ఓ ఆదివారం నాడు ఆ దారి మీద కొచ్చాను. అక్కడ నిలబడి ఎలా అడగాలని వాళ్ళ వైపు చూస్తుండగానే ఒక ఆమె నన్ను చూసి కన్ను కొట్టి దగ్గరకు రమ్మన్నట్లు సైగ చేసింది. భయపడుతూనే దగ్గరికెళ్ళాను. ఆమె చొరవ తీసుకొని రావాలా అని మెల్లిగ అడిగింది. ఏం చెప్పాలి? ఆ రావాలి! ఎంత అని అడిగితే తాను రెండువందలు అంది. పని మూలంగా వస్తున్న డబ్బులో హాస్టల్ రెంట్ పోను నాకు మిగిలేది ఐదువందలైతే ఇప్పుడు ఈమె అడుగుతుంది రెండొందలు. ఇది నేను సంపాదిస్తున్న నా డబ్బే కాబట్టి దీన్ని ఈ పనికి ఉపయోగించడం తప్పనిపించలేదు. జేబులోని రెండొందలు ఇచ్చేసాక తన రూంకి వెళ్ళేందుకు ఆటోని పిలుస్తాను అప్పటివరకు ఓచోట కూర్చోమని అంది. అక్కడే కాస్త దూరంగానే ఓ రాయిపై అక్కడకు వస్తూ పోయేవాళ్ళని చూసుకుంటూ కూర్చున్నాను. మళ్ళీ ఆలోచనల కుంపటి. తప్పు చేస్తున్నావని లోపలి నుండి ఓ గొంతు. నేను ఇది తప్పు కావడానికి ఓ నిస్సహాయురాలితో చెయ్యడం లేదు, ఇది అత్యాచారం కూడా కాదు. అయినా ఈ పని ఒకసారి అలవాటైతే మళ్ళీ మళ్ళీ ఇలానే వెళ్ళాలనిపించదని గ్యారెంటి ఏంటి? మరోవైపు డబ్బుతో నడుస్తున్న ఈ వ్యభిచారం నేరమని క్రీస్తు మాటలు చెవుల్లో. ఇంటి

పరిస్థితులు, నాకున్న మంచిపేరు ఇవన్నీ తలుచుకుంటే పూర్తిగా దిగజారినట్లు అనిపిస్తుంది. ఒకవేళ నాకు ఆ వేశ్య నుండి ఎయిడ్స్ లాంటి రోగం వస్తే. ఎయిడ్స్ దానితో పాటు వొచ్చే చావు. ఆమె ఆటో పిలిచేలోగానే ఆ వేశ్య కు కనబడకుండ అక్కన్నుండి వెళ్ళిపోయాను.

ఈ బూతు పిచ్చి నన్ను వదలదు. నేను హస్తప్రయోగం చేసుకునేప్పుడు ఒక్కోసారి ఉహల్లోకి అక్కో అమ్మో తాము కూడా స్త్రీలమే అన్నట్లు వస్తుంటే నాపైనే నాకే అసహ్యమేసేది. ఓనాడు నేను ఊర్లో ఉన్నప్పుడు అక్క నా పక్కనే పడుకున్న వేళ నేను నా బుల్లిని బయటకు తీసాను. వావి వరసలు చూడని కొన్ని పురాణ కథలు గుర్తొచ్చి ఇదేట్ల తప్పనుకుంటు అక్కకు భయపడి కేవలం తన శరీరాన్ని చూసుకుంటూ హస్తప్రయోగం చేసుకున్నాను. స్ఖలనం అయ్యాక నేనెంతో నీతిమాలిన పని చేస్తున్నట్లు నాకనిపించింది. ఆ కథల్లో అలాంటి పనులు వాళ్ళు ఏదైనా పరిహారార్థం కొరకు చేసుండొచ్చు. లేకపోతే ఆ బూతు కథలకు అర్థాలు వేరై ఉండొచ్చు. దేవుడు అలాంటి పనులు చేయమని ఎందుకు చెప్తాడు? బైబిల్ కథల్లో కొందరు అలా చేసుండొచ్చు కానవేమి దేవుడు చెప్పి చేయించలేదు. యేసుకానీ, బ్రహ్మం గారుకాని ఇలాంటి పనులు నీచమనే అంటారు. వదినను నగ్నంగా చూశాకా వేమన తప్పు చేసినట్లు సమాధుల్లో ఎందుకు బతికాడు? తప్పని తెలిసినా కూడా అదే పనిని చేస్తున్న నాకు క్షమాపణలు మాటికి దొరకడం కల్ల, నాకిక నరకమే గతవుతుందా? దీనికేంటి పరిష్కారం. నాకిక పెళ్ళి వొద్దు, ఈ కామపు పనులు కూడా ఇంకెప్పుడు చేయను. ఇంటిని విడిచి తపస్సు చేసైనా నా తప్పులకు ప్రాయిక్షిత్తం చేసుకోవాలి.

ఆ రాత్రి నుండి పదే పదే ఇంటిని విడిచి వెళ్ళాలని అనిపించ సాగేది. అయినా కూడా బలహీన క్షణాలు కామాన్ని నాలో తిరిగి నిద్ర లేపుతూనే ఉండేవి. రాత్రింబవళ్ళు కష్టపడి రాసిన పరీక్ష రెండవసారి కూడా ఫెయిల్ అయ్యాను. ఎందరికో నేను బాగా చదివి పైకొస్తానని చెప్పుకొన్న అమ్మ గుర్తొచ్చింది. ఈసారి పరీక్షని మరింత శ్రద్ధగా రాసినా మళ్ళీ ఫెయిల్. నేను నమ్ముకున్న దేవుడిపై కోపమొచ్చింది. ఆ సమయంలోనే ఊర్లో నా చిన్ననాటి స్నేహితురాలు ఒకరు బాల్య వివాహం కారణంగా కాన్పులో చనిపోయినట్లు తెలిసింది. ఆమే కాదు, మరో నెలకు ఇంకో స్నేహితురాలు ఆత్మహత్య చేసుకొని చనిపోయినట్లు తెలిసింది. ఇంత ఉన్నపళంగా చిన్న వయసులోనే చావడం ఏంటో? అసలు ఒక వ్యక్తి ఎన్నాళ్ళు బతకాలన్నది దేవుడు ఎలా నిర్ణయిస్తాడు? చదువుకోసం శరీర ఆరోగ్యాన్ని కూడా పట్టించుకోకుండా ప్రయత్నిస్తున్న నేను మధ్యలోనే చనిపోతే, చనిపోయాక ఇంత కష్టపడుతున్న ఈ చదువు, నేను సాధించబోయే కోరికలు ఏమైనా అక్కరకొస్తాయా!

దేవుడు నన్ను ఏదో ప్రయోజనం కొరకు పుట్టించే ఉంటాడు, అంత అర్దాంతరంగా చంపడు, ఎందుకంటే ఆయన తన భక్తుల్ని ఎల్లవేళలా రక్షిస్తుంటాడు. ఇలా అనుకోవడంలో పొరపాటేమి లేదు కదా?

ఆఫీస్ కి వెళ్తుండగా ఓ బైక్ వొచ్చి గుద్దడంతో నేను పక్కకు పడిపోయాను. నాకెదురుగా వస్తున్న ఒక స్కూల్ బస్ కింద పడ్డ నా ముందు సడెన్‌గా ఆగిపోయింది. కిందనుండి లేస్తుంటే అర్థమయ్యింది మోకాల్లో నుండి రక్తం వస్తున్నట్లు. ప్యాంట్ కింది భాగం చినిగిపోయి పేలికలు కనిపిస్తున్నాయి. ఇక నడుము దగ్గర బైక్ గుద్దిన నొప్పి మరియు గీతలు, దానిపై రక్తపు మరకలు. బైక్ మీద నుండి కింద పడ్డ వ్యక్తి లేచి నా దగ్గరికొచ్చి కళ్ళు కనబడటం లేదానని తప్పు మొత్తం నాదే అయినట్లు చెంప మీద కొట్టాడు. అక్కడ నిలబడ్డ వాహనాలు మమ్మల్నే చూస్తున్నాయి. నేను అతన్ని తిరిగి ఏమనకుండా

హాస్టల్లో నా రూం మీదుగా కుంటుకుంటు వెళ్ళిపోయాను. ఒకవేళ ఆ బస్సుకి బ్రేకు సమయానికి పడకపోయే ఉంటే నేను బతికేవాన్నా? తలుచుకుంటే గుండెలు జలదరిస్తున్నాయి. రోడ్డుపై అందరి ముందు చెంప చెల్లుమనిపించినప్పుడు అతనిలో నాపైన కాస్త జాలి కలిగేలా నేను నమ్మిన దేవుడు ఎందుకు చేయలేదో? చావుని ఎలా నిర్ణయిస్తున్నాడని ఒకప్పుడు వేసిన సందేహం ఇప్పుడు నాపైనే వేసుకున్నాను. అసలు దేవుడు నా చావును ఎలా నిర్ణయించాడు? పుట్టగానే కొందరు పిల్లలు చస్తుంటారు మరీ వాళ్ళ పుట్టుక దేని ప్రయోజనం కొరకు చేసినట్లు? అప్పుడే చంపేట్లు అయితే పుట్టించడమే ఎందుకు? ఇంత అర్థం లేని ప్రపంచాన్ని నడుపుతున్నాడా దేవుడు? నేను చచ్చేందుకు ఆస్కారమైన ఆ సంఘటన ఎందుకు జరిపించాడు? నన్ను కూడా చంపాలని చూస్తున్నాడా, లేకపోతే యాదృచ్ఛికమైన సంఘటనేనా ఇది. శివుడి ఆజ్ఞ లేకుండ చీమైన కుట్టదంటారు. ఒకవేళ శివుడు లేకపోతే. శివుడు ఉన్నాడని అంత ఖచ్చితంగా ఎలా అనుకోవాలి. జరిగే ప్రతిదీ దేవుడు కాకుండా యాదృచ్ఛికం ఎందుకు కారాదు? దేవుడు లేడు అన్నప్పుడు ఈ సమస్త జీవరాశిని ఎవరు సృష్టించినట్లనే ప్రశ్న వస్తుందే. అలా లోతుకు వెళ్ళే కొలది దేవుడు ఉన్నట్లే రూఢీ అవుతుంది.

మరో నెలకు ఇంటి పక్కనుండే వ్యక్తి చచ్చినట్లు వార్త. నా వయసులో ఉండే ఒక్కడికి కాన్సర్. జీవితం పూర్తిగా గడవకమునుపే మధ్యలోనే చావడం? ఏ బూతుకోరిక తీరకుండానే చస్తున్న వాళ్ళెంత అభాగ్యులో? ఇప్పుడు చచ్చిన వారికంత అంతకు ముందు రోజు అందరిలానే తెల్లారి ఉంటుందే, ఇప్పుడు సామాన్యంగా కనిపిస్తున్న నాకు ఏమో రేపటి రోజే చావు ఉండొచ్చు. మొన్న యాక్సిడెంట్ నుండి నాకు చావు దగ్గరి కొచ్చినట్లే కలలు. ఏ బూతు కోరిక తీరకుండా నేను తొందరగా చస్తే. చావు ఇప్పుడే రాదని అనుకుంటూ భవిష్యత్తు సౌధం కోసం ఆరోగ్యాన్ని, ఆనందాన్ని స్వేచ్ఛని పట్టించుకోకుండా అనవసరంగా నే కష్టపడుతున్నానా? అనవసర కాలయాపన చేస్తున్నానా? చావు అంటనే ఒళ్ళు జలదరిస్తుంది. పురాణాల్లో చచ్చే లోగా మోక్షం సంప్రాప్తించే పనులు చేయాలంటారు, ఏమీ తెలీని పిల్లల శవాలకు అవెలా తెలుస్తాయి? ఊర్లో మూగ చెవిటి వాడైన నా స్నేహితుడ్ని అలా ఎందుకు పుట్టించాడు దేవుడు? ఇది కర్మకు సంబంధించిన విషయమా! చివరి జన్మలో చేసిన పనులే ఈ జన్మలో చావుకి, మన స్థితి గతులకు కారణమవుతాయా? బ్రహ్మ రాసిన రాత ప్రకారమే అంత జరుగుతుందంటారే అలాంటప్పుడు పాపపు పనులు చేయమని కూడా ఆయనే రాసినట్లుగా. మరి ఇంకెందుకు వాళ్ళకి శిక్షెయ్యడం. ఆయనే రాత రాసి, ఆయనే మనలో కామ కోరికల్ని మరియు నేరాలు చేసే పరిస్థితుల్ని కల్పించి తిరిగి ఆయనే తప్పొప్పులని నిర్ణయించడమేంటి? ఆయన ఆజ్ఞ ప్రకారమే జరుగుతున్న ఈ సృష్టిలో నిమిత్తమాత్రుడైన మనిషిపై నేరం మోపడం న్యాయమెట్లవుతుంది? తన ప్రజల్ని విడిపించుకునేందుకు అసలు యెహోవాకి ఫరో రాజుని ఒప్పించాల్సిన పనేంటి?

దేవుడు ఉన్నాడా? లేడా ఈ ప్రశ్న పదే పదే పుట్టుక రాసాగింది. ఏదేమైనా ఓసారి పరీక్షించి చూద్దామని ఓ బ్లేడ్ తీసుకొని ముందుగా దేవుణ్ణి ప్రార్థించసాగాను. ఓ దేవుడా! నువ్వు ఒకవేళ ఉంటే కనిపించు, లేకపోతే ఇక్కడే నరాలను తెగేసుకుంటాను. నరాలను తెగేసుకున్నాక దేవుడొచ్చి నన్ను బతికించి మోక్షాన్ని ప్రసాదిస్తాడని బుద్ధి చెప్తుంది. అట్లనే అర్థాయుష్కుడైన మార్కండేయుణ్ణి, అట్లనే ఆయన భక్త రామదాసుని, భరత మునిని, ధ్రువుణ్ణి, కన్నప్పని ఎందరినో కాపాడాడు. ఖచ్చితంగా ఆయన వస్తాడు.

గీసుకునేందుకు ప్రయత్నం మొదలు పెడుతున్నా ఇంకా దేవుడు రాలేదు. నరాల మీద వున్న బ్లేడ్‌ని చూస్తూ శరీరంలో వణుకుడు మొదలైంది. ఒకవేళ దేవుడు నిజంగానే లేకపోతే! లేని ఆయనకోసం ఉన్నాడనే భ్రమలో చనిపోతున్నానా? ఇది ఖచ్చితంగా పిచ్చిపనే. దేవుణ్ణి తెలుసుకునే మార్గం ఇది కాదు.

నాచే అనవసర కాలయాపన చేస్తున్నట్లు అనిపించిన సిఏ బుక్స్ పక్కకొదిలేసి నిజాన్ని తెలుసుకోవాలని ప్రయత్నాలు వెతకసాగను. మా హాస్టల్ కి దగ్గర్లో ఉండే సిటీ సెంట్రల్ లైబ్రరికి వెళ్ళడం మొదలెట్టాను. ఆఫీసుకి పోయేముందు, సాయంత్రం వచ్చాకా, తిరిగి సెలవులప్పుడు ఇదే నాకు ఆవాసం. ఒక్కోసారి ఆరోగ్యం బాగాలేదని చెప్పి ఆఫీస్‌కి వెళ్ళకుండా లైబ్రరీలోనే గడుపుతున్నాను. అక్కడ ఎన్ని పుస్తకాల్లో. ఏవి చదవాలి? దేనిలో నిజాలుంటాయి? కంట పడిన ప్రతి పుస్తకాన్ని తిప్పుతున్నాను. నా కంటికి ఓనాడు డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతాన్ని చదివే అవకాశం వొచ్చింది. తెలిసిన జంతువులని మొత్తం వర్గీకరించుకుంటూ, వాటి లక్షణాలను స్వభావాలని పోల్చుకుంటుంటే ఆ సిద్ధాంతాన్నీ అంగీకరించక తప్పట్లేదు. ప్రపంచ చరిత్రలని చదవడం మొదలెట్టాను. శాస్త్రీయత, తర్కమంటే ఏంటో తెలుసుకోసాగాను. చరిత్రని పరిశీలించే దృక్పథం నాలో పూర్తిగా మారిపోసాగింది. ఈ భూమ్మీద జరిగిన అద్భుతాలకు, వింతలకు మానవుడి ప్రయత్నాలు మరియు భౌతిక నియమాలు తప్ప ఎలాంటి అభూత కల్పనలు మహిమలు లేనట్లు తోచింది. భౌతిక, గణిత శాస్త్రంకు సంబంధించిన సూత్రాలే విశ్వమంతటా నడిపిస్తున్నాయంట. మరి భౌతిక నియమాలని రూపొందిస్తోంది ఎవరు? ఇంకా దేవుడికి ఆస్కారం ఉంది. ఈ విశ్వం మన ఊహకు కూడా అందనంత పెద్దది. అందులో కోట్ల కొలది గెలాక్సీలు, వాటిల్లో కోట్ల కొలది నక్షత్రాలు, కొన్ని వేల కోట్ల గ్రహాలు, అయ్యో! ఇలా లెక్కేసుకుంటే పోతే భూమి ఎంత చిన్నదో. మరి ఇంత పెద్ద విశ్వాన్ని నడిపేందుకు భౌతిక నియమాల్ని రూపొందించిన ఆ శక్తినీ, విశ్వంలో నలుసంత కూడా లేని భూమి మీది వ్యక్తులు ఎలా తెలుసుకున్నారు? వారికి శివుడని, యెహోవా అని పేరెలా పెట్టారు? ఏ పవిత్ర గ్రంథ కథల్లో చూసినా కూడా తమ భావోద్వేగాలనే నియంత్రించుకోలేని శక్తి లేనివాళ్ళుగానే దేవుళ్ళున్నారు. పురాణాల్లో, బైబిల్లో రాయబడ్డ కథలు నాకిప్పుడు హాస్యాస్పదంగా అనిపిస్తున్నాయి. చరిత్ర గర్భాన మనకు తెలీకుండానే సమాధై పోయిన దేవుల్లెందరో. నాలో పెరుగుతున్న శాస్త్రీయత, హేతుబద్ధత దేవుడి అస్థిత్వాన్ని ఒప్పుకోకపోవడం మొదట్లో జీర్ణించుకోలేకపోయేవాన్ని. నన్ను నేను ఏ మతచట్రంలో ఇరికించుకోక పోవడమే నాలో హేతుత్వాన్ని గ్రహించేలా చేస్తుందేమో! మా నాన్నకానీ, నా చుట్టూ ఉన్నవాళ్ళు కానీ ఎవ్వరూ దేవుణ్ణి చూడలేదు. కొంతమంది చూసినట్లు చెప్తుంటే అందులో మోసముందని తొందరగానే అర్థం చేసుకోగలిగాను.

దేవుడు ఓ అనవసర పదార్థమని అర్థమవుతున్నప్పుడు నా చర్యలకు స్వేచ్ఛ వచ్చినట్లు అనిపించ సాగింది. ఇప్పుడు ఏ అడ్డుగోడలు పెట్టుకోకుండా, అపరాధ భావాలేమి చోటు లేకుండా హస్తప్రయోగాలు చేసుకుంటుంన్నాను. కనబడిన ప్రతి అమ్మాయిని స్వేచ్ఛగా కామ వస్తువుగా ఉహించుకుంటున్నాను. అయినా ఇది ఎక్కువ దినాలు సాగలేదు. దేవుడు లేని శూన్యతని కొత్తగా "ఆత్మ" ఆక్రమించింది. కొత్త కొత్త ప్రశ్నలు ఉద్భవిస్తున్నాయి.

పరిక్షలని చెప్పి ca దగ్గర రెన్నెళ్ళు సెలవులు తీసుకొని పూర్తిగా లైబ్రరీకి నా మొబైల్‌కి పరిమితమైపోయాను. నా చావు అతి దగ్గర్లోనే ఉందని తెలిసొస్తుంటే ఇప్పటికే అంతలా కష్టపడి

అనవసర కాలయాపన చేసినట్లు అనిపించినా ఆ పరీక్షల చదువు ఇప్పుడెట్లా కొనసాగించగలను? మత ఛాయలు, సంప్రదాయ ఛాయలు నాలో తొలిగి పోతుంటే మరింత విస్తృతంగా ఆలోచిస్తున్నాను. అదో అందమైన అద్భుతమైన ప్రపంచం. మార్క్స్, శంకరుడు, బుద్ధ, గాంధీ, గెలిలియో, బ్రూనో ఇంకెందరో నన్ను పలకరిస్తుండే వాళ్ళు. ఏథెన్స్ వీధుల్లో తిరిగాను, పిరమిడ్ల నిర్మాణానికి రాళ్ళెత్తాను, ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్నాను, నియాండర్థల్ మనుషులతో, డైనసార్లతో గడిపాను.

మన చేతికి మన చుట్టూ ఉన్న వారి నుండి అందజేయబడుతున్న విషయాలన్నీ పూర్వీకుల నుండి అనేకరకాల చిక్కుముళ్ళని కలగలుపుతూ వచ్చినవే. అందరూ ఆ ముళ్ళని మరింత కఠినతరం చేస్తూ తమ తరవాతి తరాలకు అందచేస్తున్నారు. ఈ ముళ్ళ నన్నింటిని విప్పి సత్యాన్ని కంటి ముందు తేట తెల్లంగా కనపరిచే సాధనమే "అవగాహన". అవగాహన అనేది పూర్తి పరిజ్ఞానంతో జరగవలసిన ప్రక్రియ. మనం విషయాన్ని చూసేప్పుడు కలుగుతున్న స్పందనలను గమనిస్తూ వాటిని క్రమబద్ధం చేస్తూ ఏ విభజనకు లొంగకుండా అవగాహనకు సరైన పరిజ్ఞానాన్ని అందించేందుకు మన మనసు ఎప్పుడూ సిద్ధంగుండాలి.

అనేక తాత్విక విచారాలు చదువుతున్నాను. ప్రపంచంలో జరుగుతున్న అన్యాయాలు, నా కంటి ముందు కనిపించే దీన బతుకులు చూసి చలించిపోతున్నాను. ఈ చలనాన్ని నాలోపలి మరో పదార్థం కలిగిస్తున్నట్లు గ్రహించాను. దానికి కొందరు తాత్వికులు పెట్టిన ముద్దు పేరే "ఆత్మ".

ఈ ఆత్మ నాలో ముందునుండే నాతో ఘర్షణ పడుతూ ఇంతదాకా వచ్చింది. ఇంతకు మునుపటి ఆత్మ ఒక చట్రం లో బంధింపబడి నిజాలు తెలుసుకునేందుకు నాలో ఉన్న అడ్డుగోడలని చీల్చేంత బలమయ్యింది కాదు. కానీ దాని ఉనికిని, ప్రాముఖ్యాన్ని ఇప్పుడు పూర్తిగా గ్రహిస్తున్నాను. దేవుడి అవసరం లేదని అర్థమయ్యాకే నా ఆత్మకు నిజమైన స్వేచ్ఛ లభించింది. నాలోపల ఈ " ఆత్మ" అనేది చరిత్రను, వ్యక్తుల్ని చదివేకొలది పెరుగుతూనే పోతున్నట్లు గ్రహించాను.

ఈ కొత్త పదార్థం "ఆత్మ" అనేది ఒక భౌతిక పదార్థం కాదు, ఈ సమాజంలో నివసించేందుకు కావలసిన మంచి చెడులను నిర్ణయించే సాధనం. ఆలోచనను అన్ని జంతువులు ఆహార సంపాదనలోను, జీవితాన్ని కాపాడుకునే చర్యలోను సహజంగానే ఉపయోగిస్తాయి. ఆత్మ మానవ నాగరికతకు అవసరమైన నైతికతని నిర్ధారిస్తుంది. ఆత్మ స్పృహను సృష్టిస్తుంది. ఆత్మ పెరిగేకొద్ది మనల్ని పరిసరాలతో పాటుగా తీసుకెళ్తుంది. అది ఎందరితోనో మమైకం చేస్తుంది. ఆత్మను దర్శించుకున్న మనిషికి జీవితం ఒకటి కాదు, అనేక వేలు. అతడు అందరిలో జీవిస్తాడు.

చాలి చాలని వేతనంతో సాగుతున్న ca దగ్గర పని ఆయనకు చెప్పకుండానే మానేశాను. ఇంకా నేను ఆయన దగ్గర కోర్సులో భాగంగా ఒక సంవత్సరం చేసి సర్టిఫికెట్ తీసుకోవాలి కానీ, నాకిప్పుడు అది అనవసరంగా జీవితాన్ని మరింత కాలయాపనకు గురిచేస్తున్నట్లు అనిపించింది. భవిష్యత్తు ఎలాగైనా ఉండనీ, ఎప్పుడు చస్తామో తెలీని నాకిప్పుడు వర్తమానం మాత్రమే ప్రధానం. డబ్బులు అవసరమైన ఈ సమయంలో ఓ లాయర్ దగ్గర అకౌంట్స్ చూసుకునేందుకు మంచి జీతంతో జాయినయ్యను. ఇది ఎన్నాళ్ళు చేస్తానో తెలీదు.

ఈ జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించాలి, అందుకు సాయపడే ప్రతి ప్రక్రియను గమనిస్తూ గడిపెయ్యాలి. ఎప్పుడు చస్తానో తెలీని నాకు ఇప్పుడు అతి ఎక్కువ కాలపహరణం చేసే లక్ష్యాలు

అవసరం లేదు. నా జీవితం ఎంత దౌర్భాగ్యంగానైనా గడవనీ, అప్పుడు నా ఆత్మ ఎలా స్పందిస్తుందో ఆ అనుభూతిని కూడా ఆస్వాదించాలి. చచ్చే లోగా జీవించాలనేదే నా అభిలాష.

ఏదో పని మీద ఊరికి వొచ్చిన నాకు ఇప్పుడు ఊర్లోని మనుషులు, వారి వ్యక్తిత్వాలు కొత్తగా కనిపిస్తున్నాయి. ఓ పెళ్ళైన ఆడదాన్ని తను నావైపు చూస్తుంటే నేను మొదటిసారిగా ఆమెవైపు కన్నార్పకుండా చూసాను. పెళ్ళైన వాళ్ళని అలా చూడ్డం తప్పు కాదా? ఏమో మన వ్యక్తిగత భద్రత కోసం రాసుకున్న ఇప్పటి చట్టాల ప్రకారమైతే తప్పు కాదు. తను అవకాశమిస్తే మొగుడికి తెలీకుండా తనతో గడపొచ్చు, అయినా నాలో అంత ధైర్యం లేదు. మరియు ఇది మొండివాడైన భర్త నుండి ఆమె భద్రతకు సంబంధించిన విషయం.

ఊరి నుండి హైదరాబాద్‌కి నేనెన్నో జ్ఞాపకాలను మోసుకొచ్చాను. అందులో నన్ను ఆకట్టుకున్న అమూల్యమైన ముత్యం జానకి.

తను విసిరిన ఆ అమాయక చూపులు నాలో కొత్త జీవశక్తిని నింపుతున్నాయి. మనసు ఎంత మాయ చేస్తుందో, అది ప్రేమను ఎంత అంధత్వంగా మారుస్తుందో నాకు తెలుసు. కానిప్పుడు నాకు ఈసారైనా ఆ మాయని చివరికంటా అనుభూతి చెందాలని,

దాన్నుండి తప్పుకోక దాని అంతు చూడాలని కోరిక.

# 3

స్త్రీ పురుషులు ఇద్దరి మధ్య నడిచే సంభాషణల్లో బూతు కూడా ఒక ప్రధాన విషయంగా ఉండాలని కోరుకుంటాను. ఆడదైన, మగవాడైన ఇద్దరిలో ఒకరిపై ఒకరికి ఆకర్షణకు దారితీసే ప్రాథమిక కారణం బూతు. అయినా ఆ అసలు కారణాన్ని దాచేసి తమ పరిచయానికి మరేదో కారణాలని వెతుక్కుంటుంటారు. ఇద్దరి మధ్య ఎన్నో అనవసర విషయాలు తిరుగుతూ బంధాన్ని నాటకీయకంగా కాలహరణం చేసుకుంటూ ఎప్పటికో కామత్వాన్ని చేరుకోవాలనుకుంటారు. అక్కడిదాక వొచ్చే వాళ్ళు బహు అరుదు. నా వరకు నా నగ్నత్వాన్ని కూడా ఆడవాళ్ళతో పంచుకోవాలనుకుంటాను, సిగ్గేమి లేకుండా చెప్పే వారి విషయాలను కూడా వినాలనుకుంటాను. దెంగులాడేదాక చేరుకుంటే అది అదృష్టమే.

మాట్లాడే అమ్మాయిలతో మొదటి పరిచయాల్లోనే కామం గురించిన చర్చ బాహాటంగానే ప్రదర్శిస్తే ఎంతమంది స్నేహానికి ఒప్పుకుంటారు. అలాంటి వాళ్ళని సహించడం ఎవ్వరికీ ఇష్టముండదు. అయినా పైపూత మాటలతో ఎంతమంది శ్రమించినా కేవలం ఒకరిద్దరి స్నేహం మాత్రమే కామత్వాన్ని చేరుకుంటుంది. కామాన్ని ఆశించి అక్కడి వరకు చేరుకోలేని వాళ్ళ సమయం వృధా మరియు పడే శ్రమ అంత నాటకీయంగా మిగిలిపోతే, మరి చేరుకునే ఆ ఒక్కరికి ఆ తరవాతి పరిణామం తమ భవిష్యత్తు స్వేచ్ఛను త్యాగం చేయమని చెప్పడం. అన్ని విషయాల్లో జీవించేందుకు కొద్దీ సమయం మాత్రమే ఉందని చెప్పే నా అస్థిత్వం వీటిని భరించలేదు. అలా అని ఒకరి అభిప్రాయాల్ని వాళ్ళముందే అబద్ధమని చెప్పడం నాకు చేతకాదు. జీవితంపై ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. అందుకే ఆడవాళ్ళతో పరిచయాన్ని ముందుకు సాగించలేని అశక్తత. మాట్లాడితే వాళ్ళు నన్ను భరించగలరా అనే భయం కూడా.

ఇన్ని మధనాల మధ్య వీణతో స్నేహం నాకెప్పుడు ఆశ్చర్యమే అనిపిస్తుంది.. నాకంటే రెండేళ్ళు చదువులోనూ, వయసులోనూ పెద్దది అయిన వీణది మా ఊరే. తను ఇక్కడే హైదరాబాద్‌లో నేనున్నా ఏరియాలోనే ఉంటుందని నాకు ముందుగానే తెలుసు. మొదటిసారి తను రోడ్డుపై కనిపిస్తే కేవలం మా చదువుల గురించి మాత్రమే ఇద్దరం మాట్లాడి వెళ్ళిపోయాం. కేవలం ఒకే ఊరి వాళ్ళమన్నట్లు పలకరింపు అంతే.

రెండోసారి తనను కలవడం మా ఊరివాడైన అంజీ నుండి కలిగింది. అంజీ డిగ్రీ కర్నూల్‌లో అవ్వగొట్టుకొని స్పోకెన్ ఇంగ్లీష్ కోచింగ్ కోసమని నేనున్న హాస్టలుకొచ్చాడు. నేనప్పటికి ca దగ్గర పనిచేస్తుండే వాన్ని. అంజీ పగలంతా సినిమాలకు వెళ్ళడం, షాపింగ్‌లు చేయడం, స్పోకెన్ ఇంగ్లీష్ పుస్తకాలు కొనడం, స్నేహితులతో ఫోన్లో మాట్లాడ్డం ఇలానే పొద్దు పోతుండేవాడు. వాడెప్పుడు స్పోకెన్ ఇంగ్లీష్ కోచింగ్ సెంటర్‌కి జాయినవ్వుతాడో నేనడగలేదు, వాడు కూడా ప్రయత్నాలు సాగిస్తున్నట్లు కనిపించలేదు. రాత్రి పూట హాస్టల్ మీద పడుకునేప్పుడు ఇద్దరం చర్చించుకునే విషయాలెన్నో ఇద్దరిని అంతరంగికులుగా మార్చేసింది. ఓనాటి సాయంత్రం అంజీకి వీణ ఓ జిరాక్స్ సెంటర్ దగ్గర కలిసింది. ఇద్దరి మధ్య ఆ పరిచయం నాకు కలిగినట్లు చప్పగా సాగలేదు. వాడు ఆమెకెన్నో విషయాలు చెప్పాడు, నవ్వుకునే కబుర్లు, చదువు సంగతులు, మిగతా స్నేహితుల వివరాలు. ఆ కలవడం ఒక జిరాక్స్ పేపర్ నుండి మొదలైపోయి అరగంట వరకు సాగి చివరకు టీ తో ముగిసింది. పోతూ పోతూ వాడికి తన ఫోన్ నంబర్ ఇచ్చి మళ్ళీ కలుద్దామని చెప్పుకుంది. అనుకున్నట్లుగా మరుసటి రోజు సాయంత్రం కలిసేందుకు తనకు వీలుంటుందని వాడితో ఫోన్ లో చెప్పింది. వాడీసారి తన దగ్గరికి నన్ను కూడా తీసుకెళ్ళాడు కానీ, నాలో ఏం మాట్లాడ గలననే మొహమాటం. అంజీ మాట్లాడే విధానం చూస్తుంటే నా మొహమాటం తనముందు మాయమైపోయింది. ముగ్గురం కాసేపటికే స్నేహితులుగా మారిపోయి ఆదివారం ఇందిరా పార్క్‌లో కలుద్దామని స్నేహ ఒప్పందం చేసుకున్నాం.

నిజానికి వీణతో ఇలాంటి చర్చలే ఎప్పుడూ సాగాలని నాకు లేదు. నా బూతు స్వరూపాన్ని ముందుగానే ఆమెకు చూపించేసి స్వేచ్ఛను, సమయాన్ని కాపాడుకోవాలని ఆత్మారాముడి సందేశం. కొన్నాళ్ళు మాటలతో, కబుర్లతో ఆమెకు దగ్గరైపోయి చివరగా అనుకున్న ఫలితాన్ని సాధించమని మరోవైపు కాముకుడి ఆశ. ఆ రాత్రి ఆమెని ఊహించుకుంటూనే హస్తప్రయోగం చేసుకున్నాను.

ఆదివారం అనుకున్నట్లుగానే ముగ్గురం టిఫిన్ చేశాకా పొద్దునే ఇందిరా పార్క్‌కు బయలుదేరాం. తనను మభ్యపెట్టే మాటల విషయంలో నేను, అంజీ ఇద్దరం పోటీపడి మాట్లాడుతున్నాం. వీణ మేం మాట్లాడే ప్రతి మాటకు విలువనిస్తున్నట్లు కనిపించింది. ఊరిలోని వ్యక్తుల వ్యక్తిత్వాలు, చదువులు, భవిష్య ఆశలు ఇలా ఎన్నో. మా ప్రేమ గురించిన చర్చ కూడా నడిచింది. గతంలో జరిగిన కొన్ని ప్రేమ విషయాలకు కొన్ని అబద్దాలను జోడించి నేను చెప్పాను. అంజీ తనిప్పుడు ప్రేమిస్తున్న ఒకరి గురించి చెప్పుకొచ్చాడు. ఇకపోతే ఈ విషయం దగ్గర వీణ తనెవ్వరిని ప్రేమించనని, ఇప్పటికెవ్వరిని ప్రేమించలేదని చెప్పుకుంది. మేం తెచ్చుకున్న బాటిల్ నీళ్ళే మా కడుపులు నింపుతూ ఆకలిని మరిచిన మాటల ప్రవాహంలో సాగిపోతున్నాం. సాయంత్రం అలా బయటకొచ్చి ఫాస్ట్ ఫుడ్ తిని తిరిగి మళ్ళీ పార్క్‌కు చేరుకున్నాం ముగ్గురం. ఈసారి అంజీ జీవితంలో అత్యంత విలువైనవేమో చెప్పుకొస్తున్నాడు. మొదట డబ్బు గురించి, దాని అవసరం గురించి అది ఎలా చేరుకోవాలనే అవకాశం గురించి మాట్లాడాడు. ఆ తరవాత సంఘంలో రావాల్సిన పేరు పలుకుబడుల గురించి చెప్పుకొని

చివరగా వీణతో మరో విషయం చెప్పేందుకు అనుమతి కావాలని కోరాడు. దేన్నైనా సంకోచం లేకుండా చెప్పమంది తను. ఇక వాడు నేను ఊహించనట్లుగా కామ విషయాలు ఎత్తుకున్నాడు. కామం అనేది పై రెండిటి కంటే గొప్పదని, దాన్ని సాధించడమే పరమార్థమని అంటున్నాడు. పుస్తకాల నుండి ఎత్తుకొచ్చి నేను వాడికి చెప్పే ఎన్నో విషయాలు అక్కడ వాడు వాగుతుంటే నాలో మంట. కానీ, వాడు మాట్లాడే ప్రతి మాట ప్రామాణికతకై వీణ ముందు నన్ను అడగడం నాకు గొప్పనిపించింది. ఎలా తీసుకుంటుందో అనుకున్న వీణ ఈ మాటలను ఆసక్తిగా వినడం చూసి నాలో ఉత్సాహం మొదలై అప్పటిదాకా మౌనమైన నేను మరింతగా వర్ణించడం మొదలెట్టాను. వీణ తనెప్పుడు ఇలాంటి విషయాలు వినలేదంట. తనకసలు బూతు అంటేనే తెలిదంట. ఈ మాటలు అంజీ నమ్మాడో లేదో కానీ, నేను నమ్మలేదు. లేకపోతే మాకులానే మా ఊరి వాతావరణంలో పెరిగిన తాను, పాతికేళ్ళ వయసు ఉన్న ఒకమ్మాయి అదీకాక ఇంటర్ నుండే అమ్మాయిల హాస్టల్లో ఉండిపోయిన ఆమెకి బూతు తెలిదంటే నమ్మశక్యమా!! రాత్రి 8 కు హాస్టల్‌కు చేరుకున్నాక కూడా అంజీ ఫోన్ చేసి మరీ ఈ బూతు గురించి తను చదివిన కాలేజీలో తన స్నేహితులు నడిపిన వ్యవహారాల గురించి చెప్పుకున్నాడు. వీణ చూపిస్తున్న చొరవతో నేనూ వాడి లాగే పరిగెట్టాలని కోరుకున్నాను. మొదటిసారిగా నాలుగుగంటలు ఫోన్లో మాట్లాడాను. నాకున్న ఆఫీస్ మరియు అందని దాని కోసం ఎందుకు ఈ కాలహరణమని చెప్తున్న ఆత్మ మరోవైపు.

ఆమెపై ఏ కోరిక లేనట్లు కనిపించేవాడు అంజీ, కానీ వాడు తనతో విసిరే మాటలన్నీ జుగుప్సాకరమైనవే. వాళ్ళిద్దరూ పగలు బయట కలుస్తున్నారు, తిరిగి రూమ్‌కి వొచ్చాకా అక్కడ ఫోన్లో మాట్లాడుకుంటున్నారు. వాడు పగలంత ఆమెతో మాట్లాడిన విషయాలన్నీ రాత్రుళ్ళు నాకు చెప్పి నన్నూ పూర్తిగా రగలిస్తుండేవాడు. ఎంత ఆశ వున్నా నేను తనతో మాట్లాడే అవకాశం తక్కువ. ఆమెకి నేనే ఫోన్ చేయాలి, అంజీకి చేస్తున్నట్లు నాకెప్పుడు తనే ఫోన్ చెయ్యదు. మాటలు కూడా నేను చెప్పిందే వింటుంది కానీ, తనేం చెప్పదు, తనకు వాడిపై ఉన్నట్లు నాపై ఆసక్తి లేదేమో. అయినా మాట్లాడిన ఆ తక్కువ మాటలతోనే నేను తనకు ప్రత్యేకమైపోయాను. తన జీవితంలో నాలాంటి వాణ్ణి చూడ్డం ఇదే మొదటిసారని చెప్పడమే తన నుండి నాకు ఎగిరి గంతేయాల్సిన మేథో గుర్తింపు.

వీణే ఇద్దరికి రూమ్ వెతికించింది. ఆదివారాలప్పుడు ఆమె నన్ను, వాణ్ణి బిర్యానీ తినేందుకు హోటల్‌కి తీసుకెళ్తుండేది. ఓనాడు ఆమె తనపై ఏమైనా కోరిక ఉందా అని వాణ్ణి అడిగిందట. దానికి వాడు అక్కని ఫీలింగ్ తప్పితే అలాంటి బూతు కోరిక లేదని చెప్పాడంట. నిరంతరం సాగుతున్న చదువు నొదిలేసి వాడు చెప్పే బూతు మాటలు, రంకు సంబంధాల గురించి ఫోన్ చేసి మరీ ఆలకిస్తున్న ఆమె కూడా తనలో కామ కోరికలే ఉండవని చెప్పేది. ఈ ఇద్దరి ఈ మాటలు మాత్రం నాకు నమ్మశక్యం కాలేదు. వాడు నాకు ప్రతిరోజు ఫోన్లో మాట్లాడే విషయాల గురించి చెప్తుంటే ఆ ఇద్దరు మాటలతోనే భావప్రాప్తి అవుతున్నారని అనిపించేది.

ఇలా నిరాటంకంగా ఐదారునెల్లు సాగిన వారిద్దరి వ్యవహారం పూర్తిగ బెడిసికొట్టింది. వీణ తన గురించి చెప్పమంటే వాడు ఆమె ఏమాత్రం అందంగా ఉండదని, ఒకరు ప్రేమించేంత ఆమెలో ఏమి లేదని, అదీకాక ఆమె చేష్టలను రోడ్డు ఊడ్చేవాళ్ళ చేష్టలతో పోల్చి చెప్పాడట. దీన్నికూడా ఆమె నవ్వుతూనే తీసుకుంటుందేమో అనుకున్నాడట, కానీ ఆమె మాత్రం ఫోన్ కట్ చేసి ఇంకెప్పుడు జీవితంలోనే మాట్లాడ వద్దని సందేశం పంపిందట. ఇంత ఇదిగ ఏ సంకోచం లేకుండా సాగిన బంధం

ఇంత చిన్న విషయానికి విచ్ఛిన్నం ఎలా అయ్యిందో. అదీకాక ఆమె కూడా వాడి శరీరాన్ని ఎన్నో సార్లు నవ్వుకుంటూ ఇలాంటి మాటలు అనేది. ఓవారం లోగా తిరిగి మాట్లాడుకుంటారని అనుకున్నాను, అది జరగలేదు.

అంజీతో పూర్తి తెగతెంపులు అయ్యాక వీణ నాకు ఫోన్ చేయడం మొదలెట్టింది. ఎందుకు వాడితో మాట్లాడ్డం లేదని అడిగితే ఆమె మొత్తం వాడి కామ వ్యక్తిత్వాన్ని తిట్టడం తప్పితే మరింకేం చెప్పలేదు. అయినా ఇన్నాళ్ళు మాట్లాడేప్పుడు దొరకని వ్యక్తిత్వం ఇప్పుడు కొలవడమేంటో. చెప్పడం ఇష్టం లేదేమోనని ఊరుకున్నాను కానీ, నాకు ఇందులో మరోటి అర్థమైంది. ఇన్నాళ్ళు ఏ కోరిక ఆమెపై లేదని చెప్పిన వాడు అక్కని పిలిచిన ఆమెపై కోరిక ఉన్నట్లు కనబరిచాడేమో లేకపోతే కోరిక ఉన్నట్లు చెప్పుకున్నాడేమో అందుకే మాట్లాడ్డం ఆపేసిందేమోనని. వీణ ఇంతకు మునుపులా కాకుండా నాకు మాటికి ఫోన్ చేస్తుంది ఇప్పుడు. నాపై తను ఎలాంటి అభిప్రాయాలు ఉంచుకున్నా ముందుగానే నా వ్యక్తిత్వాన్ని తన ముందు పరవడం మంచిదనిపించింది.

"ఆని శరీరమల్ల అవే కోరికలని అంజిని ఏంటికి తప్పంటావు? అంద్రు మగోల్లకి అట్లేనే ఉంటై, ఏమంటే బయటపడరు."

"యాలె. ఆనికి ఇంగెక్కువ కోరికలు. సనువు ఇచ్చినా గదాని మాటలకి అంతే ఉండదు ఆనికి."

"ఇద్దరు ఫ్రెండ్స్ అన్నప్పుడు మాట్లు ఏంటికి దాసుకొని మాట్లడల్లాబ్బా... సెప్పాలంటే ఆనికన్నా నాకే సెక్స్ కోరికలు ఎక్కువల్యా.. ."

" నువ్వు నిజాతిగా ఉన్నదీ ఉన్నట్ల సేప్పుకుంటావు శివ. ఆడట్ల కాదుల్యా."

"ఆనితోటి నువ్వు మాట్లాడవు కాబట్టె ఆని తప్పులు ఇవని ఎత్తుకోవే.. కోరిక ఉండేది తప్పు గాదు.. అట్లానుకుంటే భూమ్మీద ఉన్డేవోల్లంత గబ్బు నాయండ్లె". "

"మలీ అందరూ అట్లుండరుల్యా శివ."

"ఆర్మోన్లు ల్యాకుండా ఎట్లుంటరు అంత. సూడు, రేపు సేస్తే తప్పేతాది కానీ ఇష్టమా గాదా అనడిగితే ఏం తప్పు? ఇష్టం ఉంటె ఇష్టం అనొచ్చు. ల్యాకుంటే ల్యా. "

"నీకేం కుటుంబం ప్రేమ ఇట్లాంటి ఫీలింగ్స్ ల్యావు కాబట్టి దెండిగా సెప్పుతావు ఇట్లాటివల్ల."

ఈ మాటతో వీణ నా ప్రవాహానికి ఎప్పుడూ అడ్డుకట్ట వేస్తుంటుంది. అంజీ కామ వ్యక్తిత్వాన్ని తిట్టినా ఆమె, నాలోని కామ వ్యక్తిత్వాన్ని సహించడం ఆశ్చర్యమే. ఆమెకు నాపై ఓ అభిప్రాయం బలంగా ఉంది. నేను అందర్నీ గౌరవిస్తానని, అదే ఆమెని అంజీ తరవాత నావైపు నడిపిందేమో!

వీణ ఇప్పుడు నేను ఆఫీసుకి పొయొచ్చాక రాత్రుళ్ళ పూట నాతో పార్కులో కొద్దిసేపు మాట్లాడుతుంది. ఆమెను ఎలాగైనా కామం వైపు నడిపించి ఒప్పించాలని బలమైన కోరిక నాలో పెరుగుతుండేది.

వీణ తనకు తెలిసిన బూతు సంబంధాల గురించి చెప్తూ వాళ్ళ వ్యక్తిత్వాలని తిట్టేది. నే చెప్పే అన్ని విషయాల కన్నా కామ సంబంధాల విషయాల మీదే శ్రద్ధ చూపిస్తున్నట్లు నాకనిపించేది. ఎంత తిట్టుకున్నా ఆ తిట్లకి కారణం ఆమెకు బూతు కోరికలు బలంగా ఉన్నై, కానీ బయటపడేందుకు సంకోచిస్తున్నాయి.

తనలో బూతుపై సంకోచం పోవాలంటే ముందుగా దేవుడు చావాలి. దేవుడు లేడని, ఆయన్ను భయమే సృష్టించిందని కొన్ని తార్కిక విషయాలు తనకు చెప్పేవాన్ని. తను నా మాటలేవి ఒప్పుకోక

తిరిగి నాపై ఛాలెంజ్ విసిరింది. ఏనాటికైనా నేను దేవుణ్ణి నమ్మే తీరుతానంట. ఆ దేవుడే నన్ను తనవైపు తిప్పుకుంటాడట. ఇవన్నీ విని నేను నవ్వుకునేవాన్ని. ఇంకా గట్టిగా ప్రయత్నిస్తే అసలు తన నమ్మకాలు తనివి అన్నట్లు పట్టు వదలని ఒకే సమాధానం. దేవుడు లేడని తనకు కూడా అనిపిస్తుందేమో, దేవుణ్ణి ఒప్పుకోకపోతే ఒకవేళ ఆయన నిజంగా ఉంటే ఆయన తన భవిష్యతుని నాశనం చేస్తాడేమో అనే భయమేమో!

కొద్దిగా ఓపిక పట్టి ఆమెలోని కాను అపోహలని తొలగించేలా చేస్తే ఆమెతో కామత్వాన్నికి చేరుకోగలనని ఆశ. ఈ ఆశే ఆమెతో ఎన్నో తీరాలకు ప్రయాణం కట్టేలా చేస్తుంది. ఆమె ఇప్పటివరకు నమ్మిన స్త్రీత్వంపై ఎన్నో సార్లు ఈ ప్రయాణంలో దాడి చేశాను కూడా.

వాళ్ళ నాన్న యువకుడిగా ఉన్నప్పుడు ఎందరు ఆడవాళ్ళనో బుట్టలో వేసుకున్నాడని దాన్ని గొప్పగా చెప్తూ మురిసిపోతుంది ఓనాడు.

నేనన్నాను.

"ఇవే పనులు మీ అమ్మ సేసింటే "

"మాయమ్మన్న. సీ--- మా నాయినని పెట్టుకొని ఎట్ల సెస్తది ఆ పనులు. తప్పది. "

"మల మీ నాయిన మీయమ్మని పెట్టుకొని ఆ పనులు ఎట్ట సేసే. మీ నాయన సేస్తే గొప్పగ సెప్పుకుంటివి, అట్ల మీయమ్మ సేస్తే సెప్పుకుంటవ?"

తను కొద్దిసేపు ఆలోచించి అంది

"ఆ పన్లు మగోళ్ళు సేస్తే తప్పుగాదు, ఆడాలు సేస్తేనే తప్పు. మన పెద్దలు అంట్రు గదా 'మగోళ్ళు తిరక్క సెడిపొయ్యేరే. ఆడాల్లు తిరిగి సెడిఫోయ్యేరే అని'"

“ఆ పెద్దలు గూడ మగ నాయిండ్లే అయ్యింటరు”

ఒక మొగోడిగా పుట్టి ఉంటే ఇష్టమొచ్చినట్లు తాక్కుంటా, తినుకుంటా తిరిగే అవకాశం. తను ఆడపిల్లనైనందుకే ఇలాంటివేమి అనుభవించ లేనని వీణ అనేది. ధైర్యం ఉంటే చట్టానికి లోబడే ఇవన్నీ ఆడాళ్ళు కూడా చెయ్యొచ్చని, సంప్రదాయాలు పన్నిన ఉచ్చుని సమానత్వం ఒప్పుకోదని నేను అనేవాన్ని. అయినా వీణ సంప్రదాయాలు మీరదు. దానికి కారణం తనకు గౌరవంపై ఉన్న గౌరవం.

“సూన్నీకే ఈ గౌరం అనేది నీకే మంచిలక్కనే కనబడ్తది గానీ ఇది సనా పెద్ద ఉచ్చు ల్యా. ఇట్లుండల, అట్లుండల, ఈ బట్టలే ఎసుకోవల్ల, ఇట్లానే తిరగళ్ళ అనుకుంట ఆడోల్లని మూలిగే కుక్క లక్కన సేసినారు. ఎవరన్న దైర్యం సేసిరనుకో, సూడి ఆ పిల్ల ఎంత గబ్బుది అంటరు. నీకి గౌరం అనినిపిస్తది, దని కోసం ఎన్ని అవసరం లేని త్యాగాలు సేయ్యల్లా. ఆ? సంప్రదాయాలు అనేటివి మన అలోసల్ని నాశనం సేస్తై. సుడి, సంప్రదాయాలు గాదు మనకి ముఖ్యం. అందరు ఒటేనని సేప్తాయి సుడి ఆ సట్టలు ముఖ్యం. అవేతే తెలివి నుంచి వొస్తాయ్”

ఆమెలో ఎంతో శూన్యత, దాని ద్వారా వొచ్చిన విచారాలు గూడు కట్టుకున్నాయి. నాకు కూడా ఎప్పటినుండో నా అంతరాలను స్వేచ్ఛగా పంచుకునే బంధంగా నాకు ఆమె దొరికినట్లనిపించింది. నాలో ఉండే అన్ని అభిప్రాయాల్ని తనతో స్వేచ్ఛగా పంచుకుంటున్నాను. నా నుండి ప్రతిదీ కూఫీ లాగి తేల్చుకునేది, ఆమె మాత్రం తన విషయాలు ఏవి పూర్తిగా చెప్పుకోదు. ప్రతి విషయాన్నీ దాస్తూ

ముక్కలు ముక్కలుగా చెప్తుంటుంది. తను జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నట్లు, ఆ దెబ్బలకు పదేపదే విచారిస్తున్నట్లు అర్థమయ్యేది, కానీ దాన్ని తెలియపరచదు.

"నిజం సెప్పు. నువ్వు గూడ అందరి లెక్కనే ఎప్పుడోసారి ఎవర్నన్న ప్రేమించే ఉంటావ్"

ఈ విషయం అప్పుడెప్పుడో నా పరిచయం మొదటిరోజుల్లో అడిగాను. ఆనాడు చెప్పుకోలేదు.

"ప్రేమనా. ఎవర్ని ల్యా. "

"సరే, సెప్పాలనుకోకుంటే వద్దు ల్యా. "

"నాను ఎనిమిదిల ఉన్నప్పుడు రాజునైతే ఇష్టపడుతుంటి. ఆ మంచికి సెప్పమని ఎంకట్ లచ్చిమికి సెప్పింటి. ఏమో సెప్పనో ల్యాదో, నాను గూడ అం తర్వాత ఇంగెం కనుకుంలా"

వీణ తన శరీర ఆకృతిలో గాని, అందం విషయంలో కాని ఏ మాత్రం ఆకర్షణీయంగా ఉండదు. అలాంటి తనను బాగా చదువుతాడని బడి మొత్తంలో అర్హత ఉన్న రాజు ప్రేమించడమా! అదెప్పటికి జరగదు. వీణలో ఈ ప్రేమరాహిత్యపు లక్షణాలు బలంగా కనబడేవి.

"మల నీకెవ్వరు ఇష్టం. "

"నాక్యా. ఇప్పుడేతే ఎవర్ల. "

"యాలే ల్యా. మనుర్ల బాయెల్ల పాప జానకిని ఇష్టపడుతున్నావంట. నాకీ శేఖర్ సెప్పినాడు. "

"జానకిని న్యా. మొన్న ఊరికి ఫోయ్యినప్పుడు సుశినా ఆ పాపని. బాగుంటదని అనిపించే గాని ప్రేమించల్యా. నాకీ ప్రేమ సరిఫోదు"

"ఫోన్ల బసీరుని అడుగుతావంట ఆ ఫోట్టి గురించి"

"ఏమో, ఆ ఫోట్టికి వొళ్ళ నాయిన లేడు, అమ్మకి ఓటే రోగలంట. జాలితోటి ఎట్లుందని అడుగుతా. ప్రేమకాదుల్యా ఇది. ".

"నువ్వాపుకోవుల్యా గాని ఇదే ప్రేమ. ఆ ఫోట్టి ఊర్ల మా ఇంటికి ఓటే వస్తది. నీ గురించి సెప్త ల్యా."

"వొద్దు. నాకీ ఆ ఫోట్టిమింద జాలి, ఇంగా సెప్పాలంటే గలీజుండొచ్చు. ఆ ఫోట్టికి నా మింద ఆశలు పెట్టేది తప్పు. "

జానకి మీదే కలిగినట్లు నాకు మామ కూతురు శిరీష మీద, ఊర్లోని రేవతి మీద కూడా కలుగుతుంది. దీన్ని ఒక్కరికే కట్టివేయడం, ప్రేమగా మార్చడం నాకు నచ్చదు. ముగ్గురిలో జానకి ప్రత్యేకమని నా మనసు అంటుంది, కానీ అదంతా పదే పదే తన గురించి ఆలోచిస్తున్న ఆకర్షణ ఫలితం.

వీణకు చదువు మీది కన్నా కూడా జరగబోయే పెండ్లి మీదే గురెక్కువ. దానికి కారణం తాను ఎంతగానో నమ్ముకున్న సంప్రదాయం పెళ్ళిపై జరిగే తన సహజ కోరికైనా బూతుని ఒప్పుకోవడమే ఉండొచ్చు. పెళ్ళి తనకి అందమైన లోకం. దాన్ని కూడా బద్దలు కొట్టేవాన్ని నేను.

"జీవితమల్ల ఒకరితోటే ఉండల్లా ఒకరితోటే గడపల్ల అనేది నాకి సేతకాదు. ఇప్పుడు ఒకరిని కోరినట్లే మరోపారి ఇంగోకరిని కోరల్లనిపిస్తాది. ఒక్కోపారి అయితే సూసినోల్లనంత పెండ్లి సేసుకోవల్ల అనిపిస్తది. ఒకపారి ఒక్కరినే జీవితమల్ల ప్రేమిస్తాం, ఉంటాం అనే మాటలు నాకి సిత్రంగుంటై."

"ఇట్ల ఒక్కరినే గాకుండా సంగనమందిని అంటే అది మోసం గాదా"

"ఇష్టమొచ్చినన్నాళ్ళు ఇద్దరు ప్రేమించుకుంట్రు. ఎప్పుడన్నా వల్లలోన ఒకరికి ఇష్టం పొయ్యి ఇంకొకరిని ఇష్టపడితే, ల్యాకుంటే ఆడితో పాటు ఇంగోకరిని గూడ ఇష్టపడితే. ఇయన్నీ నాకు మామూలే అనిపిస్తాయి గానీ ఇందులో మోసం అనిపియదు. "

"ఇట్లా మనకనిపిచ్చినట్లల్ల సేస్తానంటే ఇంగ పెండ్లిళ్ళు, సంసారాలు నిలబడవు. "

"పెండ్లిళ్ళు, సంసారాలు సుల్ల అనేది అందుకే "

సమాజ స్వభావాలు, బూతు, ప్రేమ, వ్యక్తిత్వాలు, దేవుళ్ళు, సంప్రదాయాలు ఇలా ఎన్నో మేం మాట్లాడే మాటలు. తన దగ్గర ఉన్నప్పుడు మాట్లాడేందుకు ఉత్సాహం వొచ్చేది. అయినా తను నా ప్రతి మాటకు గుడ్డిగా విలువనిస్తుందేని నా లోపల ఒకవైపు ఆందోళన. నా అభిప్రాయాలే సత్యాలుగా తనపై రుద్దుతున్నానా? తన చదువుని, భవిష్య ఆశలని నా అభిప్రాయాలతో చెడగొడుతున్నానా? నా లోపలి బూతు కోరికని తనకెప్పుడు చెప్పుకోవాలి?

వీణకు బూతుపై అభిప్రాయాలు మారుతున్నా తనలో ఇంకా భయం అలాగే ఉన్నట్లు కనిపిస్తుంది. ఇది భయం కాదేమో, నా కంటే పెద్ద వయసు ఉన్న తాను నా దగ్గర బూతుని బయట పెట్టడం చిన్నతనం అనుకుందేమో. నేను భవిష్యత్తులో స్త్రీల కోసం పోరాడేవాన్ని అవుతానని అంటుంది, అందరిలో కన్నా నేనే ప్రత్యేకం అంటుంటుంది, ఈ మాటలు విన్నప్పుడల్లా నా వ్యక్తిత్వం పై నాకే సందేహం. తనతో నడుస్తున్న ప్రక్రియ అంత లోపలి కాముకుడి కోరికకు జరుపుతున్న నాటకంగా అనిపిస్తుంది. ఆ లోపలి అసలు కోరిక చెప్పేస్తే ఆత్మ ఇంత మధనపడేందుకు ఆస్కారం ఉండదు.

కాన్సర్ బారిన పడ్డ ఊరి స్నేహితుడొకడు చనిపోయినట్లు తెలిసింది. ఆ కాన్సర్ నాకే వొచ్చినట్లు, నేను కూడా చావుకి దగ్గరైనట్లు మొత్తం భయాలు. ఈ చావు భయం వీణకు అసలు విషయాన్ని చెప్పేందుకు ధైర్యం పోసింది. అసలే బతికేందుకు అతి తక్కువ సమయముంది.

మొబైల్ చేతిలోకి తీసుకొని నాకు నీ మీద కూడా బూతు కోరిక ఉందని సందేశం పంపాను. నీకిది ఇష్టమేనా అని ఇంకో సందేశం పంపాను. అంతే మరో సందేశం నా ఫోను నుండి తనకు పోలేదు. తను నా ఫోన్ నెంబర్ని బ్లాక్ చేసింది. నేను అనుకున్నట్లుగానే తను ఈ విషయాన్ని సాధారణంగా తీసుకోలేదు.

ఎన్నో సార్లు నేను ఆడవాళ్ళతో అదే కోరికతోనే ఉంటానని అన్నాను. నేను ఎక్కువగా ఆలోచించే విషయం బూతేనని, అటువైపు ఉన్న వాళ్ళపై కోరికను బయట పెట్టడం నేరమేమి కాదని ఎన్నోసార్లు తనకి చెప్పుకున్నాను. తన మీదకు వొచ్చేంత వరకు వీణకు ఇందులో అభ్యంతరం కనిపించలేదా? నేను ముందుగానే పరోక్షంగా సంజ్ఞలు పంపినట్లు తనకు అర్థం కాలేదా? తనకి అన్ని విషయాలు అర్థమవుతున్నాయని కేవలం కానట్లు నటిస్తుందని నాకనిపించింది నిజం కాదా?

ఆ రాత్రి ఎన్నో ఆలోచనలు. వీణ ఇక నాకు ఫోన్ చేయడం లేదు. నేను కూడా తనకు సందేశాలు పంపడం, ఫోన్లు చేసే ప్రయత్నాలు సాగించలెదు. నాకు తరవాత మా రూముకి కొత్తగా వొచ్చిన మా ఊరివాడైన శేఖర్ నుండి తెలిసింది ఏంటంటే నేను సందేశం పంపిన రాత్రి వీణ ఏడ్చిందంట. తనపై ఇలాంటి అభిప్రాయం ఉందని తెలవడమే తన బాధకు కారణమంట. ఇష్టమైతే ఇష్టమని లేదంటే లేదని చెప్తుందనుకున్నాను కానీ, ఏడవడం నేనూహించలేదు. ఈ కారణం మీద స్నేహాన్ని పూర్తిగా తెగ్గోసెంత బలహీనురాలుగా తనిప్పుడు లేదనుకొని పొరబడ్డాను.

నేను అయ్యాక వీణ ఇప్పుడు కొత్తగా మా రూం కి వొచ్చిన వాళ్ళతో కలిసి తిరుగుతుంది. నేను మాత్రం నా అభిప్రాయాలపై, నా చేష్టలపై ఆసక్తి కనబరిచిన స్నేహాన్ని కోల్పోయాను. ఇంతలా నాపై ఆసక్తి చూపిన స్నేహాన్ని నేను అప్పటివరకు చూడలేదు. తనకు నా లోపలి బూతు విషయం చెప్పి తప్పు చేశానా? ఈ బూతు విషయం తనకు చెప్పకపోయి ఉంటే నే చేసే ప్రతి చేష్ట అబద్ధంగా నా ఆత్మ నన్ను

ప్రశ్నించేది. నా ఆత్మ ఇప్పుడు తెలికైంది కానీ, నాలో తిరిగి శూన్యత. నేను ఎంత వదలాలని చూసినా ఇదెప్పుడు నా వెంటే పడుతుంటుంది. అయినా ఇక్కడ ఎవరు మాత్రం నిండుగా తృప్తితో ఉన్నారు? చుట్టూ వందల మందిని వేసుకొని తిరుగుతున్నా, అందరిలో అంతుచిక్కని శూన్యం. నిండుతనం ఓ నాటకం.

# 4

ఈ హైదరాబాద్ మహానగరంలో

ఉదయాన్ని, సాయంత్రాన్ని ఆలింగనం చేసుకునే మార్గాలుండవు. ఆకాశ నక్షత్రాలు జారి ఇక్కడి భవంతుల విద్యుద్దీపాలుగా మెరుస్తుంటాయి, రాత్రి ఆకాశాన వాటి జాడే వుండదు. ఎక్కి దిగేందుకు డాబా మెట్లే తప్ప చెట్లు చేమల అవకాశాలు లేవు. ఇక ఏకాంతం అది బాత్రూంలకు, సిమెంట్ గోడలకే పరిమితం. పాడుకోడానికి ఇక్కడ యెనుములతో, కుక్కల్తో, పక్షి పిల్లల్తో కాదు, బొమ్మలతోనే సాంగత్యం. కొండల ఆనవాళ్ళు గోడపై తగిలించబడ్డ చిత్రపటాలు. పసితనం నుండి పల్లె రమణీయత రుచిమరిగిన నాకు మహానగర వాతావరణం సరిపోదు. నగరంలో ఉన్న ఎప్పటికీ నాకు ఊరి ధ్యాసే.

నాకు మా ఊర్లో అబ్బురపరిచే విషయాల్లో పుకారులొకటి. ప్రతీ వ్యక్తి చుట్టూరా ఎన్నో రకాల పుకార్లు నడుస్తుంటై. అవి పుట్టే తీరు, నడిచే విధానాలు అద్భుతమనిపిస్తాయి. తమకు దక్కని వాటిమీద పుకార్లు తయారుచేయడం ఊహా శక్తితో తీర్చుకునే కసి. ఆ కసి కొందరి జీవితాలను నాశనం చేస్తోంది, ఇంకొందరికి అందరూ తమ లాంటి వాళ్ళేననే స్థైర్యాన్ని ఇస్తుంటుంది. పుకార్లలో అధికభాగం లంజరికం మీదే సాగుతుంటై, చుట్టూరి ఎన్ని నిజ సమస్యలున్నా వాటిని కాదని పనిగట్టుకొని పుకార్ల మీదే అందరికి ఆసక్తి.

జానకి గుడి పూజారి కొడుకుని ప్రేమిస్తుందని ఓ స్నేహితుడు నాకు ఓ పుకారు విషయాన్ని చెప్పాడు. ఇది నిజమా! లేక అల్లిన కథేనా! కార్తీక పూజలప్పుడు తను మాటికి వాణ్ణి చూసి నవ్వడం గమనించాను. తను వాణ్ణి చూసి మాత్రమే నవ్విందా? నవ్వేందుకు ఎన్నో కారణాలు ఉంటై, వాటిని ప్రేమేనని ఎలా అనుకోవాలి? జానకిలో నాకింకా పసితనమే కనిపిస్తుండేది, ఈ నవ్వు కూడా దాని ఛాయేనేమో.

జానకి మాత్రమే కాదు, నన్ను ఆ కార్తీకాలప్పుడు ఆకర్షణ మంత్రంలో ముంచిన చూపులు ఇంకా ఉన్నాయి. అందులో రేవతి కూడా ఒకటి. ఆ రేవతి తనను ఒకటే చూస్తుంటుందని అంజీ గొప్పలు కోస్తాడు, వాడే కాదు ఇంకో స్నేహితుడు కూడా తనవైపే చూస్తదని చెప్పుకునేవాడు. తను నా వైపే చూస్తుంటుందని నాకనిపించేది. బస్టాండ్ ఎదురుగా ఇల్లున్న ఈరమ్మ కూడా నేను అటువైపు వెళ్తే నావైపే చూస్తున్నట్లు సందేహం. నాలో అమ్మాయిలను ఆకర్షించే అర్హతలేమి లేవు. మరెందుకు ఈ చూపులు?

కాస్త మాట్లాడే సంగతులు,<br>
చూసే చూపుల ప్రవర్తన

ఇవే అమ్మాయిలని ఆకర్షించే మొదటి ఉపాయాలని హైదరాబాద్ లో ఓ స్నేహితుడు చెప్పినట్లు గుర్తు. మరి నేను వీళ్ళెవరితోను మాట్లాడలేదు, కనీసం ఆ కళ్ళవైపు చూడాలన్న ఏదో అద్దుర. మరి నేనెట్ల ఆకర్షిస్తున్నానో వీళ్ళని? నేను పెద్ద చదువులు చదువుతున్నానని నాకు ఊర్లో పేరు. అదే అర్హత వీళ్ళని నావైపు లాగిందేమో. కానీ నేనే వీళ్ళకి చివరికావడం లేదు, అంటే నాపై ఇంకా వాళ్ళలో ఏదో సంఘర్షణ.

కాముకత్వం అందరి కళ్ళను కప్పేసి అచేతనంగానే మరో లింగాన్ని ఆకర్షించేందుకు ప్రయత్నిస్తుంటుంది. అమ్మాయిలైనా మగవాళ్ళైనా పరస్పరం ఒకరికొకరు వలలు వేసుకుంటుంటారు. కేవలం బూతేనని చెప్పే మనసు అపరాధ భావం నుండి తప్పించుకోడానికి దానికి ఇంకొన్ని రంగులు కలపమంటుంది. ఆ రంగులు తమలో వెలితిగా ఉండేటి లేమిలు. ఊర్లో వీళ్ళకు లేమిగా ఉండేది తమ నిర్ణయాన్ని చెప్పుకునే స్వేచ్ఛ, ఆడంబర జీవితం మరియు బలహీనులమని అనుకునే తమకు బలమైన అండ. భవిష్యత్తులో వొచ్చే భర్తలో ఇవన్నీ ఉండవచ్చు లేదా ఉండకపోవొచ్చును కూడా. కానీ తమలో మొదలైన కాముకత్వం మాత్రం అప్పటివరకు నిగ్రహంగా ఉండలేదు. ఇష్టమున్నా లేకపోయినా ఆకర్షించమంటుంది, అసహజంగానైన చూపులు మరల్చమంటుంది. కేవలం బూతుకు సరిజోడిని వెతకడం మాత్రమే కాదు అది లేమిని తీర్చాలి. లేమి అనేది పూర్తిగా మానసికం, దాన్ని మరో లింగంలో వెతకడం పరిచయాలను నేరంగా చూసే సమాజాల్లో పూర్తిగా అసాధ్యం. దీనికి కొన్ని పైపూత రంగులని అద్ది చుట్టూరి వ్యక్తుల ద్వారానో, సినిమాల ద్వారానో, కథల ద్వారానో అర్హత జాబితాను తయారు చేసుకుంటాం. తమకున్న అర్హతలైన అందం లేదా శరీరాకృతితో అటువైపు తాము తయారుచేసి పెట్టుకున్న అర్హతల లింగాన్ని ఆడవాళ్లు ఎన్నుకుంటారు. అర్హతల జాబితాలో ఎందరికో గాలం వేస్తే, అది ఒక్కరినే దాన్ని అందుకోమని బుద్ధి హెచ్చరిస్తోంది. అందుకున్న వాడు ప్రేమికుడు.

ఊర్లో వీళ్ళు కూడా తాము పెట్టుకున్న అర్హతల నుండి డబ్బో, పలుకుబడో, వేషాలో దేన్నో ఒకదాని మిషగా మొదట ఒక్కరినే ఎన్నుకోవాలనుకుంటారు. ఒక్కరూ అనేది వాళ్ళకు నేర్పిన నీతికి నేరం కాదు. అతడు తమను పట్టించు కోడేడమోనన్న భయంతో ఇంకొకరిపై అప్పుడప్పుడు చూపులు, ఇతడు బాలుని అందుకుంటాడో లేదోనని మరొకరు. పైమెట్టు అర్హత నుండి ఆలోచిస్తూ చివరి అర్హత వరకు తమని ఎవరు పట్టించుకోరనే వారికి కామం మిగిల్చేది మనోవేదన. ప్రేమ రాహిత్యం చాటున దాక్కున్న కామ రాహిత్యం.

ఈ కోరికల అర్హతల వెల్లువలో
వేషంలోను
కబుర్లలోను
నాకంటే ముందుండే అంజీని మొదటి అవకాశంగా వాళ్ళు కోరుతుండొచ్చు. ఇక రెండవ అవకాశం ఊర్లో నాకు కొత్తగా స్నేహితుడైనా తిరుమలతో అయ్యుండొచ్చు. వీళ్ళకాకపోతే ఊర్లలో ఎప్పుడు వుండే వాళ్ళలో ఎవరో ఒకరు ఆ అవకాశాల్ని అంది పుచ్చుకోవొచ్చు. ఎప్పుడొకసారి ఊరికి వొచ్చే నాపై ఆకర్షణ మరెక్కువ దినాలు వీళ్ళకు సాగదు. అంజీ కూడా ఇప్పుడు హైదరాబాద్‌ను మరిచి ఊర్లో వ్యాపారం చేయాలనే ఆలోచనతో ఇక్కడే ఉంటున్నాడు.

రేవతి గానీ, ఈరమ్మ గానీ ఇద్దరి ఇండ్లు దారికి అందరి ఇండ్ల మధ్యే ఉంటై. రోజుకి ఒక్కసారైనా వాళ్ళని చూసేందుకు ఏ అబ్బాయికైనా అవకాశం ఉంటుంది. మరి దొడ్ల ఆవలివైపు, మెయిన్ దారిలో

కాకుండా ఊరికి చివరన ఉన్న గుడిసెలోని జానకిని ప్రతిరోజు చూడ్డం మాత్రం ఎవరికి సాధ్యం? పనిగట్టుకొని వాళ్ళున్న వైపే అదికూడా మగతోడు లేని ఆ గుడిసెల వైపు రోజూ తిరగడం ఎన్నో పుకార్లకు ఆస్కారమిస్తుంది కూడా. నేను మా దొడ్డికి వచ్చినప్పుడు ఆ గుడిసెల వైపు జానకి కనిపిస్తుందేమోనని ఆశగా చూస్తాను. మా ఇద్దరి మధ్యున్న ఈ యెడమైన దూరం కూడా అందరిలో తను నాకు ప్రత్యేకమనే భావన తీసుకొచ్చేది.

నేను ఊర్లో ఉన్నప్పుడు ప్రతిసారి దొడ్డి వైపు వెళ్తుండటం మా వొదిన గమనించి నాపై అనుమానాన్ని బసీరుని అడిగిందట. వాడు నేను జానకిని ప్రేమిస్తున్నట్లు చెప్పాడాంట. నేను బసీరు కానీ, వినోదు కానీ ఫోన్ చేస్తే జానకి పరిస్థితుల గురించి అడిగేవాన్ని. దాన్ని వాళ్ళు ప్రేమనుకున్నారా? అది ఓ జాలై ఉండొచ్చు, లేదా నాకు తెలీని మరేదో. ఇది వాళ్ళు అనుకునే ప్రేమేనని ఎలా అర్థం చేసుకున్నారో!!

జానకి ఎప్పుడూ ఊర్లోని అబ్బాయిలని తిడుతుంటుందని, ఆ విషయం వాడికి మా వదిన చెప్పిందని ఓనాడు బసీరు నాతో ఫోన్లో అన్నాడు. తను దారి మీద పోతుంటే తనవైపే అబ్బాయిలు చూస్తుంటారని, అందుకే ఊర్లో కూడా తిరగ బుద్ధి కాదని కూడా అందట. ఇది కూడా అబ్బాయిలని ఆకర్షించే తనకున్న ఓ టెక్నిక్‌లానే నాకనిపించింది. ఆ తిడుతున్న అబ్బాయిల జాబితాలో నా పేరు ఉంటుందా? ఉండాలనే కోరుకుంటాను. తన దృష్టిలో పడటం నాకు అత్యంత అవసరమైన పనిలాగా తోస్తుంటుంది. జానకి తిట్టే వాళ్ళలో అంజీ పేరు ఎక్కువుంటుందట. నాకిక పూర్తిగా అర్థమయ్యింది ఏంటంటే జానకి తన మొదటి అవకాశంగా అంజీని ఎన్నుకుందని. వాడు దాన్ని అంది పుచ్చుకుంటాడో లేదా జారవిడుస్తాడో!!

మా పొలానికి కూలికి వొస్తున్నప్పుడే మా వదిన జానకికి స్నేహితురాలైంది. అప్పుడప్పుడు వదినతో మాట్లాడేందుకు ఇంటి వైపు కూడా వస్తుందట. నేను జానకిని ప్రేమిస్తున్నానని అనుకునే వదిన ఆ విషయాన్ని తనకెప్పుడు చెప్పలేదు. కారణం మా వొదిన చెల్లెల్ని నేను పెళ్ళాడాలని తన కోరిక. మా వొదిన చెల్లెల్ని నేను చూసింది లేదు. ఓనాడు నా పక్కన అంజీ కూడా ఉన్నప్పుడు మా వదిన నా పెళ్ళి ప్రస్తావన తీసుకొచ్చింది.

"వాడు మీ పాపల్ని యేడ సేసుకుంటాడు? ఊర్లనే పిల్లని పెట్టుకొని"

జానకిని ఉద్దేశించే అంజీ అన్నాడు.

"ఆ ఫోట్టి ఏమన్నా మా కులమా!! "

"కులం కాకుంటే ఏమైతది? ఇద్దరికి ఇష్టముంటే పెళ్ళి సేసేయ్యాళ్ళ. "

"ఆ ఫోట్టికి యాడ ఇష్టమేదే. అన్ని మీరు మీరు అనుకున్నేదే. "

నేను ఇక్కడే అవకాశం తీసుకున్నాను.

"ఓవేళా నాను జానకిని సేసుకున్నా ల్యాక ఎరేటోల్లని సేసుకున్న యాదో ఓనాడు వొళ్ళని ఇడిసి నే పోవొచ్చు. ఒకరి మిందే ఎక్కువ దినాలు ఇష్టం ఉండేది నాకి సేతకాదు. ఇష్టం పోయినంక వొళ్ళతోటి నానుండలేను. "

"అయితే దన్ని మోసం అంటరు. "

"ఎవరు ఎమ్మన్న అనుకోని. పెళ్ళి సేసుకోవాలని నాకేం లేదు. సేసుకుంటే నిలబడతానని గూడ లేదు. నాకిది మోసం గాదు, నా మింద ఆశలు పెట్టుకునేది కూడా మంచిది గాదు, నా బతుకే నాకీ భారం గావొచ్చు"

"నీకేం భారం, నువ్వు సాకలేనంటే ఇడేనే ఇంటికాడ మా ఎంపడ సేని పనికొస్తది. మనకేం సేస్లు ల్యావ బతక నీకే"

"నా మనసు కరెక్ట్ ఉండదని సేప్తుండ. ఓటే వోళ్ళని సూపెట్టుకుంట, నన్ని వొళ్ళు ఎప్పుడు సూసుకుంట, జీవితమల్ల అంటే నాన్యా ఉండలేను.. "

ఈ మాటలు అంటానని వదిన ఊహించలేదు. ఇష్టం లేనప్పుడు తన పాపని చేసుకోను అనడంలో న్యాయముంటుందేమో కానీ, ఇష్టాన్ని పెట్టుకొని జానకిని కూడా కాదనడం. నాకెప్పుడూ ఎవ్వరి ముందుట ఇలా చెప్పడం అలవాటు లేదు, ఇక్కడ చెప్పక తప్పింది కాదు.

నాకున్న శ్రద్దని పెళ్ళనే పదంతో బంధించడం నాకిష్టం లేదు. పెళ్ళి అనేది జీవితాంతం సాగించాల్సిన ఒప్పందం. ఒప్పందాలకు ప్రతిజ్ఞలకు చోటిస్తే నా జీవితాన్ని నే కోరుకున్నట్లు నా చేతనైయ్యేంతయినా బతకడం సాధ్యం కాదు. పెళ్ళి లేకపోతే ఇక కామ కోరికని ఎలా తీర్చుకుంటావు? ఒకరి నుండి కామాన్ని సాధించే ధైర్యం కూడా నాకు లేదు.

వానాకాలం,

మా దొడ్డికి ఆ గుడిసెలకు మధ్యనున్న ముళ్ళకంపల నుండి కొన్ని పొదలు పిచ్చి కొమ్మలు మొలుచుకొచ్చాయి. ఆ సమయాల్లోనే ఊరికి వొచ్చిన నాకు దొడ్లో నుండి ఆ గుడిసె వైపు చూడ్డం కష్టమయ్యింది. ఆ చెట్ల ఆకు చాట్లలో కొద్ది కొద్దిగా గుడిసె కనిపించేది, తాను కనిపించదు. కుర్రాళ్ళ భయంతో ఇప్పుడు తను వీధుల్లోకి రావడం లేదు. తను ఎవరికి కూలికి వెళ్తుందో తెలీదు, ఈసారికి తన్ను చూడ్డం అసాధ్యమనిపించింది.

నేను జాబు మానేసి, జాబు మీద వొచ్చిన జీతంపై కొన్న పుస్తకాలను చదవడం అటు ఇటు తిరగడం చేసేవాన్ని. నేను చదువుని పూర్తిగా వదిలేశానని జీవితంపై పూర్తి నిర్లక్ష్యంతో ఉన్నానని అన్నకు ఎలాగో తెలిసింది. నేను రేపు హైదరాబాద్ వెళ్తున్నాననగా ముందు రాత్రి నాపై కోప్పడ్డాడు. ఏం చేయలనుకుంటున్నవని అడిగితే నేనేమి తనకు సమాధానమివ్వలేదు. నేనేం చేయలనుకుంటున్నానో, ఎలా బతకాలనుకుంటున్నానో నాకు తెలీదు, ఇంకేం చెప్పాలి? చదువు కొనసాగించమన్నాడు. నేను నోరు తెరవలేదు. నేను పూర్తి స్వార్ధపరుడినని నాపై ఆశలు పెట్టుకున్న అమ్మను, అందర్నీ మోసం చేస్తున్నానని నా వ్యక్తిత్వంపై తిట్లు మొదలెట్టాడు.

జానకిని చూడలేదని బాధ,

మరోవైపు రాత్రి తిట్లు

అసహనంగా ఉదయం గుడి గోడకు ఆనుకోని ఉన్న కట్టపై కూర్చునున్నాను. నాకెదురుగా బసీరి చెట్టు కట్ట మీద కూరగాయలను ముందేసుకొని ఒకావిడ అమ్మకాలు సాగిస్తోంది. మీనాక్షి ఆంటీ వొచ్చెల్లింది. తనలానే నాలో కామ ప్రకంపనలు రేపే ఇంకొందరు ఆడవాళ్ళు, నన్ను ఆకర్షించిన వాళ్ళు కొందరు. ఇక్కడికి కూరగాయల కోసమేనా జానకి వొస్తే ఎంత బాగు.

వాళ్ళమ్మని పంపిస్తుందని అనుమానంలో ఉన్న నేను నమ్మేలేదు జానకే చేతిలో సంచితో రావడం. అదృష్టాలను, జాతకాలను నమ్మని నేను నాకెక్కడో రాసి పెట్టుందని అనుకున్నాను. తను అటు ఇటు ఎవరి వైపు చూడకుండా కూరగాయల అవ్వ దగ్గరికెళ్ళింది. తను బసీరి చెట్టు కట్టనెక్కి నావైపు తిరిగి కూరగాయలు ఏరుకుంటుంది. నేను తననే చూస్తున్నాను ఆశగా. తను కూరగాయలను ఏరుకుంటు

మాటికి నావైపు చూస్తూ తలను కిందకు దించుతుండటం నేనూహించలేదు. తను నావైపు చూసినప్పుడు నాకే ఏదోలా అనిపించి కళ్ళను మరోవైపు తిప్పుతున్నాను, కానీ ఆ కళ్ళవైపు సూటిగా చూడమని ఆత్మారాముడి ఉద్బోధ. కాలంను ఆపేసి తన్నిక్కడే ఉంచుకోవాలని కోరిక. మొత్తం ప్రపంచమంతా యుగాంతంలో కొట్టుకపోయి తను నేనూ మాత్రమే మిగిలిపోవాలని ఆశ. మనసు ఎన్నో ఊహల్ని కళ్ళకు తీసుకొస్తుంది, కానీ తన కళ్ళ వైపు చూడటానికే ఆద్దురా.

జానకి వెళ్తూ చివరిసారిగా నావైపు మరోసారి చూపు విసిరింది. తన దృష్టిలో నేనూ కూడా ఉన్నానన్నమాట. నేను ఇక్కడ లేనప్పుడు నా గురించి అప్పుడప్పుడైన కలలు కంటుందేమో! నేను మా దొడ్లో నుండి తన్ను చూడ్డం చూసి నాపై ఇష్టం పెంచుకుందేమో. ఇవన్నీ ఊహలు. పరిస్థితులను ఎన్ని రకాలైన ఊహించుకోవొచ్చు, అయినా ఈ ఊహ నేను హైదరాబాద్ వెళ్ళే ముందు ఆహ్లాదాన్ని పంచగలిగింది.

వీణ లేని శూన్యత జానకిని కోరిందేమో! నేను జానకిని మాత్రమే కాదు, ఈ మనసు ఒక్కోసారి జానకి కన్నా కూడా రేవతిని ఎక్కువ పట్టించుకుంటుంది. వీళ్ళిద్దరిని కాదని మా మామ కూతురు శిరీషని కూడా మరెక్కువ కోరుతుంటుంది. వీళ్ళపై ఉండేది బూతు కోరిక అనిపించదు, ఏమో అచేతనంగా బూతు ఉందేమో, అయినా వాళ్ళని ఊహించుకొని హస్తప్రయోగాలు చేసుకోవడం తక్కువ.

మా ఊరికి నాలుగు కిలోమీటర్ల దూరానుండే కృష్ణదొడ్డి కొండ మీదకు క్రొత్త సంవత్సరం మొదటి రోజు చుట్టుపక్కల ఊర్ల నుండి కొందరు అబ్బాయిలు, అమ్మాయిలు ఇంకొందరు కొత్తగా పెళ్ళైన జంటలు పూజకు వొస్తుంటారు. అక్కడే కొండ మీద తమ గ్యాంగ్‌లతో కేకులు కోస్తారు, ఏమైనా తినేవాళ్ళు తింటారు, ఏదైనా తాగేవాళ్ళు అక్కడే రాళ్ళ చాటుకి తాగేస్తారు. ఆ యేడు అంజీ తన స్నేహితులతో కొండ మీదకొచ్చాడు. అప్పటికే జానకి, రేవతి ఇంకొందరు అమ్మాయిలు వాళ్ళతో పాటుగా ఓ పెళ్ళైన ఆడది ఓ పరివారంగా కొండకొచ్చారు. వీళ్ళున్నారని తెలుసుకున్న అంజీ పరివారం వాళ్ళ కంట్లో పడేందుకు మాటికి వాళ్ళ చుట్టే తిరిగేస్తున్నారు. గట్టిగా నవ్వుతున్నారు, ఒకరినొకరు గిల్లుకుంటున్నారు. కేకు కోసేప్పుడు ఆ అమ్మాయిలు అక్కడే తమ కోసం అవస్థలు పడుతూ తిరుగుతున్న అంజీని వాడితో ఉన్న కుర్రాళ్ళని దగ్గరకు పిలిచారు. ఇది వాళ్ళు ఊహించనది. దగ్గరికి పోయాక కట్ చేసిన ముక్కలు నోట్లో పెట్టి చేతులు కలిపి శుభాకాంక్షలు చెప్పుకున్నారు. కేవలం శుభాకాంక్షలతో ఆగిపోక కాసేపు చెట్టు నీడలో నవ్వుకుంటూ మాట్లాడారు. అంజీ తనకు కేవలం శుభాకాంక్షలు కాదని, తినేందుకు డబ్బులు కూడా ఇవ్వాలని నవ్వుకున్నాడు. మాటల్లో వాళ్ళలో ఒకరికొకరు పోటీతత్వం. చివరగా వెళ్తూ వెళ్తూ రేవతి అంజీకి ఓ కితాబు నిచ్చింది

"నువ్వు గూడ మనురోళ్ళ తోటి కలిసి సెడిపోయ్యేవే"

ఎంత మాట. పక్కనున్న వాళ్ళని పరోక్షంగా తిడుతూ వాణ్ణి పైకి లేపడం, ఎంత మాటైనా కూడా ప్రత్యేకంగా వాణ్ణే అనడం. అయినా వాడు చెడిపోతే తనకేం. వాడిపై రేవతికి ఎవరిపైన లేని ఆపేక్ష. ఆమె పక్కనే పెళ్ళైన ఆమె కూడా ఉన్నా, తను ధైర్యంగా ఆమాట అనగలిగింది. మిగతా కుర్రాళ్ళకు పూర్తిగా అర్థమయ్యింది రేవతి అంజీని ప్రేమిస్తుందని, అలాగే తాము చెడిపోయిన వాళ్ళమని.

ఈ విషయాలని రాత్రి బసీరు ఫోనులో చెప్పాడు. అలాగే వాడు నా మొబైలుకి ఓ ఫోటో పంపించాడు. అది ఆ కొండ కింద ఫొటో. దూరం నుండి తీయడంతో కాస్త మసగ్గా ఉంది.

అందులో జానకి చీరలో, ఎవరో కుర్రాడి ఎదురుగా నిలబడి మాట్లాడుతున్నట్లు.

ఎవరు వాడు? మన ఊరి వాడు కాదని బసీరు చెప్పాడు. మరెవరూ? కొండకు చుట్టుపక్కల ఊర్లలో నుండి ఎందరో కుర్రాళ్ళు వస్తుంటారు. ఈ కుర్రాడు ఏ ఊరి వాడు? చేతుల్ని కలుపుకొని నడుచుకుంటూ చాలాసేపు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారంట. అంతసేపు మాట్లాడితే తనతో తోడుగా వొచ్చినవాళ్ళు ఏమైయ్యారు? జానకి మాట్లాడుతుంటే మిగతా అమ్మాయిలు, ఆ పెళ్ళైనామె దూరంగా చెట్టు నీడలో ఉన్నారంట.

ఒకటే అద్దురా. ఎవరు ఆ కొత్త వ్యక్తి? ఎందుకు జానకి అంతలా మాట్లాడినట్లు? తనకేమీ తెలీదని బసీరు చెప్పుకున్నాడు. అంజీకి ఫోన్ చేస్తే ఆ కొత్త వ్యక్తి ఎవరో తెలీదన్నాడు. తను ఎవర్నైనా ప్రేమించిందా? వాడు ఆ ప్రేమించిన వాడే అయితే ఎక్కడ ఏర్పడుంటుందో వాళ్ళిద్దరి పరిచయం? జానకి ఎప్పుడూ ఊరిని దాటింది లేదు, ఒకవేళ పక్కూరికి కూలికి వెళ్తున్నప్పుడు పరిచమైనోడేమో? ఇలానే ఎందుకు ఆలోచించాలి, బంధువుల పిల్లాడై జానకికి సోదరుడి వరసై ఉండొచ్చు. సోదరుడో లేక మామ వరసో?

ఈ అద్దురని తీర్చేవాళ్ళు, తెలిసిన వాళ్ళు ఉంటే అది ఊరి అమ్మాయిలే. వాళ్ళకు చెప్పే వాడితో మాట్లాడేందుకు పొయ్యింది. పక్కన పెళ్ళైన ఆంటీ కూడా ఈ అమ్మాయిలకు దోస్తులాగే ఉంది. లేకపోతే ఏ విషయంలో కూడా ఆమెకి భయపడకుండా అమ్మాయిలు కొండ మింద ఎలా ప్రవర్తిస్తారు?

అయినా ఈ అద్దురా నాకెందుకు కలగాలి? జానకి ఎవరితో మాట్లాడితే నాకేంటి? అయినా సోదరుడైతే ఒకలా ప్రేమికుడైతే మరోలా నాలో స్పందనలు ఎందుకు మారుతున్నాయి? నేను తన ప్రేమికుడిగా మారాలని అనుకుంటున్నానా? రేవతితో కితాబు పొందిన అంజీపై కూడా అసూయ కలుగుతుందంటే నేను రేవతిని కూడా ప్రేమిస్తున్నట్లా? ఒకరితో మాత్రమే ఓ సమయంలో ప్రేమలో ఉంటామనేది నా విషయంలో అబద్ధం. ఈ ఒక్కరూ అనే నుండే అనేకరకాల వివక్షలు పుట్టుకొచ్చినట్లు అర్థం కాసాగింది.

సంక్రాంతికి ఊర్లో కొన్ని పందేలు జరిగాయి. ఈ పందేల నిర్వాహణకు కుర్రాళ్ళే చందాలేసుకున్నారు, ప్రతి పందెంకు పాల్గొనే వాళ్ళ నుండి నిర్ణీత అమౌంట్ కూడా వసూలు చేశారు. ఆ పందేలలో భాగమే మసీదు ముందు ఆడవాళ్ళ కోసం ముగ్గులపోటీ. ఈ పోటీలో జానకి పాల్గొంటుందని ఆశపడ్డాను కానీ, జానకి కాదు కదా రేవతిగాని, ఈరమ్మగాని కూడా పాల్గొనలేదు. చూడ్డానికొచ్చిన వాళ్ళలో కొందరు గుండ్లను వెతుక్కొని కూర్చుంటే, ఇంకొందరు నిలబడి చూస్తున్నారు. అందరిలో చూడ్డానికి ఇబ్బందైన వాళ్ళు మిద్దెలమీద నుండి పందెంను చూస్తున్నారు.

రేవతి తనకెదురుగా ఉన్న మిద్దెపై నుండి పోటీని ఆలకిస్తున్న అంజీ వైపు చూపుని పదే పదే విసురుతుంటే, అదే మిద్దె పైనే ఉన్న ఈరమ్మ కిందున్న బీరప్ప వైపు మాటికి కళ్ళను తిప్పుతుంది. అంజీ పోటీమీద ధ్యాసతో రేవతిని పట్టించుకోవడం లేదు కానీ, బీరప్ప మాత్రం చూపులకు ధీటుగా తన చూపుల్తో సమాధానమిస్తున్నాడు. పోటీ చూడ్డానికొచ్చిన పిల్లలు ఒకరి నెత్తిపై మరొకరు మొట్టికాయలు వేస్తూ తప్పించుక తిరుగుతున్నారు. దిద్దుతున్న ముగ్గులోనూ, బిగించిన జడలోనూ, వేసుకున్న అంగీలోనూ పువ్వులే కనిపిస్తున్నాయి జయలక్ష్మి దగ్గర. ఆ అమ్మాయి పై పెట్టెలో ముగ్గేస్తున్న కొత్త అమ్మాయి ఎవరో తెలీడం లేదు, మా ఊరు కాదేమో. జయలక్ష్మికి మరోవైపు మొత్తం పెట్టంతా ఆక్రమించిన శరీరంతో ఉన్న శైలక్క, ఊరికి తనే విజయశాంతని నా చిన్నతనంలో అనుకునేవాన్ని,

ఇప్పుడు అమ్మకు రాకముందే తన తల మొత్తం తెల్లటి వెంట్రుకలు, ముడతలు పడ్డ శరీరం. ముగ్గులు దిద్దే వాళ్ళ చేతల్లోను, చుట్టూరా అందరి వేషాల్లోనూ ఎన్ని రంగులో.

చంకలో పిల్లాడి నేసుకొని సునీత అటుఇటు తిరుగుతుంది. ఒకప్పుడు అందంగా కనిపించినా ఆమె ఇప్పుడు చూస్తుంటే బక్కగా మారిపోయి, బుగ్గలు లోపలికెళ్ళి వికారంగా! భవిష్యత్తులో ఇప్పుడు అందంగా ఉన్నట్లు నే భావిస్తున్న కుర్రదానుల పరిస్థితి కూడా ఇంతేనా? లేదు, ఇలా అందరికి జరగదు, తను ఇప్పటికే మూడుసార్లు కనింది అందుకే ఈ పరిస్థితి ఏమో. పిల్లల్ని కనడం పూర్తిగా ఆపేశాక తిరిగి సునీత శరీరం అప్పటిలా అవుతుందేమో.

పోటీ చూడ్డానికొచ్చిన ఆంటీలలో కొందరు పెళ్ళికాని ఆడపిల్లలకు మేమేం తక్కువన్నట్లు మెరుస్తూ కనిపిస్తున్నారు, కొందరు ఆ మెరుపుదనాన్ని బట్టలతో చూపిస్తుంటే, ఇంకొందరు మత్తెక్కించే శరీర ఆకృతితో. మగవాళ్ళు అక్కడ చూడ్డానికొచ్చిన ఆడవాళ్ళని ఆకర్షించేందుకు కొందరు మాటికి ఈలలు, కూతలు. పందెంలో గెలిచిన వాళ్ళని నిర్ణయించే పెద్దలు ముగ్గురు కుర్చీల్లో కూలబడి చేతుల్ని అటుఇటు ఆడిస్తూ ఏదేదో మంతనాలు సాగిస్తున్నారు. ఈ మొత్తం తతంగంలో అనవసరంగ కనిపిస్తుంది ముసలివాళ్ళే అనిపిస్తుంది.

జానకి ఓ గుండు మీద, వాళ్ళ మామ కూతురు రేణుకతో కలిసి కనిపిస్తుంది. తను ఎవర్ని చూస్తుందోనన్న ఆరాటం. ఓసారి అటుఇటు తలని తిప్పుతూ, మరోసారి కేవలం ముగ్గుల పైనే కళ్ళను దించేస్తుంది. తను మాటికి పక్కనున్న రేణుక చెవుల్లో ఏ విషయాలో ఊదుతుంది. అవి ఎలాంటి విషయాలైనా నాకు వినాలనిపిస్తుంది. నవ్వుతుంది, జడను సవరిస్తుంది, గదుముతుంది. తన పళ్ళవరస ముక్కు కున్న పుడకతో కలిసి వెలుగులు జిమ్ముతూ. తను నావైపు కూడా ఒకసారి, కేవలం ఒక్కసారే చూపులు విసిరినట్లు గుర్తు. అది కూడా అప్రయత్నంగానే అనిపించింది. రేవతికి అంజీపై ఉన్నట్లు, ఈరమ్మకు బీరప్పపై ఉన్నట్లు, జానకికి నాపై లేదు. ఈ పోటీలో జానకి ఆహార్యాలను, ముఖ కవళికలను నవ్వు రూపాలను ఎంతో సమయం చూడగలిగాను, ఇది సరిపోదు.

కొండ దగ్గర జరిగిన విషయం తెలిసినప్పటి నుండి తను నాపైన కూడా అలాంటి శ్రద్దే పెట్టాలని ఆశ. జానకి ఆలోచన నీడల్లో నేనూ ఓ భాగం కావాలి. అలా జరగాలంటే తనను నేను ఇబ్బంది పెట్టగలగాలి. తను నాపై చూపు విసిరితే నేనూ కన్నార్పకుండా, తలదించకుండా తనవైపే చూడాలి. తన ప్రతి కదలికను నేను గమనిస్తున్నట్లు తనకర్థం కావాలి. నేను మాత్రమే దొంగచాటుగా చూస్తున్నప్పుడు కలిగే అనుభూతి కన్నా కూడా తను కూడా నావైపు చూస్తున్నప్పుడు కలుగుతున్న అనుభూతి మరింత అందంగా అనిపిస్తుంది. అయినా ఎప్పుడో అప్పుడప్పుడు ఊరికి వస్తుండే నాకిది సాధ్యం చేసుకోవడం కష్టమైన సంగతి.

కృష్ణదొడ్డి కొండ మీద ఏటా జరిగే తిరుణాల ఉత్సవంకు ఈసారి నేను కూడా వచ్చాను. మా ఊరి నుండేగాక చుట్టుపక్కల ఊర్ల నుండి ట్రాక్టర్లు, ఎద్దుల బండ్లు, మోటార్ సైకిళ్ళ మీద జనాలు రథోత్సవం చూడ్డానికి రాత్రి పూట కొండకు వస్తుంటారు. అక్కడే పొలాల్లో విడిది చేసి కొండ మీది స్వామికి టెంకాయ కొట్టేసి రథోత్సవంని, అక్కడ జరిగే ఉత్సవాలని చూసి పొద్దునే తిరిగి ఇండ్లకు బయలు దేరుతారు. తిరుణాల ఉత్సవం కొరకు వొచ్చే అంగళ్ళు, జైయింట్ వీళ్ళు ఇవేగాక కొండ పైగుడి నుండి కిందవరకు వేసిన చిన్నబుట్ల సాయంతో మొత్తం ఆ కొండ చుట్టూరా నిశిని చీల్చే విద్యుత్కాంతులతో ధగధగా మెరుస్తూ.

జానకి వాళ్ళ కుటుంబంతో కొండకు వచ్చిందని తెలుసు, కానీ ఎక్కడ వాళ్ళు విడిది చేశారో నాకు, నాతో తిరుగుతున్న అంజీకి అంతుపట్టలేదు. ఇంతమంది జనాల్లో తనను వెతకడం అయ్యే పని కూడా కాదు. నేను, అంజీ మాతో సహా కొందరు కుర్రవాళ్ళం టెంకాయ కొట్టేందుకు కొండ మీదకు వెళ్ళాం. అక్కడ స్వామిని దర్శించుకొని కిందకు మళ్ళేప్పుడే అంజీకి జానకి కనిపించి నన్ను పిలిచాడు.

మాకు జానకికి మధ్య కాస్త దూరమే తేడా. తను వెనకాల నడుస్తుంటే ఉమ, రేణుక ఇంకెవరో బంధువులు తనకు కొద్దిగా దూరంలో ముందు, వాళ్ళెవరూ మగవారు కాదు. ఎక్కేవాళ్ళతో, దిగేవాళ్ళతో కొండ సందడిగా ఉంది. తన వెనకాలే పడుతూ తనని మేం అనుసరిస్తున్నట్లు తను గమనించాలని మా తపన. అంజీ అభిప్రాయంలో నేను జానకిని ప్రేమిస్తున్నాను, మరి నా అభిప్రాయంలో వాడు కూడా తనని ఇష్టపడుతున్నట్లు అర్థమయ్యేది. వాడిలో కూడా నాకు లాంటి తపనే.

ఇద్దరం అనుసరిస్తున్నాం మావైపు చూడనైన చూడదే. ఇలా అయితే ఇంకెలా. తనకి మరీ దగ్గరకొచ్చి గట్టిగా ఏదేదో మాట్లాడుతున్నాం, అరుస్తున్నాం. తను వెనక్కి తిరిగి మావైపు చూడగలిగింది. అప్పటివరకూ నిదానంగా సాగిన తన నడక వేగం పెరగడం. ముందున్న అక్కని మిగతావారిని చేరుకునేందుకు ప్రయత్నం. తను వేగం పెంచడం మాలో మరింత ఉత్సాహాన్నిచ్చి మేం పరిగెత్తుకుంటూ తనకంటే ముందేళ్ళి తన దారికి అడ్డొచ్చాం. తను మాపక్కకి అటుఇటు జరిగి తడబడుకుంటు వెళ్ళిపోయింది. ఆ తడబాటులో అక్కవాళ్ళ గుర్తు తను మరిచిపోయినట్లు అటుఇటు దిక్కులు చూస్తూ ముందుకు. కొండను దిగుతున్న మందిని చీల్చుకుంటూ తిరిగి తనకంటే ముందుకు పరిగెత్తాం. తనతో మాట్లాడేందుకు, మనసులోనిది చెప్పేందుకు ఇదే సందని అంజీ నన్ను తొందర పెడుతున్నాడు. నా మనసులో ఏముంది? అదే తెలిడం లేదు.

అంజీ తన ముందుకు నన్ను తోస్తే నేనెళ్ళి తనకు అడ్డుగా నిలబడ్డాను. తను నిలబడిపోయి నావైపు చూసింది. పక్కకి తప్పించుకొని నడిచేందుకు ప్రయత్నిస్తే నే పక్కకు కూడా జరిగాను. ఆ ధైర్యం నాలో ఎలా వచ్చిందో? మేమేదో చేయబోతున్నట్లు అందుకే తను ఎటెళ్తే అటొస్తున్నట్లు తనలో కంగారు. తన కళ్ళలో, తన నడక తీరులో భయం. అదే మొహమే మరుక్షణానికే నన్ను చూసి నవ్వుతున్నట్లు మార్పు. ఆ నవ్వు నా తలపై వంద గొడ్డళ్ళ వేటు. వెంటనే తనని తప్పించి వెనక్కి వెళ్ళిపోయాను. అంజీ ఏమైనా తన ముందు చెప్పావా అని అడిగితే ఏం చెప్పలేదన్నాను. జానకి త్వరత్వరగా తన వాళ్ళని చేరుకోగలిగింది. నేను నడక వేగం తగ్గించాను.

నేనేం చేస్తున్నాను? తప్పు, ఇదే తన బంధువుల్లో ఏ మగవారో ఉండి ఉంటే? ఇంత ధైర్యంగా తన్ను వెంబడించడం నేచేసేవాన్నా? జనాలు నన్ను గమనించలేదు, ఒకవేళ తను నేనేదో చేయబోతున్నట్లు గట్టిగా కేకేసింటే! అదే జనం నావైపు రావడం, చుట్టుకోవడం, ఏదేదో చేసేయ్యడం. తను కూతెయ్యగానే నేగుంపుల్లో పారిపోలేనా? అయినా తనదెంత అమాయకమైన చూపో. దాన్ని నాకెందుకు భయపెట్టలనిపించిందో?

నేను అంజీ కొండ కిందకు వొచ్చేప్పటికే ఇంకొందరు కుర్రాళ్ళు మాతో కలిశారు. గుడి దగ్గర మైకులో డబ్బులిచ్చిన వాళ్ళ పేర్లు వినబడుతున్నాయి. ఆ మైకు దగ్గరున్న పూజారికి పది రూపాయల నుండి ఎంతిచ్చినా వాళ్ళ ఊరు పేరు చదివి చందా ఎంతిచ్చారో చెబుతాడు. నాకు ఆ మైకులో జానకి పేరు వినాలని గుబులు పుట్టింది. అంజీని పక్కకు తీసుకెళ్ళి ఆ విషయం చెబితే వాడు మిగతా కుర్రాళ్ళని తప్పించి నాతో పాటుగా గుడి వైపుకొచ్చాడు.

ఉత్సవానికి వొచ్చిన జనాల్లో జానకి పేరు కలవాళ్ళు ఎందరో? అందులో మా ఊరి నుండి ఇద్దరో ముగ్గురో ఉండవచ్చు. తన పేరు చదివినట్లు తనకర్థం కావాలంటే ప్రత్యకమైన తన కులం పేరు కూడా చెప్పి చదివించాలి. పూజారి ఎవరూ అని అడిగితే నే బోయ జానకని చెప్పడం. ఆ మాట వినగానే తన పేరు ఎలా వొచ్చిందో తను ఆలోచనలో పడాలి. ఆ మాట జానకే చదివించింటుందని ఊరి వాళ్ళంతా అనుకోవొచ్చు. మరి జానకి తన పేరు చదివించింది ఎవరా అని ఆరా తీస్తుంది. ఆ ఆలోచన రంగుల్లో నా రూపానికి ఆస్కారం. ఉంటుందా? ఉండాలి! తనకై ఆత్రపడే వారినందరి జాబితాలో నే ఇప్పుడు కొండమీద చేసిన పనికి నన్నూ తను చేర్చుకునే ఉండవచ్చు. ఇక ఇక్కడలేని వాళ్ళ కుటుంబం గురించి నేనెవరో తెలీని పూజారి వలన నాకేం భయం?

పూజారి మైకు చుట్టుపక్కలే అన్నదానాలు సాగుతున్నాయి. అందులో మా ఊరివాళ్ళు. అడ్డు. కక్కుర్తి, ఊరికే దొరికిందని ఆబగా తినెయ్యడం. అక్కడ తినేవాళ్ళు మైకు పట్టుకున్న పూజారిని అతడికి డబ్బులిచ్చి చదివించుకుంటున్న వాళ్ళని గమనిస్తుంటే నాకున్న ధైర్యం సన్నగిల్లిపోతుంది. అంజీ వద్దని చెప్పి నాతో ముందుకు రాకుండా అన్నం తినేవాళ్ళతో కలిసిపోయాడు.

పూజారి చేతిలో ఇరవై రూపాయల నోటు పెట్టాను.

"పేరేంటి? ఊరేంటి?"

ఏం చెప్పాలి? తన పేరు, ఊరు చెబితే ఈ చుట్టూరా ఉన్న ఊరు వాళ్ళు ఇక్కడివైపు చూసి నన్ను గుర్తుపడితే? నా ద్వారా అటునుండి పుట్టుకొచ్చే పుకార్లకు తను బలి.

"సెప్పూ, ఏం పేరు. "

"జానకి రాముడు. మెరుగుదొడ్డి. "

గుడ్డి కన్నా మెల్ల మేలన్నట్లు. ఇలాగైన జానకి తనలాంటి పేరు వొచ్చిందని మైకు విన్న తను అనుకోవొచ్చు. ఒకవేళ తను వింటే ఖచ్చితంగా ఆలోచనలో కూడా పడగలదు. ఎందుకంటే జానకి రాముడనే పేరు ఊర్లో ఎవరికి లేదు. నావైపు చూసిన ఊర్ల వాళ్ళకు నేను ఎవరి పేరు చదివిస్తున్నానో అర్థం కాదు. అర్థం కావడం కన్నా ఏ అర్థం కాకపోవడం ఎప్పటికి మేలే. ఏదొకటి చెప్పేయొచ్చు. కానీ ఎవ్వరూ ఆ పేరుని పట్టించుకున్నట్లు అనిపించలేదు. అనవసరంగా భయపడ్డాను, పేరు చెప్పేసి కనబడకుండా గుంపులో దూరి ఉంటే బాగుణ్ణు.

ప్రేమ అనేది ఒట్టి బూటకమని, కామం ఆడించే నాటకమని నాకెప్పటినుండో ఉన్న అభిప్రాయం. జానకిపై ఉన్న ఆకర్షణకి కూడా కామమే కారణమా? ఏమో అదే అయ్యుండొచ్చు. నాకులానే జానకిలో కూడా తన కామం ఎవర్నైనా ఆకర్షించమని చెప్పే ఉంటుంది. ఊర్లో తను ఎవర్ని కోరుకుంటుంది. అంజీ మాత్రం తనను ఎప్పుడూ తిడుతుంటుందని ఫోన్లో చెప్పేవాడు. ఆ విషయాన్ని వాడికి బీరప్ప చెప్పాడట. బీరప్ప పొలంకు జానకి కూలికి వెళ్తే వాడితో ఒంటరిగా తను అన్ని విషయాలు చెప్పేదంట. రోడ్డు మీద తనవైపు సొల్లు కార్చుకుంటు చూస్తున్న వినోదు, అంజీ లాంటి వాళ్ళని కుక్కలతో పోల్చేదంట. కానీ ఈ పోలిక తనలోని కోపానికి సంకేంతంగా కాక తనలోని కోరికకు మరో రూపంగా నాకర్దమయ్యేది. నన్ను తను కుక్కని ఎప్పుడంటుందో?

హైదరాబాద్‌లో మా రూంకి వొచ్చిన మా ఊరివాళ్ళతో వీణ తిరగడం, మాట్లాడ్డం చేసేది. నాతో కూడా వీణ మాట్లాడాలని చూస్తోందని, నేను కూడా రూమ్ వాళ్ళ వెంట తనని కలవచ్చని వీణ చెప్పేదంట. ఏదో ఆరోజు తన్ని కోరుతూ నే పెట్టిన మెసేజ్ పొరపాటనుకొని పిలుస్తుందేమో. నే

క్షమాపణ కోరి, ఇంకెప్పుడు బూతు మాటలు మాట్లాడనని అనుకుంటుందేమో. చేతకాదు. నే కాకపోయినా ఇప్పుడు తనకి మాట్లాడేందుకు ఎన్నో అవకాశాలు. ఇన్ని అవకాశాల్లో ఒకప్పుడూ నే చూసిన ఆ సహజ వీణ తనలో కనుమరుగవ్వడం. సహనంగా, ఓపిగ్గా నే చెప్పే ఎలాంటి విషయాలైనా వినే ఆ పాత వీణేనా తను? అబద్ధంగా నాటకీయంగా నన్ను వాళ్ళతో పాటే తను తిప్పుకోవడం. కాలాపహరణం. తప్పించుకొని తిరిగేవాన్ని. అప్పుడప్పుడు తనే హాయ్ అని మెసేజులు పంపేది, నాకు ఇష్టమైతే తిరిగి హాయని, దాన్నెప్పుడు దాటలేదు.

జానకిని చూసే అవకాశం తిరిగి గడస్థంభ ప్రతిష్ట రూపంలో వొచ్చింది. మా ఇల్లు నేనెప్పుడూ చూడని మా వొదిన బంధువులతో నిండిపోయింది. ఊరు మొత్తం కొత్త రంగులు, అందరి ఇల్లలో ఆనంద రేఖలు. మా దొడ్లో నుండి జానకి గుడిసె వైపు చూస్తుంటే వాళ్ళ బంధువులంతా కనిపిస్తున్నారు, వాళ్ళల్లో తనెక్కడ? ఊర్లోనే ఉందా? ఎక్కడికైనెళ్ళిందా? ఎక్కడికెళ్తుంది? ఊర్లో సంబరం, ఈస్థితిలో తానెక్కడికి వెళ్ళగలదు?

ప్రతిష్ట సంబరం జరుగబోతుందనగా ముందు రోజు సాయంత్రం ప్రతిష్టించబోయే కొత్త విగ్రహాలను ఎద్దుల బండిలో వేసుకొని ఊరు మొత్తం తిరుగుతారని విని నాకిదో అవకాశంగా తోచింది. ఆ ఎద్దుల బండిని చూడ్డానికైనా జానకి రావడం. నేనకున్నట్లుగానే జానకి వొచ్చిందని అంజీ నన్ను తడిమాడు. ఎక్కడుందని నేను వాడిని అడిగితే వాడు చూపిన వైపు నేను చూసేలోగా నా తల అసంకల్పితంగా పక్కకు వాలిపోయింది. మా అన్న ఆ బండి వెనకాలే నడుస్తూ మాటికి నన్ను గమనిస్తున్నాడు. జానకి అక్కడ కొద్దిసేపే ఉంది, ఆ కొద్దిసేపు కూడా నేను తనని చూడలేకపోవడం. ఎద్దుల బండి ముందు నీళ్ళ కడవతో నీళ్ళు పోసి పోయినట్లు కూడా తెలిసింది. అప్పుడు కూడా బండి దగ్గరే ఉన్న అన్న భయంతో తన వైపు సంతృప్తైన చూపు లేదు. ఈ రెండు దినాలు తను కనపడలేదని బాధ. ఇప్పుడు కంటి ముందుకొస్తే అన్న ఉన్నాడనే అడ్డు. అయినా తను ఊర్లోనే ఉందని ఊరట.

మరుసటిరోజు గడస్థంభం ప్రతిష్టించబోయే సమయంకు గుడి దగ్గర జనాలు నిండిపోయారు. నేను నా స్నేహితులకు చిక్కకుండ బసిరి చెట్టు కట్ట మీదకు చేరుకున్నాను. అక్కడి నుండి గుడి వైపు చూస్తూ ఆ జనాల్లో నాకళ్ళ వెదుకులాట. జనాలకు వేసుకున్న బట్టలపై పిచ్చి, బంధువుల ముందు గొప్పగా కనిపించాలనే పిచ్చి, ప్రతిష్టను మొబైల్లో బందించాలనే పిచ్చి. కొందరికి దేవుడు తన్ను కరుణించాలనే పిచ్చి. ఇంకొకరికన్నా తామెంత అందమో కొలతలాడే ఆడవాల్ల పిచ్చి. తాము కోరుకునే వాళ్ళని చూడాలని ఆత్రపడే వాళ్ళ పిచ్చి. చొక్కా పైనే రెట్టలెయ్యాలని కాకులకు పిచ్చి. అందరూ పిచ్చివాళ్ళే. లోకమే పిచ్చాసపత్రని ఎక్కడో విన్నాను. నాకు ఎదురుగానే రోడ్డుకి అటువైపున్న పూజారి ఇంటి కట్ట మీద జానకి, తను కూడా పిచ్చిదే. ఆ పిచ్చితనంతోనే తను మెరుస్తూ తన మెరుపులు జనానికి చూపడం. ఆ మెరుపుని ఆశపడి తనకై వెతికే చూపులు. అందర్నీ ఆకర్షించడం, కాదని తను మొహమాటపడ్డాం. తన పక్కనే ఉమ. మాటికి జానకికి, నాకూ అడ్డం వొస్తున్న ఈ పిచ్చి జనాలను చూస్తుంటే చిరాకేస్తుంది. కానీ ఆ చోటి నుండే తన్ను చూడ్డం నాకు సరిపోతుంది. ఆ మొత్తం తతంగంలో ఒక్కసారి కూడా జానకి నావైపు చూడలేదు. నా కంటికి కనిపిస్తుంది, నేను చూస్తున్నాను. ఇదేగా నాక్కావాల్సింది. తను చూస్తేనేం, చూడకపోతేనేం. తన పాపిడిమీద నగ, తను వేసుకున్న ఆ కొత్త చీరను పసిగట్టి నా వైపు చూసుకున్నాను. నావీ కొత్తబట్టలే. నేను కూడా పిచ్చితనపు మత్తులో

ఆకర్షణీయంగానే తయారైపోయాను. నిజంగానే నాలో ఆకర్షణ? పెళ్ళి కాకముందు ఉండేంత ఆకర్షణ కొత్తబట్టలేసుకున్నా కూడా ఇప్పటి ఉమలో అనిపించడం లేదు. తన కళ్ళలో ఆత్మ చచ్చినట్లు వికారం. తరవాత జానకి కూడా ఇలానే మారిపోవడం? ఆ తరవాత నా ఆకర్షణ తనపై ఇలానే ఉంటుదాననే సందేహం.

ఏ పుస్తకం చదివినా,

నేనే ప్రేమికుల్ని చూస్తున్నా

ఆ ప్రేయసి పాత్రల్లో జానకో, రేవతో అధమపక్షంగా శిరీషో కళ్ళలో మెదిలేది. పుస్తక జీవితంలో నేను వాళ్ళు కోరుకునే ప్రియుడైపోయాను. చుట్టూరా నేను పెనవేసుకుంటున్న సమస్యలన్నింటికి ఈ ఊహలు నాకెప్పుడూ ఉపశమనంగా నిలుస్తుండేవి. పోనీ నేను వాళ్ళను ప్రేమిస్తున్నానా అంటే నాలో సమాధానం ఉండదు. సమాధానం అనేక గొలుసుల్లో చిక్కుకు పోతుంది.

హైదరాబాద్ వెళ్ళిన మొదటి నెలలోనే శిరీష పెళ్ళయ్యినట్లు ఫోన్ వచ్చింది.

నేను సిఏ చదువుకు పోయేప్పుడు శిరీషను నాకివ్వాలని మా బట్టతల మామ ఆలోచన. పది లక్షల కట్నం ఇస్తానని మా అమ్మని ఒప్పించాలని చూసాడు. నేనేదో పెద్ద ప్రయోజకుణ్ణి అవుతానని అంతకంటే గొప్పింటి పిల్ల దొరుకుతుందని మా అమ్మ ఆ సంబంధాన్ని అప్పట్లో ఏవేవో కారణాలు చెప్పేసి తెగ్గొట్టేసింది. అయినా మా మామకు నాపై ఆశ, వాళ్ళ ఊరికి వెళ్తే నామీద ప్రత్యేకమైన శ్రద్ధ చూపేవాడు. నేను పదో తరగతిలో ఉన్నప్పుడు నాకు పక్కనే పడుకున్న శిరీష పట్ల నేను చేసిన పని తననే పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన పుట్టించింది కానీ, అప్పటి నేను వేరు, పెళ్ళంటేనే గూదిబండగా ఆలోచిస్తున్న ఇప్పటి నేను వేరు. శిరీష అన్ని వైపులా సరైన కొలతలతో నన్ను రెచ్చకొట్టేంత ఆకర్షణీయంగా తయారైంది. నేను చూసినప్పుడల్లా తను ఊరికే నవ్వేది, ఇది ఎంతదాక తీసుకెళ్తుందనే భయంతో, మొహమాటంతో నేను పట్టించుకోనట్లు ఉండేవాన్ని. ఆ తరవాత పరిస్థితులు మారాయి. నేనింకా చదువుతూనే ఉన్నాను. ఇంకా నేనెప్పుడు ఉద్యోగం తెచ్చుకుంటానని నాపై ఆశ కోల్పోయినట్లున్నాడు మామ. శిరీష మా బంధువుల్లోనే మరొకరిని ప్రేమిస్తుందని ఇద్దరు ఇష్టపడుతున్నారని తెలిసింది. నాకు శిరీషను చేసుకోవాలని కోరిక లేకపోయినా ఇది నన్ను బాధించింది. శిరీష మరొకరిని ఇష్టపడటం. తను నన్ను చూసి మాటికి నవ్వేపాటికి నన్నే ఇష్టపడుతుందని నా అనుమతి కోసం చూస్తున్నట్లు నేనే కలలు కనడం. లేదు, మొదటి అవకాశంగా శిరీష నన్నే కోరుకుంది, అయినా ఎంతకీ నేను బయట పడనందుకే మరొకతన్ని చూసుకుంది... ఏమో?

శిరీష పెళ్ళి ప్రేమించిన ఆ వ్యక్తితో కూడా జరగలేదు. కారణం ఆ వ్యక్తికి ఆస్తి లేకపోవడం. అంతకన్నా ఆస్తి ఉన్న మరొకరిని చూసి బట్టతల మామ తన పెళ్ళి చేసేశాడు. ఈ పెళ్ళి విషయం ఆ పెళ్ళి జరిగే రోజు కూడా నాకు తెలీదు. తన పెళ్ళి కోరుకున్న మరో బంధువుల అబ్బాయితోనైన జరగొచ్చని అనుకున్న నాకది సాధ్యం కానందుకు శిరీషపై జాలేసింది. నేను నా మొహమాటంతో, తప్పిదాలతో శిరీషను కోల్పోవడం. పెళ్ళిపై నాకు సదభిప్రాయం లేదు, అయినా ఏదో అవసరమైంది దూరమైనట్లు గుండెల్లో మెలి. నేను ఊహించుకునేందుకు తను నన్ను చూసి నవ్వేందుకు ఉన్న అవకాశాలకు ఎవరో గండి కొట్టినట్లు.

శిరీష పోయాక నా ఆలోచనలు పూర్తిగా జానకి మరియు రేవతి పైకి కేంద్రీకృతమైపోసాగై. అందులో ఊరి చివరన గుడిసె జానకిపై మరింత శ్రద్ధ. జానకిపై ఆలోచనలు జీవితంని మరింత నాజూగ్గా, అందంగా మారుస్తున్నట్లు నాకు అర్థమయ్యేది.

జానకి నవ్వుని పట్టుకోవడం

ఆ కళ్ళలోని ఆత్మను దర్శించడం ఇవి మాత్రమే కాదు, తన జ్ఞాపకాలలో నేను ఒక జ్ఞాపకంగా మారాలని ఇదే అంతిమ విజయం కావాలని ఆత్మారాముడు ఎప్పుడూ తొందరపడుతుండేవాడు. మరి అవకాశం? ఊర్లో ఉండే రెండు మూడు రోజుల్లో అటువంటి పరిస్థితుల్ని నేను సృష్టించడం సాధ్యం కావడం లేదు.

ఓ ప్రభుత్వ పథకలబ్ది కోసం తన పేరు మీద ఉన్న పొలంలో కొంత భాగాన్ని నా మీద మరియు అన్న పేరు మీద రిజిస్ట్రేషన్ చేయించడానికి నాన్న నన్ను హైదరాబాద్ నుండి తిరిగి పిలిపించాడు. పని మొదలై పాసుబుక్కులు వొచ్చేవరకు సమయం పట్టేటట్లుంది. నేను వొచ్చిన నెల జూన్ మాసం చివర. ప్రతీయేడు అప్పటికే వర్షాలు కురిసి జనాలు పొలం పనుల్లో ఉండేవాళ్ళు. మరి ఈ ఏడు ఇప్పటికి ఒక్క వర్షపు చుక్క లేక పనులు మొదలవ్వలేదు. మగవాళ్ళు తీరికగా వీధి అరుగుల దగ్గర, బస్టాండుల్లో ఇంటి కట్టల మీద కూర్చొని కబుర్లాడేవాళ్ళు. తుంగభద్ర యేరు పారే గ్రామాల్లో నాట్లు వేయడానికి కూలీకై పొద్దునే రెండు ఆటోలు వెళ్తుండేవి. ఆ ఆటోలో ఎక్కేందుకు కూలి దక్కించుకునేందుకు ఆడవాల్లు పోటీపడేవాళ్ళు. అందులో జానకి కూడా వెళ్తుందని వార్త.

ఆ ఆటోలు ఆపే స్థలం మా వీధి కాదు. ఆ స్థలంకు రోజు పొద్దునే వెళ్ళడం ఆటోల వంక జానకికై చూస్తుండటం పుకార్లకు ఆనవాలు. అయినా ఆ కారణంతో నేను అవకాశాన్ని వదులుకోలేను. చుట్టూ నన్నెవరు గమనిస్తున్నారో అర్థం చేసుకుంటూ దూరంగా ఏ చెట్టు కిందనో తన్ని చూసేందుకు నిలబడేవాన్ని. చేతిలో చద్దిగిన్నెతో జానకి. ఆటోలో తను ఎక్కేంతవరకె తనని చూసే భాగ్యం.

మొదటి రెండు రోజులు ఇలా గడిస్తే మూడో రోజు నుండి నాకు అదృష్టం చిన్ననాటి స్నేహితుడైన నరసిం రూపంలో వొచ్చింది. నరసిం వాళ్ళ గుడిసెకి వెనకాల రోడ్డుకి అటువైపే ఆగుతై ఆ రెండు ఆటోలు. వైజాగ్ లో డిగ్రీ చదివే వాడు ఏదోపనిమీద ఊరికి రావడం ఆ విషయం నాకు సాయంత్రమే తెలవడం మంచిదైంది. మరసటిదినం పొద్దునే ఆటోలను చూసేందుకు వాణ్ణి కారణంగా పెట్టుకున్నాను. మంచంపై పుస్తకాలు ముందుంచుకొని చదువుతున్న వాడు నన్ను చూడగానే నవ్వుతూ ఆహ్వానం పలికాడు. నేను వాడిని వాళ్ళ గుడిసె వెనకాల ఉన్న రాళ్ళగుట్ట దగ్గరకి రమ్మన్నాను. వాడు మంచం మీద నుండి లేచి ముందుకు నడుస్తూ ఎందుకని అడిగాడు. ఎప్పటికైనా తెలుస్తోందనే ముందుగానే జానకి గురించి చెప్పాను. తనని చూసేందుకు రెండు రోజుల నుండి ఇక్కడికి వస్తున్నానని, జనాల కంట పడకుండా జాగ్రత్తగా ఉంటున్నానని చెప్పాను. దానికి ఇంత భయమెందుకని వాడు నన్ను ఆటోకి పక్కనే ఆపిన ఎద్దుల బండి దగ్గరకు తీసుకొచ్చాడు. ఇంత దగ్గరగా చూసే అవకాశం, పక్కనే నరసిం ఉన్నాడనే ధైర్యం. జానకి రోజులానే దూరం నుండి పింకు పంజాబీ డ్రెస్ లో వస్తూ. ఎక్కడ ఆటో వెళ్ళిపోతుందేమోనని తొందర తొందరగా నడక. మేం కూర్చున్న ఎద్దుల బండికి ముందు రెండు కుక్కలు గొడవ పడుతున్నాయి. వాటి అరుపు జానకిని నావైపు చూసేలా చేసింది. ఆ వెంటనే తాను తలదించేసుకుంది.

ఏంటో తనకు భయం. కనీసం తల ఎత్తైనా పక్కకైనా చూడొచ్చు, లేదు అలా కూడా చేయలేదు. నాకు దగ్గరగా ఉన్న ఓ ఆటో వెనక ట్రాలీపై వెనక్కు తిరిగి కూర్చొని పక్కనే చద్దిగిన్నెను ఉంచేసుకుంది. తన పక్కనే అప్పుడే వొచ్చిన ఎంకమ్మతో మాటలు కలుపుతూ నవ్వుతుంది. ఇప్పుడు దగ్గర్నుండీ తన్ను చూస్తున్నాను. ఆ నవ్వుని, మెరుస్తున్న ఆ ముక్కు పుడకని.

భౌ

భౌ

వెనక కుక్కల అరుపు, చిరాకు. నరసిం రెండు రాళ్ళు తీసుకొని వాటిపైకి విసిరాడు. ఓ కుక్క మేం కూర్చున్న బండికి అటువైపు పరిగెత్తితే, మరొకటి కుయ్యో అనుకుంటూ ఆటోల వైపు పరిగెత్తింది. జానకి కుక్కవైపు చూసింది. కుక్క పరిగెత్తుతూ వెనక్కి తిరిగి మావైపు చూసింది. జానకి దానితో పాటు నావైపు. తను చూసినప్పుడు ఆ కళ్ళవైపు నా కళ్ళను కలపాలని నేనెప్పుడూ అనుకుంటానా, కానీ ఆ అవకాశం వొచ్చిన ఆ క్షణం, ఎందుకో నా తల వెంటనే కిందకు వాలిపోయింది. తను పక్కకు తిరిగిందో లేకుంటే నా వైపు అలానే చూస్తోందా?

తిరిగి ధైర్యం చేసి తల ఎత్తితే జానకి కనిపించలేదు. పక్కనున్న నరసింను అడిగాను. వాడు కూడా ఆటోవైపు చూసి వెతికాడు. జానకి ముందు డ్రైవర్ పక్కన. ఎందుకక్కడికెళ్ళిందో? నేను చూస్తున్నాననా... ఊరికేనా?

ఆటోల దగ్గర మంది చాలావరకూ పోగేయ్యారు. డ్రైవర్లు రెండు సార్లు హారన్ కొట్టి ఆటోలను స్టార్ట్ చేశారు. బండి కదులుతుండగా చేతిలో చద్దితో భుజాలపై తువాలనేసుకొని పంజాబీ డ్రెస్ లో రేవతి పరిగెత్తుకుంటూ ఆటోలవైపు, నరసిం నా భుజాలు రాస్తే అప్పుడు చూశాను అటువైపు. రేవతి వెనక ట్రాలీపై మందిని సర్దుకొని ఎలాగో స్థలాన్ని దొరకబుచ్చుకొని కూర్చుంది. రేవతి మావైపే చూస్తుంది. జానకి నావైపు చూసినప్పుడు నేను తనవైపు చూడలేక దించుకున్న కళ్ళు ఇప్పుడు మాత్రం నావైపు మాటికి చూస్తున్న రేవతిని అలానే చూడ్డం. ఇదెందుకో? రేవతి ఏంటో నన్ను చూడటమేంటో. అంజీగాడు ఉంటే ఏడ్చేవాడు. లేదు, అప్పుడు నేను ఏడ్చేవాన్ని. వాడుంటే తను నావైపు చూడటం? వాడికే అవకాశం.

రెండు ఆటోలు వెళ్ళిపోయాక నరసిం నాతో రేవతి నన్ను పదే పదే చూసిన విషయాన్ని ప్రస్తావిస్తూ రేవతి నన్ను ప్రేమిస్తున్న విషయాన్ని తేల్చేశాడు. నేను నవ్వుకున్నాను.

జానకి వేట రోజులో అదే ఆఖరు కాదు, సాయంత్రాన వెంకటప్ప కట్ట దగ్గర తిరిగి మొదలవుతుంది. వెంకటప్ప ఇంటి చుట్టూరా రాళ్ళతో కాంపౌండ్డ్ గోడ. ఆ కంపౌండ్‌కి మధ్యలో రేకుల గేటు. ఆ రేకుల గేటుకి పక్కన రాళ్ళకు ఆనుకోని కూర్చోవడానికి చిన్నగా సిమెంట్ కట్ట. దాని పక్కనే కృష్ణ చెక్కబంకు కిరాణం. ఆ సిమెంట్ కట్టకి ఎదురగానే బస్టాండ్ పక్కకు బోయ వీధి. ఆ వీధిలో చిట్ట చివరి గుడిసె జానకి వాళ్ళది.

బస్టాండ్ లో, ఇటువైపు కట్టమీద అట్లే ఆ కంపౌండ్ రాళ్ళ మీద కూర్చొని పనిలేని మగవాళ్ళు బాతాఖాని వేస్తుంటారు. ఇప్పుడు సాయంత్రాన నేను కూడా వాళ్ళలో చేరిపోయాను. జానకి కూలి నుండి ఇదే దారిలోనే ఇంటికి వెళ్తుంటుంది. తను ఏ అవసరం ఉండి ఊరిలోకి రావాలన్నా మాదిగవీధి కాకుండా తనకున్న మరో దారి ఇదే. తను కూలి నుండి వస్తుందనే సమయానికి గంట ముందే నేనక్కడ కూర్చుంటాను, తను నన్ను దాటేసి వెళ్ళిపోయాకా వెంటనే అక్కన్నుండి వెళ్ళిపోతాను. తిరిగి ఇంటి

దగ్గర పనులు చూసుకొని రాత్రి ఆ కట్ట దగ్గరికి మళ్ళీ వస్తాను. తనేదైన పని మీద రోడ్డు మీదకు కిరాణం కోసమో, కూరగాయల కోసమో, ఇంకేదో కారణమో మళ్ళీ వస్తుందనే ఆరాటం.

మొదట రెండు మూడు రోజులు బాగానే సాగినా ఆ తరవాత నుండి జానకి దూరం నుండే తల దించుకొని ఆటో వైపు రావడం మొదలెట్టింది, ఆటోలో ఎక్కినా కూడా నాకు కనబడకుండా ముందు సీట్లో కూర్చుంటుంది. సాయంత్రం వెంకటప్ప కట్ట మీద నే కూర్చొని తను వస్తుంటే రెప్ప వాల్చకుండా నేను చూస్తుంటానా! తను నేనుంటానని కనిపెట్టేసి ఆ చోటు రాక మునుపే తలని వాల్చేసి నడక. ఏదైనా పని మీద మా ఇంటి వైపు గుండా వెళ్తే తను ఖచ్చితంగా మా వొదినను పలకరించే వెళ్తుండేది. మరి ఇప్పుడు అక్కడ నేనున్నానని కనిపెట్టిందా అంతే, ఇక మా వొదిన పిలిచినా కూడా ఏదేదో చెప్తూ త్వరత్వరగా వెళ్ళిపోతుంది.

మెల్లిగా నాట్ల పనికి వెళ్ళడం తగ్గుముఖం పట్టింది. నరసిం కూడా తనకి అసలు విషయం త్వరగా చెప్పెయ్యమని చెప్పి వైజాగ్ వెళ్ళిపోయాడు. జానకి ఇంటి దగ్గరే ఉంటుంది. తన్ను చూడ్డం మా దొడ్డి నుండో లేకుంటే ఎప్పుడో ఒకసారి పని మీద బయటకొస్తేనే. అయినా నేనున్నానని తెలిస్తే నన్ను తప్పుకోడానికి తను ప్రయత్నాలు.

ఈ ప్రయత్నాలు నాపై మాత్రమేనా లేక అందరి మగాళ్ళ ముందు తను ఇంతేనా! లేదు నేనున్నానని మాత్రమే. నేను కాక అక్కడ అంజో మరొకరో ఉంటే ఎటువంటి బెరుకు లేకుండా అటు ఇటు తలను తిప్పుకుంటు తను సాధారణంగానే వెళ్ళగలదు. నేనుంటేనే త్వరత్వరగా నడక. నన్ను ఓ జిడ్డులా తను అనుకుంటుందేమో. ఎక్కడ అవకాశమిస్తే అంటుక పోతాననే భయమేమో. నేను తన్ని ఆకర్షించలేను, నా ఆహార్యం మిగతా కుర్రాళ్ళతో పోల్చుకుంటే మరింత దిగువున.

వానల్లేక ఏ పని లేకపోవడంతో ఊర్లో ఉపాధి హామీ పథకం మొదలెట్టారు. జానకి వస్తుందనే ఇంటి దగ్గర లేని అన్న పేరు మీద నేనూ పనికి సిద్ధమయ్యాను. మొదటిసారి ఇలా వెళ్ళడం మొహమాటమనిపించినా నేనున్నానని జాఫర్ భరోసా చూపించాడు. వాడు చదువాపేసి ఊర్లో పనికెళ్తుంటాడు. వాడితో నడక ధైర్యం మాత్రమే కాదు, అనేక పుకార్లని కూడ తెలుసుకునే అవకాశం. నేను అన్న తరుపున వస్తానని చెప్పినప్పుడే మా వొదిన తనకేదో అర్థమైపోయినట్లు నవ్వు విసిరింది. రోడ్డు మీద చూస్తే జనాలు గంపల్ని, పారలను, షెలకలను భుజాలమీదేసుకొని బారులు తీరి నడుస్తున్నారు. నా భుజం పై కూడా ఓ షెలకుంది. నే అడిగిన ప్రతివాటికి జాఫర్ సమాధానాలు చెప్తున్నాడు.

జానకి జనాల్లో ముందుగానే వెళ్ళిందో, ఇంకా ఇంటి దగ్గర్నుండి కదల్లేదో. జాఫర్‌ని అడిగితే వాడు జానకి వాళ్ళ గ్రూప్ పని కూడా మా గ్రూప్ దగ్గరే ఉంటుందని చెప్పాడు. నేను మాటికి ముందుకి వెనక్కి చూసి నడుస్తున్నాను. పని చేసే గుంత దగ్గరకు రాగానే అక్కడ చుట్టూ ఉన్న జనాల్లో జానకి జాడ కోసం మా ఇద్దరి వెదుకులాట. దూరంగా జానకి వాళ్ళ పని గ్రూప్‌ని కనిపెట్టాడు జాఫర్. మాకు దగ్గరగానే ఉంటుందనుకున్న గ్రూప్ దూరంగా. అక్కడ జానకి నాకు, జాఫర్‌కు ఇద్దరికి కనిపించలేదు. రాలేదేమో?

మా గ్రూప్‌లో పుద్ధి బాషా మట్టిని తవ్వుతుంటే, ఆ మట్టిని ముగ్గురు మగవాళ్ళు షెలకతో గంపల్లోకి నింపుతుంటే ఆ గంపలను నిలబడ్డ నలుగురు ఆడవాల్లు, వాళ్ళతో పాటుగా నేను ఒకరికొకరం అందుకుంటూ పక్కకి పోస్తున్నాం. పనికి ఇదే నేను కొత్త కాబట్టి నా మీద మా గ్రూప్

వాళ్ళు ఇంకా పక్క గ్రూప్ పనివాళ్ళు మాటకు మాట అనేస్తూ నవ్వుకుంటుంటే వాళ్ళతో తిరిగి నవ్వడం తప్పితే నేనేమి సమాధానం ఇవ్వలేదు. ఈరమ్మ మా గ్రూపే, జానకి మా గ్రూపే అయ్యుంటే.

పని మధ్యలో విరామ సమయప్పుడు జాఫర్ ఎట్టకేలకు జానకిని కనిపెట్టి తనకి జానకి కనిపిస్తుందని నాకు చూపించాడు. వాడు చూపినవైపు చూశాను. నాకు అక్కడ ఎవరెవరో జనం మసకగా, జానకి ఏది? వాడు నమ్మకంగా చెప్పడం నేను జానకిని గుర్తుపట్టకపోవడం. ఈసారి జానకి వాళ్ళ గ్రూప్ వైపుగా తిరిగి గంపలందుకుంటు మాటికి జాఫర్ చూపిన వైపే చూస్తున్నాను. మా వొదిన నన్ను గమనిస్తుందని తెలిసినా కూడా నాలో ధైర్యం, ఆ జనాల్లో జానకి. అందులో ఎవరో? ఇంతదాకా జాఫర్‌కి ఎందుకు కనిపించలేదో. అంత మసకగా... కొందరు పెద్దగా, ఇంకొందరు చిన్నగా. పంజాబి డ్రెస్సులు పెద్దవాళ్ళు యేస్తే పిల్లలు చీరలు కట్టడం. నా కంటి సైటుని పరీక్షించి కొత్త అద్దాలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

గంట పని అయ్యాక జనాలు ఒక్కో గ్రూప్‌గా ఇంటి బాట పడుతున్నారు. జానకి వాళ్ళ గ్రూప్ మేమున్న దారి గుండా కాకుండా మరో దారిలో ఇంటికి వెళ్తున్నట్లు జాఫర్ చెప్పాడు. నిరాశతో నేను మా గ్రూప్ వెనకాల అటుఇటు చూసుకుంటూ నడుస్తున్నాను. నాతో మరియు జాఫర్‌తో పాటుగా రామంజిని కలిసాడు. ఆయన వయసు ముప్పై ఉంటుంది. పెళ్ళయిన వాడు, పిల్లలున్నవాడు. ఆయనకు ఎప్పుడూ నన్ను ఆట పట్టించడం ఇష్టం. ఆయనకు నా మాటలు పిచ్చి మాటలు. దేవుడు ఎవరని అనడం, పెళ్ళెందుకనడగడం నా పిచ్చితనంకు సంకేతాలు. ఆయన నా ముందున్న ఆడవాళ్లకు వెనక ఉండేవాళ్ళకు అందరికి అర్థమయ్యేట్లు అడిగాడు పెళ్ళెప్పుడు చేసుకుంటావని. అందులో నాకు ఆసక్తి కలిగించే పాలిండ్లు ఉన్న ఆడవాళ్ళున్నారు. ఆయన అడిగింది నన్ను ఆటపట్టించి ఆ ఆడాళ్ల ముందు తను గొప్పలు పోడానికి.

"పెళ్ళెంటికి?"

"ను మగోనివి గాదా?"

మళ్ళీ నవ్వు గట్టిగా.

ఏం సమాధానం చెప్పాలి. ముందు ఆడవాళ్ళు ఉన్నారు, వెనక ఉన్నారు. వాళ్ళ ముందు నా మగతనంకు ప్రశ్న. మగతనం అనే పదంని నేనెప్పుడో వదిలేసాను.

"ఓపారి నీ పిల్లనిచ్చి సూడు, మగోడో కాడో తెలుస్తది"

నాకు సపోర్టుగా వెనక నుండి కాంతమ్మ సిన్నమ్మ.

"అట్టన్న అనమను వాణ్ణి, పూర పెళ్ళె వద్దంటాడు ఆడు. "

"పెండ్లి అయినోళ్ళల్ల మగోళ్ళేనా మల. అట్లాడితప్పుడు ఆడాల్లు పెండ్లే సేసుకోరా"

అనేసాను.

"పెండ్లి సేసుకోకుంటే సన్యాసుల్లోకి కలసళ్ళ. "

"పెండ్లి సేసుకోకుంటే సన్యాసుల్లోకి కలసళ్ళ అని ఎవరు సెప్పెరే, మనిష్టం. ఇప్పుడు లక్కనే ఉంట. "

"ఏమరే అట్లాంటవు పా. మనిద్దరం సేసుకుందాం పా"

వెనక నుండి రామమ్మ.

"ఎంతమందిని సేసుకుంటవు నువ్వు. ఊరు నిండ మగుండ్లని బుడుక్కుంటవ. "

ఇది కూడా అనేసాను. వెనక ముందు నవ్వులు. ఆ నవ్వుల్లో నా ముందు ఈరమ్మ. ఇంకాస్త ముందుకు చూసాను. అక్కడ పొలంలో ఎండిన కట్టెల్ని గంపలో ఏసుకుంటు ఆడవాల్లు. ఇంకాస్త ముందుకు చూపు, జానకి, నిజంగా జానకేనా. అవును తనే. ఎట్టకేలకు నాకూ కనిపించింది. ప్రశాంతత. ఏంటి తను వెనక్కోస్తుంది, నా వైపు. నా కోసమేనేమో. అంతెం జరగదు.

"సూడమ్మ! వానికేం మాట్లు రావనుకోరే. సూన్నికే తిక్కలోనిలక్కన ఉండేడే గాని అన్ని తెలుసానికి"

వెనకనుండి రామంజిని గెన్నగింపు.

వెనకొస్తున్న జానకి నన్ను చూసే ఉంటుంది. తను నా ముందున్న ఈరమ్మ దగ్గర ఆగిపోయి ఈసారి తనతో ముందుకు నడక వేగం పెంచేసింది. ఆ వేగం నేనున్నాననేం? వెళ్ళు. వారితో పాటే నువ్వు వేగం పెంచు. చూస్తారు, ఏదొకటి మాట్లాడుతారు. అదే కావాలి. భయం... చుట్టున్న వాళ్ళతో, కథలు అలవోకగా అల్లే వీళ్ళందరితో.

ఇద్దరు నానుండి జాఫర్ నుండి ముందేళ్తున్న జనాలని దాటుకుంటూ మేమున్న పొలం దాటేసి అప్పుడే రోడ్డు ఎక్కేశారు. అదిగో ఆ రోడ్డు పైనుండి జానకి పక్కనున్న ఈరమ్మ ఇద్దరు కూడా నా వైపు చూసి నవ్వుతున్నట్లు. ఎందుకో. అది నా వైపేనా? వేరేకరేమో? జానకి నేనున్నానంటే అటు చూడ్డమే కష్టం, కానీ ఏంటో కొత్తగా! ఒక్కసారి కాదు మాటికి ఇటే చూస్తూ వాళ్ళిద్దరూ నవ్వుతుండటం.

నన్నేనా.

నన్నే ఉంటుంది.

నా అద్దాల మసకలో నన్నే అనుకుంటున్నానా! లేదు నన్నే... నమ్మలేను. కానీ నిజం. నన్నే అయితే. నన్నే అయితే ఏంటి నన్నే. ఇన్నాళ్ళు రోడ్డు మీద నే చూస్తే మరి తనెందుకు నన్ను చూడలేదు. ఏమో! ఇప్పుడైతే నన్నే. తనకు నేనంటే ఇష్టమే. రోజూ అన్నీ నాటకాలు.

అర్థమవుతుంది.

ఊర్లోని అన్ని విగ్రహాలకు పెళ్ళి కాని యువకులు ఎవరైనా నూట ఒక్క బిందెలతో మరసటి దినం పొద్దునే నీళ్ళను పోయాలని గుడి మైకులో చెప్పారు సాయంత్రం. అలా చేస్తే వాన కురవచ్చని నమ్మకమంట. నేను గుడి దగ్గరకొచ్చాను. అక్కడ అప్పటికే కొందరు కుర్రాళ్ళున్నారు. అక్కడున్న అందరూ కుర్రాళ్ళు ఏయే దేవుడికి ఎవరెవరు నీళ్ళని పోయాలో లెక్కలేసుకుంటున్నారు. నాకు ఇలాంటి ఉత్సవాల్లో పాల్గొనడం ఇష్టం. నేను దర్గాకు పోస్తానన్నాను, అదైతే జానకి గుడిసెకు ఎదురుగా ఉన్న పొలంలో ఉన్నందుకని. ఆ దర్గాకు తురక పిల్లాడు జాఫర్ పోస్తే బాగుంటుందని అక్కడున్న ఓ పెద్దమంచి తేల్చాడు. ఏ దేవుడికి ఎవరు పోస్తేనేం. జాఫర్ కూడా తాను అదే పోస్తానని పంతం. వాడు వినడు, మా దేవుళ్ళకు నీళ్ళు పోయడం వాడికిష్టం లేదు. నేనిప్పుడు ఎవరికి పోస్తే బాగుంటుందో? మారెమ్మ తల్లి గుడి! అక్కన్నుండైతే జానకి గుడిసె వెనకభాగం కనిపిస్తుంది. మారెమ్మ తల్లి గుడి మా దొడ్డి రస్తాలో మాదిగ వీధిలో ఉంటుంది. ఆ గుడికి పోసేందుకు దర్గా దగ్గరి కుళాయి నీళ్ళకే పోతాను. ఆ కుళాయి నుండి పోతూనే రోడ్డుపై ఓచోట కాస్త దూరంలో జానకి వాళ్ళ గుడిసె ముందుభాగం కనిపిస్తుంది. అట్లే ముందుకెళ్తే వాళ్ళ గుడిసెకి దారికి దొడ్లు అడ్డమొస్తాయి.

రాత్రి అనుకున్నట్లుగానే పొద్దున్నే నాలుగు లోగా అందరం గుడి దగ్గరకు చేరుకున్నాం. అంతా చీకటి. మమ్మల్ని నిద్ర లేపింది పూజారి పెట్టిన గుడి మైకు. నీళ్ళను మోసేందుకు షార్ట్ వేసుకుంటే కంఫర్ట్ అని చాలామంది షార్ట్లు ఏసుకొచ్చారు. నాకి షార్ట్ లేదు, ఇలానే పంచె మీదే మోద్దామనుకున్నాను, అంజీ తనకు ఇంకో షార్ట్ ఉందని, ఇంటికి తీసుకెళ్ళి షార్ట్ ఇచ్చాడు. అందరం కడవలు పట్టుకొని దర్గా దగ్గరి కుళాయి కాడికి పోయాం. ఊర్లో ఏ ఇంటి వాకిలి ఇంకా తెరవలేదు. పడుకున్న వాళ్ళకెవ్వరికి చెవులు లేవు, మాకెవ్వరికి చెప్పులు లేవు. చెప్పులు వేసుకోరాదంట. నేనిప్పుడు దేవుడిని వదిలేసి, దేవుణ్ణి చంపేసి మూడేళ్ళవుతుంది కానీ సంబరం, అందునా జానకి నన్ను చూడాలని నేను పదే పదే తన్ను చూడాలని.

కుళాయి దగ్గర మోటార్ ఆన్ కాలేదు. మాలో కొందరు ఏమయ్యిందోనని లైట్లు వేసుకొని మొత్తం చూశారు. ఒకచోట వైరు తెగిందని తేల్చేసి ఊర్లోకెళ్ళి పట్టుకారు, టేపు వేసి బిగించి మోటార్ ఆన్ చేశారు. కుళాయి నుండి ధారపాతంగా నీళ్ళు. అందరం ఒకరిని జరుపుకుంటూ ఒకరం నీళ్ళలో తడుస్తున్నాం, చలి. మాకెవరో ఇప్పుడామె అనవసరం. నీళ్ళని నించుకోడానికి తొందరవుతుందని కుళాయి దగ్గరకు పెద్దవాళ్ళు రెండు డ్రమ్ములు తీసుకొచ్చారు. కుళాయికి పైపు బిగించేసి రెండు డ్రముల్లో నీళ్ళను పట్టేశారు. నీళ్ళను నించుకుంటు ఒకరిపై ఒకరం చల్లుకుంటూ ఒకరిపై ఒకరం తుల్లుకుంటూ రాత్రి మాట్లాడుకున్నట్లుగా ఎవరి దేవుడి దగ్గరికి వాళ్ళు నిండు బిందెతో బయలుదేరారు.

నే లెక్కించుకోడానికి జేబులో ఉంచుకున్న ఒక్కో రాయిని మారెమ్మ తల్లి గుడి మెట్లపై పెట్టేస్తూ నీళ్ళను మోస్తున్నాను. మారెమ్మ, పోతురాజు. చిన్నప్పటి నుండి నాకు ఇష్టం లేని దేవుళ్ళల్లో మారెమ్మ ఒకరు, కారణం తను బలి కోరటం. తన దేవర కోసం ఎన్నో మేకలు, దున్నపోతు కర్కశంగా నరకబడటం. కానిప్పుడు తను నాకు ఒట్టి బొమ్మే. కేవలం నా ఆటకు సహా ఆటగత్తె. నాలో ఎంత శక్తి, ఓపిక ఉందో నాకు నేను తెలుసుకోడానికి కూడా నాకేదో పరీక్ష. కుళాయి నుండి గుడికి పోయే దారి గుంతలు రాళ్ళతో. కుళాయి దగ్గరకు వెళ్ళిన ప్రతిసారి నాపై నేను బిందెతో నీళ్ళను గుమ్మరించుకుంటు నా పాదాలను మరింత తేమగా చేసుకుంటున్నాను. తడికాళ్ళతో రాళ్ళపై నడవడం ఇబ్బంది, అయినా నాకు మాటికి తడవడం ఇష్టం.

నేను బిందెని మోసుకుంటు ఆ దారిలో వెళ్తూ జానకి గుడిసె వైపు చూస్తుంటాను. గుడిసెకు పక్కన ఉన్న కరెంట్ స్థంభం వీధి బల్బు వెలుగుకి ఆ పరిసరాలన్ని తేటగా కనిపిస్తున్నాయి. ఇంకా సూర్యుడి వెలుగు పూర్తిగా పరవనప్పుడు, ఇంకా అందరూ పిల్లలు దర్గా దగ్గరి కుళాయిల దగ్గరికే మొదటి బిందెలకు వస్తున్నప్పుడు ఆ గుడిసె తలుపులు మూసుకునే ఉన్నాయి. గుడిసె బయట ప్యారేంగ చెట్టుకి కట్టివేయబడి నెమరేస్తున్న గేదె. దానికి వానలు రావడం, వొచ్చేందుకు మాలా చేయాల్సిన ప్రయత్నాలు చేయడం అలవాటు ఉండదు. నే పోయే దారిలో మా దొడ్ల దగ్గర ఏ కరెంట్ స్థంభం ఉండదు. నడిచేందుకు మరి అంత ఇబ్బందైన చీకటేం లేదు.

ఊర్లో అన్ని కుళాయిలకు నీళ్ళని విడిచారు. దాంతో దర్గా దగ్గరున్న కుళాయికి అంతా రావడం మానేసి ఏ గుడికి, ఏ ఇంటి కుళాయి దగ్గరో దాన్నుండి నీళ్ళను పట్టేస్తున్నారు. ఇక దర్గా దగ్గరి కుళాయి దగ్గరికి నేను, జాఫర్ మాత్రమే వస్తున్నాం. మారెమ్మ గుడి పక్కనున్న కొన్ని ఇండ్లకు కూడా కుళాయిలు వస్తున్నాయి, నేను ఆ నీళ్ళు పట్టలేను.

గుడిసె తలుపులు తెరుచుకున్నాయి. అయినా ఇంకా జానకి జాడ లేదు. తడిసిన పాదాలు ఎర్రగా మారుతున్నట్లున్నాయి. మరోసారి మరో బిందెకు మోసుకొని పోతుంటే పళ్ళను బ్రష్‌తో కడుగుకుంటు గుడిసె ముందు నిలబడి జానకి. నేనున్న వైపే చూస్తుంది, కానీ నావైపేనా? మెల్లిగా నడిచాను. అయినా తొందరగానే దొడ్లడ్డమొచ్చాయి. మారెమ్మ గుడి దగ్గర మరో రాయినేసి ఆ బొమ్మల తలలపై తెచ్చిన నీళ్ళను పోసి మరో కడవకు ప్రయాణం. కుళాయి దగ్గర జాఫర్‌ను కలిసినప్పుడల్లా వాడివెన్నీ బిందెలు అయ్యాయో కనుకునేవాడిని. వాడివి నా కంటే ఎక్కువ. ఒకటి కాదు, పదుల్లో తేడా.

జానకి నోట్లో అదే బ్రష్ ని అటు ఇటు తిప్పుతూ తాను ప్యారేంగ చెట్టు నుండి గుడిసెకు,

గుడిసె నుండి ప్యారేంగ చెట్టు వైపు తిరుగుతూ, మళ్ళీ నావైపే చూపులు. నా తల వెంటనే కిందకు.

ఇంటి ముందు ఊడ్చుకుంటూ,

గుడిసె పక్కల పూలను తెంచుకుంటూ,

గేదె పెడని గంపల్లోకి ఎత్తుతూ

ఒక్కోసారి తను కనిపించదు, ఎక్కడికెళ్ళిందని ఆ చుట్టూ మొత్తం వెదుకులాట.

తనని నేను చూస్తాను. తను నావైపు చూడగానే వెంటనే తల దించేస్తాను. తిరిగి తను చూసేప్పుడు ఎందుకు చూడలేక పోయాననే నాపై చిరాకు. ఈ సారైనా ధైర్యం చేయాలని ప్రతిజ్ఞ. తిరిగి అదే పని.

నేను మోసుకొస్తున్న బిందె చిన్నదే అయినా కడవలు పెరిగే కొద్దీ భుజాలు పట్టేసుకుంటున్నాయి. మాటిమాటికి తడవడం మూలన పాదాలకు రాళ్ళు వత్తుకొని నొప్పి. తొడల దగ్గర నడవలేక ఇబ్బంది. మారెమ్మ గుడి చుట్టూ పక్కల కుళాయిల నుండి నీళ్ళు బాగానే వస్తున్నాయని ఎవరైనా చెప్పినా, ఆ దర్గా దగ్గరి కుళాయి దూరమైనా కూడా నాకు పట్టింపు రావడం లేదు. అదే కుళాయి. అదే జానకి నన్ను చూడాలని, నేను తన్ను చూడాలని, అదే ఉత్సాహం నాలో.

దూరం కావడం వలన ఇంకా నా లెక్క తక్కువే ఉంది. జాఫర్‌వి అప్పటికే దగ్గరపడ్డాయి. ఊర్లోని పిల్లలవి కూడా చాలా వరకు దగ్గరికొచ్చాయని విన్నాను. ఒక్కోసారి పోయినప్పుడల్లా ఒక్క రాయి కాకుండా రెండు మూడు రాళ్ళను పెట్టేస్తున్నాను. అయినా ఇంకా నావి కనీసం సగం కూడా కాలేదు.

బిందెని మోసుకుంటు వస్తున్నాను. జానకి గుడిసె దగ్గర లేదు. ఇంతకు ముందు రెండు సార్లు కూడ కనిపించలేదు. దొడ్లను దాటి గుడి ముందరకు వస్తుంటే అక్కడే మారెమ్మ గుడి బయట ఆ తల్లికి మొక్కుతూ జానకి. నేను దగ్గరికెళ్ళిలోపు తను ముందుకు నడిచి ఊరి వైపు వెళ్ళి పోయింది. జానకి మొక్కులు పొందిన బొమ్మ అదృష్టవంతురాలు. మరి ఆ బొమ్మకు నీళ్ళు పోస్తున్న నేను? మరి ఇక్కడే తను మొక్కడం ఏంటి? రోజు ఇలానే చేస్తుందా! ఈరోజే చేసిందా? అదీకాక ఇంతకు మునుపు నావైపు ఎప్పుడు చూస్తున్నట్లు కనిపించేది కాదు, నేడు గుడిసె దగ్గరి నుండి నా వైపు చూస్తున్నట్లు అనిపించడం. అనిపించడమేనా నిజంగానే చూసిందిగా. ఊరికే చూసిందో లేక మరేదైనా ప్రత్యేకమైన అర్థంలో చూసిందో!!

జానకి ఇక కనిపించడం తగ్గిపోయింది. దర్గా దగ్గర నీళ్ళను మోసేసి ఎప్పుడో జాఫర్ వెళ్ళిపోయాడు. ఊర్లో గుడి దగ్గర నీళ్ళను మోసిన వాళ్ళంత మారెమ్మ గుడి దగ్గరకొచ్చి అక్కడ నేను పోసిన రాళ్ళను లెక్కపెట్టారు. ఇంతకు మునుపు పది, అంతకు మునుపు ఐదు. ఇలా ఒక్కోసారి ఒకటి

ఎక్కువ కలిపితేనే డెబ్బై వరకొచ్చాయి. వెంటనే వాళ్ళంతా తమ బిందెలతో ఈసారి మారెమ్మకి పోయసాగారు. అంతే నేను మూడు సార్లు తిరిగేలోగా నూట ఒక్క బిందెతో ముగిసి పోయింది.

అప్పటికే సమయం పదకొండు కావొస్తుంది. ఈశ్వరుని గుడి దగ్గర ఉగ్గాని వండుతున్నారు. మొత్తం బాడీలో నొప్పులన్ని మెల్లిమెల్లిగా తెలవడం మొదలవుతుంది. దేవుళ్ళకు ప్రసాదాలు పెట్టేసాక మేము గుడి దగ్గరి ఉగ్గాని తినేసి ఇంటివైపు కదులుతుంటే మళ్ళీ కనిపించింది జానకి. కొత్త బట్టలతో వాళ్ళ చిన్నాన్న వెంట అటు ఇటు తిరుక్కుంటు. జానకి రావటంతో నేను గుడికి ఎదురుగా ఉండే బసిరి చెట్టు కిందున్న కట్టపై కూర్చున్నాను. గుళ్ళోకి పోయి బయటికి వస్తూ నన్ను చూసింది. నేను ధైర్యంతో తనవైపు అలానే చూసాను. గుండె వేగంగా కొట్టుకుంటుంది, బుద్ది తల దించేయ్యమని హెచ్చరిస్తుంది. అయినా నే వినలేదు. తను వెంటనే తలను పక్కకు తిప్పి వేగంగా అక్కడి నుండి మాయమైంది. ఇక తను అక్కడికి తిరిగి రాలేదు. నేనంటే తనకు భయమో? లేక నేనంటే తనకు ఆకర్షణో?

ఒకసారి చూస్తున్నట్లు,

మరోసారి తప్పించుకుంటున్నట్లు,

నేనెలా దీన్ని ఊహించుకోవాలో? మిగతా వాళ్ళతో పోల్చుకుంటే నేనంటే తనకి అయిష్టం, లేదు అవన్నీ నాటకాలు. తనకు నన్ను చూడటం భరించడం సిగ్గు, అందుకే పరుగులు. ఒక్కోసారి బాధ, ఇంకోసారి పూర్తి సంతృప్తి.

పాస్ బుక్కు రావడంతో ఇక ఊరు విడవడానికి సమయం దగ్గరైంది. ఇంట్లోవాళ్ళ ఉద్దేశంలో నేను హైదరాబాద్ వెళ్తున్నా, నేను మాత్రం కర్నూల్ కి పోతున్నాను ఈసారి. కొన్నాళ్ళు కర్నూల్ లో గడపాలని నా ఆశ. అక్కడ ఉండేందుకు నాకు పని లేదు. వీణకి కర్నూల్లో తెలిసిన స్నేహితులు చాలామంది ఉన్నట్లు అప్పుడెప్పుడో చెప్పింది గుర్తుంది, కానీ తనని తప్పించుకొని తిరిగే నేను తన్ని ఇప్పుడెలా సాయమడగడం. అయినా నా అవసరం. తనకు ఏదైనా ఎలాంటిదైనా కర్నూలులో జాబ్ చూడమని మెసేజ్ పెట్టాను. తను తన స్నేహితులను కనుక్కొని హాస్పిటల్ లో కంప్యూటర్ ఆపరేటర్ గా పని చేయడానికి నన్ను అడిగింది, నేను సరేనన్నాను. అక్కడ కర్నూల్ లో తెలిసిన ఓ ఊరి స్నేహితుడికి ఫోన్ చేసి నేను రూమ్ లో ఉంటానని చెప్పేసాను. నేను కర్నూల్ వెళ్ళిన మొదటి రోజే ఊర్లో మూడురోజుల వరకు భారీగా వర్షం.

నాకు తెలుసు నేను ఊర్లో ఉన్న ఈ నెల రోజుల్లో జానకిలో నాపై ఓ ప్రత్యేకమైన కదలికనైనా తీసుకొచ్చానని. తనకోసం ఊర్లో ఎందరూ ప్రయత్నిస్తున్నారో నాకు అనవసరం. నేను ఇంతకు మునుపుకన్నా మరింతగా తనవైపు ఆకర్షితున్నైనాను. ఎందుకు ?

ఏమో!

తను అందంగా ఉందనేనా? ఒకవేళ అదే జానకి నల్లగా బొద్దుగా ఉండి ఉంటే,

నా ఆక్షేపణ తనపై ఇంతలా ఉండేదా? ఖచ్చితంగా ఉండేది కాదని చెప్పగలను.

మరి రేవతి, ఈరమ్మ వీరంతా కూడా అందంగా ఉన్నారుగా మరి వీళ్ళపై అంతటి ఆకర్షణ కలగలేదు ఎందుకని? ఎందుకంటే వీళ్ళకన్నా కూడా అదనంగా తనలో చిలిపితనం, మొండి ధైర్యం, అమాయకత్వం తిరిగి తనపై జాలి. తను నన్ను తప్పించుకొని తిరిగే కొద్దీ తనంటే మరింత శ్రద్ధ. మరింత పట్టుగా వెంకటప్ప కట్ట మీద రాత్రి జనాలంతా నిద్రపోయేంతవరకు కూర్చుంటాను. ఏదో సమయాన

ఆ దారిలో తను వొచ్చిపోతే తను నన్ను చూస్తుందో, నేను మాత్రం తన్ను చూడాలి. ఒకటి మరోటి తనపై ఆలోచనలు కలుపుతూ పూర్తిగా తనవైపుకే ఆలోచనలన్నీ వెళ్ళిపోతూ.

నాలో కలుగుతున్న ఈ స్పందనలు తనకు తెలియజేసి, తనతో పెళ్ళికై ఎన్ని కష్టాలైనా భరించి. ఇక జీవితాంతం తను తన నవ్వు, తన చూపు అన్నీ నా సొంతం. నాలో ఆలోచనలు తిరోగమనం వైపు. అసలు పెళ్ళేంటి? నేనకున్నట్లుగా తనపై ఆకర్షణ నాలో జీవితాంతం ఇప్పటి విధంగానే ఉండగలదా? నేను నిజం చెప్పాకా, తను ఒప్పుకోకుంటేనే సరి.

మరీ తను నన్ను ఒప్పుకుంటే, ఆ తరవాత తను నా దగ్గరగా ఉండగా తనలో నేను ఇప్పటివరకు ఊహించని కోణాలు నాకు ఎదురువ్వితే. ఎప్పుడు నన్ను ఒప్పుకుంటుందో అప్పుడు తన కోరికలు, తన ఆంక్షలు, తన కట్టుబాట్లు, తన ప్రతి చేష్ట నావైపుకి వొంగిపోయి అప్పటివరకూ తనలో నే చూసినా, ఇష్టపడినా ఆ సహజత్వం కనుమరుగవుతుంది. అలా కావాలనే కదా పెళ్ళి సంప్రదాయాలు చెబుతాయి.

తనని పూర్తిగా నేను మాత్రమే ఆక్రమించకుండా ఇప్పుడు తనపై నే నడిపే స్పందనలు ఎంత అందం. ఈ రాత్రి తను ఏ కల కంటుందో. పొద్దున నేను అలానే కళ్ళార్పకుండా చూసిన దాని గురించి తాను ఏమనుకుందో. తనలో కాముకత్వం ఊర్లో ఎవరిని కోరుకుంటుందో. నన్నెందుకు చూళ్ళేదు? నన్ను నిజంగానే చూసిందా! వాడి కన్నా నేనే ముందా? వాడే ముందా? ఆ కళ్ళలో ఎంత మత్తు. పోరాడటం, తడబడటం ఈ అద్భుతాలే గొప్పవి కావా?

నన్ను ఒప్పుకోకపోయినా నన్ను చూడకపోయినా పర్లేదు, నేను చూసేది నన్ను తడిపేదే నాకు కావాలి.

బసీరి చెట్టు మీది తీత నే లయ కలపకపోయినా పాట పాడుతున్నప్పుడు,
చీకటి ఆకాశాన నక్షత్ర చందమామలు నే కోరపోయినా కుంచెని రంగులతో నింపుతున్నప్పుడు,
సాయంత్రాన నే చెప్పకపోయినా మా పాకలో లేగదూడ ఎగిరి గంతేస్తున్నప్పుడు,
నే అరవకపోయినా ఆ యేటి నీరు నాట్యం చేస్తున్నప్పుడు
ఆ సహజత్వం ఎంత అందం.
సొంతం చేసుకోవడం కంటే వదిలెయ్యడమే అద్భుతం.

ఏ అర్థం చెప్పలేని మౌనపు గాలినే నే కోరుకుంటాను. అందులోనే వేల కోట్ల మణులను లెక్కించేందుకు నాకు ఆస్కారముంటుంది.

# రెండవ అధ్యాయం

## 1

వెళ్ళిన దారులనే మళ్ళీ కనుక్కోడానికి తిప్పలు పడ్డ ఈ కర్నూలు ఇక్కడి నుండి చూస్తే ఎంత చిన్నదయ్యింది.

రంగురంగులు, ఎగుడు దిగుడుగా. పారుతున్న చెరువు పట్టణానికి ఒకవైపుగా నా కళ్ళకు అందని దూరంగా ప్రవహిస్తూ. అదెక్కడికెళ్తుందో.

ఆ రైల్వే ట్రాక్, ఈ రోడ్లు చివరికంట ఎన్ని మలుపులుగా, ఒక్కొక్కటి మళ్ళీ విడిపోతూ కలుస్తూ చిత్ర విచిత్ర భాగాలుగా.

ఆ భవంతులు,

ఆ చెట్లు,

ఆ మైదానాలు,

అన్నీ అస్త్యవస్థంగా ఇంత ఇరుకుగా. వాటిని ఒక్కొక్కటిగా పైకి లేపి దూరంగా విసిరేస్తూ నాకు తోచిన రీతిలో అందంగా కూర్చాలని ఉంది. మొత్తం పట్టణం నే ఆడుకునేందుకు సరిపోయే బొమ్మలాగా.

అదే నేను కర్నూలు రోడ్లలో ఏదో ఒకచోట నడుస్తూ ఉండి ఉంటే, ఎంత పెద్ద రోడ్లు. ఎంత పెద్ద మనుషులు, ఎంత పెద్ద పట్టణం, తల తిరిగేంత, కండ్లు పట్టలేనంత భవంతులు. ఈ మొత్తం పట్టణానికి అభయమిస్తున్నట్లు ఈ కొండ మీద పెద్ద ఆంజనేయుడి విగ్రహం నాకు దగ్గరగా. అదే విగ్రహం కర్నూల్‌లోని ఏదైనా భవంతి మీద నుండి చూస్తే చిన్నదిగా.

చూసే చోటు ప్రదానం. ఈ ఎత్తు– తగ్గులు, పెద్ద– చిన్నలు, పగలు రాత్రులు అన్నీ సాపేక్షం. దేనికి ఇది సరైందని చెప్పే నిరూపాక్షమైన కొలతలు ఈ విశ్వంలో లేవనే ఐంస్టీన్ అంటాడు.

నే కూర్చున్న గుండుకి ఎదురుగా దర్గా. మొత్తం దర్గాని కప్పేస్తూ గుంపుగా వేప చెట్టు. దాని నీడలో కొందరూ ముస్లిం దంపతులు భోజనాలు చేస్తున్నారు. నాకు ఆకలి గుర్తొచ్చింది. పక్కన పెట్టుకున్న బాటిల్‌లో నీళ్ళు గొంతులోకి కొన్ని. వేడికి అవిరిగా మొఖపు చెమటపై కొన్ని. నేవొచ్చే దారిలోనే ఈ కొండ మీది ఓ గుడి దగ్గర ఇంతకు ముందే మొఖం కడుక్కున్నాను. తిరిగేళ్ళేప్పుడు ఆ కుళాయిల దగ్గరే నీళ్ళు తాగేసి మళ్ళీ బాటిల్ నింపెయ్యాలి. ఇప్పుడైతే ఎవరో ఈ కొండను చూడ్డానికొచ్చిన ఒకరిద్దరు తప్ప ఆ గుడి దగ్గర ఉండరేమో కానీ, శివరాత్రి ఉత్సవం. నే ఇంటర్‌లో ఉన్నప్పుడు ఒకసారి అక్కడే జాగారం కూడా చేసాను. ఎందరు జనాలో. మొత్తం కర్నూలే ఇక్కడకు తరలిందా అన్నట్లుగా. నాకు ముందున్న ఆంజనేయ స్వామి విగ్రహం దగ్గర సెల్ఫీలు దిగుతున్న ఆ జంట. భార్యభర్తలేనా? లేదంటే ప్రేమికులా? అన్న చెల్లెల్లెమో. ఆ యువతి ఎంత అందం. పంజాబీ డ్రెస్ లో ముందుకు ఉబ్బినట్లు కనిపిస్తున్న ఆ ఎదలు, ఆ తొడలు. పక్కన ఉన్నవాడు ప్రేమికుడో, భర్తనో

అయ్యింటే మొత్తం శరీరాన్ని తనలో కలుపుకొనే అవకాశం. అదృష్టవంతుడు! మరి నాకూ? నాకెప్పటికి కామాన్ని తీర్చుకునే అదృష్టం.

నన్ను ప్రేమించి నా సాంగత్యం కోరేవాళ్ళు ఎవరున్నారు? నేనే ఏ స్త్రీ వెంటయిన కామం కోసం వెంటపడే అవకాశం నాకుందా? ఒకవేళ వెంటపడినా తనని అడిగే ధైర్యం నాలో ఉంటుందా?

ఊర్లో ఓ పెళ్ళైనామే నేను కనిపించిన ప్రతిసారి మాటికి నా వైపే చూస్తున్నట్లు గుర్తు. ఆమెకు నాపై కోరికలుంటాయా!! నాపైనే కాదు, అందరిపైనా  తన చూపులు అంతేనేమో. ఆమె దగ్గరికి నేను ధైర్యం చేసి అసలు విషయం కోరేసి ఆ తరవాత. తరవాత ఆమె భర్తకు తెలిస్తే అతన్నుండి ఆమెకు, ఊర్లో పరువుగా ఉంటున్నామని చెప్పుకునే మా అమ్మానాన్నలకు, ఆపై నాకు.

పోనీ పద్ధతిగా ఎవర్నైనా పెళ్ళి చేసుకుంటే?

పెళ్ళయితే ఆమె జీవితంలో నేనూ, నా జీవితంలో తానూ. ఇది గొప్ప వ్యవస్థే, కానీ దీన్ని ఎంత ఇరుకుగా కుట్టేసింది గుంపు. ప్రేమో, పెళ్ళో ఇద్దరు ఎవరికి వాళ్ళుగా వేరుగా ఉండాలి. అప్పుడప్పుడు ఇద్దరు కలుస్తుండాలి. జీవితంలో అప్పటివరకు తమకు ఎదురైన అనుభవాల్ని ఒకరికొకరు నెమరేసుకొని, ఒకరికొకరు కామాన్ని తీర్చేసుకొని, ఆ తరవాత మళ్ళీ ఇద్దరు ఇద్దరికి దూరం. ఈ దూరం బంధాలని ఎంత పటిష్ట పరుస్తుందో. తరవాత తను ఎవర్నైనా, నేను మరెవర్నైనా కలవనీ. మళ్ళీ ఇద్దరం ఏదోనాడు, ఎన్ని రోజులో ఎదురొస్తూనే ఉంటాం.

కానీ, ఇది మా పల్లెల్లో సాధ్యం కాదు. ఇక్కడ స్త్రీ కానీ, పురుషుడుగానీ అత్యంత బలహీనంగా పెంచబడుతారు. నీ జీవితం నీవు ఇష్టమొచ్చినట్లు ఆనందంగా గడిపేసేయ్, నీకు కష్టమొచ్చినా నాకు కష్టమొచ్చినా నీకు నేను నాకు నువ్వు తోడుంటాం, ఇందులో ఇంకెంతమందైన ఉండనీ, మనలనంత ప్రేమ ఒక్కటిగా కలిపిందని భార్యతో ఏనాడైనా భర్త అంటే, విన్న ఆమె ఆ మాటలను తట్టుకోగలదా? స్వేచ్ఛని భయపెట్టేలా నీతులు. ఆమెకు ఖచ్చితం రక్షణ ఉండాలి, రక్షణ లేకుంటే తను బతకలేదనే పాఠాలు గుంపు నీతుల నుండి.

ఎవరికి వాళ్ళు ఉంటే మరి పుట్టబోయే పిల్లల మాటేంటి? నాకిక్కడ నే విన్న ఓషో మాటలు సబాబనిపిస్తాయి. పిల్లలు సమాజ సొత్తు. అందరి పిల్లల్ని సమాజమే పెంచాలి, వాళ్ళ చదువుకు, బట్టకు, తిండికి మొత్తం ఖర్చుని సమాజమే చూసుకోవాలి. తమ తండ్రెవరో వాళ్ళకు తెలవని రోజున, తమ పిల్లలెవరో తమకు అనవసరమని తండ్రులు అనుకునే రోజున ఎంత కుళ్ళు సమాజం నుండి వెళ్ళిపోతుంది. సంపాదించే ఆస్తి, పేరు, కులం, మతం అన్ని మన వారసుల కోసం. అందుకోసం ఎన్ని అన్యాయాలైన మనం చేయనీ, ఎందరి కడుపునైనా మనం కొట్టనీ. పోనీ వారసులైన మన్నిండి సుఖంగా ఉంటారా? వాళ్ళపై మనమే పెంచుతున్నామనే ఆధిపత్యం. నా భార్య, నా ఇల్లు, నా వారసులు వీళ్ళు నా వాళ్ళు. ఆపై కులం, ఆపై మతం చిట్ట చివరాకరకు మనిషి. ప్రేమ ఇంత సంకుచితంగా ఉంటుందంటే అదెందుకు గొప్పదవుతుంది?

ఇప్పటికి జానకిని చూడక రెణ్ణెళ్ళవుతుంది. నేను కర్నూలుకి వచ్చాక కొన్ని రోజులకు జానకి కర్నూలులో వాళ్ళ మామా వాళ్ళింటికి వచ్చిందని, ఆ ఇల్లు మా రూమ్‌కి దగ్గరేనని తెల్సింది కానీ, నాకెప్పుడూ ఇక్కడ తను కనిపించలేదు. తనకి దూరంగా ఉన్నా కూడా జ్ఞాపకాలు, నన్ను తనకు మరింత దగ్గరగా చేస్తూ. అవెంత అందంగా పలకరిస్తుండేవో. ఎంత ఊరిస్తే అంత తియ్యటి పండులా.

రేపు ఊరెళ్ళితే తిరిగి తనకోసం నా ఆనందకరమైన ఆట. ఇక్కడ నే చేస్తున్న పనిని నిన్నటి నుండే మానేశాను. కనీసం ఇక్కడ ఐదారు నెలలైన ఉండగలనని అనుకున్నాను కానీ, ఇక్కడి అనుభవాలు నన్ను వెనక్కి లాగేస్తున్నాయి. చేసే పని పన్నెండు గంటలు. వారంలో ఉంటే ఉంటుంది, లేకుంటే లేదు సెలవు. పనిచేసే సంస్థను మనదిగా అనుకోని పని చేయాలని అంటుంటాడు మా మేనేజర్, మరి ఏదైనా తెలియక పొరపాటు మననుండి జరిగిందని తెలిస్తే అన్నిరకాల తిట్లని అదే ఆయన ఉపయోగిస్తాడు. నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోమంటాడు. క్యాష్ కౌంటర్లో ఏ లెక్క పక్కకు పోకుండా ఎంత శ్రద్ధగా, కఠినంగా పనిచేసిన కూడా నెలకు జీతం ఎనిమిది వేలే. మనీ ఎంతైనా కానీ, మరి సమయం. అదీనుకాక నేను పనిచేసే చోట నాకు తోడుగా నన్ను ఆకర్షించిన ఓ చిన్నది పని మానేసింది. ఆ చోటికి ఇప్పుడు ఓ మగాన్ని.

ఊర్లో మా పెద్దత్త పరిస్థితి ఎంత అద్వాన్నంగా ఉందో. మా పెద్దత్త అంటే మా నాన్నకి పెద్దక్క. మా ఇంటి పక్కనే గుడిసెలో ఉండే విధవ. కర్నూలుకి వొచ్చిన వారంలోనే అంతవరకు బావున్న తను ఊరికే కింద పడిపోయిందని ఆసుపత్రికి తీసుకొచ్చారని నాకు ఆనాడు ఫోన్. నాకు ఆ ఆసుపత్రి పది కిలోమీటర్ల దూరమే అయినా నేను హైదరాబాద్‌లో ఉన్నాననుకునే మా అమ్మవాళ్ళకు అనుమానం రాకూడదని మరుసటి దినం ఆసుపత్రిలో వాలిపోయాను. ముక్కుకు పైపు, కళ్ళు అప్పుడప్పుడు తెరచి మూస్తూ. ఎప్పుడో ఏ క్షణానో కొద్దికొద్దిగా శరీరాన్ని కదుపుతూ అత్త. తన వయసు ఇప్పుడు డెబ్బై దగ్గట్లో ఉండవచ్చు. నేను అక్కడ ఉన్నది ఆ రోజు రాత్రి వరకే. నేనొచ్చిన రోజు అత్త స్పృహలో లేదు. మరుసటి దినం పొద్దున కళ్ళు తెరిచి తన పక్కలనే నిలబడ్డ నన్ను గుర్తించగలిగింది అత్త. ఏదో చెప్పాలని, మాట్లాడాలని చూసింది, అయినా తన శరీరంలో సత్తువ చాలడం లేదు. కాళ్ళని, చేతుల్ని కదిలించడం చేయలేకుంది. ఈ పరిస్థితిలో ఉన్న అత్త ఇక బతకడం కష్టమేనని మా అమ్మవాళ్ళు అనుకున్నారు. కానీ తను బతకగలిగింది, కాళ్ళు చేతులు కదల్చలేని విగత జీవిగా. మా అత్తకు నా అన్నవాళ్ళు ఎవరు లేకపోవడంతో ఆ విగత శరీరానికి చాకిరి చేయాల్సిన స్థితి ఇప్పుడు అమ్మకు, పెద్దమ్మకే దాపురించింది.

మా పెద్దత్తది రాతి గుండెని, దేనికి అది చలించదని మా ఊర్లో అందరు ఎంత మాట్లాడుకుంటుంటారో. ఇది నాకు పూర్తి నమ్మశక్యం కాదు. మా అవ్వ చనిపోయే క్షణాన పక్కన ఆ సమయంలో ఉన్నది పిల్లాడినైన నేను మరియు పెద్దత్త మాత్రమే. తనిక ఒంటరి కాబోతుందని, ఇన్నాళ్ళు తనకు తోడుగా ఉన్న అమ్మ లేవడం లేదేంటని పదే పదే అవ్వను తడుతూ ఏడవడం నేను చూసాను. అయినా జనాలకు అత్తది రాతి గుండెనే. ఎందుకంటే జీవితం తనపై ఎన్ని రాళ్ళు విసురుతున్నా తానెప్పుడూ మంచి బట్ట కడుతూ నిబ్బరంగా బతుకుతున్నట్లు కనిపించేది కాబట్టి. ఎందుకంటే ఏ తోడు తనకు లేకపోయినా తను ఎవ్వరి నుండి ఏ జాలీగాని, ఏ సానుభూతి గాని ఆశిస్తున్నట్లు అనిపించేది కాదు కాబట్టి.

నా గుద్ద కింద ఉన్న బండ వేడెక్కుతున్నట్లు అర్థమవుతుంది. ఆంజనేయ స్వామి విగ్రహం దగ్గర ఉన్న ఆ జంటలో ఆ మగాడు కొండ కిందున్న కర్నూలులో దేనినో పక్కనున్న ఆమెకు చెబుతున్నట్లు. ఒకచేయి ఆమె భుజం మీద, మరోటి వేలితో పట్టణం వైపు చూపుతూ. మిగిలిన కొన్ని నీళ్ళను కూడా తాగేసి నిలబడ్డాను. ఆకలి! నిజానికి నేను గుండుపై కూర్చున్నప్పుడు నాకంత ఆకలి లేదు. దర్గా దగ్గర తింటున్న ఆ ముస్లిం కుటుంబాలని చూశాకే నాలో ఇంతాకలి. నే వొచ్చేప్పుడు ఇదే కొండమీదే దర్గాకి ఇంకాస్త ముందుకు ఓ కిరాణం చూసాను. టెంకాయలు, పూలు, ఆకులు పూజకు అవసరమైన

వస్తువులు అమ్మకానికి ఉన్నట్లు. అక్కడ తినే వస్తువులు కూడా ఉన్నాయా? కరాచీ పాకెట్లు అలాంటివి. లేవేమో!! ఉంటే_ _ _

లేచి గుండును దిగేసి నడవడం మొదలెట్టాను. దర్గావైపు నుండి వెళ్తుంటే ఓ ముసలావిడ గొంతు నావైపు.

" బాబు! భోజనం.. "

అక్కడ మొత్తం ఎనిమిది మంది ఉన్నారు. తినడం మానేసి అటు ఇటు పరుగులు పెడుతూ పిల్లలు ముగ్గురూ, పుష్టిగా ఆరగిస్తున్న ఇద్దరు జంటలు, ఊరికే కూర్చున్న నన్ను పిలిచిన ఆ మూసలావిడ. నాకూ వెళ్ళి తినాలనే ఉంది, కానీ_ _ _కానీ వాళ్ళు తినేవి మాంసం. పొట్టేలో, కోడో తెలీదు. దర్గాకు నైవేద్యం పెట్టేందుకు వొచ్చింటారు.

తిన్నాను! ఆకలిగా లేదని అక్కడి నుండి ముందుకు నడక. చేతిలో ఖాళీ బాటిల్‌ని తొడలకు కొట్టుకుంటూ.

దగ్గర పడుతున్న కిరాణం కొట్టులో పూజ సామాగ్రి తప్పితే మరింకేం ఉన్నట్లు కనిపించడం లేదు. రోడ్డుకి అటువైపు నాకు పక్కనే బారెడు పొడువుతో చచ్చి పడున్న పాము. ఎవరు చంపారో? రాయితో దాని తలపై పదే పదే కొట్టినట్లు. ఏం పామో తెలీడం లేదు. మనకు కొన్ని చావులంటే నిర్లక్ష్యం. మనిషి చావు తప్ప ఇంకేది మనల్ని భయపెట్టదు, ఇంకేది మనల్ని కదిలించలేదు. చావు!!! ఇది ఈ భూమ్మీది అన్ని ప్రాణులకు అనివార్యమైనా సంగతి. చావంటే సమస్తం ముగిసిపోవడమేనా? ఇప్పుడు పచ్చగా కనిపిస్తున్న ఈ చెట్టు, రేపొద్దున చస్తే. దాని కొమ్మలు, కాండం దాన్నుండి వేరు కాబడి వేరు వేరు రూపాల్లో ఎక్కడెక్కడో. అదో చెక్కబల్ల కావొచ్చు. లేకుంటే కూర్చునే పీట. పిల్లవాడు చదివే పుస్తకంలోని కాగితం. గోడకు వేలాడదీసే చెక్కబొమ్మ, కుర్రాడి చేతిలో బ్యాట్, ఇంటి గుమ్మం ఇంకెన్ని రూపాలో. తిరిగి అవి అక్కడి నుండి ఇంకెన్ని రూపాలుగా మారుతాయో. విరిగిన చెక్కబల్ల పొయ్యి కిందకు పోవడం, చెక్కలోని శక్తి బూడిదగా మారడం. తిరిగి బూడిద పొలంలో ఎరువుగా. పదార్థం శక్తిగా మారడం. తిరిగి శక్తి పదార్థంగా. ఎన్ని రూపాల్లో. చచ్చిన పాముని తిన్న పురుగులు వాటి శరీరంలో కలిసిన ఈ పాము కణాలు. మిగిలిన ఎముకలు శిలలుగా లేదా ఇంకేదో రూపంగా. పదార్థం కానీ, శక్తి కానీ కొత్తగా ఏదీ సృష్టింపబడదని లేదా నాశనం కాదని భౌతిక నియమం. అలాంటప్పుడూ చావుకు అర్థం ఎక్కడుంటుంది? మరి మనలోని చైతన్యం సంగతి. ఇది కూడా ఇలానే ఉంటుందా! అసలు చైతన్యం అనేది ఒకటుందా! ఇదంతా ఉనికిని నిలుపుకునేందుకు మనం కల్పించుకున్నవేనా? నే పుట్టినప్పుడు కూడా నాలోని చైతన్యం ఇప్పటిలానే ఉండేదా? అప్పుడు నేనెవరో నాకు తెలీదు. పెరిగే కొద్దీ కొత్త కొత్త పదాలు తెలుసుకునేకొద్ది చైతన్యం మరో కొత్త రూపంగా. నిన్నటి చైతన్య స్థితి నేడు తిరిగి మరొక కొత్తగా. చైతన్యం నీటి బుడగలా అలా పగిలిపోతూ, కొత్తవి పుట్టుకొస్తు. ఇదే చైతన్యం నక్కకి ఒకలా నాకు మరోలా.

ఆ కుక్కలు రెండు బూతు పని. కుక్కల పని విచిత్రంగా. రెండు లింగాలు గట్టిగా ముడిపడిపోతాయి. ఆ లంకె విడిపోయేంతవరకు రెండు అలానే ఉండిపోవడం. అసలు వీటికి సిగ్గు కూడా ఉండదు అన్ని బహిరంగానే. అడవుల్లో వాతావరణ పరిస్థితుల్లో రక్షణ కోసం మనం బట్ట కట్టడం, అవి ఆ తరువాత లింగానికే ప్రాధాన్యతగా మారడం, సిగ్గు పుట్టడం. అసలుకారణం ఎప్పుడో మరుగున పడేసి కొత్త అర్దాలను మనం ఎన్నెనా అల్లుకుంటాం. ఈ ప్రకృతిలో బూతు, ఆకలి, నిద్ర,

సంతానం, చావు ఇవే అన్ని జీవులకు సమానమైన చైతన్య దశలు. మిగతాదంతా మనం కల్పించుకున్నదే. అంత భ్రాంతే. నాలోని ఆనందం భ్రాంతి, ఏడుపు ప్రేమ సత్యం అసత్యం అన్ని భ్రాంతే. భ్రాంతే అయితే వాటి నుండి పుట్టిన సమస్త శాస్త్రాలు, కళలు, భావాలు అన్ని భ్రాంతే. ఈ ఆలోచన కూడా భ్రాంతే. ఈ భ్రాంతి అన్నది కూడా భ్రాంతే. గారడీ... మాటల గారడీ. దీనిపైనే మెట్ట వేదాంతాలన్ని పుట్టుకొచ్చాయి. అన్ని భ్రాంతో, మాయో అవితే అవ్వనీ. అనుభవిస్తున్న నాకు ఈ క్షణం, ఈ లోకం ఈ అనుభూతి అన్ని నా వరకు నాకు సత్యం. పదాలకు మోసమవ్వనీ.

బూతు, నన్నెప్పుడు వెంటాడి వేధించేది. ఇప్పుడు పక్షవాతంతో పడిన అత్తపై బూతు. నే పసివాడిగా ఉన్నప్పుడు తను నా ముందే ఊర్లోని సూరన్నతో అక్రమంగా బూతు పని చేయడం. ఆనాడు మాత్రమే అలా చేసిందని ఇంకెప్పుడూ తను అలాంటి పనులు చేయలేదని నేనకునేవాన్ని. తిరిగి నే ఎనిమిదో తరవతిలో ఉండగా, ఇంట్లోని అమ్మవాళ్ళు ఊరెళ్ళిపోతే భయంతో అత్త పక్కనే పడుకున్నాను. ఆ రాత్రి సూరన్న అత్త దగ్గరకు రావడం, నే పడుకున్నానని అనుకోని ఇద్దరు ఏవేవో మాట్లాడ్డం, బూతు పని చేసుకోవడం. బూతుని తప్పుగా అనుకునే నా దృష్టిలో అప్పటికి పెద్దత్త నెరస్థురాలు. నాలో అదుపు లేకుండా బూతు కోరికలు పెరుగుతూ, వాటిపై నా నియంత్రణ కష్టసాధ్యంగా మారుతున్న దశలో పెద్దత్తే నాకు బూతు అవకాశమనిపించడం. బూతు తప్పే, కానీ ఒక్కసారి ఆ కోరిక తీరిపోతే. ఇక ఎప్పుడూ ఆ పని చేయమేమో. మోసం! నన్ను నేను చేసుకునే మోసం! పెద్దత్త పక్కన పడుకునే అవకాశం వస్తే తనకు మెలుకువ రాకుండా తన్ని అతుక్కోవడం. శరీర భాగాలని తడమడం. తను కదిలినట్లు అనిపిస్తే తిరిగి అటు తిరగడం. వీర్యం పోయాక తిరిగి తప్పు చేసినట్లు బాధ, పశ్చాత్తాపం. తిరిగి మళ్ళీ కోరిక పుట్టడం. సూరన్న విషయం అందరికి చెప్తానని చెప్పేసి ముసలి అత్తను ఒప్పించాలి, నగ్నంగా అనుభవించాలి. తనతో మాత్రమే ఆ పని, ఒప్పించి చేసే పని. తూ!! నేనేంటి ఇంత దిగజారడం. తన వయసేంటి? నా వయసేంటీ!! కానీ తప్పదు, ఎలాగూ అత్త ఒకరికి లంజే. తప్పు తనదే, అనుభవించు. అది తప్పైన ఆ తప్పు ఒకరి మిందే, అది కూడా తప్పు చేస్తున్న అత్త మీదే. అత్తని మాత్రమే ఊహించుకొని హస్తప్రయోగాలు. రాత్రి పూట అప్పుడప్పుడు అత్త మంచం దగ్గరకొచ్చి తన శరీర భాగాలని తడమడం, తను కదలగానే అక్కడినుండి వెళ్ళిపోవడం. కొన్నిసార్లు అత్త కళ్ళు తెరిచినట్లు గుర్తు. అప్పుడు నా గుండె వేగం. వెంటనే ఏం తెలినట్లు మూత్రం పోయడానికే బయటికొచ్చినట్లు అటు ఇటు ముందుకు వెనక్కెళ్ళి నేను పడుకున్న చోటికెళ్ళడం. నాన్న వాళ్ళకి చెప్తుందేమో!! ఒకవేళ తను చెప్తానంటే ముందుగానే సూరన్న విషయం చెబుతానని బెదిరించాలనే ఆలోచన. కానీ పొద్దున రాత్రి నే చేసిన పని ఏం తెలినట్లుగానే అత్త నాతో ఉండటం. ఓసారి స్నానం చేస్తుంటే తన్ను నేను నగ్నంగా కూడా చూసాను. రాత్రి నాలో కోరిక మరిగినప్పుడు అత్తంటే ఎంత చులకన, కానీ తన ఊహలతో మంటను విస్తృతం కాకుండా ఆపిన శక్తి. నే తన్ని హత్తుకున్నప్పుడు తనకు నా స్థితి తెలిసే ఉంటుంది, కానీ తెలినట్లు. దైవం చచ్చాకగానీ అత్తని చూసే తీరు నాలో మారలేదనుకుంటా. కామం, బూతు ఇవి ఇప్పటికి నన్ను కలవరపెట్టేవే. ఒకప్పుడూ పిల్లల్ని చూసినా కూడా కామ కోరిక. పిల్లల్ని హత్తుకొని స్వయం తృప్తి పొందటం, అయినా నేనెప్పుడూ అత్యాచారాలకు పాల్పడలేదు. అప్పటి కారణం భయమైతే, ఇప్పుడు అవగాహనేమో. పిల్లలపై లైంగిక పనులు వాళ్ళ మనసిక స్థితిని ఎంతగా దిగాజార్చుతుందో తెలుసు. వాళ్ళేమి మనల్ని ప్రతిఘటించలేరని వాళ్ళపై మన బలం చూపాలనుకునే అవగాహనా రాహిత్య బూతు. అత్యాచారం చేసేవాడికి బూతు సంతోషాన్ని

నింపగలదా? తొందర తొందర్లో భయంగా ఆత్రంగా వెంటనే కారిపోవడం. తెలుస్తోంది, చెబుతోందని భయంతో తనపై ఆవేశంలో ఏదైనా చేసేయ్యడం. అత్యాచారం చేసేవాళ్ళ దృష్టిలో అత్యాచారం గావింపబడ్డ వాళ్ళు ఎంత చులకన. అది బూతు గాదు, అహంకారం. తొందరలో పుట్టే ఆధిపత్యం. అవగాహన అన్ని ఆలోచనల్ని బద్దలు కొట్టి అన్ని తేటగా కనిపించేట్లు చేస్తుంది. ఆనాటి కన్నా కూడా ఇప్పటికి నాలో బూతు కోరికలు ఎక్కువే, కానీ అప్పట్లో చేసిన పనులు నేనిప్పుడు చేయలేను. బూతు అంటే, అది ఎలా చేస్తే ఆనందమో తెలుసు. ఏవి అపార్థాలో– ఏవి నిజాలో, ఏది తొందరో– ఏది అబద్ధమో విడదీసి వాటిని చివరికంట తేల్చుకోవాలనే తాపత్రయం. ఇంకోవైపు అందరూ మనుషులేనని, ఎవరి జీవితానికి ఇంకెవరు బాధ్యులు కాలేరని చెప్పుకొనే తత్వం. నాలో ఉందా! ఉన్నా లేకపోయినా నా ఆత్మ నా వెంట ఎప్పటికి ఉంటుంది, నాలోని అన్ని దెయ్యాలని పట్టుకునే గూఢచారిగా.

పెద్దత్త ఇప్పుడు మంచం మీద. జీవితం తనపై ఎంత కక్ష పట్టినా ధీరోదాత్తంగా నిలబడ్డ స్త్రీ. పెళ్ళైన ఏడేళ్ళకే మొగుడు పోవడం, బిడ్డకు ఏదో రోగం తగిలి ఐదో ఏటనే పోవడం. ఆ తరవాత మిగిలిన ఒక్కగానొక్క కొడుకు కూడా యవ్వనంలో దీపాలి పండగప్పుడు రాకెట్ వొత్తి తలకు తగిలి చావడం. మా నాన్న, చనిపోయిన మా పెద్దనాన్న, తలో దిక్కులో ఉన్న అత్తలు అందరికంటే తను పెద్దది కాబట్టే నాకు పెద్దత్త. మా తాత, మా నాన్న చిన్నగున్నప్పుడే పోయాడంట. మా నాన్నవాళ్ళు ఇంకా పిల్లలేనని పొలాన్ని చూసుకుంటాడని కొంత ఆస్తినిచ్చి పెద్దత్త మొగుణ్ణి ఇల్లరికం చేసుకుంది అవ్వ. మొగుడు చచ్చాక ఆ ఆస్తి అత్త పేరు మీదకు మార్చేసింది. మా నాన్నవాళ్ళు వేరు కుటుంబాలు అయ్యాక అవ్వతో కలిసి మా ఇంటి పక్కనే గుడిసేసుకుంది పెద్దత్త. ఇద్దరు అక్కడే. తోడుగా ఉన్న అవ్వకూడ నా పన్నెండో యేట పోయాక ఇక అత్త పనికేళ్ళడం మానేసింది. పొలాన్ని మా నాన్న వాళ్ళకి కౌలుకిచ్చి ఆ కౌలు మీద, వైధవ్య పింఛన్ మీద బతికేది. తన్ను వదిలి తన్నోక్కదాన్ని అంత ఒంటరి చేసి వెళ్ళిపోయినా ఆ బాధ బయటకు తనెప్పుడు చూపలేదు. ఏ ఒక్కరి నుండి సానుభూతి కోరేట్లు, ఏ ఒక్కరూ తనపై ఆధిపత్యం చూపేట్లు చేసుకోలేదు. తను వేసుకునే బట్ట, ఉండే శుభ్రం అవేమి ఎరుగని ఊర్లో వాళ్ళకి ఆమెది అహంకారం. ఏడ్చేవాళ్ళు అందరి ముందు ఏడేస్తేనే వాళ్ళకి గుండె ఉన్నట్లు సమాజ భావన. అందుకే తమ మనస్సాక్షి కన్నా కూడా రాళ్ళంటేనే మనకు భయం.

దేవాలయం! నాకూ, దేవుడికి ఏం సంబంధం? ఎందరికో ఇతడు మత్తు. దేవుడు లేడని చాలామందికి తెలుసు. తెలిసిన వాళ్ళలో కొందరు అతన్ని వాడుకొని రాజకీయాలు, వ్యాపారాలు చేస్తుంటారు. ఇంకొందరు నాస్తికులుగానే బహిరంగంగా ఒప్పుకుంటారు. అయినా జనాలకు తమను మత్తులో ఉంచే మంత్రాలు, దొంగబాబాలంటేనే వ్యామోహం. నాస్తికుడిగా ప్రకటించుకున్న వాడు తమలోని అంతరాత్మని తమ కళ్ళముందే చూపుతాడేమోననే భయం.

దేవాలయం ఓ అద్భుత కళా సృష్టి. ఆ విధంగానే నేను వాటిని చూస్తాను. ఆ శిలలు, శిల్పాలు ఎందరి కళాకారులు ఎన్ని రోజులుగా కన్న కలలో. ఆ మూతి విరుపుల్లో, ఆ నడుంఒంపుల్లో వాళ్ళు ఎందరిని దర్శించుకున్నారో. అంతవరకూ తను ప్రచారం చేసిన దేవుడు తనకు చివరికంట కూడా ఆదుకోవడం లేదేంటని "నా దేవా! నా దేవా! నన్నెందుకు చెయ్యి విడిచితివి" అనే యేసు, చివరాకరకు నానాటి బ్రతుకే నటనగా ముగించిన అన్నమాచార్యుడి పదాల్లో ఎంత దైన్యం. శాస్త్రాలను, వేదాలను పట్టుకొని మనిషిపై ఆధిపత్యం చూపాలనుకునేవాళ్ళకి దేవుడు నటన. పొట్టకూటికోసం, అహంకారం కోసం, పైశాచికానందం కోసం.

ఊరు, ఈ సారి ఊళ్ళో నేను రెండు నెలలు ఉండాల్సొస్తుంది. వారంలో ఉండే దసరాకి వొచ్చింటానని అమ్మవాళ్ళు అనుకుంటారు కానీ, దసరా అయ్యాక ఆ తరవాత వొచ్చే కార్తీకమాసం. జానకి రోజు మా ఇంటి ముందుండే గుడి దగ్గరకు వొచ్చి పూజ చేయడం, నే చూడటం, తన ఉబులాటని, తన ఆనందాన్ని గమనించడం. ఈ మాసం పోతే నాకింకా తన్ను చూసే క్షణాలు దొరకవేమో. ఏమో, నెక్స్ట్ సంవత్సరమే తనకు పెళ్ళై పోతే. నేనే పెళ్ళి చేసుకుంటే, పెళ్ళిపై నాకున్న అభిప్రాయం మారితే.

ఇక ఎవరు తనకు లేరని అనుకునే అత్తకు ఈ స్థితిలో నేను పక్కనుండటం కూడా కావాలి. మొన్న బషీర్ ఫోన్ చేసినప్పుడు తనతో మాట్లాడాను. ఎంత నిస్సహాయంగా, నిరాశగా మాటలు. అందరి పిల్లల్లా నేను లేనని, తిని బలంగా అవ్వాలని ఎప్పుడూ నూరిపోసే అత్త. ఏ ప్రత్యేకమైన వంట చేసుకున్నా నన్ను తప్పక పిలుస్తుండే అత్త. తన ప్రతిమాట వింటానని, అప్పుడప్పుడైన తనకు సాయం చేస్తుంటాననేమో నాపై తనకంతభిమానం. ఇలానే ఉంటే పిచ్చివాళ్ళంటారని తిని తాగడం నేర్చుకోమని చెప్పిన అత్త. తనకు కాలు చేతులు వొచ్చే అవకాశం ఉందమో, తనకు ఆశ కలిగించే వాళ్ళుంటే.

కుళాయి పైన పెద్ద ట్యాంక్. చుట్టూ ఎవరు లేరు. ఎండకు నడిసొచ్చిన శరీరం అలసటగా. అంగీ, ప్యాంట్ ని విప్పేసి కుళాయి కింద కూర్చున్నాను.

తలపై నీళ్ళు

చల్లగా.

ఎదురుగా దేవాలయ శిఖరం.

అందమైన కల.

# 2

పచ్చిక నుండి బయటికొచ్చిన తొండ నన్ను చూసి ఆగిపోయింది. ఎటు కదలకుండా నావైపే చూపులు విసురుతూ. నేనూ దాని కళ్ళవైపే. భయం లేదు, రెండు కాళ్ళతో ముందరి శరీరాన్ని పైకి లేపింది. ఇంత చిన్న శరీరం ఇంత ధైర్యంగా నాకే సవాలు విసురుతున్నట్లు. గట్టిగా దగ్గాను రెండు సార్లు. తిరిగి పచ్చికలోకే దాని పరుగు. విజయం సాధించానని గర్వం.

నే కూర్చున్న గుండు మీద ఎండిన బట్టల సబ్బు మరకలు, అదే సబ్బు వాసన. వంకలో చేపపిల్లలు అన్ని గుంపుగా కదిలి పోతున్నాయి. చిన్న చిన్న నీటి అలజడ్లో రాళ్ళు ముత్యాలుగా మెరిసిపోతూ. నీటిలోని ఓ గులకరాయిని తీసుకొని ముందుకు విసిరాను. నీళ్ళలో ఆ చివరున్న రెండు కొంగలు ఆకాశం వైపు లేచి రెక్కల్ని సవరించుకుంటూ వరిమల్ల వైపు సాగిపోయాయి. నేనేం చేశాను? చేపల్ని పట్టి పొట్ట నింపుకుంటున్న కొంగల కడుపు కొట్టానా? లేక కొంగల బారి నుండి కొన్ని చేప పిల్లల్ని రక్షించానా? రెండిటిది అర్థవంతమైన పోరాటమే!

ఒకదాని ఆకలి,

ఇంకోదాని ప్రాణం.

నే ఇప్పుడు చేసిందేంటి?

న్యాయమా? అన్యాయమా?

పెద్దత్త పరిస్థితి కూడా ఇంతే. ఏది న్యాయమో తేల్చుకోలేని స్థితి. పడిపోయిన పెద్దత్తకి ఎన్ని తిట్లు తిడుతూ చాకిరి చేస్తుంటారు మా అమ్మ, పెద్దమ్మలు. పెద్దత్త మంచంపై నుండి అది చేయమని ఇది చేయాలని అరుస్తుంటుంది. వాటికి ధీటుగా అమ్మ చిరాకు. అత్త పరిస్థితి అర్థం చేసుకోవాల్సిందే, అమ్మ చిరాకూ అర్థం చేసుకోవాల్సిందే. మలమూత్రాలు కడగడం, పొద్దున, రాత్రి తిండి పెట్టడం ఒకవైపు, మరోవైపు మా ఇంట్లోని పనులు వేళకు అన్ని అవ్వగొట్టుకొని పొలం వెళ్ళటం. మా పెద్దమ్మ, మా అమ్మ ఇద్దరు అత్తకి పొద్దున సాయంత్రం చాకిరి చేసేందుకు వొంతులు. ఇక పగలు అత్త సంగతి దేవుడెరుగు.

నేనొచ్చిన మొదటి రోజే అత్త స్థితి నన్ను భయపెట్టింది. అత్త గుడిసెలోకి అడుగు పెడితే మలమూత్రాల వాసన. గుడిసెని కడిగే వాళ్ళో లేదో. నన్ను చూడగానే అత్త సంతోషం. లేచి కూర్చొంది. నేను మంచం మీదే కూర్చున్నాను. తానెన్ని మాటలు చెప్పింది? తననెవరూ పట్టించుకోడం లేదని, తనకే ఈ కష్టం వొచ్చిందని ఏడుపు. ఏం కాదని, నడుస్తావని అన్నాను. నడుస్తుందా! నడవగలదా! కానీ డాక్టర్లు కాళ్లు రాగలవని చెప్పారంట. అదే ఆశ తనలో. ఎలా ఉంటుందో ఆ వాసనకు అత్త. కొద్దీ సేపయితే కక్కు వొచ్చేట్లు.

ఏది తప్పని విచారం చేస్తే నేనిప్పుడు ఏం చెప్పగలను? అన్నం పెట్టడం, మలమూత్రాలు ఎత్తడం, అప్పుడప్పుడు స్నానం చేయించడం ఇవన్నీ ఎలాగూ చేస్తున్నారు, కానీ పక్షవాతంతో ఉన్న తనని మాటల్తో గుచ్చడం ఎంతవరకు సబబు. ఈ గుడిసెని కడగవొచ్చు అలాగే తనతో అప్పుడప్పుడైన వొచ్చి కొన్ని మాటలు చెప్పిపోవొచ్చు. కానీ ఎవరికి తీరికా. అందరూ వాళ్ళ వాళ్ళ పనుల్లోనే పీకల్లోతుగా మునిగిపోతారు. అయినా ఈ పనిని అమ్మవాళ్ళే ఎందుకు చేయాలి? పెద్దత్తకి చాకిరి చేయాల్సిన గత్యంతరం వారికేంటి? మా వొదినలు, మా అన్నలు ఎవ్వరూ ఆ గుడిసె వైపు ఎప్పుడోసారి చూశేవారు. ఆసుపత్రి నుండి తన్ను తీసుకొచ్చిన మొదట్లో మా పెదనాన్న కొడుకు నాగేంద్రన్న మంచం మీద నుండి లేపి నడిపించేవాడంట రోజు పగలు, సాయంత్రం. ఎంతకీ పాదాలు సరిగ్గా నించోబెట్టని తనని ఎన్నాళ్ళని ఓపికతో ప్రయత్నిస్తారు. ఇప్పుడు అప్పుడప్పుడు మాత్రమే నడక అత్తకు. పగలంత మంచం మీదే పడుకోవడం, లేచి కూర్చోవడం, తనకెదురుగా ఉన్న కుర్చీ మీది నీళ్ళని తాగడం. బయటి ప్రపంచపు గాలి, బయటి ప్రపంచపు మాటలు ఏవీ ఇప్పుడు తనకి వినిపించవు, కానీ అవి ఆత్మని తాకి కలవరపెట్టగలవు.

నేనైనా తనకి ఏదైనా చేయలనిపిస్తుండేది. ఎలాగూ అమ్మవాళ్ళు పొలంకెళ్ళితే, అన్న పిల్లల్ని పట్టుకొని నేను ఇంటి దగ్గరే ఉండిపోతున్నాను. ఆ పిల్లల్లో పెద్దది ఐదేళ్ళ వయసున్న రూపతో తలనొప్పిండదు కానీ, అన్న కొడుకు మోహన్ తోనే. వాన్ని ఉయ్యాలలో పడుకోబెట్టి కొద్దిసేపు తనకు మాటలు చెప్పేందుకు అత్త మంచం దగ్గరికెళ్ళేవాన్ని. అత్త ఉన్న మంచంకు తన ముడ్డి దగ్గర నులకను జరిపి బొక్క పెట్టారు. దాని కింద సగం కోసిన బకిట. అందులోనే అత్త మలమూత్రాలు. ముడ్డిని తుడుచుకునేందుకు ఆ మంచం పైనే చిరిగిన కొన్ని బట్ట పిలికలు. తుడుచుకున్నాకా వాటిని అదే బకిటలోకి వేస్తుంటుంది అత్త. ఆ మధ్యాహ్నం ఆ బకిటలోనివి బయట పారబోయమన్నప్పుడు, నేను దాన్ని ముట్టుకోగానే ముక్కులో వాసన రోత. దానివైపు చూడకుండా కుర్చీ కింద నుండి దాన్ని తీసి బయటకెళ్ళి ఆ గుడిసెకి అటువైపున్న పడిపోయిన ఇంటి స్థలం మన్నుపై పోసాను. అమ్మవాళ్ళు కూడా అక్కడే పోస్తుంటారు. కొద్దిగా సర్ఫ్ నీళ్ళు పోసి నురగ వొచ్చేంతవరకుండి నీళ్ళను అటువైపు పారేశాను.

నే చేసిన పనికి అత్త భయపడింది. ఇలా కడిగినట్లు అమ్మకు తెలిస్తే తనతో పని చేయించుకుంటున్న తనని అమ్మ తిడుతుందని చెప్పింది నాతో. నేనెవ్వరికి చెప్పనన్నాను.

అన్నం తింటావా అని అడిగితే కొద్దిగా పెట్టమంది. పగలు తనకు ఇన్నాళ్ళు అన్నం లేదంట. ఇంట్లో ఇష్టమొచ్చిన వంటలు వొండుకొని సంతృప్తిగా తినే తను ఇప్పుడెలా ఉండగలుగుతుందో? కొద్దిగా అన్నం పెట్టుకొచ్చి తన ముందుంచాను. తిన్నాక తెలను కడిగేసి మళ్ళీ వస్తానని బయటకొచ్చేసాను. ఆ గుడిసెలో ఎంత సేపు ఉండగలను? ముఖ్యంగా ఆ వాసన, తిరిగి తనతో నేనేం చెప్పగలనని లోపల, ఇంకోవైపు బయట తిరుగదామనే ఆశ.

బయట మా ఇంటి ముందు కూర్చోబెట్టమని అత్త అడుగుతుండేది. అక్కడి నుండైతే బజారు కనిపిస్తుంది. బయటి మనుషులు, బయటి గాలి. కుర్చీని మా ఇంటి ముందు నీడ పడేచోటున ఉంచేవాన్ని. అత్తని నిలబెట్టి ఒక చేతిని భుజాల మీదేసుకొని అక్కడి నుండి బయటకు తీసుకొచ్చేందుకు తిప్పలు. ఆ గుడిసె ద్వారం చిన్నగుండటం వలన దాన్నుండి బయటకు రావడం కష్టం. ఒక కాలి పాదంతో అడుగేస్తుంది, మరో పాదం ఈడ్చుకుంటూ. మొత్తం శరీర బరువు నా భుజంపైనే పడ్డట్లు. ఇంకెవరినైన సాయం పిలవొచ్చు, కానీ ఆ మధ్యాహ్నం ఎవరు కనిపిస్తారు? కనిపించినా ఎవరికి ఓపిక? ఇన్నాళ్ళు అత్త శరీరాన్ని తాకుతూ కామ తృప్తి పడ్డ నాకు, అప్పుడు ఆ తాకిడి రోత. అత్తని బయట కుర్చీలో పెట్టేంతవరకు శ్వాస బరువుగా, పెట్టాక తిరిగి తన్నెప్పుడు లోపల గుడిసెలో పెట్టగలనని ఆలోచన.

పొద్దున నేను అత్త గుడిసె దగ్గర ఉన్నట్లు తెలిస్తే అమ్మ వెంటనే ఇంట్లోకి రమ్మన్నట్లు పిలిచేది. అక్కడే ఉంటే ఆమె రోగం నాకు తగులుతుందని మేం చేసేదే చాలని అమ్మ ఉద్బోధన. రోగం తగలడానికి తనదేమైన అంటువ్యాధా. అమ్మ అంతా మా పెద్దత్తకి వినబడేట్లే తిడుతుంది. తనే కాదు, మా పెద్దమ్మ కూడా అంతే.

మా పెద్దత్తకి ఉన్న ఇద్దరు చెల్లెల్లో ఒకామె కూతురు తన భర్తతో కలిసి చూడ్డాని కొచ్చింది ఆరోజు. మధ్యాహ్నం ఇంటి దగ్గర మోహన్ తో కలిసి నేను తప్ప ఇంకెవరు లేరు. తన పేరు బుడ్డక్క. రావడం, నా సాయంతో, మొగుడి సాయంతో అత్తని బయట కూర్చోపెట్టడం, ఇంటిని, ఆమె బట్టల్ని కడగడం చేసింది. స్నానం చేయించింది. లోపలి గుడిసె వాసన పోయేందుకు దాన్ని అలానే తెరచి ఉంచింది. మా అమ్మవాళ్ళు చేయని పని. సాయంత్రమే అత్తని లోపల పెట్టాకా బుడ్డక్క మొగుడితో కలిసి వెళ్ళిపోయింది. మీ అమ్మవాళ్ళు ఇలా చేస్తే ఎంత బాగుంటుందని అత్త అంది.

"ఎప్పుడోసారి వొచ్చేటోళ్ళకి నువ్వేట్ల భారం అయితావ్. వొళ్ళు సేస్తే ఇయ్యాలోటే. మల అమ్మోళ్ళు దిన్నం సెయ్యాలంటే యాసిరిక రాదా! ఇప్పుడు సేసినట్లే బుడ్డక్కని రోజు సెయ్యమను. తెలుస్తాది. " అనేసాను.

"మీ ఎమ్మోళ్ళేం నాకేం ఊరికే సేసిపెడుతుండ్రా పని. నా భాగం సేను గుత్త తీసుకుండ్లేరా"

" సెండ్లు ఉన్నాయంటే సరిపోతదా. పని సెయ్యల్ల గదా. అమ్మోళ్ళు ఇప్పుడు నీ సేను నువ్వే తీసుకో, నీ సాకిరి సెయ్యమంటే. "

"ఏంటికి సేయ్యరు. అప్పుడు ఊళ్ళోన పెద్ద మంచులు మీ యంమొల్లని తిట్టరా?"

" వొళ్ళు ఏమంటరు? బా సూసుకోమని సెప్తరు అంతే గానీ నీకి సాకిరి సేసేది సూస్తారా. మాటలు ఎవరన్నా అంటరు గానీ సేసేటోళ్ళకి తెలుస్తది. "

అత్త ఏమంటుందోనని సందేహం. నా వైపు గుడిసె నుండి బయటకు చూస్తూ ఏదో ఆలోచనలో. ప్రపంచంపై ఆశ కోల్పోతుందా? ఏమైనా బరువైన మాటలు మాట్లాడనా నేను? కానీ ఇలా చెప్పడం తనకు మంచిదే.

"సూడత్త. నువ్వు పొద్దన ఓటే గట్టిగ అరుసుకుంట ఉండొద్దు. అమ్మోళ్ళు సేసేది సేస్తారు. నువ్వు అరిసేది సూసి అయి కూడా సేసేది మానేస్తే ఎట్లా. "

"నాను అట్ల అరుస్తున్నందుకే ఆ మాత్రమన్నా సేస్తుంద్రూ. ల్యాకుంటే ఇంక్యాడ సూస్తరు"

అత్త చెప్పింది నిజమే. అలా గట్టిగా కేకలేసినందుకైనా అమ్మవాళ్ళు తనకు చేసే పనులు కొన్నైనా చేస్తున్నారు. అలా అరవడం రాకుంటే అవైనా చేసేవాళ్ళ. సందేహమే?

బుడ్డక్క కడిగాక ఇల్లు వాసనేమి లేకుండా ఎంత బాగో. ఇలా నేను కూడా కనీసం రెండు రోజులకొకసారైనా కడిగితే, గుడిసెలో కంపు ఎంత పోతుంది. కానీ అమ్మవాళ్ళకు తెలిస్తే. తప్పించుకునేందుకే ఈ అమ్మవాళ్ళ సాకా?

మరుసటి రోజు మధ్యాహ్నం అత్తని బయట కష్టమ్మీద కూర్చోబెట్టి నేనే గుడిసెని ఊడ్చి సర్ఫ్ నీళ్ళతో కడిగేసాను. మంచాన్ని కొద్దీ సేపు బయటించాను. అలా చేయవద్దని, అవి ఆడవాళ్ళ పనులని అత్త అరుపు. ఏవి ఎవరి పనులో ఇప్పుడు అవసరం లేదు. ఆ వాసన పోవడం తనకోసం కాదు, అప్పుడప్పుడు నేను వొచ్చినప్పుడు నా కోసం కూడా.

మలమూత్ర బకీటని కడగడం,

ఇల్లు శుభ్రం చేయడం,

నే చేసే పని ఊర్లో ఎవరికి తెలినివ్వలేదు. మధ్యాహ్నం ఎవ్వరు చూస్తారు? అత్త ఇల్లు కూడా బజారుకు కనబడదు. నే చేసే పని తెలిస్తే ఈ కాస్త కూడా తనకి చేయలేను. విషయం అమ్మవాళ్ళకు తెలిస్తే అదెంతవరకు తీసుకెళ్తుంది? వాళ్ళు చేసేది వాళ్ళు చేస్తున్నారు. వాళ్ళలో వాళ్ళపైనే తక్కువయినట్లు ఆలోచన కలిగించడం మనిషితనాన్ని అవమానించడం. అత్తకి సేవ చేయడానికి పాపం వాళ్ళకెందుకు పట్టాలి?

చిరాకు, ఓపిక ఇవి ఎంతదాక పని చేస్తాయి? ఎన్నాళ్ళిలా? తనకు కాళ్ళు రావడం మీద నాకు సందేహమే. ఇల్లు కడగడం, మలమూత్రాలు తీయడం, అన్నం పెట్టడం, పొద్దున కొద్దిసేపు సాయంత్రం కొద్ది సేపు తన దగ్గర ఉండటం, అప్పుడప్పుడు బయట కూర్చోబెట్టడం, ఇక పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోవడం. ఇవి మాత్రమే నా పనులు అనుకుంటే చిరాకు లేకుండా చేయవొచ్చు, కానీ నే గుడిసె నుండి బయటకెళ్ళిన కొద్దిసేపటికి అత్త గట్టిగా నా పేరుతో కేకలేస్తుంది. వెళ్ళి పడుకోమని చెప్పి వొచ్చానా మళ్ళీ అదే తంతు. మా అమ్మవాళ్ళు ఉంటే ఇలా చేయదు. ఇది నాకు చిరాకు తెప్పించడం చేసేది. నేనే వస్తానని అరవొద్దని చెప్పేవాణ్ణి. అయినా అత్త మొండిపట్టు తాను విడవదు దాంతో నేను వెళ్ళిన ప్రతిసారీ నేను కూడా తిట్టేవాన్ని. ఎంత బాధ పడుంటుందో. నేను మొన్న తనని బయటకు జాగ్రత్తగా తీసుకరాకుండా ఏదో తొందర తొందరగా తీసుకురావడం వలన తన వేలు భూమికి రాసుకొని పుండయ్యింది. వేళ్ళకి చీర బట్టతో కట్టు కట్టాను. గుడిసెలోకి చీమలు రాకుండా సుద్ద ముక్కతో గీసాను. వాసన పోయేందుకి స్ప్రే కొట్టాను. అయినా నే చేస్తున్న పనులు కూడా తన్ని తిట్టుకుంటే చేస్తున్నాను చాలావరకు. అత్త నా తిట్లకు ఏమనుకుంటుందో. మొన్న అంది, "నువ్వే తిడతావు, నువ్వే సేస్తుంటావు అన్ని. ఆడ పిల్ల లక్కన " అని. నాకు నవ్వాలనిపించింది ఎందుకో. నేను

ఎంత తిట్టినా కూడా తనకి బిడ్డలాగా అనిపిస్తున్నానంట. ఓసారైతే అందర్నీ ఇంత తిప్పలు పెట్టే బదులు చనిపోమని కూడా తిట్టాను. నేనెంత ఘౌర్భాగ్యున్ని.

దసరా అయ్యాక ఇంకో నెల వరకు ఉండాలని అత్త కోరింది. నేను ఇంకో నెలేంటి జానకి కోసం రాబోయే కార్తీకాలు అయిపోయేంతవరకు రెణ్ణెళ్ళయినా ఇక్కడ ఉంటాను. మరి ఆ తరవాత! అత్తని ఎవరు చూసుకుంటారు?

జానకి, నాకు ఉన్న ఒకే ఒక్క ఊరట. వొచ్చిన నాటి నుండి తనకోసం ఆత్రపడుతున్నాను. మా దొడ్లో నుండి వాళ్ళ గుడిసె వైపు చూస్తాను, లీలగా కనిపిస్తుంది. ఈ మధ్య బజారులోకి రావడం కూడా తగ్గించినట్లుంది. నిన్న సాయంత్రం మా దొడ్లో ఎద్దుల్ని కట్టేస్తూ గుడిసె వైపు చూద్దునా! నాకు ఎదురుగా కట్టెల్ని విరుస్తూ జానకి. నన్నే చూస్తున్నట్లు అనిపిస్తుంది. అలానే నేను చూస్తూ. నా ఆత్మ తన ఆత్మలో కలిసిపోయినట్లు నేను తాను వేరుగా లేనట్లు తద్యాద్మికరణ కలిగింది.

నేనేదైన అత్తని తిడితే నా కంటి ముందే జానకి ప్రత్యేక్షమయ్యేది. అత్త స్థితి అర్థం చేసుకోవాలని, నిదానంగా ఆలోచించి మాటలు అనాలని అంటుండేది. తిరిగి అత్త దగ్గరకు పోయి కొద్దిసేపు కూర్చొని వొస్తుండేవాన్ని. అత్త నా వీపు నిమురుతూ జ్ఞాపకాలని చెప్తుండేది. నేను వినడం, తిక్క తిక్క ప్రశ్నలడగడం చేసేవాన్నీ. తను నవ్వేది, నే వెళ్తే తిరిగి కోప్పడేది.

రాత్రి పూట ఆకాశంలో ఊరికే చూస్తుంటాను. అనేక నక్షత్రాలు. అక్కా, ఎంత ఓపిక తనకి. వికలాంగులైన ముగ్గురి పిల్లలకి చాకిరి చెయ్యడం. పెళ్ళైయిన ఆ నాటి నుండి తను కంటూనే ఉంది. అంతా ఆడపిల్లలు అందునా రోగగ్రస్థులు. మేనరికం చేసుకుంటే ఇట్లవుతుందని చెప్పేదెవ్వరు తనకి. సునీతకి ఇంతే. వారసుడు కావాలని తన శరీరాన్ని తూట్లు పొడవడం. రెండు సార్లు కడుపు తీయించారు. తనది శరీరం కాదు, యంత్రం. అందులో నుండి మగపిల్లలే రావాలంటా. ఆడపిల్ల బతుకు ఇంత భారంగా అవుతుంటే ఇంకెవరిని అనగలం. ఏవేవో ఊహించుకొని చిన్నపిల్లలకే తాళి కట్టిస్తారు. అరె నేనింకా నిక్కరేసుకునేప్పుడు నాతోటి వాళ్ళకు పెళ్ళై పోయిందే. వీరేషక్క, చిన్నప్రాయంకి పెళ్ళై, గర్భంలో గడ్డలొచ్చి చావడం. భయం, ఎక్కువ దినాలు ఇంటి దగ్గరుంటే ఎక్కడ తను తప్పు చేస్తుందో, ఎక్కడ జనాలు తమల్ని అనుమానిస్తారనే తల్లితండ్రుల భయం. కేవలం పరువు కోసమే బతుకుతూ పరువు కోసమే ప్రేమల్ని కురిపిస్తున్నారు. ఎవర్నో ప్రేమించి కడుపు తెచ్చుకుందని చావమని తండ్రి కేకలేస్తే రేష్మ మందు తాగడం. కరుణ, ఇదెక్కడికి పోతుందో? నాటకీయ బతుకులు, నిస్సహాయ జీవనాలు. శ్రీలత, తన్ని మాటలతో ఎంత ఏమరుస్తుంది అమ్మ. మొగుడు తాగొచ్చి మాటికి కొడుతున్నాడని ఏడుస్తూ ఇంటికొస్తే స్త్రీకి సహనం ఆభరణమని, ఓర్చుకోవాలని చెప్పి పంపిందంట. నేనుగానా అయితే ఎవరో ఒకర్ని చూసుకొని ఈ పాటికే లేచిపోయేదాన్ని. లేచిపోవడమా? అదేమైన విముక్తా? శీనక్కని చూస్తున్నానుగా. తను మొగున్నుండి అప్పటికే పెళ్ళై పిల్లలున్న మా ఊరి ఆయనతో లేచొస్తే తనకి దక్కిందేంటి? ఇక్కడ ఆయన కొట్టడం, కూలి డబ్బులు లాక్కొని తాగడం. తనిప్పుడు ఎక్కడికి వెళ్ళలేదు. మా అమ్మ అప్పిస్తే గుడిసేసుకుంది కానీ, ఆ అప్పెప్పుడు తీరుతుందో, ఆ డబ్బులు ఆ మగాడు ఉండనిస్తాడో? లేదో? తిరగబడదామంటే జనాలంత మగాడికే ఆసరా. పెళ్ళి, ఇదే అన్నింటికీ మూల సమస్య. పెళ్ళి కానివాళ్ళు సంతోషంగా ఉంటారా? ఎర్రక్క, మొఖం మొత్తం నల్ల చారలున్న తననెవ్వరు పెళ్ళి చేసుకోలేదే. ఆరోగ్యంగా ఉన్న తనకి ఇప్పుడు దెయ్యాలు పడుతున్నాయని అంటున్నారు ఊర్లోవాళ్ళు. అది కామరాహిత్య జబ్బు. తనకి కామం ఎవరు తీరుస్తారు? కామం

కావాలంటే పెళ్ళి కావాలి, లేకుంటే సంస్కారం వదిలెయ్యాలి. జనం వాళ్ళలో వాళ్ళే సమంజసం కాని నీతులు వల్లించుకొని అవి సాధ్యం చేసుకోలేక అసలైన నీతుల్ని తొక్కేసి తమకు తామే పిచ్చోళ్ళయిపోతున్నారు. ఏ ఆశ ఉంది అసహాయులకి? ఏడవండి. దిక్కులు పిక్కటిల్లేల ఏడ్వండి. మీకోసం ఏ క్రీస్తు రాడు, ఏ మార్క్స్ పుట్టడు. మీ బాధలకు మీరే ఏడ్వండి. తప్పించుకు పోలేని ఈ వలయాన్ని చూస్తూ బిగ్గరగా కేకలెయ్యండి.

ఇంకో లోకంలో నన్ను పగలంత తిప్పలు పెట్టే మా మోహన్ గాడు. నా నెత్తిపై పిడి గుద్దులు గుద్ది పారిపోయే రూప, మల్లిక. నేను స్నానం చేస్తుంటే నా బట్టలు ఎత్తుకెళ్ళే శేఖర్ గాడు, గీతక్క. రేవతి పాడుతున్న పాట. అన్నింటిని సంపూర్ణం చేస్తున్న జానకి చూపు, ఆ నవ్వు, ముక్కుకున్న పుడక. నా ఆత్మ. ఎన్ని ఆటుపోట్లు రానీ, నేను కాపాడుకోవాల్సిన విలువైన వజ్రం.

కొంగ మళ్ళీ వొచ్చి నీటిపై వాలింది. చెట్ల నుండి చెట్లకు ఎగురుతూ గువ్వలు. సాయంత్రానికి రంగులు అద్దుతున్న సూర్యుడు. నా మస్తిష్క అలజడి మొత్తం నీళ్ళలో పడి కొట్టుకపోతూ. ఓ ప్రేమ గాలి నా చెంపలకి తాకింది. అచేతనంగా నా కంటి నుండి నీళ్ళు రావడంతో ఈ విషయం నే తెలుసుకోగలిగాను.

# 3

తలకు రిబ్బేన. కొత్త గౌను. అటు ఇటు చేతులకు గోట్లు. చిన్నాన్న వేలిని పట్టుకొని పొలాల దారిలో నడుస్తూ ఉంది ఐదేళ్ళ పాప. చిన్నాన్న వయసు యాభై పైనే ఉంటాయి. అతని తలకు వెంట్రుకలు లేవు. వేసుకున్న తెల్ల ధోవతి, అంగీ కొత్తవి. ఇద్దరి కాళ్ళకు చెప్పులు లేవు. ఎండ మెతక శరీరాలపై తన కోపాన్ని చూపిస్తూ. చిన్నాన్న తన భుజం మీది తువ్వాలని ఆ పాప తలపై కప్పాడు. ఇద్దరు వెళ్తుంది వాళ్ళ బంధువుల ఊర్లో జరిగే ఉరుసుకి. ఆ పాపకు కొత్త బొమ్మలు కొనాలని, చేతులకు గోరింటాకు వేసుకోవాలని, చుట్టాల పిల్లల్తో ఎగరాలని ఆశ.

మిరప పొలంలో అమ్మ వెంట కలుపు తీస్తున్న ఓ పదిహేనేళ్ళ పడుచు. వాళ్ళ చేతుల్లోని కొడవళ్ళ శబ్దం, వారిద్దరి నిశ్శబ్దం. బిడ్డ సముర్తయి ఏడు గడిచింది? భర్త బతికే ఉండుంటే తన్ని ఇంతదాకా ఉంచుకునేటోడా? కొడుకులు చూస్తే ఇంకా చిన్న పిల్లలే. ఇంత ఆస్తిని నేనొక్కదాన్ని ఎలా చూసుకుంటాను? రాబోయే అల్లుడే ఇల్లరికం, కానీ ఎవరొస్తారు? ఆ గోర్లోళ్ళ సంబంధం కలుపుకుంటే, పిల్లాడు కూడా బాగుంటాడు. అమ్మ తలను మాటికి గోక్కుంటు.

రాబోయే తన మొగుడు ఎట్లుంటాడు? ఎట్లాంటివాడో? కొడతాడో లేక మంచోడో. మొగోళ్ళు మంచోళ్ళు ఎవరుంటారు? ఏ ఊరి కెళ్తానో. మా చుట్టాల మామ ఎంత బాగుంటాడో. జడని గుంజుకుంటు నవ్విస్తాడు. మామని చేసుకుంటానని అమ్మకు చెబితే, అమ్మో అలా ఆడాళ్ళు అడగొచ్చా! ఎంత కసరితనం! పదిహేనేళ్ళ పడుచు తన చేతిలో కొడవలితో మాట్లాడుతూ.

చేతిలో రోగంతో ఉన్న పాప. కొడుకు ఎద్దుల్ని కట్టెయ్యడానికి దొడ్డి వైపెళ్తున్నాడు. భర్త పోయి అప్పటికి రెండేళ్ళవతుంది. ఇద్దరు చెల్లెల్లకు పెళ్ళిళ్ళయి వెళ్ళి పోయారు. ఉన్న ఇద్దరు తమ్ముళ్ళు వేరు కాపురాలు పెట్టేసుకున్నారు. తమ్ముళ్ళ పెళ్ళాలకు ఏ పని చేతకాదు, కలిసి ఉన్నప్పుడు తను ఎంత

తిట్టేదో వాళ్ళని. ఇప్పుడు తాను, అమ్మ, ఆ పిల్లలు అంతే ఆ గుడిసెలో. తనకున్న ఆశ, భరోసా తన కొడుకు. ఊర్లో అందరికి మొనగాడు. ఏ పనికి తగ్గడు. పిల్లనివ్వడానికి ఎంతమంది ముందుంటారో.

గుడిసె చివర్లో దగ్గుతున్న దీపం. మాటికి జ్వరమంటున్న అమ్మ. మెతకబారుతున్న తన శరీరం. ఎవరికోసం బతకాలో, దేనికోసం కష్టపడాలో అర్థం కాదు. అన్ని ఆధారాలను తెంపాలన్నంత పగ ఏమిటి తనపై దేవుడికి? పిచ్చి! ఆ దేవుడికి పిచ్చి! లోకం పిచ్చి! మనుషులపై కసి! సంతోషంగా ఉండే వాళ్ళపై కసి! జీవితంపై కసి! జీవితాలపై కసి!

అస్తవస్త్యంగా అత్త చెబుతున్న జ్ఞాపకాలు. ఒకవేళ ఆనాడు అత్త పెళ్ళి వేరేటాళ్ళతో అయ్యుంటే, ఒకవేళ అత్త కొడుకు పాపన్న ఆ దీపాలి పండగప్పుడు బడి దగ్గర కాల్చే దీపాల దగ్గర కాక ఆ సమయంలో పొలంలోనో ఇంకెక్కడో ఉండుంటే, విభిన్న ప్రపంచం. ఈ పాటికె చచ్చిన పాపన్నకి పెళ్ళై కొడుకో కూతురో. కూతురైతే నా కంటే చిన్నదైతే, తను ఎలా ఉండేదో. అందమో, వికారమో. అత్తకి మా అమ్మవాళ్ళతో రోజూ పేచీ పెట్టుకునే తీరిక ఉండేది కాదు. తను, అదే పాపన్న కూతురు మా ఇంట్లోకి వొచ్చేది, నాతో ఆడుకునేది, బడికొచ్చేది. నేను ఉండే వాణ్ణేనా అప్పుడు. ఒకవేళా బావిలో పడ్డ ఆ ఐదేళ్ళప్పుడే నేను చచ్చుంటే. అమ్మనే నాన్న పెళ్ళి చేసుకోకుండా వేరేవాళ్ళని చేసుకొంటే. ఉన్న ఇద్దరే చాలనుకొని అమ్మవాళ్ళు అనుకొంటే? ఆ యాక్సిడెంట్ రోజు బస్సు నా ముందు ఆగకపోయుంటే, నేను లేను. ఈలోకం లేదు. యాదృచ్ఛికం. నే బతకడం అన్ని సమయాలు కలిసిన యాదృచ్ఛికం. అత్త ఆ రోగాల మామని చేసుకోవడం యాదృచ్ఛికం. అత్త కూతురుకి అలాంటి రోగమే రావడం యాద్రుచ్ఛికం. పాపన్న ఆ దీపాలప్పుడు బడి దగ్గరే ఉండటం యాద్రుచ్ఛికం. మా అమ్మను నాన్న పెళ్ళి చేసుకోవడం ఆ తరవాత నే పుట్టడం యాదృచ్ఛికం. నే బతకడం, ఇంతవరకు చావు రాకపోవడం యాదృచ్ఛికం. నే చదవడం, నే ఒంటరి కావడం యాదృచ్ఛికం. ఆనాడు నేను జానకిని చూడ్డం, తనకై పరుగులు పెట్టడం యాదృచ్ఛికం. పిల్ల, మనవరాళ్ళతో సంతోషంగా గడిపే పెద్దత్తకి ఇక పక్షవాతం రావడం కల్ల. కానీ రావడం యాద్రుచ్ఛికం. జీవితానికి అర్థం లేదు. నా ఊహలకు అర్థం లేవు. ఎంజాయ్ చెయ్, ఉన్న ఈ క్షణాన్ని. బోడి ఆత్మ. దాన్ని వొదిలేయ్. ఇష్టమున్న ఆడాళ్ళని దైర్యంగా ఆడిగేసి బూతు చేసేయ్. జానకికి నిజం చెప్పెయ్. అర్థం లేదు. తరవాత తన్ని వదిలేసినా, ఆపై తను బాధ పడ్డ ఆ బాధ యాదృచ్ఛికం. దేనికి అర్థమే లేదు. మాయ...!

"పెళ్ళెప్పుడు సేసుకుంటావ్?"

పల్లెల్లో అందరికి ఎప్పుడు పెళ్ళిళ్ళ గోలే. పుట్టేది, పెరిగేది, చేసేది అన్ని పెళ్ళి కోసమే. మొగుడి ఇంటి కాడ తిప్పలు పడకుండా ఉండేందుకు చిన్ననాటి నుండి ఆడపిల్లలు బడొదిలేసి పనికెళ్ళడం, పద్దతిగా ఉండటం, మౌనం నేర్చుకోవడం. ఇక మగవాళ్ళు గొప్పలకు పోవడం. గొప్పతనాన్ని పెంచుకునేందుకు తిప్పలు పడ్డం.

"పెండ్లి! పెండ్లి ఇప్పుడే గాదత్త. పనొచ్చినంక సేసుకుంటా. "

"ఇంకెప్పుడొస్తాది పని. మూసిలోనివి అయితావ్, అంచాకి పిల్లల్ని ఎవరియ్యరు సుడి"

"ఏమో ల్యా. "

"ఏమో గాదు. మీకేం సెండ్లు ల్యావా. పెండ్లి సేసుకొని సేండ్లు సేసుకో. నానింక బతకను. సచ్చిపోయ్యే లోగా నీ పెండ్లన్న సుస్తా, నువ్వే ఇంగ నా కొడుకివి. "

"ఏంటికి సచ్చిపోతావ్, ఇంత గట్టిగేవే. నీకంటే ముందు గాలానే మేమే సచ్చిపోతమేమో. "

అత్త నవ్వింది. తనకు యాదృచ్ఛికం అనేది తెలిదేమో. చెప్పలేం నేను రేపే చావొచ్చు.

పెళ్ళి నాకు కాకపోయినా జానకికి అయ్యే తీరుతుంది. ఏవర్తో అవుతుంది? తనకెలాంటి వాడిష్టం. మొన్న జాఫర్ గాడు చెబితే విన్నాను. జానకి వాళ్ళక్క ఉమ్మక్కకి మరిది జానకిని ఇష్టపడ్డాడంట. కట్నం లేకుండ చేసుకుంటానని అన్నాడంట. ఆయన కరెంట్ పని చేస్తాడంట, పెళ్ళాన్ని బయటకు పోకుండా కూసోబెట్టి చూసుకుంటానని చెప్పాడంట. అయినా జానకి ఒప్పుకోలేదంట. ఇలానే తను పనికెళ్తూ ఎవరితోనైనా బతుకుతానుగాని వాణ్ణి మాత్రం వొద్దంట. భర్త పోరు పెడితే ఉమక్క కూడా చెల్లిని ఒప్పించేందుకు తిప్పలు. జానకి వాణ్ణి సస్సేమిరా అనడం. ఎందుకు అలా అందో. బాగా చూసుకుంటానని అన్నప్పుడు తనకెందుకు ఇష్టం లేకపోయెనో? మొగుడితో అక్క బాధ పడ్డం చూసి ఆ ఇంటిపై అనుమానమా? అయినా ధైర్యం, తన నిర్ణయాన్ని నిక్కచ్చిగా చెప్పిన ధైర్యం. కట్నం పోయినా పర్లేదూ ఆ ఇంటికి వొద్దని వాళ్ళమ్మ కూడా అనుకుందేమో!

ఏ పనైనా చేసుకుంటూ, ఎవర్నైనా చేసుకుంటా అని తను అనడమంటే అమ్మవాళ్ళు వాణ్ణి గాకుండా ఆ తరవాత ఎవర్ని చూపించినా చేసుకుంటానని అర్థమా? అదే అర్థమే. ఆ కర్నూలు వాణ్ణి చేసుకోకపోవడం ధైర్యమైతే మరి ఇది. అందరూ వేస్తున్న బురదలోకి ఏ మాత్రం ఆలోచన చేయకుండా కాలు పెడతాననడం, అదీ అందరూ అడపిల్లల్లాగే. చదువుకున్నవాడు, మనిషితనాన్ని అర్థం చేసుకోగలిగేవాడు, ఆలోచించేవాడు తన భర్తయితే మేలు. అదీ నేనేందుకు కాకూడదు?

దసరా ఉత్సవం రోజు, సాయంత్రం అందరూ తెచ్చుకున్న జమ్మి ఆకులతో ఊర్లోని పెద్దవాళ్ళకు మొక్కుతుంటారు. నేను నా జేబు నిండా జమ్మి ఆకు నింపుకున్నాను. ఏ వీధిలో ఎవరెవర్ని మొక్కాలో అనుకుంటూ కుర్రాళ్ళు అక్కడక్కడ మంతనాలు సాగిస్తున్నారు. గుడి దగ్గర మొత్తం నిండిపోయి జనాలు. జానకి, రేణుకతో కలిసి నా ముందే కొట్టాల వీధి వైపుకి వెళ్తుండటం చూసాను, అంతే నేను వాళ్ళ వెనకాలే. నే వేసుకున్న కొత్త అంగీ ఆకుపచ్చది, జానకి వేసుకున్న పంజాబీ డ్రెస్ కూడా అదే రంగే. వెనకనుండి చూస్తుంటే పక్కనున్న రేణుక మరింత ఆకర్షణీయమైన కొలతల్తో. ఊర్లోని ఆడవాల్లు, మొగపిల్లలు తమ కిష్టమైన వారిండ్ల వైపు పోతూ అటుఇటు. ఇద్దరు ఎందుకో వెనక్కి తిరిగారు. అంతవరకూ వాళ్ళవైపు చూస్తున్న నా తల నాకేం సంబంధం లేనట్లు పక్కకు. వెళ్తున్నారు, నేనూ వెళ్తున్నాను గుడ్డిగా, మొండి ధైర్యంతో. ఇంకోచోట భాస్కర్, మల్లేష్, జాఫర్ ముగ్గురు ఎదురొచ్చి నన్ను ఆపారు. తాము సినిమాకి వెళ్తున్నామని నన్ను రమ్మన్నట్లు అడిగారు. వీళ్ళ గోల. నేను రానని చెప్పి ముందుకు కదులుతుంటే ఎందుకు రావని మళ్ళీ ప్రశ్న. వాళ్ళు వెళ్ళిపోతున్నారు. ఈ ముగ్గురికి తోడుగా ఇంకో ముగ్గురు వెనకనుండి కలిశారు.

"లేదు, నాకడ డబ్బుల్లేవ్. మీరే ఫొండి. "

ముందుకు అడుగుస్తుంటే, మళ్ళీ వెనక్కి లాగారు.

"నువ్వొస్తానంటేనే జాఫరు గాడు, మల్లేష్ ఇద్దరొస్తారంట. రాలే. "

"నాను రాలేను. ఒల్లకి ఇష్టమైతే ఫోమను. "

జానకి, రేణుక కంటికి కనబడడం లేదు.

"ఏంటికి రావు. "

మళ్ళీ అదే ప్రశ్న.

నాకు ఇదంత చిరాకు. ముందున్న ఆరుగురు ఆస్తి పంజరాలు నావైపు హేళనగా చూస్తూ. అన్ని ఎముకలు విడగొట్టి, ఒక్కోదాన్ని ఒక్కోవైపు విసిరి పారిపోవలన్నంత కోపం.

"డబ్బుల్లేవని సెప్తి గద. ఇంటి కాడ ఇయ్యరు నాకి"

"ల్యాకుంటేమిలే. నాను ఇస్తా ర్యాలే, మల్ల ఎప్పుడన్న ఇద్దువులే నాకి. "

"అంచాకి సెప్తా. నాకి పనేదే, నానోస్తా. "

తప్పించుకొని ముందుకడిగేసాను. ఆ అస్థిపంజరలు వెనక ఏమేమో అంటున్నారు. ఏవీ నాకు వినబడ్డం లేదు.

ఎక్కడికెళ్ళారు? ఏ ఇంట్లోకి పోయింటారు? వెతుకులాట, ముందుకు వెనక్కి, పక్కకు, లోపలకు!

ఒకచోట కిరాణం ముందున్న అంగడి దగ్గర ఇద్దరు. అక్కడే అంగడి ముందు కూర్చొని నలుగురు పెద్దవాళ్ళు. జానకి అక్కడ ఎవరికి మొక్కిందో, అక్కడే నిలబడి వాళ్ళకేవో మాటలు చెప్తున్నారు ఇద్దరు. నేనిప్పుడు ఎవరినైనా మొక్కే మిష మీద అక్కడకి ఒంటరిగా వెళ్ళడం. వెల్దామా, చూసేవాళ్ళు ఏమైనా అనుకుంటారా? వెళ్ళాలి, జానకి నన్ను గమనించాలి.

"ఏలే, నానేం ముసులోన్నా, నన్ని మొక్కనీకే వొచ్చేవే. "

అక్కడున్న నలుగురు పెద్ద మంచులో ఊరికే గుండుపై కూర్చున్న పుద్దికి జమ్మి చేతిలో పెడుతుంటే అనేశాడు. అక్కడున్నవారంత మా వైపు. వాళ్ళతో పాటుగా జానకి, రేణుకలు.

"ఏం ల్యా, బట్ట నెత్తి వొచ్చినోళ్ళకళ్ళ మొక్కలని వొచ్చిన. "

"లే ముసులోడా, మా కన్నా నువ్వే అద్దలు పెట్టుకున్న మూసిలోనివి. నీకే మొక్కాల్ల మాం"

అటువైపు నుండి మరో ఆయన. తనైతే ముసలోడనే పేరుకి అర్హుడు.

" సల్లగుండు మనవడా! జెమ్మకు తెచ్చుకోవేనా మొక్కనీకే. "

నవ్వులు. అందరిలో కలిసి తన నవ్వు. అందరూ తానై. ఇద్దరూ నవ్వుకుంటూ ముందుకు కదిలారు. నాకు అక్కడ పనిలేదిక, వెంటనే అక్కన్నుండి కదలడం అంత మంచి కూడా కాదు.

ఆ పెద్ద మంచులని వదిలించుకుని ముందుకొస్తే, మళ్ళీ మాయం. ఎక్కడ? ఏ మూలకెళ్ళారు? ఏ దారి లో, ఏ ఇంటి వైపు? ఇంత సమయంకు ఎంత దూరం పోగలరు. కమాన్! మిస్టర్ ఒడిసియస్!

ఎంతకు కనిపించడం లేదు. నిరాశగా వెళ్తుంటే మళ్ళీ భాస్కర్, మల్లేష్ సినిమాకు వెల్దామని ఎదురొచ్చారు. రానని చెప్తే మళ్ళీ మొదట్లో పడిన తంటాలే. ఊర్లో వాళ్ళతో ఈ పండగ పూట రాత్రి సినిమాకు వెళ్ళడం సరదా. కానీ, ఇంట్లో తిట్లు. సినిమాకు పోయే వాళ్ళంత రాజన్న ఇంటి దగ్గర ఆన్లైన్లో టికెట్లు బుక్ చేస్తున్నారంట. ఆటో కూడా మాట్లాడేసారంట. టైం చూస్తే ఆరున్నర. సినిమా తొమ్మిదికైతే ఆటో ఎనిమిది లోపు కదులుతుంది. ఏదోటి చెప్పెయ్యమన్నారు వాళ్ళు, వాళ్ళు నానుండి ఏదోటి వినేందుకు సిద్ధంగా లేరు. కేవలం సినిమాకు వస్తాననే చెప్పాలి. ఆ మల్లేష్ గాడు నేను లేకుంటే సినిమాకి రానని, ఎలాగైనా సినిమాకి వెల్దామని జాలిగా మొహం. సరే అనక తప్పదు.

మా ముందు కొద్ది దూరంలో చీకట్లో మసకగా, రోడ్డుకున్న విద్యుద్దీపాల వెలుగులో కాస్త తేటగా పంజాబీ డ్రెస్ లో ఇద్దరు. వాళ్ళే! ఇంకా ఈ వీధుల్లోనే ఉన్నారు.

"సెప్పులే బేరింత. టికెట్లు అయిపోతాయి. "

"ఆగండ్లే, మళ్ళొస్తా. మళ్ళొచ్చి సెప్తా. "

ముందుకు త్వర త్వరగా. నాపై ఆశ పోవడం ఖాయం.

జానకి, రేణుకలవైపు వెళ్తున్న నా వద్ద రంగస్వామి బైకు ఆపాడు. ఎక్కడికని అడిగాడు. నేనేం చెప్పలేదు, వాడే ముందుకు చూసి అర్థం చేసుకున్నాడు. నేను జానకి కోసం ఆత్రపడే విషయం వాడికి కూడా తెలుసు. ఓనాడు చీకట్లో నేనే చెప్పాను. చీకటి మోసకారిణి, ఎంత మోసం చేస్తుందది.

వాడు తన బైక్ ఎక్కమన్నాడు. తాను తీసుకెళ్తానన్నాడు. ఇదేందో బాగుంది. బైక్ మీద నుండి తన్ని వెంబడించడం, తనకంటే ముందెళ్ళి వెనక్కి తిరిగి తన మొఖాన్ని దర్శించడం.

బైక్ ఎక్కాను. మేం దగ్గరికి వస్తుండగానే దారి మలుపులో అడ్డమున్న ఇంట్ల చాటుకి ఇద్దరు మాయమయ్యారు. అక్కడ ఎవరింట్లోకి వెళ్తున్నారో. రంగస్వామి బైకుని నిదానం చేస్తూ నడుపుతున్నాడు. నేను దారి మీద నుండే ఒక్కో ఇంటి వైపు చూస్తూ. కె(రన్న తాత ఇంట్లో నవ్వులు. వారివే. తలుపు దగ్గర మెడలో వేసుకున్న చున్నీ కనిపిస్తుంది. నేను బైక్ దిగి ఇంట్లోకి అడుగు పెట్టాను. జానకి నిలబడి ఏదో చెబుతుంటే తాత, రేణుక మంచంపై కూర్చొని నవ్వుతున్నారు. కె(రన్నతో పాటుగా మాటలాపేసి నా వైపు ఇద్దరు. నేను జేబు నుండి జమ్మిని బయటకు తీసాను. రేణుక మంచం మీద నుండి లేచి జానకి పక్కకొచ్చింది.

"ఎండ్లె, ఇంతేతేవే. ఇల్లుని తగుల్తావు. "

జానకి, రేణుక ద్వారం నుండి బయటకెల్తూ. కూర్చున్న తాత కాళ్ళ దగ్గర జమ్మి పెడుతుంటే ఆపేశాడు ముసలోడు.

"నా కాలు మొక్కనీకే ముడ్లొంగుతాయా నీకి. ఒంగుకఫొయ్యేవే నువ్వే, సేతుల పెట్టు. "

తలుపు దగ్గర నవ్వుకుంటూ తూనీగలు ఎగరడం.

ఆ నవ్వు!

ఆ నవ్వుకోసమే ఎన్ని నిద్రలేని రాత్రులు గడుపుతున్నానో.

అలాంటి నవ్వుకోసమే ఎన్ని నక్షత్రాలను నిందిస్తుంటానో..

ఇంకా, ఇంకా నవ్వండి. నా కోసం! ఈ సృష్టి మొత్తం బాధలనుండి విముక్తి పొందే కోసం.

రంగస్వామి బయట నా కోసం చూస్తున్నాడు. తాతని మొక్కి బయటకు రాగానే మళ్ళీ మాయం. రంగ చూసే ఉంటాడు, బైకు ఎక్కగానే వాళ్ళిద్దరూ వెళ్ళిన వైపు తీసుకెళ్ళాడు. ఇంతకు ముందు రోడ్డు మీదే తూనీగలు వెనక్కి వెళ్తూ. ఆ రోడ్డు మీద కొద్దీ దూరం వరకు ఏ ఇండ్లు ఉండవు. తనకు ప్రేమ విషయం చెప్పేందుకు ఇదే అవకాశమని రంగ అన్నాడు. చెప్పాలా? ఏం చెప్పాలి? అబద్ధాన్ని చెప్పాలా? బైకు దగ్గరికొస్తుంది.

"నానంటే కోపం తనకి. అస్సలు సూడదు"

కావాలనే బైకు తనని దాటే ముందు అనేసాను. తను నన్ని గమనించాలని. గమనించాలని ఎందుకు కోరుకుంటున్నట్లో. తన ఆత్మలో భాగం కావాలనీ. కావడమా, ఎందుకు?

బైకు మీద నుండి వెనక్కి తిరిగాను. రేణుక నవ్వుతుంటే, జానకి తల దించుకొని.

భాస్కర్, మల్లేష్ ఇద్దరు బండికి అడ్డమొచ్చారు. వాళ్ళకు తోడుగా ఇంకో ముగ్గురు. మాకు పక్కనే జానకి వాళ్ళు వెళ్ళి పోతున్నారు. ఎక్కడికి? ఇంకెక్కడికి వాళ్ళ గుడిసెల వైపుంటుంది. వాళ్ళ వెనక ఇక వెళ్ళడం మంచిది కాదనిపించింది. అదీకాక వీళ్ళ గోలోకటి.

"సెప్పులే. ఆటో ఫోత్తుంది ఆడ, ఓటే తప్పిచ్చుకుంటావ్. ఎవరికోసమో తెలిసుల్యా"

మల్లేష్ ఏడుపు. వస్తానని నా నవ్వు.

జానకి వెంట పడటం అంత మంచిది కాదనీ, జానకి ఎంతకైనా తెగిస్తుందని మల్లేష్ అన్నాడు. ఎంతకైనా తెగిస్తుందంటే ఎంతకు. ఎంతవరకు?

నాకులానే ఈరన్న జానకి వెంట పడేవాడంట. ఓరోజు కుళాయి దగ్గర జనాల ముందు వాణ్ణి చెంప మీద కొట్టిందంట. నిజమా? పుకారా? చెంప మీద కొట్టేంత వాడు ఇంకేమైనా అనింటాడా? మరి ఇంతగా తన వెంట పడే నాకు? నా చెంప కూడా పగులుతుందా? చెంపపై చేతులుంచుకున్న నన్ను అక్కడున్న జనాలంతా చూస్తుంటారు. వీడే, ఆ పాపని ఏదో అన్నాడు. ఇలాంటోళ్ళకి ఇలానే పడాలి. ఎంత మంచిగా నటించేటోడు ఊర్లోనా, ఇంత చేశాడా! నవ్వులు, బా జరిగిందని ఓర్వలేనోళ్ళ ఎత్తిపొడుపులు, అవమానం!

# 4

మా దొడ్డిని దాటేసి గుడిసె ముందుకొచ్చాను. చుట్టూ ఎవరు కనబడడం లేదు. జానకి అమ్మ కానీ, అవ్వకానీ ఏ ఒక్కరూ లేరు, కేవలం జానకి గేదెకు మేతెస్తూ నా ముందే.

జానకీ అన్నాను.

తను వెనక్కి తిరిగింది. భయపడిందేమో, మొఖం నిస్సహాయంగా కనిపిస్తుంది, కానీ జానకి జంకదు. మొహం మీదే ఏమైనా చెయ్యగలదని నా నమ్మకం.

ఏం అంది అనుమానపు చూపుల్తో. ఆ చూపుల వైపు చూస్తూ ఎలా మాట్లాడాలి? గుండెను గుచ్చుతున్నాయి. తలను మెలి పెడుతున్నాయి. ఇంత దగ్గరగా, తనతో నే మాటలు కలపడం ఇదే నాకు మొదటిసారి. నేనేం చేస్తానని అనుకుంటుందో, అలాంటి అనుమానమే ఉంటే అదెంత సిగ్గుచేటు. పరిస్థితి దిగజారేలా మార్చకముందే గొంతులో నుండి మాటలు రావాలి. మౌనం కొత్త అర్థాలను వెతక్కముందే.

"నాను నిన్ను ప్రేమిస్తున్న జానకి. నిన్ను సూడకుండ ఉండలేకఫోతుండ. నీకిష్టమైతే గూడ సెప్పూ."

చెప్పేసాను. ఇన్నాళ్ళ నా నిరీక్షణకు తెర దించేసాను. దాంతో పాటే నా తల.

"నా కిట్లాంటివి ఇష్టముండదు. ఫో, ఈట్నుంచి. ల్యాకుంటే గట్టిగ అరుస్త సుడి. "

అరుస్తుందా!! నేనేం చేస్తానని. ఎందుకొచ్చాను? వొద్దు, వెళ్ళు. బయటకు త్వర త్వరగా. ఆ పిల్ల నోటి నుండి తిట్లు, తన చేతి నుండి నా చెంపకు చెల్లు పడకముందే.

వెళ్ళిపోయాను. పారిపోయాను. అక్కడినుండి దూరంగా తనకి దొరకనట్లుగా.

మా దొడ్లోని బండి మీద పడుకొని నీడ పడుతున్న వేప ఆకుల్ని, వాటి మధ్యలో కనిపిస్తున్న ఆకాశాన్ని నా చూపులు తాకుతున్నాయి.

ఆత్మ నా సాంగత్యాన్ని వొద్దని చెప్పెయ్యడం. ఒట్టి శరీరంతో నేనింకా ఎన్నాలని బతకగలను. శరీరం తుచ్ఛమ్, మాయ. నేనెంత భ్రమ పడ్డాను. భ్రమే! పూర్తిగా అబద్ధం. తను అందంగా ఉందనే తనకోసం వెంపర్లాట, అంతే. పళ్ళు ముందు కొచ్చి, నల్లగొ లేక తెల్లగో మొహం గాట్లతో ఉండి ఒకామె వొచ్చి నిలబడి నన్ను కోరితే, నేనేం అంటాను? ఇష్టం లేదంటాను. నే ప్రేమించడం, అదేలాంటి ప్రేమనే

నే తననుండి కోరడం. కోరడమేంటి? నే ప్రేమిస్తే తను తప్పక నన్ను ప్రేమించాలా?స్వార్థం. ఆ అందంపై, తన నవ్వులపై, తన చూపులపై మొత్తం నాదే ఆధిపత్యం కావాలనే అహంకారం. పెళ్ళి! పెళ్ళి సృష్టించిందే ఇదంతా. సొంతం చేసుకోవాలనే భావన. సొంతం కాబట్టే అందమైంది, గొప్పది కావాలనే ఆలోచన. అందం, మనిషితనాన్ని ముక్కలుగా విడగొట్టిన ఆకర్షణ. అందం ఎవరికి ఏమి కాదనుకుంటే వికారానికి ఏమర్థం? ఇవన్ని అందరికి తెలుసు, అందరూ ప్రేమిస్తారు. అయినా అందరూ ఆ గొప్పతనాన్నే కోరతారు, దక్కించుకుంటారు. అందం లేనివాళ్ళు బాధితులు. కథలో రాజకుమారి ఎంత అందంగా ఉంటే, ఆ అందాన్ని సొంతం చేసుకుంటే అదే అంత గొప్ప ప్రేమకథ... మనిషికి అందాన్ని అంటకట్టి అది దక్కించు కునేందుకు పోరాడటం. సంకుచితం ప్రేమ. ప్రేమే గొప్పదని, ప్రేమే అమరమని కావ్యాలు, సినిమాలు, కథలు. ఒట్టి అస్థిపంజరాలు ఈ లోకంలోని ప్రేమ పక్షులు.

బండి మీద నుండి లేచి గుడిసె వైపు చూశాను. ముండ్ల కంపలు, పొదలు. ముందుగా వీటిని నరికెయ్యాలి. అస్పష్టంగా జానకి గుడిసె. దాని ముందున్న ప్యారేంగ చెట్టు కిందేసుకున్న మంచంపై జానకి అటువైపు తిరిగి కూర్చొని. నిన్న లానే ఈరోజూ కూలికి  వెళ్ళలేదు. ఎందుకో. ఎవరు లేనట్లున్నారు. పోయి నా విషయం చెప్పేందుకు నాకిదే అవకాశం. కానీ ఎప్పుడూ నేను తనతో మాట్లాడింది లేదు. అయినా ఏం చెప్తానూ? చెప్పడమేంటి? ప్రేమని అర్థించడమేంటి? అన్ని అబద్ధాలైతే! కానీ ఇక్కడే తన్ను చూడ్డం, ఎంత హాయి. జానకి వాళ్ళవ్వ గుడిసె ముందుకొచ్చింది. మా దొడ్డి వైపు చూస్తున్నట్లు కనిపిస్తుంది. నేను వెనక్కి తగ్గాను. అటు ఇటు తచ్చాడుతూ దొడ్డిని దాటి ఇంటి వైపుకి. ఆ ముసలిది ఇంకా అలానే చూస్తున్నట్లుంది.

జానకికి నేనంటే భయం. తనకి నా మీద ఏ ఆకర్షణ లేదు. నేను కనిపిస్తే తప్పించుకొని తిరిగేందుకు చూస్తుంటుంది. అది ఇంకా స్పష్టంగా అర్థమవుతుంది. ప్రతి యేడు సీడుపత్తి పనికి మా పొలానికే కూలికొచ్చే జానకి ఈ సారి రెండు రోజులోటే వొచ్చి, తరవాత నుండి వాళ్ళమ్మని పంపిందంట. ఎందుకో? మా వొదిన నా వల్లే పొలానికి కూలీకి రావడం లేదంది. నిజమా!! నా వల్లేనా? నేనంటే భయం. అది భయమేనా? ఏమో, లేకుంటే ఎప్పుడూ వెళ్ళేది నేను ఇంటి దగ్గర ఉన్న ఈసారి వెళ్ళకపోవడం. తను ఇప్పుడు కెర్రన్న తాత వాళ్ళ సీడు పత్తి పనికెళ్తుంది. అదే నాకు మంచిది. లేకుంటే, మా పొలనికెళ్తే మా ఇంటివాళ్ళ భయంతో నేనెక్కడ తన్ని చూడగలను? కెర్రన్న పొలానికి వెంకటప్ప కట్ట వైపు నుండే పోవాలి. నేను కూలివాళ్ళు పోయే సమయానికి మోహన్ గాన్ని ఎత్తుకొని వెంకటప్ప కట్ట దగ్గర కూర్చుంటాను. నేను మాత్రమే. అందరూ తమ తమ పనులకు వెళ్తుంటారు. జానకి చద్ది గిన్నెతో వస్తుంది, దూరం నుండే నన్ను చూస్తుంది. తల కిందకు దించుకుంటుంది. త్వరత్వరగా నడక నన్ను దాటాలని. సాయంత్రం కూడా అంతే. ఈ దారిలో వెళ్ళక తనకు తప్పింది కాదు కాబట్టి ఈ మాత్రమేనా వస్తుంది, లేకుంటే నేనున్నానని దారి మార్చి వెళ్ళేదేమో. భయం! మొదటి నుండే ఈ భయం. నే చూస్తున్నానని తెలిసిన ఆ మొదటిరోజు నుండే.

ఎందుకు? నే ఆకర్షణగా లేనా? కళ్ళకి ఈ అద్దాలు, బక్క శరీరం. వదులుగా వున్నా అంగీ, అస్తవ్యస్థంగా గడ్డం, మాటికి జారే పాత పంచె. నే చదువుకున్న వాణ్ణి అంటే ఎవరు నమ్మరు. నా వయసులో ఉన్న వాళ్ళు ఊళ్ళో ఒక్కొక్కరు ఎంత ముస్తాబు. తను ఇంకెవరినైన ఇష్టపడుతోండొచ్చు. దానికి సమాధాన పడలేకే ఈ తిప్పలుండొచ్చు. ఈరన్నని చెంపదెబ్బ వేసిన తనకి అయినా ఈ భయమేంటి? నన్ను కూడా అలా కొట్టొచ్చు, కానీ లేదు, తప్పించుకునే తిరుగుతుంది అంతే. అది

భయమేనా ఇంకేదైన అర్థమా? ఇంకోవైపు తను నన్ను దొంగ చూపులు చూస్తున్నట్లు కూడా అనిపించేది. కేవలం అనిపించడమా, లేక నిజమా! అప్పుడప్పుడు తల ఎత్తి కనీ కనిపించకుండా నన్ను చూసేసి ఏమి తెలినట్లు, ఇంకేమి ఎరగనట్లు.

శివా! శివా! అంటూ అత్త గుడిసె నుండి అరుపులు. ఎన్నిసార్లు వెళ్ళొచ్చిన అంతే, నే అత్త దగ్గరకు పోయొచ్చాక కొద్దిసేపటికే అరుస్తుంటుంది. తనకి చాకిరి చేయడానికే నే ఉన్నట్లు. పోనీ ఏదైనా అవసరమైన పనుంటుందా అంటే అలాంటిదేమి ఉండదు. ఏంటన్నాను విసుగ్గా. తన బొడ్డు సంచి బయటకు తీసి అందులో ఎన్ని నోట్లున్నాయో లెక్కపెట్టమంది. డబ్బు, వాటిని లెక్కపెట్టడం నాకు విసుగు. ఎంతో కొంత ఉంటుంది పడుకోమన్నాను. అయినా వినదు, లెక్కపెట్టే తీరాలని మంకు పట్టు. తను పట్టు పడితే, మరి నేనూ. లేదు, లెక్కించను అన్నాను. పెద్దత్త మొహం చూడకుండ మా ఇంటి వైపుకొచ్చాను. మళ్ళీ కేకలు శివా! శివా! అంటూ. చూసేవాళ్ళకి నేను ఎంత కేకేసినా పట్టించుకోనన్నట్లు. నోట్లు లెక్కపెట్టేస్తే ఓ పని అవుతుంది, అయినా పని అక్కడితో ఆగదని నాకు తెలుసు. ఉయ్యాలలో ఉన్న మోహన్ నిద్రలేచి ఏడుపు మొదలెట్టాడు. వాణ్ణి కిందకు దించి సముదాయించలేక తిప్పలు. అటువైపు అత్త కేకలు. వీడు చూస్తే ఊరుకో అంటే వినడు, తరవాత వస్తానని చెప్పినా తానూ వినదు. మా నాన్న ఉంటేనే వాడికి ఊరట. నాన్న పొలం పనికెల్లడు, అటు ఇంటి దగ్గర ఉండడు. ఎప్పుడు ఎక్కడికో అక్కడకు తిరుగుతూ, తాగుతూ. వాణ్ణి ఎత్తుకొని కిరాణం కెళ్ళి సొంగలు బాకీ పెట్టాను. రూపక్క ఎక్కన్నుండి వచ్చిందో తాను అక్కడ ప్రత్యేక్షం. తనకి సొంగలు కొనించాను. అక్కని చూసిన వాడు ఏడుపు తగ్గించాడు. వాడి వేలు పట్టుకొని అక్క మా ఇంటివైపు, నేను గుడిసె వైపు.

మనం కోరుకున్న వాళ్ళు మనల్ని పట్టించుకోడం లేదంటే బాధ. జానకి చూడకపోతే నాకెంత బాధో, అత్త తనని నే పట్టించుకోకపోతే అంతే బాధ. పోయి నోట్లు లెక్కెటాను. అవి మొన్న పింఛన్ గా ఇచ్చినవి. పింఛన్ డబ్బులు రెండు వేల రెండు వందలు. కానీ, ఉండేది ఏడు వందలు. ఏమైనవని అడిగితే లెక్క.

కరెంటు బిల్లు వొచ్చిందని మా అన్న రెండు వందలు,

గుళిగలు తేవాలని మా నాన్న రెండు వందలు,

మా పెదనాన్న కొడుకు ఏదో అవసరం మీద పొద్దున వంద,

నిన్న తన్ని చూడానికొచ్చిన పెద్ద చెల్లికి వెయ్యి.

నన్ను కూడా రెండు వందలు తీసుకోమంది. వాటిని తీసుకోవడం అంటే తనకు చేస్తున్న పనులకు వెల కట్టడం. నాకొద్దు అన్నాను. లేదు తీసుకోవాలని మంకు పట్టు. తనిచ్చినవి నే తీసుకుంటే తను చెప్పిన ప్రతి పనిని, తను పిలిచినా ప్రతి మాటికి వెళ్ళాల్సిన అగత్యం, నన్ను నేను పూర్తిగా అప్పగించుకోవడం కూడా. వద్దని చెప్పేసి ఆ మూటని జాగ్రత్తగా దిండిలో కట్టేసాను. అత్త తన్ని నిలబెట్టమంది. నిలబెట్టాను. కొద్ది సేపు అలా వణుకుతూ. ఎప్పుడెప్పుడు నన్ను వదిలేస్తుందా! అత్తని కూర్చోబెట్టి నీళ్ళు తాపి పడుకోమని చెప్పి ఇంటి వైపుకొచ్చాను. మోహన్ గాడితో రూప, ఇద్దరు ఇంట్లో ఆడుకుంటూ. నేను వాళ్ళలో ఇప్పుడు భాగమయ్యాను.

పది నిమిషాలకు మళ్ళీ కేక శివా! శివా! అంటూ.

తను చచ్చేలోపు నన్ను కూడా చంపుతుంది. ఓరి పాపిష్టోడా! ఇదే అసలైన నువ్వు. నాటకాలాడొద్దు.

# 5

ఎన్నాళ్ళుగా ఎదురుచూస్తున్న కార్తీక మాసం. పూజలు చేయబోయే ఆడాల్లు రేపొద్దున నాలుగు గంటలకు చన్నీళ్ళతో స్నానం చేసి గుడి దగ్గరకు రావాలని పూజారి సాయంత్రమే మైకులో చెప్పేసాడు. మా ఇంటి ముందున్న గుడి దగ్గరకు జానకి రావడం, పూజలు అయ్యేంత వరకు తన్ని చూడ్డం, ఇదే ఆశ. అందుకే నే ఊర్లో ఉంటున్నాను. రాత్రంతా కుతూహలం. పొద్దున ఎప్పుడవుతుందా, ఏ డ్రెస్ తాను వేసుకొని వస్తుందా ఇదే నాలో. నా పక్కన పడుకున్న తిరుమల్ కు గానీ, అంజీకి గానీ, జాఫరుకి గానీ ఏ అలజడి లేదు. మేమంత తిరుమల వాళ్ళ పాత ఇంట్లో పడుకుంటుంటాం. ఆ ఇంట్లో మేం తప్ప ఇంకెవరు ఉండరు.

నే లేచేలోపు సమయం నాలుగున్నర అయ్యింది. ముగ్గురు గుర్రు పెడుతున్నారు. ముందుకెళ్తుంటే చీకట్లో జాఫరు కాళ్ళు తగిలాయి, కొద్దిసేపు నిలబడి జాగ్రత్తగా అడుగులేసుకుంటు తలుపు దగ్గరకొచ్చాను. తలుపు తెరవగానే ఎక్కడినుండో నా ముందు బల్లి పడింది. నాపై పడలేదు అదే సంతోషం.

ఈ పాటికె మైకు మోగుతుందని, సందడిగా ఉంటుందనుకున్న గుడి, చూస్తే ఇంకా తెరవలేదు. ఎంత సేపు!! ఎప్పుడొస్తారు? ఎక్కడ ఎదురుచూడాలి? ఎవరైనా నన్ను చూస్తే. ఏ ఇంటి నుండి ఏ అలికిడి లేదు. ఎందుకైనా మంచిదని మా బాత్రూమ్ దగ్గరికెళ్ళి మగ్గులో నీళ్ళని నింపుకొని రోడ్డు మీద కొచ్చాను. వెంకటప్ప కట్ట దగ్గర ఆగి జానకి గుడిసె ఉన్న వీధి వైపు చూద్దునా, అంత నిశ్శబ్దం. దూరాన ఉన్న స్థంబపు వెలుగులో రెండు కుక్కలు ముడుచుకొని పడుకోనున్నాయి. ముందుకు ఎంత త్వరగా వేళ్ళానో, అంతే త్వరగా వెనక్కొచ్చాను. ఈసారి ఖాళీ అయిన మగ్గుతోటి. గుడ్లగూబ అరుపులు వినిపిస్తున్నాయి. జానకి వెళ్ళిందా? వెళ్ళిందో లేదో ఆ పక్షులు చూసే ఉంటాయి. ఎక్కడ అవి? నా కంటికి చిక్కవా? అడుగులు లెక్కేసుకుంటు ఇంటివైపు నడిచాను.

గుడి తలుపులు తెరిచే ఉన్నాయి. పద, పద త్వరగా. మగ్గుని బాత్రూమ్ దగ్గర పెట్టేసి గుడి వైపు గుండా నడుచుకుంటూ వస్తున్నాను. గుడి కడ్డీల గుండా గుళ్ళోకి నా చూపు. ఎంతసేప్పయిందో గుడి తెరిచి? తానొచ్చుంటుందా? వొచ్చింటే ఎక్కడుందో?

ఉషా, ఈరమ్మ, మహేష్ కానీ... జానకి కనబడడం లేదు. రేడియో దగ్గర పూజారి ఏవో తిప్పలు పడుతున్నాడు. నా నడక నిదానంగా సాగుతుంది, కానీ ఎంత సేపు? పోనీ లోపలికెళ్ళి చూస్తే. వెతుకుడి, మీకు దొరుకును అనే వాక్యం చెవుల్లో. లోపలికి వెళ్తే ఎందుకు వచ్చావని అక్కడ ఆడాళ్ళ చూపులు. అక్కడే తిరిగాడుతున్న నన్ను పూజారి కేకేశాడు. వెతికే తీగ కాలికి తగిలినట్లు. గుళ్ళోకి అడుగుపెట్టిన నన్నిప్పుడు ఆ చూపులు భయపెట్టవు. జానకి, ఎక్కడ? ఆ మూలుందో, ఈ మూలనో. లేదు, తను లేదు. ఇంకా రాలేదు. ఏమని అడిగాను పూజారిని. రేడియో పనిచేయడం లేదని చూడమన్నాడు పూజారి. సమయం ఎంత వృధా చేస్తే అంతవరకూ గుళ్ళో ఉండొచ్చు. రిమోటుతో కుస్తీ పట్టాను, రేడియోకి ఉన్న అన్ని బటన్లు తిప్పి చూసాను. గుర్రు గుర్రు మని శబ్దం. ఏమై ఉంటుంది. గుడి దేవుడికి స్థలం. నా చుట్టూ తిరగాడే వాళ్ళంత దేవకన్యలు. అబ్బో, ఇక ఆపు.

రేడియో లోని మెమోరి బయటకు తీసి నా మొబైల్లో వేసుకున్నాను. అందులోని పాటల్ని కొత్త ఫోల్డర్ లోకి మూవ్ చేసి తిరిగి రేడియోలో పెట్టేసాను. ఈసారి రేడియో ఆన్ చేస్తే పాటలు. రేడియో మెమోరి పాటల్ని డిటెక్ట్ చేసింది, అచ్చం నా గుండె శబ్దాల్ని నేను కనుకుంటున్నట్లూ.

కొట్టాల వీధి పిల్లలు వొచ్చారు.

జానకి గుడిసె ఉన్న వీధిలోని వాళ్ళు కూడా వొచ్చారు.

జానకి జాడేది. ఓ జటాయువు జానకిని నువ్వేమైన చూసావా?

వెంకటప్ప కట్ట దగ్గరికి మళ్ళీ వొచ్చాను. గేట్ పక్కనున్న రాళ్ళ మీద కూర్చొని జానకి గుడిసెన్న వీధి వైపు చూస్తున్నాను. నే కూచున్న చోట కరెంట్ స్థంభం వెలుగు. ఎదురుగా ఉన్న వీధి మొత్తంలో మరోచోట మరో కరెంట్ స్థంభం. దానికున్న బల్బు చుట్టూరా దోమలు. వాటికి నిద్రుండదు. దోమలు ఏ సమయంలో నిద్రపోతాయో అర్థం కాదు. పగలూ కనిపిస్తాయి, రాత్రుళ్ళు కనిపిస్తాయి. చుట్టూ ఇన్ని తిరుగుతున్నా నిద్రపోతున్న ఒక్క దోమని కానీ, ఒక్క చీమని కానీ, ఒక్క ఈగని కానీ దేన్ని ఇప్పటివరకు నే చూడలేదు. ఆ స్థంభం కింద రెండు కుక్కలు ముడుచుకొని పడుకునే ఉన్నాయి. చలి, చలి గుర్తొచ్చింది నాకు. ఈ ఆడాళ్లు ఇంత చలికి చన్నీళ్ళతో స్నానం చేసి ఎలా వచ్చారో! భక్తి, శివోహం. మహిమ! కాదు మత్తు. నా చేతులు రెండు సంకల్లోని ముడుచుక పోయాయి.

గుడి వైపుకి జానకి పోడానికి ఇదే దారి. తనొస్తే ఇటునుండే వెళ్ళాలి. కానీ ఎప్పుడూ? అందరూ లేచే సమయం అవుతుంది, ఇంకా జానకి జాడ లేదు. రాదేమో. పూజలు చెయ్యదేమో. రాకుంటే ఇన్నాళ్ళు చూసింది ఒట్టి ప్రయాస. అడుగుడి, మీకివ్వబడును. అడుగుతున్నాను, నాక్కావాల్సింది నాకిచ్చేసేయ్.

స్థంభం ఉన్న చోట దాని వెలుగులో ఎవరో. చేతిలో కంచం, తానే. నా వైపోస్తుంది. నేనున్న చోట ఎవరు లేరు. తనొస్తున్న చోట ఆ కుక్కలు తప్పితే ఇంకేం లేదు. నన్ను చూస్తోందా...చూసింది. నాకు తనకి దూరం దగ్గరే. ఒంటరిగా కూర్చున్న నేను తనకోసమే ఉన్నట్లు తనకర్థమవుతుందా? నే తనవైపే కష్టమ్మీద చూపు విసురుతున్నాను. తను తలదించుకొని త్వర త్వరగా అడుగులు. ఎవరు లేని ఈ చోట నేనేమైనా చేస్తానని తను అనుకుంటుందా! అవును ఎవరు లేరు. చేసేయ్ ఏదైనా, జీవితానికి కొత్తగా. చెప్పేయ్ అనుకున్నవన్నీ చెప్పేయ్.

తను నన్ను దాటి పోయింది. తను వెనక్కి చూస్తోందా? చూడాలి. చూస్తుంది, కానీ చూడలేదు. రోదశిలో ఎక్కడో ఎవరికో నన్ను చూసి కన్ను కుట్టినట్లుంది. లేకుంటే ఈ సమయం ఇంత త్వరగా గడవడం. రాళ్ళ మీద నుండి లేచాను. తన వెనకాలే పడుతూ వెళ్ళాలని ఉంది. బసీరి చెట్టు కట్ట మీద కూర్చొని ఎదురుగా ఉన్న గుడివైపు చూస్తుండాలి. ఆ కట్ట మీద, ఈ సమయాన కూర్చోవడం, సిగ్గు. ఎవరైనా చూస్తే ఏ పుకారు పుట్టిస్తారో. గుడి వైపుకి కాకుండా మరో వైపుగా అడుగులేసాను. తెల్లారే దాకా అక్కడే కూర్చోవాలని చివర నున్న బడివైపుకు. కాంపౌండ్ దాటి లోపలికెళ్ళాను. రోడ్డు మీద నుండి చూస్తే ఎవరికైనా కనిపిస్తానని బడి కట్ట మీద లోపలకు జరిగాను.

కాసేపైతే తెల్లారుతుంది. అందరూ నిద్రలేస్తారు. నిద్ర లేచిన ఆ క్షణం నుండి తిరిగి నిద్రపోయేంతవరకు పనులు. అందరికి ఏదో ఒక పని. నేనే ఏ పని చేయకుండా ఇంటి దగ్గర ఊరికే తిని కూర్చుంటుంటానని అన్న తిడుతుంటాడు. దసరా పోయింది, దీపాలి వెళ్ళింది. ఇంకా నేను హైద్రాబాద్ వెళ్ళకపోవడం. అడిగితే అక్కడ మా ఫ్రెండ్స్‌కి రూం చిక్కలేదని, దొరికాక వెళ్తానని చెప్పడం. అమ్మ

నమ్ముతుంది, కానీ అన్న. సరే, రూం దొరికేవరకు తమతో పొలం పనికి రమ్మన్నాడు. ఇంటి దగ్గర పిల్లల్ని నాన్న చూసుకుంటాడని నా అవసరం లేదని గర్జించాడు. అన్న బాధ భరించలేక పనికెళ్ళాలనే ఉంటుంది కానీ, ఇంటి దగ్గరి పెద్దత్త సంగతి. నే లేకపోతే ఆ గుడిసెని మల మూత్రల ఆ బకీటని కడిగేదెవరు? కాసేపు తన్ని బయట కూర్చోబెట్టడం, అడిగిన్నప్పుడల్లా నుంచోబెట్టడం, మధ్యాహ్నం అన్నం పెట్టడం ఇవన్నీ ఎవరు చేస్తారు? మా పెద్దనాన్న ఇంటివాళ్ళు కానీ, మా ఇంటివాళ్ళకు కానీ, పగలంత తీరిక లేకుండా పొలంలో పని. మాకెందుకు అనేంత పోటీ అత్త మీద. నేను ఇంటి దగ్గరుండి అత్తకు మధ్యాహ్నం భోజనం పెడుతున్నానని తెలుసుకొని మొన్న అమ్మ తిట్టింది. కారణం తనేపని చేయకుండ మంచం మీదే కాబట్టి మధ్యాహ్నం అన్నం అక్కర్లేదంట అత్తకు. తింటే మరింత మలం ఏరుగుతుందని వాళ్ళ బాధ. నే అత్తకు చేసే పనులేవి మా అమ్మవాళ్ళకు తెలీకుండా చేయాలనుకుంటాను. మా నాన్న ఇంటి దగ్గర ఉంటే నన్ను గమనిస్తాడు కానీ, గమనించనట్లే నన్నేం పట్టించుకోడు. అత్తకి సేవ చేయడం కూడా ఇంటి పనే. తన భాగపు ఆస్తిని తింటున్నాం కాబట్టి అది తప్పదు. అప్పటికి పొలంలో మందు కొట్టే పని ఉంటే వెళ్తూనే ఉన్నాను, అదైతే మధ్యాహ్నం లోపు తిరిగొస్తానని. నే లేకపోతే అత్త కేకలు అరణ్య రోదనలు. నాన్న ఇంటి దగ్గరుంటే అప్పుడప్పుడైన తనకి స్పందిస్తాడు అయినా అత్త నాన్నని కోరదు. తిట్టినా, తన్ను అరిచినా అత్త నేను ఇంటి దగ్గరే ఉండాలని అంటాది. నేను ఊర్లో ఉన్నన్నాళ్ళు తనతో ఉండక నాకు తప్పదు.

కరెంట్ షాక్ కొట్టి రెండేళ్ళ క్రితమే చచ్చిన నా స్నేహితుడు అలీం, కాన్సర్ వొచ్చి చచ్చిన ఇంకొకరు వీళ్ళందరితో చూస్తే ఇప్పటివరకైనా జీవితాన్ని చూసిన అత్త మేలు. తను ఇన్ని యేండ్లు బతకగలిగింది. అయినా సమయాన్ని చూసే కోణం ఆలోచిస్తే అత్తకు ఆనాడు, ఇప్పటి ఈనాడు ఒక్కటే. మా అత్తని ఉంచుకున్న సూరన్న కనీసం తన్ని చూడ్డానికి రావడం నేనెప్పుడూ గమనించలేదు, అతడు మాకు బంధువు కూడాను. ఆ గుడిసె వాసన. అదేనా అందరికి భయం. బలహీనంగా, నిస్సహాయంగా ఉన్నవాళ్ళకి గాంభీర్యం ఉండరాదనేది లోకనీతి. వాళ్ళు జాలిగానే కనిపించాలి. నలుగుతున్నట్లు, ఏడుస్తున్నట్లే. అత్త అలా కనిపించదు. ఇప్పటికి తానూ దబాయించగలదు, నిస్సంకోచంగా అడగగలదు. అందుకే అత్త అంటే ప్రేమ పుట్టదు ఎవరికి. తనకి సంప్రాప్తించిన దానికి తాను జీవితాంతం చేసిన కర్మేనని పెదవి విరుస్తారు.

సూరీడు తను చేయబోయే పని మొదలెడుతున్నాడు. ఇలా మమ్మల్ని మేల్కొలపడం, దినమంత మాపై వెలుగు పంచుతూ మా పనుల్లో సాయం చేయడం. అతనికి రోజూ ఇదే పని ఇదే అనుభవమైన ఎప్పుడూ విసుగనిపించదు. కానీ నాకు... ఏ పనైనా, ఏ అనుభవమైన కొన్నాళ్ళకే విసుగు. జానకి అనుభవం కూడా ఇంతేనా? తన అనుభవం కూడా కాలంతో పాటే నేను చంపేస్తానా? ఇది భయంకరం అనిపిస్తుంది. నన్ను నేను చంపుకునే స్థితి.

కట్ట మీద నుండి లేచాను. గుడి దగ్గరకు, నన్ను నేను చూసుకునేందుకు నాకు పయనం. రోడ్డు మీద కుంటుకుంటు ఓ కుక్క, బక్క చిక్కి. దాని నుదుటిమీద గాయం కనిపిస్తుంది. ఈగలు దాన్ని మాటికి తిప్పలు పెడుతున్నట్లున్నాయి. దాని మొహంలో పక్షావాతపు మా అత్త. నేను దాన్ని పట్టించుకోలేదు. పట్టించుకోవాల్సిన అవసరం నాకు దాన్నుండి లేదు.

ఇంటి దగ్గర అమ్మవాళ్ళకు మొఖం చూపి బసీరూ చెట్టు కిందకొచ్చాను. అక్కడ అదే కట్ట మీద ఇద్దరు ఉన్నారనే ధైర్యం. ఆ పెద్దవాళ్ళు ఎందుకు కూర్చున్నారో. గుడి ముందు అటు ఇటు

ఎగురుకుంటూ రామ చిలుకలు. వాళ్ళ అరుపులు, సందడి అన్ని చిలుకపలుకుల వలె. జానకి, ఆ ఒక్క మధువు. నా గొంతులోకి జారీ నా శరీరం మొత్తం నిండి, అస్తవస్థ్యమైన ఈ ప్రపంచానికి సవ్యమైన అర్థం చూపే మత్తు. కంచం తీసుకొని గుడి బయటకొచ్చింది. ఎదురుగా కట్ట మీద కూర్చున్న వాళ్ళ వైపు. అదే నా వైపు. చున్నీ సర్దుకొని నడుస్తూ నవగ్రహాల వైపు సాగింది. ఆ గ్రహాల చుట్టూ తాను తిరగడం, తన చుట్టూనే నా కళ్ళు తిరగడం, మా చుట్టూ రోదసీ రహస్య నేత్రుడి కళ్ళు పడటం ఇవన్నీ అలా జరిగిపోతాయి. తను తిరిగి మాయమై గుళ్ళోకి. నే కూర్చున్న కట్ట మీది పెద్దవాళ్ళు లేచెల్లిపోయారు. ఇలా నేను ఒంటరిగా కూర్చోవడం భారమైంది. ఆ కట్టపై ఆ చివరన శేషన్న కిరాణం. అక్కడ న్యూస్ పేపర్ ఉంటుంది. నేనెళ్ళి న్యూస్ పేపర్ అడిగి కిరాణంకి కాస్త దూరంగా కూర్చున్నాను. మాటకి నే పేపరు చూస్తున్నానే కానీ, మాటికి గుడివైపే చూపులు. తను మళ్ళీ బయటకొచ్చింది. ఈ సారి కొత్త గడస్థంభం వైపుకెళ్ళింది. తన వెనకాలే ఓ కుక్క. నేను కదా ఉండాల్సింది. పూజారి రాయి విసిరితే అది దూరంగా పరుగు. అమ్మో! తను మాటికి నావైపు చూస్తున్నట్లే అనిపిస్తుంది కానీ, చూస్తోందా లేదానన్న సందేహం. ఆ చిలుక రెక్కల్ని విరగొట్టి నా దగ్గరే పెట్టుకోవాలనే కసి. రెక్కలు తెగిన ఆ చిలుకకి ఏం ఎరగనట్లు నేను సాయం చేస్తుంటాను. తను నా కరుణకి కరిగిపోయి తన ఆరాధ్య దైవంగా నన్ను చూడటం. నేను తన్నే చూస్తుండటం. మాకిక ఏ అడ్డు, అదుపు ఇంకేవి ఉండవు. తను పూర్తిగా ఆవేశంతో తన్ను తాను అప్పగించుకుంటుంది. హా---హా---హా. తనిక నాది. తను తనలాగా ఇప్పుడు ఉండలేదు. ఉండలేదంటే తను చావడం. నేనొట్టి శవాన్ని ఏం చేసుకోవాలి?

పేపర్ తిప్పేస్తున్నాను. ఏ పేజీలో ఏ వార్తుందో. సమయంని వేగంగా తిప్పుతున్నాడు రోదశీ కుర్రాడు. వాడు నా చేతికి చిక్కితే సాపేక్ష సిద్ధాంతాన్ని అర్థం చేసుకోమంటాను. దాన్ని ఎక్కడ ఎలా ఉపయోగించాలో నేర్చుకోమంటాను. నాలాంటి వాళ్ళ పైన వాడికెంత కసి. జానకి గుడి నుండి బయటకొచ్చి చున్నీ సర్దుకుంటు తిరిగి నావైపు చూపు, ఆ వెనువెంటనే ఎంత త్వరగా కంచం మీదకి తల దించుకొని నడక. మౌనానికి అర్థం చెప్పే యంత్రాలు నాకు అవసరం లేదు. అర్థం తెలీకపోతే మనకిష్టమొచ్చినట్లు మనం కోరుకున్నట్లు మనం భిన్న రకాల స్వప్నాలని ఆహ్వానించొచ్చు.

ఇంటి దగ్గర అమ్మ విసుక్కుంటుంది. అత్తకు కొడుకులు లేరు. మొగుడు లేడు. తను ఒంటరి. ఎవరిని అడగాలో అత్తెవ్వరిని కోరలేని దుస్థితి. ఎంత దగ్గరి వాళ్ళైతే వాళ్ళ పైనే కరుణ. నేనూ పెళ్ళి చేసుకోకుండా ఇలానే ఒంటరిగా ఉండి, ఆ తరవాత నాకు అత్తలాంటి పరిస్థితే దాపరిస్తే.

ఆనాడు నన్నెవరు చూస్తారు?

# 6

నిరాశ. మూడు రోజులుగా జానకి గుడికి రావడం లేదెందుకో. నేనే కారణమా? మొదటి రోజు నే చేసిన నిర్వాకం, ఒంటరిగా పూజకొస్తున్న తన్ని అడ్డుకోవడం. గుడి దగ్గర తనవైపే చూస్తూ ఉండిపోవడం. నేనంటే తనకి అసహ్యమేమో. నా చూపులు తన్ని నెత్తురు కారేలా గుచ్చుతున్నాయేమో. కానది తప్ప ఇంకేం చేతనవుతుంది నాకు.

నా చుట్టూ ఆవరణ మొత్తం చీకటి. నా కంటికి ఎదురుగా కాంపౌండ్ అవతల కరెంట్ స్థంభం. దాని వెలుగు నా వరకు కాస్త డిమ్ముగా. ఆకాశం వైపు చూసాను. కోట్ల నక్షత్రాలు. నాకు కనిపించనవి

ఇంకెన్ని కోట్ల కోట్లో. ఆ రోదసిలో కోట్ల పాలపుంతలు. అంతటితో పోల్చుకుంటే ఈ భూమెంత? మరి ఈ దేశం, ఈ నేను, నాలో ఉండే ఈ ఆత్రం.

నా ముందు ఒక వెలుగు రేఖ ప్రత్యేక్షమైంది. అందులో నుండి ఎవరో అస్పష్టంగా. ఆ వెలుగుని ఎక్కువసేపు చూడలేక తలకు చెయ్యి అడ్డంపెట్టి పక్కకు తిరిగాను. ఎవరని అడిగాడు.

"శివా! నా పేరు మార్ఫియస్. స్వప్నాలను తీసుకొచ్చే దేవతను. "

"ఎందుకొచ్చినావు?"

"ఏమన్నా కోరుకో నన్ని?"

ఏం కోరుకోవాలి? అడిగి వరమిస్తానంటే ఎవరు వద్దంటారు?

"నే కోరుకున్న వాళ్ళతో మాట్లాడే అవకాశమివ్వు. వాళ్ళతో మాట్లాడేందుకి కావాల్సినంత ధైర్యాన్ని కూడా. "

"తథాస్తు. "

నా ముందు వెలుగు రేఖ మాయమైంది. నా తలను పక్కకు తిప్పుకోగలిగాను. నే చూసింది అబద్ధమో నిజమో అర్థం కావడం లేదు. ఓ సారి పరిక్షిద్దామనుకున్నాను.

ఎవర్ని కోరుకుందాం... జానకి! వొద్దు. తన్నిప్పుడు భరించలేను. రేవతి! తనని కోరుదాం. నా పక్కన ఎవరో ఉన్నట్లనిపించి మొహం తిప్పాను. రేవతే, నిజంగానే వొచ్చింది. నావైపు చూస్తోంది.

"ఏం. పిలిసినావ్"

అవును ఎందుకు పిలిచాను తన్ని. మాట్లాడాలని కోరాను కానీ, ఏం మాట్లాడుతాను? అయినా ఇట్లాగే ఉంటే సమయం, వరం వృధా అవుతుంది.

"నీకి అంజీ గాడు ఇష్టమా?"

"ఆడా, ఇష్టమే. వొళ్ళింటికి ఫోతే నాకెళ్ళే సూసుకుంట ఉంటడు. నాకి ఫోను ఇస్తడు. ఇంగ వల్లమ్మ, వల్ల తాత బల నగిస్తారు. "

తరవాత ఏం అడగాలి. పరశరాముడు గుర్తొచ్చాడు. వాడు ఓసారి తనకి ప్రేమిస్తానని చెప్పాడంట. తను మాత్రం ఏం చెప్పకుండా పారిపోయిందంట. వాడే చెప్పాడు నాకు.

"పరుష గాడు నీకి లవ్వు సేసినేది సెప్పినాడంట గదా. వాడంటే ఇష్టమా మల. "

"యా సెప్పిలేకొండే. "

"లేద, మల సెప్పినానని సెప్పే నాకి. "

"ఏమో, సుల్ల అనింటాడు. "

"నానడిగితే కరెస్టు సెప్పు. నువ్వు లవ్వు సేసినావా ఎవర్ణన్న ఊర్లోన. "

"యా సేసిలేను. "

"మల ఏంటికి మా కెళ్ళి అట్ట సుసుకుంట ఫోతావ్? అంజి గానికేళ్ళ సుస్తావు. తిరుమల్ గానికేళ్ళ సుస్తావు. ఏంటికి అంత. "

"ఊకనే సుస్తా. ఏం సూడగూడదా"

అవును. చూడొచ్చు.

"ఈడ ఎవర్లేరు, నాకి ముద్దీవా"

రేవతి సిగ్గు పడలేదు. నా చెంపలపై ముద్దు పెట్టుకుంది. నేను ఆ తడిని గుర్తించగానే మాయమైంది.

తప్పు చేశానా? ఏం తెలీని చిన్న పిల్లని ముద్దు కోరానా, అదీ కామ కోరికతో. తన వయసు పదహారేళ్ళుంటాయి. తనకేం తెలిదంటావా? తెలవడం అంటే అది కాదు, ఎరుక. తను చేసే పని మీద పూర్తి ఎరుక.

ఈసారి ఎవర్ని పిలుద్దాం. జానకి, వొద్దు వొద్దు తన్ని నేను భరించలేను. ఈరమ్మని కోరుదాం. తనంటే, తన మాటలంటే భయం నాకు. కానీ అది అప్పుడు, ఇప్పుడు కాదు.

పక్కకు చూస్తే ఈరమ్మ. తన కళ్ళని చూడలేకపోయాను. ఇంత ధైర్యంలో కూడా అవి నన్నెందుకో హెచ్చరిస్తున్నట్లు.

"నీ కండ్లని సుస్తే నాకి భయమైతాధి ఎప్పుడు. "

"ఏంటికి నాను మనిషిని గాదా!! దెయ్యాని అనుకొంటివ్యా. "

నవ్వు. చలాకీ పిల్ల తాను.

"నువ్వు బీరప్ప గాన్ని లవు సేసేవేనా. ఊర్లోన అందరూ మాట్లాడ్తారు మీ గురించి. "

"ఎవరు సెప్పేనేది. ఆ నాయండ్లని దెంగింట్రూ. "

కళ్ళు పెద్దవి చేసి, కోపం. భయం లేదు నాకు.

"నువ్వు, ఆడు ఫోన్లు మాట్లాడుకుంటారంట. వాడొస్తే ఆనికెళ్ళే సూసుకుంట ఉంటావంట. సెప్పిరి "

" ఊకె మాట్లాడుతం, గయింత దానికే లవ్వు అయితాదా?"

"ఏమో. మీ ఇద్దరు ముద్దులు పెట్టుకోరేని, కర్శికుంటారని ఏమేమో సెప్తరు ఇంగ"

"ఇంగోపారి మాట్లాడితే సెప్పు తీసుకొని కోడ్త సుడి నిన్ని. సూసినోళ్ళ లెక్కనే మాట్లాడ్తరు. నాను ఫోతా పా. "

ఆగు ఆగని అన్నా వినకుండా వెళ్ళిపోయింది ఈరమ్మ. పోయేవాళ్ళని ఏం చెప్తం?

ఈసారి నే కోరింది లింగేశ్వరిని. తను ఇంటి దగ్గరే పని చేసుకుంటూ దూర విద్యలో డిగ్రీ చేస్తుంది. చదివే ఆడపిల్లలు అరుదుగా ఉన్న మా ఊర్లో తను చదవడం గొప్పే.

"సెప్పన్నా, ఏం పిలిసితివి. "

"ఏం ల్యా. పరీక్షలు బా రాసితివా మొన్న. "

"మ్మ్. రాస్తి, అట్టే. "

"నాను ఆడిగినేది కరెస్టు సెప్తావా. కోపం పడగూడదు. "

"ల్యా, అడుగు. "

"నువ్వు నాగేంద్ర గాడు ఫోన్ల మాట్లాడుతుంటే ఇంటి. ఇద్దరు లవ్వు సేసుకోరే గదా. "

"అవ్వు. ఎవరికి సెప్పొద్దు. ".

"యా సెప్పన్లే గానీ ఆడేట్ల నచ్చే నీకి. "

"ఏమో. ఏంటికి. వోటే సుస్తుండే. నాను యాటికి ఫోతే ఆటికొస్తుండే. "

"మ్మ్, మల పెండ్లి సేసుకుంటావా ఆన్నీ. "

"అవ్వు. మా ఇద్దరం సేసుకుంటాం. "

"మీ నాయిన ఒప్పుకుంటాడా. నిన్ని గవరణమెంట్ జాబున్నోనికి ఇయ్యాలనుకోడే. ఆనికి సూస్తే సదువే కష్టం ఇంగ జాబెడ వస్తది. "

"మా నాయిన ఒప్పుకోకున్నా నాను ఆన్నే సేసుకుంట. ఆనితోటి మాట్లాడకుండ, సూడకుండ ఉండలేను "

"అంత ధైర్యం సేస్తవ, మీ నాయినని ఎదిరిచ్చి..."

ఆలోచనలో పడింది లిమ్గేష్. తన్ని నేనే ఇక వెళ్ళిపోమని చెప్పాను. వెళ్ళిపోయాక అనిపించింది తన పెదాలు ముద్దు పెట్టుకోలేకపోయానని. అవి బాగుంటాయి.

రాజేశ్వరి నల్ల కలువ. చిన్నప్పుడే అమ్మ చనిపోయింది. నాన్న రెండో పెళ్ళి చేసుకున్నాడు. తనకి నాన్నంటే ఇష్టం లేదని అవ్వ వాళ్ళ దగ్గర ఉంటుంది. వాళ్ళతోటే పనికెళ్ళేది. రాజేశ్వరి నల్లగా, పొట్టిగా ఉంటాది. తనకోసం పాకులాడేవాళ్ళు, తనకోసం ఎదురుచూసేవాళ్ళు ఊర్లో ఏ కుర్రాడు ఉండడని నా నమ్మకం.

"బాగేవేనా బుజ్జి"

"అవన్నా. "

"ఇప్పుడు సుస్తే ఓటే నవ్వినట్ల కనిపిస్తావు గాని సిన్న వున్నప్పుడు నీకి బల కోపమొస్తుండే గదా. రాళ్ళతోటి కోడ్తింటివి. "

"అవ్వు. అప్పుడు ఎవరన్నా ఏమన్నా అంటే రాయి తీసుకొని జిమ్ముతుంటి. ఓ మంచికెతే నెత్తికి బుంగ గూడ పెట్టింటి. "

"మల ఇప్పుడు. "

"నేనేం ఇంగ సిన్న పిల్లన్యా, అప్పుడంటే తెలదు నాకీ. "

"మీ నాయినంటే కోపం గదా నీకి. మన్న ఇంటి కాడ నిన్ని కొడుతుంటే సూస్థి. నాకే మీ నాయినని కొట్టల అనిపించే. "

"అవ్వు...ఐతెంల్యా. ఆ మంచి పాపంల ఆ మంచే ఫోతాడు. "

"ఇయ్యాళ్ళ ఫోద్దున జాఫరు గానొద్ద మీ సుట్టాల మంచిది నెంబర్ ఇపిచ్చుకుంటివి గదా. ఆ సుట్టాల మంచంటే ఇష్టమంట గద నీకి. "

"అవ్వు, నీకి ఆడే సెప్పేనా. ఎవరికి సెప్పొద్దని సెప్పు ఆనికి. అందర్కి తెలిస్తే నాయిన కొడ్తాడు."

"మీ నాయినని గూడ రాయి తీసుకొని బుంగ పెట్టు. ఇంగోపారి నీ సుకం రాకుండ సెయ్యి. "

తను మళ్ళీ నవ్వింది.

ఆ చుట్టాల అబ్బాయి అప్పట్లో స్కూల్ ఫస్ట్ వచ్చాడని కూడా నాకు జాఫరె చెప్పాడు. నాకు తెలుసు తానెంత పాకులాడినా వాడు తిరిగి తన్ను ప్రేమించలేడని.

చీకటి
అందరికి నువ్వంటే భయం,
కానీ నువ్వెంత ఆహ్లాదకరం.

చీకటి
నీ వీణ పలకదని అందరూ అంటారు.

ఆ రాగలేంత మధురం.

చీకటి
నిన్ను నేను పూర్తిగా ప్రేమిస్తాను.
నువ్వు నా ఆత్మని కళ్ళముందు నిలిపే ధీశాలివి.

ఎవర్ని కోరాలి. జానకి, వొద్దు తను వొద్దు. మహేశ్వరి. రాజేశ్వరికి అక్కవుతుంది. తన పెదనాన్న బిడ్డ.

"మహేష్, నీకి మల్లేష్‌గాడు ఇష్టమా? ఆడు నిన్ని పెండ్లి సేసుకోవలని మీ ఇంట్ల ఆడిగేనంట గదా."

"అవ్వ ఆడిగేనంట, మా యమ్మ సెప్పె. "

"మల నీకిష్టమ ఆడు. "

"మాయమ్మ కైతే ఇష్టం. మా నాయన వొద్దు అంటడు. ఆనికి ఆస్తి లేదంట. "

"మ్మ్, నీకి సెప్పూ. "

"అమ్మోళ్ళకి ఇష్టమైతే ఇష్టం, ల్యాకుంటే ల్యా. "

"నువిప్పుడే పెండ్లి వొద్దను. ఇంకొన్నాళ్ళు ఉంటా అను. "

"ఏం...ఇప్పుడు పెండ్లి ల్యాకుంటే మూసిలిగైనంక సేసికుంటర"

"యాలే, అది గాదు. ఇంకొంచెం వయసొస్తే తెలివొస్తాది. ఇష్టం మున్నోళ్ళని పెండ్లి సేసుకున్నికె ధైర్యముంటాది. "

"నాకేం ఇష్టం ఉండదు. మా ఎమ్మోళ్ళు యాది సెప్తే అది. "

"అట్ల గుడ్డిగ ఉండొద్దు. "

"నువ్వే గుడ్డోనివి. "

నవ్వుకుంటూ పారిపోయింది తను. నా అద్దాలను సరిచేసుకుంటు నేను గుడ్డివాననే విషయం గుర్తుచేసుకున్నాను.

నాకు కొట్టాల వీధి అందునా జయలక్ష్మి గుర్తొచ్చింది. జయలక్ష్మి మా పెద్దత్త మొగుడి తమ్ముని బిడ్డ. నాకు వరుసకు మరదలు అవుతుంది. తన వయసు ఇరవై. రెండేళ్ళ ముందు వాళ్ళ నాన్న చనిపోతే మూడేళ్ళవరకి పెండ్లి చేయకూడదని జాతకం చెప్తే ఇప్పటివరకు తనని ఆపారు. ఈసారి నేను జయలక్ష్మి కావలనన్నాను. పక్కకి చూసాను. నావైపే కన్నార్పకుండా చూస్తూ చీరలో మరొకరు. తను నే కోరుకున్న వాళ్ళు కాదు. కుమ్మరి వీధి ఆమె. ఆమెకు పెళ్ళై పిల్లలు కూడా ఉన్నారు. తన చూపుల్తో నా చూపులను కలిపేసాను.

"నువ్వెంటికి ఒచ్చినావు. "

"నువ్వే గదా పిలిసినేది. "

"నాను పిలిసినేది నువ్వు గాదు, జయలచ్చిమిని. "

"నా పేరే జయలచ్చిమి. "

ఈమె పేరు కూడా ఇదేనా. తనని వెల్లమందామా? వొద్దు. ఆ బరువెక్కిన సన్నులు, కలువ చూపులు.

"నువ్వేంటికి మొగుణ్ణి పెట్టుకొని గూడ అట్లే మంది కెళ్ళ సుస్తావు. మంది ఏమనరా. గబ్బు లంజ అంటారు."

"అనుకోని, వొళ్ళేం పతివ్రతాలా. అందరూ అట్టతోళ్ళే, ఏమంటే బయటపడరు. "

"మల మొగుడు. "

"నన్ని సేతకాకపోతే ఆ మంచెం సేస్తడు. "

"ఓ, నాకెళ్ళి అట్లే సూడకు. ఏమన్న సెయ్యాలనిపిస్తది. "

"సెయ్యి. ఏం నీకి లేద, మోగోనివి గాదా?"

నేను పూర్తిగా నిగ్రహం కోల్పోయాను. ఆమెపై అలానే పడిపోయాను. ఏం చేస్తున్నానో, ఎక్కడున్నానో నాకు తెలీదు. ఇది మార్ఫియస్ మాయ అన్న విషయాన్ని వదిలేసాను. మాయ అయితేనేం ఆ బరువెక్కిన ఎదల అమృతాన్ని తాగగలుగుతున్నాను.

నా అనుభవం తననేంత నిరాశ పరుస్తుందో. ఇంత త్వరగా స్ఖలనం కావడం. అయ్యో! నన్ను అలానే లాగుతుంటే తన్ని నేను తోసేశానే. నావైపు చూడకుండా వెళ్ళిపోయింది. నా నుదుటిపై మొబ్బు తెమ్మరలు అలుముకున్నాయి.

"ఈ ప్రేమలు, కామపు అనుభవాలు, హృదయ రాగాలు అన్ని మనతో పాటే మట్టిలో కలిసిపోతాయి కదా. "

బాధ పడుతూ కనిపించింది జానకి. నే కోరుకోలేదు, అయినా ఎలా వచ్చిందో తెలీదు.

"నాపై ఏంటికి కోపం? గుడికి రావొచ్చుగా జానకి. "

"నీ మింద కోపం గాదు. నాను ముట్టయ్యాను. సోమరం వారికి గుడికి రాగూడదంట. ".

"నిజ్జంగ అదేనా!".

"సుక్కల మీద ఒట్టు. ".

"నానంటే నీకిష్టమా!"

చెప్పు జానకి, చెప్పు. మౌనం ఎన్నాలిలా! నన్ను కాల్చకూ.

జానకి మాయమైంది. నాకు ఇంకెవ్వరిని కోరాలనిపించడం లేదు. స్ఖలనం అన్నింటిని మాయం చేస్తుంటుంది.

మార్ఫియస్,

నా కాళ్ళకు శక్తి నివ్వు.

నోటి నుండి రాగాలను అందుకున్నాను.

"హృదయ సీమలు,

సముద్రాలు, సెలయేళ్ళు, అడవులు, ఏడారులు, మంచు పర్వతాలు, కొండలు.

అరవడం, గంతులెయ్యడం, పాడటం, ఏడవడం.

ఆత్రం జీవ శక్తి.

అది కామమో, చెప్పుకునే ప్రేమో.

శరీరంలోని ప్రతి అణువుని కదిలించే చైతన్య దీప.
ఎందరు ఇక్కడ మునకలు వేస్తున్నారో,
అందరికి అది కావాల్సినంత జీవామృతం పంచుతుంది. "
నా పాదాలు నాట్యం చేస్తున్నాయి. ఆ కదలికలకు ఏ నిబంధనలు, ఏ నియమాలు లేవు.

# 7

రోడ్డుకి ఆవలవైపు బీడు పొలంలో యెనుము మీద కూర్చొని పిల్లాడు. అది ముందుకు వెళ్తుంటే వాడు భుజాలు ఎగిరేస్తున్నాడు. వాడి కాళ్ళకు చెప్పులు లేవు. చేతిలో ప్యారేంగ కట్టె ఉంది. వయసు ఏడెనిమిది మధ్యలో ఉండొచ్చు. ఇలాగే వాడు యెనుముతో రోజూ వస్తుంటాడో, లేక ఈ రోజు మాత్రమేనో. చదివిస్తున్నారో లేదో. పెద్దగా కనిపించిన పిల్లాడి చిత్రం చిన్నగా. మరింత చిన్నగా. చెట్లు రాళ్ళు అడ్డమైపోయి కంటికి అందకుండా. తాళమేసిన ఓ గుడిసె ముందు కూర్చొని ఏడుస్తూ చిన్నారి. ఎందుకో, ఎవరు కొట్టారో. అమ్మ ఎక్కడికెళ్ళిందో. ఇల్లు వారిదేనో కాదో. ఆ చుట్టూ పక్కల తిరిగే వాళ్ళెవరికి తన ఏడుపు పట్టింపు లేదు. ఓ కాంపౌండ్ గోడ మీద కొడవలి సుత్తి బొమ్మ, దాని పక్కనే నీలిమందు అక్షరాలు పెద్దగా జార్జి రెడ్డి మీకు తెలుసా! ఎవరు ఈ జార్జి రెడ్డి. గోడ మీది చిత్రం అతడెవరో కమ్యూనిస్టని. కమ్యూనిజం, కారల్ మార్క్స్, కార్మికులు, విప్లవం వర్ధిల్లాలి. ఊర్లో ఇరవై ఎకరాలు ఉన్నోడు ఈ యేడు ఇంకో రెండకరాలు కొన్నాడు. రేపటి యేడు ఇంకో ఎకర. వాడి పెద్ద కొడుక్కి వ్యాపారం, ఇంకొడు పై చదువు. జీవితాంతం పని చేసి ఇల్లు కట్టుకోడానికి సతమతమవుతున్న ఓ కూలి. వాడి కొడుకు సిమెంట్ పని. చదువు దూరం. అసమానతలు. పుట్టుకతో ధౌర్భాగ్యం, పుట్టకతో సంపన్నం. వాడు ఎకరా కొనాలంటే జీవితం చాకిరి. వీడు అంతలోగా ఇంకో పదెకరాలు. డబ్బు మీద డబ్బు. పని చేసే కూలి పది, లాభం వంద. సమానత్వంకై రిజర్వేషన్లు. దేశం అభివృద్ధి లేదంటూ ఏడుపులు. కమ్యూనిజం రావాలి, ఆ స్వాంతత్ర్యం రోజే నెహ్రూ అన్ని భూముల్ని అందరికి సమంగా పంచి ఆ తరవాతే ప్రజాస్వామ్యపు జెండా ఎత్తుంటే.

గోడ మీద నుండి కిరాణం వైపు ఆశగా చూస్తున్న కోతి. గ్రౌండ్ లో క్రికెట్ ఆడుతున్న యువకులు. పొలంలో నీళ్ళు కడుతున్న శరీరంపై పంచె తప్ప మరేమీ లేని ముసలాడు. ఒకరిపై ఒకరు నవ్వుకుంటూ కలుపు తీస్తున్న కూలీ గువ్వలు. పారుతున్న వంక నీటిలో బట్టలుతుకున్న ఆడవాళ్లు. గతుకులు, సిమెంట్, తారోడ్డు.

అన్ని చలనం లో ఉన్నాయి. చెట్లు, కొండలు, స్తంభాలు, రాళ్ళు, పొలాలు, ఇండ్లు అన్నీ. వాటి నుండి నేను దూరమవుతూ, అవే నన్ను తప్పుకుంటూ.

జాఫరు వెనక్కి జరిగి కింద వేలాడదీసుకున్న కాళ్ళని ట్రాలీ పైకి వేసుకున్నాడు. వాడి పక్కన ఎండ తగలకుండ ఆటో లోపలకు కూర్చున్న అమ్మ, ఆ ఇరుకులో అమ్మ వయసున్న ఇంకో ఆడది. అమ్మ ఒళ్ళో సగం వరకు నీళ్ళున్న బాటిల్. ట్రాలికి, ఆటోకి కలుపుతూ అనుసంధానమై గొలుసు, దాని చుట్టుకొని నా వేళ్ళు. వేళ్ళకి పక్కన ఆటో పట్ట మీద ఎర్ర పెన్నుతో చిన్నగా అక్షరాలు. ఆ అక్షరాల చుట్టూరా ప్రేమ గుర్తు, మధ్యలో ఓ బాణం అటు నుండి ఇటువైపు. దగ్గరగా మూతి పెట్టి చూసాను.

చంద్ర,

ఉమ.

చంద్ర అంటే ఆటో నడుపుతున్నాయన పేరు. ఆయనే. నాకన్నా మూడేళ్ళు పెద్దోడు. మరీ ఈ ఉమ? ఆయన పెళ్ళామా జానకి వాళ్ళక్క లేకుంటే వేరే వ్యక్తా? మా ఊరి చెరువు కట్ట మీద ఇలానే పేర్లు ఎందరివో. లవ్ గుర్తు మధ్యలో అరణ, రత్నం ఇంకోచోట చాంద్, కృష్ణ. కొందరు చెట్ల మీద చెక్కేస్తారు వడ్రంగి పిట్టల్లా. రాజు, భాగ్య. పేరు చెక్కడమంటే? ప్రేమని ప్రకటించాలనే ఉబులాట. తన ప్రేమని గుర్తించాలనే కోరిక. ఎవరో ఒక్కరైనా ఒప్పుకోవాలి. తన మనస్సాక్షి మాత్రమే కాదు, ఇంకొకరు. ప్రేయసో ఇంకోరో. అర్థం చేసుకోవాలి. ఎందుకు? తన ప్రేమ తనకు సొంతం అనుకున్నప్పుడు మరొకరినుండి గుర్తింపు కోరడం? ఒక్కరైనా చెప్పుకోవాలి. ఒక్కరైనా. ఎప్పుడో ఒకప్పుడూ. ఏ గుర్తింపు మిగలకపోతే ప్రేమ శవమై పోతుందనే భయం. తానెంత పరితపించాడో తనకోసం. జాలి తనమీద తనకే. ఇంకొకరు జాలి చూపితేనే తన స్థితికి సరైన అర్థం. లేకుంటే పిచ్చి. ఇలా పేర్లు రాసేవాళ్ళు అంత మొగవాళ్ళే. ఏమవుతుందో, తన్నేమంటారోననే భయమేమో ఆడపిల్లలకు. లేకుంటే పెళ్ళయాక ఇబ్బందనో. వాళ్ళు ఎలా దాచుకుంటారో ప్రేమల్ని. పోనీ స్నేహితులకైనా చెప్తారా?

నేను ఈత వంపు మధ్యలో ఓ కాన చెట్టుపై నా పేరు, సునీత పేరు చెక్కాను అప్పుడెప్పుడో. గుడి వెనక వారం క్రితం మత్తులో జానకి, శివ, సిమెంటుపై రాయితో గిరికి. అలా ఎలా రాయగలిగాను. నాతో తిరిగేవాళ్ళకి, నా విషయం తెలిసిన వాళ్ళకైతే జానకంటే తానేనని అర్థమవుతుంది. నా గురించి జానకి గురించి వాళ్ళంత మాట్లాడుకోవాలని కూడా కోరుకుంటాను. ఇంకా మాట్లాడుకోవాలి. ఏవేవో చెప్పుకోవాలి. ఆడపిల్లలు కూడా మాట్లాడాలి. ఆ పేర్లు చూసి నా చొక్కా పట్టుకొని బెదిరించగలిగే మొగవాళ్ళు జానకి వాళ్ళింట్లో లేరు. ఊరి పెద్దవాళ్ళకు చదువురాదు, ఒకవేళ వొచ్చినా ఎవరో నన్ను బెదిరించేది? నన్ను అడిగినా హైదరాబాద్ వారిదని దాటెయ్యగలను.

రోజు పొద్దునే కార్తీక పూజలు చేసేవాళ్ళ పేర్లను వాళ్ళ గోత్రంతో కలిపి చెబుతూ చివరగా స్య అనేస్తారు మైకులో. ఆ పేర్లని పూజలు చేసే ఆడపిల్లలే ఎవరో ఒకరు చదువుకున్నవారు చదువుతారు. ఆ పేర్లు గోత్రం పేర్లతో రాయబడి ఓ నోటు బుక్కులో ఉంటాయి. ఆ చదివే ఆడపిల్లలకు నేను జానకిపై చూపే శ్రద్ధ అర్థం కావడానికి ఆ నోటు బుక్కులో నా పేరు ఉండాలనుకున్నాను? ఎలా? ఆ నోటు బుక్కు గుడి కడ్డీల చివర ఉండటం చూసాను. నా చుట్టూ ఎవరు లేరు. చెయ్యి పెట్టి దాన్ని బయటకు లాగేసాను. పేజీలు తిప్పుతున్నాను. ఎక్కడ చిలుకలు? ఎక్కడ జానకి పేరు? దానికి కిందే, కాదు కాదు దానికి పక్కన దగ్గర కాకుండా సేఫ్ గా  కొంచెం దూరంగా నా పేరు. పెన్ను తీసుకొని నా పేరు రాసి గుళ్ళో ఎక్కడున్నా చోట అక్కడే పెట్టేశాను. మళ్ళీ కొద్దిసేపటికి నోటు బుక్కుని బయటకు తీసి నా పేరు కొట్టేశాను. అసలేమి గుర్తు పట్టకుండా. అరే అనవసరంగా కొట్టేశానే. మళ్ళీ బయటకి తీసి రాయబోయి, రాయలేక అలానే వదిలేసి లోపల పెట్టేశాను. అరె అనవసరంగా పెట్టేశానే. తనకోసమేనని రోజు పొద్దున గుడి ముందు కూర్చోవడం, పేపరు చదువుతున్నట్లు నటించడం, అటు ఇటు తిరగడం అన్ని వాళ్ళకందరికి తెలిసే ఉంటే బాగుండు. బాగుంటుందా?

ఆటో ఆగింది. వెనక కాలు వేలాడదీసుకున్న నేను కిందకు దూకి ముడ్లు సవరించాను. నా వెనకే నిలబడ్డాడు జాఫరు. ఆటో మధ్య సీట్ల వైపు చూసాను. జానకి కింద నిలబడి ఆటోలో ఉన్న వాళ్ళవ్వకి చేతిని అందించి కిందకు దింపుతోంది. జానకి పక్కనే మోహన్ని ఎత్తుకున్న వదినే, రూప నాన్న భుజాలపై. అన్న వెంట అన్న వయసున్న చెన్నకేశవులు. అమ్మతో బోయామే, ముస్లిం మాదారు. డ్రైవర్

ఆటో దిగలేదు. మమ్మల్ని పూజలు చేసుకొని రమ్మని అప్పటివరకు ఆయన బయటే ఉంటానన్నాడు. కారణం డ్రైవర్ మాదిగ క్రైస్తవుడు.

మేమొచ్చింది కసాపుర ఆంజనేయ స్వామి గుడికి. సీడుపత్తి పనికి కూలికొచ్చే వాళ్ళని దేవునికి తీసుకురావాలని మా ఇంటి ఆలోచన వారం నుండి. ఉన్న కూలివాళ్ళలో ఇంకా ఇద్దరు రాలేదు. ఇక జానకి వాళ్ళింటి నుండి మొదట వాళ్ళమ్మ వస్తుందని చెప్పారు. నేనున్నా కాబట్టి మా కుటుంబంతో జానకి రాదని నాకు ప్రగాఢ నమ్మకం. కానీ, చివర్లో వాళ్ళమ్మ రాదని అందట. జానకి వాళ్ళవ్వ వస్తుందన్నారు. అవ్వకు తోడుగా జానకి కూడా రావాలని వొదిన కష్టపడి తన్ను ఒప్పించింది. అది నాకోసం. నేను కాసేపు ఉంటేనే గుడి దగ్గర అంత ఇబ్బంది జానకికి, మరి పగలంతా అదీ కూడా మా అమ్మవాళ్ళ దగ్గర. రాకూడదనుకున్నాను. అవకాశం, తనతో సమయం. మళ్ళీ కాలం వెనక్కి రాదు. వొచ్చేసాను. నాకు తోడుగా జాఫరు. జానకి వేసుకొచ్చింది పింక్ కలర్ పంజాబీ. చున్నీ కూడా అదే రంగే. నాది నీలం, తెల్ల ప్యాంట్. ఎప్పుడు నన్ను ఊర్లో తను పంచె తోనే చూసుంటుంది, కానిప్పుడూ స్టైల్‌గా ప్యాంట్. తను ఆటో ఎక్కేప్పుడు తనవైపు చూస్తున్న నన్ను బెరుకుగా చూడగలిగింది. తను మధ్య సీటుకి అటువైపు మదారుకి పక్కన చివర్లో కూర్చుంది. మా వొదిన, వాళ్ళవ్వ, అన్న పిల్లలు మధ్య సీట్లో. ఆటోలో పిల్లల్తో వదినతో నవ్వుకుంటూ తను మాటలు, వాళ్ళని ఎత్తుకొని ముద్దుచేస్తూ, నేను లేనే అక్కడ. అప్పుడప్పుడు చూసేవాన్ని వెనక్కి. నన్ను చూస్తుందేమోనని ఆత్రం. ఒక్కోసారి నేను చూసేప్పుడు నా వైపు చూస్తోంది, వెంటనే తలని బయటకో మరో వైపో.

ఆటో దిగిన ఆడవాళ్ళంతా ముందు నడుస్తుంటే, వాళ్ళ వెనకాల అన్న, చెన్నకేశవులు ఆ ఇద్దరి వెనకాల నేను జాఫర్. రా బాబు రా ఈ వాచి తీసుకోండి మీ చేతికి బాగుంటుంది. అమ్మా, ఈ గాజులు చూడండమ్మా. రండి బాబు రండి వందకి రెండు వందకి రెండు. చార్జింగ్ టార్చ్, ఒక్కసారి పెడితే.. శ్రీ హనుమాను గురుదేవులు నా ఎద పలికిన సీతారామ కథ, నే పలికెద సీతారామ కథ. దేవుడి పటాలు. చాయ్, చాయ్‌---అన్నా, అడ్డం జరుగన్నా. టెంకాయలు, టెంకాయలు, అన్నా టెంకాయలు..

అమ్మ రెండు టెంకాయలు తీసుకోమని చెప్పిన సంగతి గుర్తొచ్చింది. రెండు తీసుకున్నాను. ఊది కడ్డీలు ఫ్రీగా ఇచ్చాడు కొన్ని.

"శివ, సూడి ఆ ఫోట్టి బలేదే గా"

నా ముందు జనాల్లో లంగా వొణిలో వెళ్తున్న యువతి. జాఫరు తననే చూపించాడు. బాగానే ఉంది. తెల్లగా, పిర్రలు ఊపుకుంటూ. ఛీ, వొద్దు. నా కంటే కొంచెం తక్కువ ఎత్తు. జడ పెద్దది. మోకాల వరకు. జానకికి కూడా అంతే. లేదు తక్కువుంటుంది. తక్కువంటే అంత తక్కువ గాదు, కొంచెమే.

చూడు, దేవుడి బొమ్మల చుట్టూ లైట్లు. ఎంతో. రేట్ కనుక్కుందామా. ఇప్పుడేం తీసుకుంటామా వొచ్చేప్పుడు చూద్దాం. పూలు, ఎన్ని రకాలో. అవి గులాబీలేనా? ఎంతో. ఒకదాని తీసుకొని జానకి చేతికిస్తే. నా చేతిలోని పువ్వుని తీసుకొని తను సిగ్గు పడుతూ. ఆ ముక్కుకున్న ముక్కెర మెరిసిపోతూ. అవ్వు, జానకి ఎక్కడ? కనబడడం లేదు. అన్నవాళ్ళు కూడా లేరు. తనకు అన్న వాళ్ళు కనిపిస్తున్నారన్నాడు జాఫరు. వేగంగా నడక. మెల్లిగా నడవడానికి చిన్నపిల్లలం కాదు.

గుళ్ళోకి మేమెళ్ళొచ్చిన తరవాత వస్తానని, అప్పటివరకూ పిల్లల్ని చూసుకుంటూ ఉంటానని అంది అమ్మ. జనం అంత ఎక్కువ లేరు. చుట్టు చుట్టుగా బారికేడ్లు, లోపలికి వెళ్ళడానికి టికెట్ పది రూపాయలు. అన్నే అందరి టికెట్లు తీసుకున్నాడు. క్యూ, ముందులో జానకి. నేను చివరన, పర్లేదు

కనిపిస్తుంది. క్యూ త్వరగా నడుస్తుంది, లోపలికి వెళ్ళే కొద్ది జనాలు పెరిగిపోతున్నారు. చేతిలో టెంకాయలు భద్రంగా పట్టుకున్నాను. వెనకనుండి తోస్తున్నారు, ముందున్న వాళ్ళు తిడుతున్నారు. వెనకో ముందో నేనెక్కడో అర్థం కాదు. ఊది కడ్డీలు విరిగాయో, బాగున్నాయో.

గుడిలో ఒక్కొక్కరుగా కనిపించకుండా మాయమైపోయారు. నా ముందున్న జాఫరు కూడా లేడు. దర్శనం అయ్యాక అటు ఇటు తిరుగుతూ కనిపిస్తారేమోనని చూసాను. అంత హనుమంతుని చిత్రపటాలు. బయటి దారిలో వెళ్తుంటే, ఆ దారిలో తమలపాకుల మాలతో జానకి ఎదురొచ్చింది. నా చేతిలో టెంకాయ్ ఒప్పులు, తన చేతిలో పెద్ద మాల. అక్కడ చాలామంది జనాల చేతుల్లో అలాంటి మాలలే కనిపిస్తున్నై. తను నాపై ఆ మాలేసి నన్ను తను చుట్టుకుంటే. శ్రీ శివ జానకి కళ్యాణం.

ఆనందమానందమాయేనే,

జానకి పెళ్ళి కూతురాయేనే,

శ్రీ శివగాడు పెళ్ళికొడుకాయేనే.

ఇంద్రాది దేవతలు బంధు మిత్రులు. హనుమంతుడు సాక్ష్మి భూతుడు. వాయించండి, వాయించండి. భజంత్రీలు, భజంత్రీలు.

నన్ను చూసి కూడా ఏం ఎరగనట్లే, నేనెవరో తెలినట్లే జానకి దాటిపోయింది. ఎంత నిర్లక్ష్యమో. ఇక్కడ ఈ ఉక్కలో చేసేదేం లేదు. బయటకు నడక. కోతులు, గుళ్ళో కూడా కోతులు. జాగ్రత్త, టెంకాయ్ ఒప్పులు ఎత్తుకెళ్తాయి. గోపురాలపై కోతులు. రోడ్డు మీదకొస్తున్నాయి. ఆ కోతి నావైపే చూస్తుంది. అదో కోతి అంతే, నాకు భయమెందుకు. జాగ్రత్త, టెంకాయ్ ఒప్పులు. కోతులు, మనుషులు. మనిషి ఒకప్పుడు కోతే. అంటే మన తాతలు అవి. తాత కోతి. నేను కోతి, మారుతి కోతి, రాముడూ కోతే, జానకీ కోతి, అంతా కోతులే. ప్రపంచమొక కిష్కింద సామ్రాజ్యం.

అమ్మ దగ్గరి కొచ్చేసాను. నేను పిల్లల్ని పట్టుకుంటే, అమ్మ క్యూ లో వెళ్ళిపోయింది.

ఒక్కొక్కరుగా నా దగ్గరికొస్తున్నారు. ముందు జాఫర్, తరవాత చెన్న, వదిన, అన్న, జానకి, అవ్వ, అమ్మ, మదారు, బోయామే. పైన కోతులు. ఇక్కడ అన్నదానాలు జరిగే చోటు తనకు తెలుసునని అక్కడికి వెల్దామని జానకి అందరితో అంది. ఈ గుడికి జానకి ప్రతి యేడు వస్తుందంట. ఆటోలో తను చెప్పేప్పుడే నేను విన్నాను. నేను ఎప్పుడో, నా చిన్నప్పుడు ఒక్కసారి వొచ్చాను అమ్మవాళ్ళతో. అప్పుడు ఏం చూశానో, ఏం చేశానో కానీ, ఆనాడు తిన్న గుత్తోంకాయ్ కూర, నా చేతి లడ్డు ఎత్తుకెల్లిన కోతిపిల్ల గుర్తుంది. జానకి, త్వరత్వరగా ముందు కదుళ్తుంటే వెనకాలే మేమంతా. ఓ కోతి ముందేళ్తుంటే దాని వెంటే మిగతవన్నీ. మా కాళ్ళకి చెప్పుల్లేవ్. మేమంత వాటిని ఆటో దగ్గరే విడిచిపెట్టొచ్చాం.

పదండి ముందుకు,

పదండి తోసుకు

పై పైకి.

పార్కులు దాటాం, హోటళ్ళు దాటాం, కదం తొక్కుతూ పదం పాడుతూ నాలుగు రోడ్ల కూడలిని దాటాం. సత్రం. బయట కట్టలపై కూర్చొని భోజనాలు చేస్తున్నారు. కడుపులో ఎలుకలు, కాదు లడ్లు ఎత్తుకెళ్ళే కోతి పిల్లలు.

అందరూ కొద్దిగే తినేశారు. ఆటోలో మేం తెచ్చుకున్న చల్దీలు ఉన్నాయి. వాటిని కూడా తినాలి, పొట్ట పూర్తిగా కాదు, కొంచెమే. పాయసం బాగుంది, సాంబరే ఉప్పు లేదు. కొంచెమే కదా, ఏం కాదు. వేళ్ళని నాకేసి విస్తరకు పారేసి,

పదండి వెనక్కి,

పదండి తోసుకు,

ఆటో దగ్గరకు.

పూలు, కనకాంబరాలు, గులాబీలు, మల్లెపూలు, రండమ్మ మూరె పది.  అన్న భుజాలపై ఉన్న రూప ఏడుస్తుంది. తనకి బొమ్మ కావాలి. ఆడాల్లు గాజుల అంగడి దగ్గర నిలబడిపోయారు. అన్న బొమ్మల షాపు. నేను, జాఫరు ముందుకి. శివా, బాగున్నాయి కదా గొలుసులు. బానే ఉన్నాయి. జాఫరు తాను కొనుక్కుంటానన్నాడు. ఎంతన్నా? ఒక గొలుసుని పట్టుకొని అడిగాను.

"నలభై. "

"నలవై, ఇరబైకి ఇయ్యన్న. "

"యాలేదు, లాస్ట్ మాట ముప్పై. "

"ఇరవై అయిదు. "

"సర్లే, ఇయ్యండి..."

ఇయ్యండా, ఇరవైకే ఆడిగింటే బాగుండు. ఇచ్చేవాడేమో. మోసపోయాం ఐదు రూపాయలు. వొద్దని అందామా, కానీ రేట్ ఒప్పుకున్నాక ఎలా వొద్దంటం. జాఫరు తీసుకున్నాడు. వాడే కదా మోసపోయింది, నేను కాదు. వందకి మూడు, వందకి మూడు. దేవుడి బొమ్మల్లో కొన్ని కోతులు. దొంగలు.

ఆటో ముందు నిలబడి షాపుల వైపు చూస్తున్నాను. అంతా వొచ్చేశారు కానీ ఇంకా జానకి, వదిన ఇద్దరు లేరు. ఎంత సేపు? వస్తున్నారు. నేను తన్ని చూస్తున్నాను. తను నావైపే చూస్తూ వస్తుంది. అరె, తల కిందకు దించడం లేదు. భయం కదా నేనంటే, అయినా చూస్తుంది. నేను అసహ్యం కాదా, లేదు ఈరోజు కొత్త ప్యాంట్ వేసుకున్నాను. నాకే భయం, వొద్దు వదిన నన్నే గమనిస్తుంది. తల దించేసాను. మళ్ళీ తల ఎత్తితే తన చూపులు నావైపే.

ఆటో ఈసారి మద్దికెర వైపు సాగింది. అక్కడే అమ్మవారి గుడి ముందు భోజనాలు చేయాలనుకున్నాం. గుడి ఆవరణ మొత్తం చెట్ల నీడ. అక్కడక్కడ మొక్కు ఉన్నవాళ్ళు అన్నదానాలు చేస్తున్నారు. మేం మా చల్దీలు తినాలి. గుళ్ళో దర్శనం చేసుకొని అంత వేప చెట్టు కింద కూర్చున్నారు. ఆటో డ్రైవర్ని పిలిచాం. ఆయన మాకు కాస్త దూరంగా కూర్చున్నాడు. కులం కారణం. తక్కువ, ఎక్కువ. కమ్యూనిజం రావాలి. అసమానత్వం పోవాలి. ఇంటి దగ్గర చేసుకొచ్చిన పాయసం పెట్టింది అందరికి వొదిన. జానకి పులిహోర చేసుకొచ్చింది. తను అందరికి వడ్డించుకుంటు ఇంకా కావాలా వద్దా అనడుగుతుంది. నన్ను అడుగుతాది. మొదటిసారి నాతో మాటలు. నేనేమనాలి. కొద్దిగా చాలు జానకి. వొద్దు. బొజ్జి అందాం. కాదు, ఫోటే. బొజ్జె బాగుంటది. మరి తానేమంటాది. అమ్మని అవ్వనీ, వదినని అత్త అంటుంది. నన్ను. నన్ను మామ! మామే! మామ చాలా అంటుంది. నేనప్పుడూ ఆ సరిపోతుంది బొజ్జి అంటాను.

జానకి నా విస్తరాకు ముందు వొంగిని తన గిన్నెలోని పులిహోర ఓసారి వేసింది. ఏం అడగడం లేదు. అందర్నీ అడిగి నన్ను అడుగకపోతే, తన నోటి నుండి నన్ను మామా అనాలి. లేదు, ఇంకోసారి వేసింది. తను మాట్లాడదు. అడుగు. ఇంకా కావాలా వద్దని. అడగదు, పాపం ఇబ్బంది తనకి. మా అమ్మవాళ్ళు ఉన్నారు, గమనిస్తే బాగోదు. నేనే చాలన్నట్లు చెయ్యి చూపి తల ఊపాను. అప్పటికి నా తల కింద విస్తరాకు వైపే.

రెండు రోజుల క్రితం కూడా అంతే.

కార్తీక పౌర్ణమి రాత్రి గుడి దగ్గర కార్తీక పూజలు చేసే ఆడవాళ్ళకు మీనాక్షి ఆంటీ వాళ్ళు అన్నదానం చేయిస్తున్నారు. నేను, మల్లేష్‌తో కలిసి గుడికి దూరంగా కిరాణం ముందు కూర్చోనున్నాను. గుడి చుట్టు లైట్లు. రాత్రి మొత్తం జాగరణ, భజన చేస్తారని విన్నాను. ఆ రాత్రి మొత్తం పూజలు చేసేవాళ్ళు గుళ్ళోనే ఉంటారు. జానకి ఉంటుంది, నేనూ ఉండాలి. భజన పాటలు పాడాలి. ఇవే మాటలు మా ఇద్దరి మధ్య. జానకి ఓ గిన్నె, అందులోనే కొన్ని విస్తరాకులు పట్టుకొని కిరాణం దగ్గర కొచ్చింది. గుళ్ళో ప్రసాదం మిగిలిందేమో. కిరాణం చుట్టూ పక్కల ఉన్నవారికి విస్తరాకు ఇచ్చి అడుగుతూ ప్రసాదం పెడుతూ వెళ్తుంది. నా దగ్గరకు వొస్తుంది, నన్నూ అడుగుతుంది, నాక్కూడా పెడుతుంది. నన్ను పలకరిస్తుందని ఆశ. నాతో మొదటిసారిగా అనే ఆత్రం. నా ముందుకొచ్చింది. నేను తనవైపు, తను నానుండి గిన్నె వైపు. నా చేతికి విస్తరాకు అందిస్తుంది అనుకుంటే తను నన్ను అడగను కూడా అడగకుండా కూర్చున్న నా ఒడిలో పెట్టేసింది. గాలికి ఎగురుతుందనే ఆలోచనే లేదు. నేనే పట్టుకున్నాను. ప్రసాదం కూడా అంతే, ఒక గంటే వేసింది. అడగకుండా ఇంకో గంటే. నే చాలని అనలేను, తను అడగదు. నా పక్కనున్న మల్లేష్‌ని సరిపోతుందాని చూపు. నాకు పెట్టి వాణ్ణి అడగడం. వాడు నవ్వుతూ సరేననడం. ఇక అక్కడి నుండి నావైపు చూడకుండ వెళ్ళి పోవడం. నాకు ప్రసాదం పెట్టింది, పక్కనున్న మల్లేష్‌కి పెట్టకపోవడం. తను నాతో నోరు తెరవలేదు. మౌనం, నేనూ మౌనం. నిశ్శబ్దం, తానూ నిశ్శబ్దం. గొంతుని ఆపేదెవరు? ఊపిరిని బిగపట్టేదెవరు?

ప్రయాణం, ఎక్కడికి ఈ పరుగు. పద, పద, పద. ఆటో పత్తికొండ వైపుగా. అక్కడున్న సాయిబాబా గుడిని చూసి వెల్దామని. ఇంకెంతదాక ఈ గుళ్ళ పిచ్చి. పత్తికొండకైతే వచ్చాం కానీ, ఇక్కడి నుండి ఎటువైపు ఆ గుడి. జానకి వాగడం మొదలెట్టింది. తను చెప్పిన దారిలో వెళ్తున్నాడు డ్రైవర్. ఎన్ని తెలుసు తనకు? ఈ గుళ్ళకి కూడా చాలసార్లే వొచ్చిందంట. బానే తిరిగింది. ఆటో కిందకు చూస్తూ, షాపులను గుర్తు పడుతూ, అలా ఇలా వెళ్ళాలని గుర్తులు. బాలాజీ వైన్ షాప్, మంది ఎలా నిలబడ్డారో. కక్కుర్తి. కోడుమూరు బస్సు. ఈ బస్సు ఎక్కితే ఊరికే. పందులు, రోడ్డు మీద భయం లేకుండా. అబ్బా, ఏమున్నాయి పైనా. ఊపుకుంటూ ఆ నడుము, ముడతలు, మొఖమే బాలేదు. పిల్లలు చూడు, ముట్టుకోవాలని లేదా!! ఒక్క అవకాశం. ముద్దులెట్టాలని. వేటిని? అందులో నుండి మలం వొస్తుంది. కంపు. పందులు. అదే కంపు. పంజాబీ డ్రెస్. అంగీ బాగుంది వాడిది. కాలేజి నుండి ఇంటికేమో. రేంజర్ సైకిల్. జానకి దగ్గర కూడా అలాంటిదే. కొట్టాల వీధి కెళ్ళాలంటే తను సైకిల్ తొక్కుకుంటూ వెళ్తుంది. పనికెళ్ళే పిల్ల జానకి తొక్కడం. తొక్కుతుంది, ఓ కాలు పైకి లేపి, ఇంకోటి కిందకు. చైను ఊడిపోతే మళ్ళీ ఎక్కించుకోవాలి. పైకి కిందకు. అరే, ఇక్కడే ఉండాలి, ఎక్కడ? ఇక్కన్నుండి ఎటేల్లాలి? రోడ్డు మీద వెళ్తున్న ఒకతన్ని దారి అడిగారు. ఆయన ఇక్కడే, పక్కకని చూపించాడు. జానకికి ఈ కాసింత ఎందుకొచ్చిందో కన్ఫ్యూజన్.

డ్రైవర్, డ్రైవర్‌తో పాటు మెట్లు ఎక్కలేని జానకి వాల్లవ్వ కిందే ఉండిపోయారు. మేమంతా మెట్లెక్కి కొండమీదకు పోయాం. అంతా పార్కులా ఉంది. అక్కడక్కడ గుళ్ళు. రాధ కృష్ణులు, శివలింగం, దాని వెనక కైలాస పర్వతం. దాని మీద కూర్చొని పార్వతి శివుడు. శివపార్వతులు కాదు, శివ జానకులైతే బాగుండు. గరుడుడు, చూస్తేనే అర్థమవుతుంది. ముక్కు చూడు. కాలెత్తు కూడా లేను నేను. ఆ చెట్టు కింద బుద్ధుడు. విగ్రహం వెనక ఉడతా. ఎక్కడికెళ్తావోచ్. పైన నెత్తి మీద కొచ్చింది. బుద్ధుడు ఉలకడు, పలకడు. దుఃఖానికి కారణం తలలో పేనులు. అదాయనకు తెలీలేదు. యోగి వేమన. సిమెంట్‌తో బానే కట్టారు. చేతులు బుల్లికు అడ్డం. వినరా వేమా నీతి శాస్త్రాలు ఎవడికి కావాలి? అది పెద్దగా ఉంటె సరిపోతుంది. చూసే ఆడాళ్ళు సొల్లు కారుస్తారు, మగాళ్ళు అసూయతో రగిలిపోతారు. ఎర్రమన్ను చుట్టూ, దాని మధ్యలో సరస్వతి. పెయింట్ లేదు. యేసు క్రీస్తు. ఆయన బొమ్మ కూడా. మరియ ఒడిలో క్రీస్తు. నిన్ను వలె జానకిని ప్రేమించు. ఇక్కడ తాకి, ఆపై ఆ వేళ్ళని దొమ్మలకు అటు ఇటు తాకి ముద్దెట్టుకోవాలి. వొదిన అలా చేసింది, జానకి మొక్కింది. మరి నేనూ? మొక్కడమా, దేవుడు లేడు. జాఫర్ ఫొటోలు దించమంటున్నాడు. నిలబడు. ఆ చెట్టు కనబడితే బాగుంటుంది. మరి అలా స్ట్రెయిట్‌గా వొద్దు. చెట్టు పై ఒక చెయ్యి పెట్టు. క్లిక్, క్లిక్. ఈసారి పోజు మార్చు. అక్కడికి రా, అక్కడ ఇంకా బాగుంటుంది. కురుక్షేత్ర కృష్ణుడు, అర్జునుడు. రథం ముందు నిలబడు. చెన్నకేశవులన్నా కూడా. పంచె కిందుకనుకో. జాఫరు గాని పాయింట్ ఫోటొలో బాగోస్తుంది. కొత్తది. క్లిక్, క్లిక్, క్లిక్.

ఒక్కొక్కరు ఒక్కో దిక్కుకు. సాయి బాబా గుడి దగ్గర కలిసాం అంత. లోపలి గోడలపై చిత్రపటాలు. ఎవరు గీశారో. ఎన్ని బొమ్మలు. సాయి జీవితం. ఒక్కొక్కటి ఇంపాధిగా చూడలనిపిస్తుంది. ఆగండి, చూద్దాం. వాళ్ళెవరు ఫొటోల వైపు చూడకుండ వెళ్తున్నారు. సరాసరి విగ్రహం వద్దకు. అంత తొందరెందుకు, బొమ్మలు ఇంత బాగా పెట్టుకొని చూడకుండ. పూజారి మంత్రాలు మొదలెట్టాడు. వరసగా నిలబడి మొక్కుతున్నారు. అమ్మ, బోయామే, జానకి, జాఫరు ఎక్కడ, మోహన్ వొదిన పక్కన. మూత్రం పోసాడు. అయ్యో! గుళ్ళో పోయడం. వేలెడంత లేడు, దేవుడంటే మర్యాద లేదు. నరకానికి పోతావు, సూదుల్తో గుచ్చుతారు జాగ్రత్త. జానకి బట్ట తీసుకొస్తానని అటు ఇటు చూసింది. పూజారి ఆ చిన్న గేటు పక్కన ఉందన్నాడు. తిరిగి ఆయన గర్భ గుళ్ళోకి వెళ్ళాడు. గేట్ తెరవడానికి తంటాలు, రావడం లేదు. అంత తనవైపే చూస్తున్నారు. అటు ఇటు నెడుతుంది. తాళమేమీ లేదు. ఎందుకు రాదు? వొదిన కూడా వెళ్ళి చూసింది. ఎక్కడి నుండొచ్చాడో జాఫరు. రావడం లేదు. ఎలా తెరవాలి. పూజారి గేటు దగ్గరికొచ్చాడు. ఆయన వెనకాలే నేను. అరె, అటువైపు సిలుకు చూడలేదా? అంత బాగా కనిపిస్తుంది. పూజారి చెయ్యి పెట్టి సిలుకు తీసి తెరిచాడు. ఇంత సులువు. ఎంత కష్టపడ్డారో. నవ్వులు.

ఇంకా ఏ గుళ్ళకు వొద్దు. సాయంత్రం అయింది. డైరెక్ట్ ఊరికే. వెళ్ళేలోగా ఎనిమిది కావొచ్చు. అంచనా వేసాడు జాఫర్, అంతే అవుతుంది. ఎటు లెక్కేసినా. జానకి మోహన్ గాన్ని ఎత్తుకుంది. తనమీద మూత్రం పోస్తే, ఏం జరుగుతుంది. అంత నవ్వుకుంటాం. నేనే పోస్తే. నేను, జాఫరు, అమ్మ వెనక. అంత ముందు.

రయ్యి. రయ్యి.

కొండలు దాటాయ్. కోనలు, వంకలు, చెట్లు!

జానకి నావైపు చూస్తోందా. వెనక్కి చూసాను. మొఖం దిగాలుగా పెట్టేసి బయటకు చూస్తుంది. ఎండిపోయింది మొఖం మొత్తం. ఈ సాయంత్రపు గాలి తనకేం గుర్తు చేస్తుందో! చనిపోయిన వాళ్ళ నాన్న? ఒంటరి పాపం. తానెప్పుడూ కూలికెళ్ళాలి. ఒక్క రోజు కూడా ఊరికే ఉండదు. అంత తనకోసమే, తన పెళ్ళి, కట్నం. ఆపై మొగుడు ఇవి తప్ప ఆడపిల్లలకు జీవితం లేదు. చదువు బలి, బాల్య వివాహాలు, మొగుడి దర్పం. మా అమ్మ, మా వొదిన పగలంత పొలంలో కష్టపడి ఇంటికొస్తే తిరిగి ఇంటి దగ్గర పని. మొగవాళ్ళలాగా దర్పంగా బయటకొచ్చి ఆనందించలేరు. కష్టపడాలి, ప్రతి చిన్నదానికి మొగుడి అంగీకారం. కాళ్ళు బయట పెడితే, మరో మొగోన్ని చూసిందంటే ఇంట్లో నరకం. చిన్నప్పటి నుండి ఎన్ని సార్లు కొట్టాడో నాన్న అమ్మని. ప్రతి చిన్న పనికి నాన్న మాటే వినాలి. మొగుడు కింద కుక్క తాను. మా అక్క, బావ కింద కుక్క. జానకి కూడా ఒకరి కింద కుక్కే అవుతుంది. రేవతి ఓ కుక్క. రాజేశ్వరి ఇంకో కుక్క. కుక్కలుగా ఉంచేందుకు చిన్నప్పటి నుండి క్రమబద్ధీకరమైన శిక్షణ. పుట్టాలి, పెళ్ళి చేసుకోవాలి, పాతివ్రత్యం, పిల్లలు, చావు. చదువు వొద్దు, ఆత్మ గౌరవం వొద్దు. తను వ్యక్తిననే స్పృహ అక్కర్లేదు. పెళ్ళి కోసం ఆ వొచ్చే మొగుడి కోసం స్వేచ్ఛ నుండి జాలువారే సహజ నవ్వుని ఆ నడత అందాలని తాకట్టుపెట్టడం. పెద్దత్త పరిస్థితి భయం నన్ను పెళ్ళివైపు లాగుతుందేమో. అలా చేసుకోవాలనుకుంటే, జానకిని నేనే చేసుకుంటే? జానకా, తను అందంగా ఉందనా మరి రాజేశ్వరీ, మరి రేవతి? పెద్దత్త, ఈరోజు మధ్యాహ్నం తిన్నదో లేదో. వారం క్రితం పౌరుషం మీద ఇంట్లో వాళ్ళకి తెలీకుండా చెట్ల పనికెళ్ళాను. ఆనాడు, తను మధ్యాహ్నం తినలేదంట. నాకోసం కేకలేసి, కేకలేసి నే పలకక పోయేపాటికి హైద్రాబాద్ వెళ్ళి పోయానేమోనని ఏడ్చిందంట. మా నాన్న ఏదో పని మీద పిల్లల్ని బైకు మీద ఎక్కించుకొని ఎక్కడికో వెళ్ళాడంటా. ఈరోజు చెప్పే వొచ్చాను. మధ్యాహ్నపు ఆకలి విషయాన్ని నాన్నకి ముందే చెప్పమని కూడా అన్నాను. నాన్న ఉన్నా నే లేకపోతే తనకి సయించదు. పాపం నిస్సహాయత, దానిపై కోపం. తనకీ కాళ్ళు రావని అర్థమవుతుంది, అత్త చచ్చేంత వరకు ఇక్కడనే ఉండాలని అనిపించింది కానీ, ఉండగలనా? నా జీవితం ఏం కావాలి? స్వార్థం, నా స్వార్థం. ఇంటి దగ్గర మాటికి తిట్లు. మలమూత్రాలు తీస్తున్నానని, ఇల్లు కడుగుతున్నానని అన్ని విషయాలు ఇంట్లో వాళ్ళకు తెలిశాయి. ఇలాంటివి ఎందుకు చేస్తున్నావని ప్రశ్నలు. మేం చేసేవి చాలవా అని అమ్మ కళ్ళు. త్వరగా హైద్రాబాద్ వెళ్ళమని, లేదంటే పనికి రమ్మని, ఇంటి దగ్గర అత్తకై ఉండొద్దని అన్న పోరు. వెళ్తాను, పనికో, హైదరాబాద్ కో. ఇంటి దగ్గరుండి పనికెళ్ళినా, హైదరాబాద్ వెళ్ళినా ఒకటే. జీవితాలు అందరివి అందరికి బరువుగానే ఉన్నాయి. పరిస్థితులు అందర్నీ మనమేంటో అసలు రూపాన్ని చూపుతున్నాయి. బలహీనత్వం. ఎంత బలహీనులుగా మనమంతా సృష్టించబడ్డాం. అందరూ అంతే, నేనూ అంతే. నా జీవితం, జానకి జీవితం, అమ్మ జీవితం, అక్క, రేవతి, రాజేశ్వరి, శ్రీలత, అలీం అందరూ బలహీనులే. దయలేకుండా రోదసి నుండి మనమంత ఇక్కడకు విసిరేయబడ్డాం.

ఆకాశమా!

నా మోర ఆలకించు!

అన్ని స్థితులను, భయాలను దాటేసే మార్గం చూపించు.

నేనెంత బలహీనున్నో అర్థమయ్యే కొద్ది నాపై నాకు అసహ్యం.

జానకి ఎందుకో నవ్వుతుంది. వెనక్కి తిరిగాను. ఆ నవ్వు నన్ను వెక్కిరిస్తున్నట్లు అనిపించింది.

# 8

చుట్టగాలి,

అనేక సుళ్ళు తిరుగుతూ నావైపొస్తుంది. వచ్చినట్లే వచ్చి వెంటనే నా వైపు తప్పించి మరో వైపు వెళ్ళిపోయింది. నేను కట్ట మీద నుండి లేచి అది వెళ్లిన వైపు చూడసాగాను. ఈ దర్గా వేప చెట్టున్న పొలాన్ని దాటేసింది. జానకి వాళ్ళ గుడిసెని దాటేసింది. ఆ గుడిసె మీదకి మళ్ళీ అసంకల్పితంగా నా కళ్ళు చేరుకుంటాయి, జానకి అక్కడ లేదని తెలుసు, తను కూలికి వెళ్లిందని సాయంత్రం వరకు రాదని తెలుసు. కానీ వచ్చిందేమో, మధ్యాహ్నమే ఏదో పనిమీదో ఇంకేదో అవసరమో..చూస్తాను, నిరాశ. మళ్ళీ కూలబడిపోతాను.

నేను కూర్చున్న కట్ట మీద అక్కడక్కడ వేప పండ్ల తొనలు. అటు ఇటు కదిలిపోతూ నేనున్న బండ మీద కొన్ని చీమలు. ముందున్న వేప చెట్టు కాండం దగ్గర్నుండీ వస్తున్న చీమలు, మరియు కట్ట కింద నుండి పైకి కాండం దగ్గరకు వెళ్తున్న చీమలు. బారుగా సాగే అవి ఒకదానికొకటి ఎదురుపడతాయి. పడ్డాక కాసేపు ఆగిపోయి తిరిగి వాటిని తప్పించి ముందుకెళ్తాయి. ఇలా ఎందుకు జరుగుతుందో అర్థం కాదు. ఏమైనా మాట్లాడుకుంటాయా? ఆ ఆగిపోయిన ఆ క్షణకాలంలో. అవేం మాట్లాడగలవు? నోరు తెరిచేలోగానే కాలం వెళ్ళిపోతుంది. మనకు అది క్షణమేమో కానీ వాటికి అదే రోజులో, లేక వారాల్లో. పురాణాల్లో అంటారు కదా మనకు కొన్ని వందల ఏళ్లు గడిస్తే బ్రహ్మకు ఒక్క క్షణం లాగా.

ఓయ్, ముక్కు బాలేని చీమ, నేను పైనుండొస్తున్నా, అక్కడ కొన్ని గండు చీమలున్నాయి జాగ్రత్త, ఈరోజు మా పుట్టలో చక్కెర విందుంది, సాయంత్రం వొచ్చేయ్.. చక్కెర విందా, నేను రాలేను , మాది ఈ రోజు మాంసం. చచ్చిన బల్లిని చూసాం.. చూడు, దానికి ఎన్ని టెక్కులు, నీకు తెలుసో లేదో దానికి కడుపు తీయించారు, కడుపు చేసింది ఎవరో తెలుసా, వాడే లోత్తోడు.. ఏయ్ చీమ జాగ్రత్త, ఏంటి నన్ను చూసి మీసం ఎత్తుతావ్, దించు, నీ కంటే నే పెద్దోన్ని.. పెద్దోడైతే ఎవరికెక్కువ.హే సమానత్వం.. సమానత్వం కావాలంట, జైల్లో వెయ్యండి, కొట్టండి, ఆ దొంగ చీమలకు హక్కులు కావాలంట. నరకండి.. అమ్మా, మనకు ఆ ఎర్ర చీమలనుండి స్వాతంత్ర్యం ఎప్పుడమ్మా? వొద్దు బిడ్డ అవేమి ఆలోచించొద్దు, అణిగిమణిగి ఉండు, అణిగిమణిగి ఉంటే వాటికి మనమ్మీద బోలెడంత కరునొస్తుంది, ఆపై మనకు కడుపొస్తుంది.. దేవుణ్ణి నమ్మండి, గ్రోమేక్ దేవుడు, ఆయన మనకోసం గండు చీమలకు బలయ్యాడు, మరియు ఆయన కరుణ గల దేవుడు, నమ్మని వాళ్ళని తన ఖడ్గం పంపి నరికేయిస్తాడు, జాగ్రత్త.. నిన్నే, ఎన్నాళ్ళన్ని నీ వెంట పడాలి. ఇప్పుడైనా నన్ను పట్టించుకో. ప్రేమించు, ముద్దులేట్టు. నిన్నా, నేనా, ఎన్నాళ్ళని నన్ను చంపుక తింటావ్, నిన్ను చూస్తే నాకు కంపరం, వెళ్ళు ఇక్కన్నుండి.. నన్ను చూస్తే కంపరమా.. జానకి చీమకు ఆ శివ చీమ నచ్చలేదు. కానది నాటకమేమో, ఊరికే ఏమంటాడో ఏం చేస్తాడో తెలుసుకుందామనేమో.

ఓ బ్లేడు నా చేతిలో ఉంటే బాగుండేది. ఇష్టమొచ్చిన చీమల్ని సగం సగం నరికేవాన్ని. ఏదో ఉపద్రవం వచ్చిందేమోనని చంపబడుతున్న చీమల్ని చూసి మిగతా చీమలు దాక్కువొచ్చు, ఏడవొచ్చు, మమ్మల్ని కాపాడమని గ్రోమేక్ దేవుడికి మొక్కవచ్చు. మాకు కుటుంబాలు ఉన్నాయి, విడిచిపెట్టమని ప్రార్థేయపడొచ్చు. వీళ్ళ దృష్టిలో కుటుంబాలు లేనివాళ్ళని ప్రాణాలు కాదు. కానీ నాకు మాత్రం అవేమి

వినిపించవు. అందర్నీ దొరికినట్లు ఏం ఆలోచించకుండ నరికేస్తుంటాను. చీమల్నే చంపడం అంత పాపమనిపించదు, అంత బాధ పడ్డానికి అవి కనీసం ఎలుకలైన కాదు. చీమలు అంతే. పైగా అలా వాటి బతుకుల్తో ఆడుకోవడం అదో వినోదం.

చిన్నప్పుడు ఎక్కడ చీమల దండు కనిపించినా వాటి మీదకు అగ్గి పుల్ల అంటించొ లేక పిన్నిసులతో గుచ్చో చంపి వినోదించేవాన్ని. శ్రీలత మాత్రం పాపమనేది. కర్మాల చుట్టుకుంటాది అని భయపెట్టేది. అయినా నేనెక్కడ వింటాను. తనకు ప్రతీది పాపమే. తునిగ తోకల్ని దారంకు కట్టి ఆడుదామన్నా, బింగన్నలను తెచ్చుకొని అగ్గిపెట్టలో దాచుకుందామన్నా, కుక్కల్ని రాళ్లతో కొడుదామన్నా అవీ వొద్దనే వారించేది. కూర తినేది కాదు. తినడానికి కోళ్ళని మేకల్ని కోసేప్పుడు ఆ చంపబడుతున్న వాటిలో మనల్ని చూసుకోవాలనేది. తనకి ఇవన్నీ ఎవరు చెప్పారో?? ఇప్పుడు నేను మిడతలో నన్ను చూసుకోవాలి. నేను చంపబోతున్న మిడత.. దాని తలని చితక్కొటినప్పుడు అది నా తల అనుకోవాలి. భయమేసింది, అసలు నే చంపగలనా అనే సందేహం.

మిడత,  
నువ్వెందుకు వస్తావో అక్కడికి,  
ఇంకెక్కడ చోటే లేనట్లు.

ఏదో మిడత. అత్త ఉన్న గుడిసెలోకి నిన్న సాయంత్రం వస్తుంటే అత్త నన్ను చూసి దాన్ని చంపమంది. నేనెక్కడ చంపగలను. బయటకు తోలేశాను. అత్తేమో ఆ మిడత రోజూ గుడిసెలోకి వస్తుందని, చంపాలని అంటుంది. అదెక్కడ తనమీదకెక్కుతుందో, ఎక్కి ఏం చేస్తుందో. భయం. ఈరోజు పొద్దున అది మళ్ళీ గుడిసె బయట కనిపించింది. చంపాలనిపిచ్చింది, కానీ చంపలేదు. శ్రీలత చెప్పినట్లు అందులో నేనె ఉంటాను, ఎలా చంపగలను? కానీ చంపకపోతే, అత్త స్థితి అర్థం చేసుకొకపోతే. చంపడం కాదు, నాకు చేతనవ్వదు. అది గుడిసె దగ్గరకే రానట్లు ఉపాయం వెతకాలి, ఏం చేయాలో?

నిద్రొస్తున్నట్లుంది. ఇక్కడే కాసేపు ఈ చెట్టు నీడలో కట్ట మీద పడుకుంటే బాగుంటుంది. ఇంటి దగ్గర మోహన్ గాడు ఇంకా లేచి ఉండడు, ఒకవేలా లేచినా మల్లిక రూప ఇద్దరూ ఉన్నారు వాడిని ఆడించుకోడానికి. దొడ్లో ఎద్దులకు ఇంతకు ముందే మేతేసొచ్చాను. మళ్ళీ ఎప్పుడొస్తానో ఈ చెట్టు దగ్గరకు. ఈ వేప చెట్టు దగ్గరే నా జీవితంలో ఎన్నో అద్భుత అనుభవాలు నిక్షిప్తమై ఉన్నాయి. ఒక్కోసారి ఈ చెట్టె నా పూర్తి జీవితమనిపిస్తాది. ఆ కొమ్మలు, ఆ ఆకులు. ఎవర్ని నేను మరిచినా దీనెప్పుడు నేను మరిచిపోను. ఆ కొమ్మలు, ఈ కట్ట, దీని చుట్టూ పక్కల ఉండే గుండ్లు, ఆ బుడం దగ్గర ఉండే దస్తగీరయ్య స్వామి జెండా. ఎక్కడ పడుకోవాలి? ఇక్కడ బండ మీద ఇన్ని చీమలున్నాయి. చీమలు ఉండని మరో బండ వెతుకున్నాను. అక్కడ చీమలు లేవని కాదు, అక్కడక్కడ కొన్ని బండల మధ్యలో ఉన్న సిమెంట్ పొక్కుల్లో కనిపిస్తున్నాయి. నా భుజాల మీది తువ్వాలతో వాటిని చెదరగొట్టి తువాలను బండ మీద పరుచుకున్నాను. గ్రోమేక్ శకం పలానా యేడులో వేప చెట్టు దేశంలో పొక్కులున్న పెద్ద బండ రాష్ట్రంలో ఓ పెద్ద తుఫాన్ చెలరేగి కొన్ని చీమల్ని చెదరగొట్టినట్లు చీమలు తమ ప్రపంచ చరిత్రలో లిఖించికోవొచ్చు.

కళ్ళు మూసుకుంటే నా కళ్ళలో మొదట ఓ పెద్ద చుట్టగాలి కనిపించింది. అది అనేక సుళ్ళు తిరుగుతుంది. అది అలా తిరుగుతూ తిరుగేస్తూ కె[్రన్న పొలం వైపుకెళ్ళింది. అక్కడే పత్తి పొలంలో పత్తిని తీస్తున్న జానకి, తన పక్క సాలులో వెనుకనే జాఫర్. మిగతా కూలోళ్లు ఇద్దర్ని పట్టించుకోవడం లేదు.

"లే, జాఫర్.. నువ్వు మొబ్రెస్ తాత కొడుకు ఏంటికిలే, ఎప్పుడు దొడ్ల నుంచి మా గుడిసెకెళ్ల సూసుకుంట ఉంటరు"

అడుగుతుంది జానకి.

ఎందుకోసం?

ఓ జానకి, మేం కేవలం నీకోసం చూస్తుంటాం. ఇలా జాఫర్ చెబితే ఏమంటుందో?

"మీ గుడిసెకెళ్ళి కాదు ఫోటే, ఆ ముండ్ల కంపల్లోనా తేనెలుంటాయని బుడుకుతుంటాం."

ఎంత అబద్ధం. నమ్ముతుందా. నమ్మినట్లే ఇంకేం అడగలేదు. ఆ గుడిసెకి మా దొడ్డికి మధ్యలో ఉన్న కంపల్లో మేం తేనెకోసం వెతుకుతుంటామని మేం కావాలని అటువైపు చూడమని. ఎలా నమ్ముతుంది? తనకు ఎప్పుడో తెలుసు, మేం తనకోసమే చూస్తుంటామని. తనకూ అదే కావలేమో. మేం చూడ్డం. ఎందుకు ఈ రోజూ శివగాడు పొద్దున గుడి దగ్గరకు రాలేదు, ఎందుకు నావైపు చూళ్ళేదు. నేనేమో తన్ని చూడకుండా రేవతినో ఇంకెవరినో చూస్తుంటాను. ఏంటి, నన్నొదిలేశావా?? ఎటూ బయటపడనందుకు. శివా, వాళ్ళని మాత్రమే కాదు, నన్నూ చూడు. మరింత సింగారించుకొని గుడికి వస్తుంది. నా కోసం గుడి దగ్గర వెతుకుతూ వేసారుతూ. మనం ఇలానే ఆటలాడాలి. ప్రతి పూట పాటలు అల్లుకోవాలి. ఎంత నొచ్చుకోనుంటుందో. అందుకోసమైనా ఇంకా ఇంకా ఆత్ర పడాలి. ఇలానే అనుకుంటుందా?? వీడేంటి జిడ్డు. ఇంకేం పన్లేదా? ఆడిపిల్లల్ని సూస్తే సాలు. సొల్లు. త్థూ. గలీజ్ నాయలు.

నా మీద ఎంగిలి పడింది. పర్లేదు, తను కాదనుకుంటే తనకు తెలికుండనైనా చూస్తాను. అంతే చెయ్యగలను. కె[్రన్న పొలంలో మాటేసిన చుట్టగాలి అది అలానే ఇంకా ముందుకు వెళ్ళిపోతుంది. దాని పరుగుకు అడ్డు లేదు. కాలంలో వెనక్కి కూడా వెళ్తుంది. రెండేండ్లు వెనక్కి. అలా వెళ్లిపోయిన అది మా సీడు పత్తి పొలంలో ఉంది. అక్కడ జానకి, తన పక్కనే మా ఒదిన. అది సాయంత్రం. ఇద్దరే ఇంటికొస్తున్నారు.

"ఫోటే జానకి.. మా మరిదిని పెండ్లి సేసుకో."

నవ్వుకుంటూ అడుగుతుంది వదిన. నవ్వులాటకే అన్నట్లు. ఇంకా తను చిన్నపిల్లే అయినట్లు.

"గా, సుడి.. ఇంకోపారి అట్ల అంటే జీవితంల మాట్లాడను సుడి నీతోటి."

కోపం. లేక మోహమాటమో. లేదు కోపమే అది. ఆ చిన్నతనంలోనే కాదు, ఎప్పటికి అది అలానే ఉండిపోతుంది. తన్ని నేనెలా మెప్పించగలనో అర్థం కాదు. నా వేషం మార్చలేమో, లేక నాకు అతీత శక్తులుండాలేమో. శక్తులంటే ఎలాంటివి? మాయ టోపి లాగా. చిన్నప్పుడు నే విన్న కథ. రాము అనే మంచి బాలుడికి ఓ ముని కుచ్చిటోపీ ఇచ్చాడంట. ఆ టోపి ప్రత్యేకత ఏంటంటే అది పెట్టుకోగానే మనం కనిపించకుండ మాయమవుతామంట. అలా మాయమైపోయిన నేను జానకి గుడిసెలోకి వెళ్తాను. తను

అక్కడ ఏదో పనిలో ఉంటుంది. ఓ జానకి అంటాను. తను అటు ఇటు చూసుకుంటుంది. ఎవరు తన్ను పిలిచింది..

"భయపడకు, నేను శివ సామిని."

"యా శివ సామి. కనబడ్తలేరు."

"శివ సామి అంటే శివుణ్ణి. దేవుణ్ణి. నువ్వు ఎంత వెతికినా కనిపించను. నీకో విషయం చెబుదామని వచ్చాను."

జానకి ఏం చేస్తుంది. భయపడుతుందా? లేదు, తన పూజలకు మెచ్చి దేవుడు కరుణించాడు.

"ఓం నమశివాయ..శివాయ నమః ఏంది సామి ఆ ఇసయం."

"మొబ్రాస్ కొడుకు శివగాడు తెలుసు గదా"

"ఆ తెలుసు సామి."

"వాడు నిన్ని లవ్వు సెసేడే.. నువ్వా వాణ్ణి ప్రేమించల్ల. వాడు సూస్తుంటే నువ్వాఆనివైపు కన్నార్పకుండా సూడల్లా. మీ ఇద్దరు ఒక్కటైతే నాను నీ కడుపుల లోకంమంచి కోసం అవతారం ఎత్తుతా."

సరే అంటుంది జానకి. అంతే! ఇక నేను వద్దన్నా నా కోసం చూస్తుంది. మా ఇంటికి మాటికి వస్తుంది. నన్ను చూసి నవ్వుతుంది. ఇద్దరం కావాల్సినంత ముచ్చట్లు పెట్టుకుంటాం. ముద్దులాడుతాం. ఊర్లో తెలిసిపోతుంది. అది ఓ విప్లవంకు దారవుతుంది. మా అమ్మకూ తెలుస్తుంది. నేను జానకినే చేసుకుంటానని అమ్మతో అంటాను. ఎలా చేసుకుంటావు, తను మన కులమే కాదని అమ్మ అంటుంది. అప్పుడూ మళ్ళీ టోపీ పెట్టుకుని అమ్మకూ నాన్నకు కనిపించకుండా దేవుడిలా బీరప్ప సామిలా వాళ్ళని, ఊర్లోవాళ్ళని అందర్నీ నా వైపు తిప్పుకుంటాను. మరి రేవతి? తన్నీ అలానే చేసుకుంటాను. ఊర్లో పెద్దమంచులకు దర్శనం ఇచ్చేసి శివ రెండు పెళ్ళిళ్ళు చేసుకోవడం లోకక్షేమమని వాళ్ళతోటే పలికిస్తాను. మరి జయలక్ష్మి. తన్ని కూడా. రాజేశ్వరి. ఎంతమందిని చేసుకోవాలి, ఎలా పోషించాలి? పెళ్లొద్దు. ఊరికే అందరితో ఆడుకుంటాను. ఇప్పటికన్నా మరింత గొప్పగా. మరింత ఆసక్తిగా. జానకి గుడిసె కంటే ముందు ఆ కుచ్చుటోపీ పెట్టుకొని ఓ అద్భుత ప్రదేశంకు వేళ్ళాల్సుంటుంది. బాత్రూమ్. మీనాక్షి ఆంటీ బాత్రుం అది. తనేమో ఒంటిపై బట్టల్లేకుండా స్నానం చేస్తుంటుంది. నేను మొత్తం తేరిపారా చూస్తుంటాను. కిందున్న ఆ పూకుని. ఒక్కసారి ముట్టుకోవాలి, అలాగే పైనుండే ఆ సన్నులను, ముచ్చికలని, పిర్రలని. స్పర్శ తెలుస్తుందంటావా. తెలిస్తే ఇంకింత మజా ఉంటుంది. తన ఒంటిపై చక్కిలిగింతలు ఎలా వస్తున్నాయో తనకర్థం కాదు. నవ్వుతుంది, ఆ కళ్ళని పూర్తిగా విప్పారుస్తూ, పెదాల్ని మునిపంటితో కొరుకుతూ ఆ పూకులో తన వేలుని దోపుకొని. ఒక్క కుచ్చుటోపీ, నా కోరికలన్నీ నెరవేరిపోతాయి. ఎందరి పూకులు చూడగలనో అనిపిస్తుంది. దేశ మంత్రులు, సినిమా వాళ్ళు.

చుట్టగాలి ఈసారి అలానే నిన్నటి సాయంత్రానికి నన్ను లాకెళ్లింది. పులకుర్తి రోడ్డు మీదకు. నేనూ, నాకు పక్కనే లక్ష్మన్న గాడు. వాడు పులకుర్తికి ఏదో పని మీద వెళ్ళొస్తున్నట్లు చెబుతున్నాడు. నేను ఈత వంపులో దొడ్డికి పోయోస్తున్నాను. వాణ్ణి అడిగాను. ఏమంటాడో అని.

"బాయి జానకీ బల ఉంటాది కదా?"

"సూప్పర్."

"మంచి పిల్లనేనా ఆ ఫోట్టి."

వాడేం చెబుతాడో అన్నట్లు?

"ఏం మంచి పిల్లలే, గబ్బుది. బీరప్ప గాడు ఆ ఫోట్టిని ముద్దు పెట్టుకోనే తెలుసా నీకి.."

అప్పుడెప్పుడో బీరప్ప పొలానికి ఒంటరిగా వాడి వెంట కూలికి పోతున్నందుకు అంత దాకా వచ్చినట్లు తేల్చేస్తున్నాడు

"ఆ పిల్ల ఓటే గాదు, వొళ్ళమ్మ గూడ. మొగుడు లేడు గదా, ఇంగ ఇష్టమొచ్చినట్ల ఆట్లు ఆడ్తారు. వాళ్ళ సిన్నమ్మ గూడ. గా ఆ గేరి మంచి ఉంచుకోడెలే ఆ లంజల్ని.."

ఇంకా,

ఇంకా వాగుతున్నాడు లక్ష్మన్న. అవన్నీ వాడికి ఉన్న కోరికలే. నెరవేరలేదని పుకార్లు అల్లుతూ ఆనందపడుతున్నాడు. జానకిని ముద్దు పెట్టాలని వాడికి ఉంది, ఇంకెవరో ముద్దు పెట్టినట్లు, జానకి చిన్నమ్మని హత్తుకోవాలని, ఇంకెవరో హత్తుకున్నట్లు. ఆత్రపడే హృదయం.

ఇలానే ఇంకెంత మంది జానకికై ఆత్ర పడుతున్నారోననిపిస్తుంది. రాజుగాడు. ఎందుకు గుర్తొచ్చాడు? ఏమో? పుట్టు మూగ చెవిటి వాడు. వాడికి జానకి వయసే ఉంటుంది. నాతో జాఫర్ తో పాటు వాడూ మా దొడ్డికొస్తాడు. మేం చూస్తున్నట్లే వాడూ చూస్తాడు. తనకోసం నాకు లానే ఆత్ర పడుతున్నాడెమో. ఎలాగూ తనకు దక్కదని ఆశొదిలేసి, నిస్సహాయంగా, ఒంటరిగా. పుట్టుక, అది వాడి చేతిలో లేనిది. ప్రేమ రాహిత్యంలో కామ రాహిత్యంలో కాలిపోవాలి. ఒకవేళ జానకి నన్ను ఇష్టపడితే వాణ్ణి ఇష్టపడాలంటాను. ఇది జాలి కాదు, గోడలు ఎందుకు కట్టుకోవాలి? ఓ జానకి, నన్ను ప్రేమిస్తే నన్ను మాత్రమే కాదు, వాణ్ణి కూడా ప్రేమించాలి. మనం ఒకరికొకరం ప్రేమించుకుందాం. ముగ్గరం, ఇంకా మనల్ని ఎందరు ప్రేమిస్తారో వాళ్ళందరం ఒకరికొకరం. ఆటలు ఆడుతూ పాడుతూ, ఈ లోకం ఆత్రపడే వారందరికోసం నందనవనంగా ముస్తాబవుతూ.

కానీ జానకి ఒప్పుకుంటుందా? జానకే కాదు లోకమే నన్ను ఒప్పుకోదు. నేనేదో పిచ్చోన్నో లేక నేనేదో ఏం తెలినోన్నో అనేస్తుంది. ఒక్కరనే ప్రేమించాలి, వాళ్ళతోటే పెళ్లి, సంసారం. ఇదే గొప్ప ప్రేమ. ఒక్కరితో అంటే, మలినం ఉండని ప్రేమ. మలినం? ఎంత ఎక్కువమంది అయితే అంతగా పూకో బుల్లో మలినమవుతుంది. జీవితాంతం ఒక్కర్ని అంటే అది మరింత స్వచ్ఛత. పోనీ ఇంత చెప్పే వాళ్ళు రాజునొక్కడిని ఎందుకు ప్రేమించరు? వాడితో బూతుకు. కారణాలు వెతుక్కుంటారు. తప్పించుకుంటారు. ఎవరో దొరుకొచ్చు. కానీ ఎవరో? నూటికో కోటికో? వాడి మరదలు వాణ్ణి చేసుకోను అందంట. ఎలా చేసుకుంటుంది? నేనూ అదే అనేవాన్నేమో. జానకి అదే అంటుంది..ఈ లోకమే హింసా పూరితం. ప్రతిక్షణం నే నడుస్తున్నప్పుడో గాలి పీలుస్తున్నప్పుడో సబ్బు రుద్దుకుంటున్నప్పుడో నేనెన్నో వేల క్రిముల్ని, చీమల్ని చంపినట్లు.. అంతటిని చంపేసి మిడతని చంపడం పాపమంటాను. శాకాహారినైన నేను ప్రాణమున్న మొక్కల్ని తింటున్నట్లు, నన్ను కాటేస్తుందేమోనని దోమల్ని చప్పున కొట్టినట్లు.. ఒకదానికొకటి చంపుకునేట్లే దేవుడు మనల్ని పుట్టించాడు..ఖౌర్భాగ్యుడు.. వాడే ఇంత నీచానొడికట్టి మేమె పాపం చేసినట్లు ఏదేను తోట నుండి మమ్మల్ని బహిష్కరిస్తాడు. అందరూ అందర్నీ చంపేస్తారు. ఇక్కడున్న పాము నన్ని చంపినట్లు. అవును. ఈ దర్గా చెట్టు దగ్గర శ్వేత నాగు ఉందట. ఆ రాళ్ళ వెనక పొదల్లో ఉన్న పుట్టలో. అదొచ్చి నన్ను కొరికితే. అరె అది నన్ను

చంపేలోగా దాన్నే నేను చంపాలి. పాము నన్ను చంపేలోగా మిడతను చంపాలి. మిడత కంటే ముందు చీమల్ని నరికేయ్యాలి. శివా, అందులో ఉండేది మనమే అంటుంది శ్రీలత. అవును జానకిలోను, నీలోనూ, నాలోనూ నిన్ను కొట్టే నీ మొగుడిలోనూ మిడతలే ఉన్నాయి, వాటిని చంపకపోతే అవే మనల్ని చంపేస్తాయి.

# 9

కుక్క,

తింది,

పడుకుంది.

ఇంకేం. లే మొద్దు నిద్ర వదులు. సోమరికాకు. కీళ్ళు సవరించు. వెతుకు, పోరాడు. దాచుకో తిండి. మరో పూటకు, మరో వారంకు, మరో నెలవరకు. ఎంత ఎక్కువ దోచుకొంటే అంత తినేయి. ఏది మిగిలేయకు. కనిపించిన ప్రతి ఆడకుక్క వెంట తోక ఉపుకుంట పోతున్నావ్. సిగ్గు, శరం అక్కర్లేదా? అలా కూతలేస్తావేం? కుక్క జాతి పరువేం కాను? ఎంత అప్రతిష్ట నీవల్ల అన్ని కుక్కలకి. లే, ఏంటి తుప్పల్లో పడుకున్నావ్. అక్కడ పాములుంటాయి. భయం లేదా! చావొస్తుంది. చింతించు, ఎందుకు చస్తామో ఆలోచించు. కృశించు, నలుగు, పరిగెట్టు.

"లేయ్, ఎప్పుడు పోతావు లే హైద్రాబాద్ కి. "

రోడ్డు మీద నుండి కేకేశాడు కత్తాయన. బట్ట తల మీద చింత కొమ్మల నడిమి నుండి సూర్యుడు మెరుస్తూ, గర్భం దాల్చినట్లు పొట్ట.

"పోతా, ఇంగ వారం. "

"ఇంగ సదువుతుండవు అంట గదా. ఇంకెన్నాళ్ళప్ప సదువు. ఉద్యోగం రాదా ఇంగ. "

"ఏమో. వొచ్చినప్పుడు"

"ఏం జాబొస్తాదో ఏమో పా. సదువు పూర ఎనకేయినావంట. అప్పుడు సిన్న గున్నప్పుడు ఉన్నట్ల లేదంట సదువు మింద ధ్యాస నీకి. "

"ఏమొల్యా. "

"ఏంది ఎమోల్యా. మీ అమ్మోళ్ళు సూస్తే మావోడు సియ్యే అయితాడు లచ్చలు తెస్తాడాని సెప్పుకుంరి. నువ్వు సూస్తే సదువు ఎనికేటికి ఎసినావ్. కొంచెం ఆలోసించప్ప. "

"యాది జరిగేది అద్వైతాధి.. "

"నీకేం తెలుస్తది. ధూడ్లు పెట్టి సధివిచ్చినోళ్ళకి తెలుస్తది. అంత సదువు సదివి ఊర్ల ఉంటానంటే ఇంగేం పనికి రానట్లే నువ్వు. "

"యాదొకటి సిన్న పనన్నా రాదా?"

"సిన్నపని అయితే ఇంతకాటికి ఏంటికి సదవల్ల. నగుతారు సుడి సుశినోళ్ళు. మూసిలోనివి ఐతుండావ్. బెరింత మంచి జాబు తెచ్చుకొని పెండ్లి సేసుకో. ఊర్ల ఉంటే నాలక్కనే మాట్లు సుడి. "

"ఎవరన్నా ఏమన్నా అనుకోని. పెండ్లి ఐతే కానీ, లేదంటే ల్యా. ఉన్నకాటికి ఉంట. "

"ఏం పెండ్లి సేసుకోకుండ సన్నసుల కలుస్తవ. మీ ఎమ్మోళ్ళు సనా ఆశ పెట్టుకోరేలే. నువ్వు సూస్తే ఇట్లాంటావు. "

"మామూలే. అనుకున్నవళ్ళ అయితాయా"

"పా,,. నీకి సెప్పలేం పా. గబ్బు లేసేవే నువ్వంత. ఏం పనికి రాకుండ అయితావ్‌పా "

బీడీ వెలిగించాడు. మా రెండు ఎద్దులు కూడా మేత మేయడం ఆపి ఆయన మాటలు విన్నాయి ఇంతసేపు. ఆ నోట్లోని బీడీ, ఆయన మొఖం ముందు పొగ. నడుస్తున్న ఆయన వెనక్కి తిరిగి చుట్టేస్తున్న అదే పొగ.

నేను మోసం చేస్తున్నానా? నాపై ఆశలు పెట్టుకొని, ఏదో అవుతానని ప్రచారం చేసిన మా అమ్మవాళ్ళని. ఏది మోసం? కుక్కకు ఏది మోసం? పిల్లికి ఏది మోసం? ఎందుకు నాపై ఆశలు పెట్టుకోవడం. పెట్టుకున్నా, ప్రచారం చేసి ఆపై బాధపడ్డాం. పరువు పోతుందనా? నేనిక్కడే ఉంటే తల ఎత్తుకోలేమనా? వాళ్ళేం కోరుతున్నారు. కోరడం ఎందుకు? రేపటిరోజు ఏమవుతుందో ఎవరు చూసారు? నేను ఇలాగే ఉండటం ఎవరికి లాభం? మా ఇంటి మీద కోపమున్నోళ్ళకి లాభం. చదువు అటకెక్కిందని, పిచ్చి మాటలు చెబుతాడని వాళ్ళైతేనే నవ్వుకుంటారు. మా అమ్మవాళ్ళకు తగిన శాస్తే జరిగిందని వాళ్ళకే కులాస. ఇన్నాళ్ళు చెప్పుకొన్న ఆ జాబు ఏమైందని ఎత్తిపొడుస్తారు. నా వల్ల అమ్మవాళ్ళు మాటలు పడటం. ఎందుకు ఇదంత? నేనే ఎంత త్వరగా అయితే అంత త్వరగా ఊరి నుండి తప్పుకోవాలి. వ్యక్తి, తన జీవితం తాను బతికుతానంటే ఎన్ని ఆటుపోట్లు. ఇవి ఆటుపోట్లా!! పిచ్చి కేకలు. దెప్పి పొడిచేవాళ్ళు రోగగ్రస్థులు. కుక్క ఎవరి మాట పట్టించుకుంటుంది. పంది ఏ సిద్ధాంతం వింటుంది. మా ఎంపగొడ్డుకి ఏ సంప్రదాయాలు ఉన్నాయి?

చెట్టు మీద నుండి ఉడత గాట్లోకి దూకింది. గడ్డిలో కాస్త ముందుకెళ్ళి దొరికిన దేన్నో పట్టుకొని వాసన చూస్తుంది. నెమరేస్తూ ఎద్దు తల పైకెత్తగానే ఉడత గాటుని దాటేసి పరిగెత్తింది. అది అప్పుడు పట్టుకుంది చేతిలో ఉందో, కింద పారేసిందో. ఎవరో ఇద్దరు వస్తున్నారు. పంజాబీ డ్రెస్ ఒకరు, నైటీ ఇంకోరు. ఎవరూ? సుజాత, మౌనిక. వాళ్ళే! వదిన మరదళ్ళు. మౌనిక మొగుడు సుజాతకి అన్న. ఒంటరిగా ఎటో పోతున్నారు. ఎక్కడికి? ఎక్కడికైతేమ్. వాళ్ళని ఆపేయ్, రమ్మని ఆడిగేయ్... గడ్డివాము చాటుకి తీసికెళ్ళి కామం చేసేయ్. ఎవరు లేరు. ఒప్పుకోకుంటే లొంగదీసుకో. సుజాత ఎవర్ని ముద్దు పెట్టుకుందో నీకు తెలుసు. మౌనిక అలీంతో పడుకున్నది కూడా తెలుసు. బెదిరించు. ఈ విషయాలు వాళ్ళింట్లో చెబుతానను. మాట వింటారు. ఖచ్చితంగా లొంగిపోతారు. వాళ్ళకి కామం ఎక్కువే. ఛాన్స్ మళ్ళీ రాదు. వొద్దు సుజాతకి గర్భం వస్తే నామీదకే, పెళ్ళి కాలేదు ఇంకా. పోనీ మౌనిక. తనకి గర్భం వచ్చినా అది మొగుడి కౌన్ట్. సుజాత, మౌనికని ఏమనలేదు. ఇద్దరు ఒకరికొకరు తెలిసే అన్ని పనులు చేస్తారు. వెళ్ళు, అడుగు, బరి తెగించు. తుళ్ళి తుళ్ళి పడబోకు తునకరి బొమ్మ! మళ్ళీ మళ్ళీ రాబోదు మానవ జన్మ!

వెళ్ళి పోయారు. ఎంత పని చేశావు? ఛాన్స్ ని వదులుకున్నావ్. బెదిరించి లొంగ దీయడం తప్పు. తప్పా, భలే చెప్పావ్. చేతకాక శనివారమంటావు. ధైర్యం లేదు. ఒట్టి పిరికోడివి. అడగడం తప్పెట్ల ఐతది. వాళ్ళకి ఇష్టమే కామం. ఒప్పుకునేవాళ్ళు. మోహమాటనికి ఒప్పుకోకుంటే, వాళ్ళ విషయాలు చెబుతానంటే లొంగేవాళ్ళే. ధైర్యం లేదు, పిచ్చివాడవు, పిరికివాడవు. ఇప్పటికి ఛాన్స్ ఉంది. వెనకాల వెళ్ళి కలు, వెళ్ళు.

వదులుకున్నావ్. మౌనికని వదులుకున్నావ్. సుజాతని వదులుకున్నావ్.

అందర్నీ వదులుకుంటున్నావ్. జానకిని వదిలేస్తున్నావ్. వదిలెయ్యడమా. తానేమైన నా చేతిలోని బొమ్మనా పట్టుకోడానికి? ఇలాంటి మాటలు ఎన్ని చెప్తావు గానీ ఒప్పుకో, జానకికి నువ్వంటే అసహ్యమని, ఏవగింపని ఒప్పుకో. మొన్న రాత్రి జరిగింది గుర్తుందిగా. ఏం జరిగింది? అదే గుడి దగ్గర జానకి ఇంటి వాళ్ళు అన్నదానం పెట్టిన రోజునా. నువ్వేం చేశావు? గుళ్ళో ఆడవాళ్ళు కాక బయటి వ్యక్తుల్లో నువ్వే మొదట గుళ్ళోకి పోయావు. ధైర్యం! జానకి కోసమా అది. గుళ్ళో ఆడాళ్ళు నీవైపే చూస్తున్నారు. రేవతి, ఈరమ్మ నవ్వుతున్నారు. నవ్వనీ, ఆ ముత్యాల్ని ఏరుకుంటానంటావు. జానకి వాళ్ళ చిన్నమ్మ విస్తరి పరిచింది. అన్నం పెట్టమని జానకికి కేకేస్తే, తనేం చేసింది? నిన్ను పట్టించుకోలేదు. వినబడనట్లు అటు ఇటు తిరుగుతుంది. రా! జానకి నీకే కదా చెప్పింది. చేతిలోని అన్నం గిన్నెని అమ్మకిచ్చి ఏదో పనున్నట్లు ముందు కెళ్ళింది. ఆ తరవాత నీళ్ళు. చేతిలో నీటి జగ్గుతో వెళ్తున్న తన్ని నీకు నీళ్ళు పోయామని అదే చిన్నమ్మ కేకేస్తే. వినదు, వినబడనట్లు నటింపు. రాదు. నీతో మాట్లాడమని కాదు నువ్వు కోరింది. వొచ్చి నీళ్ళు పోయమని అంతే. నిన్ను సంతోష పెట్టే ఒక్క పని గూడ చేయదేంటి జానకి? నీ తరవాత బయటి వాళ్ళు చాలామందే అన్నం తిన్నారు. అంజీ గాడికి చూశావుగా. నవ్వుకుంటూ వాడి చుట్టూరే తిరుగుకుంటు అన్నం పెట్టడం. నీళ్ళు పోయడం. విస్తరి ఎత్తడం. ఎంత గుండెకోత నీకి. తను అందరితో మాట్లాడుతుంది, అందరితో నవ్వుతుంది. కేవలం నువ్వంటేనే ఈ ఏవగింపు. కిరాణం దగ్గర బీరప్పగాడు జానకి చేతిలోని సొంగ నవ్వుకుంటూ లాక్కోవడం. జానకి నవ్వుకుంటూ వాడికి ఇంకో సొంగ ఇవ్వడం. అందరితో అంతే. నువ్వే తనకి భారం, నీ ఉనికే తనకి నష్టం. ఇంకెంత సొల్లు చెప్పుకుంటావు. తనపై ఇంకెంత నమ్మకం పెట్టుకుంటావ్. నువ్వెప్పటికి ఒంటరే.

వొద్దు, అరవద్దు. ఇక ఆపేయ్.

లేదు, నేను తనపై నమ్మకం పెట్టుకోలేదు. నమ్మకం ఎవరు పెట్టుకుంటారు? వ్యక్తిపై నమ్మకాలు ఎందుకు పెట్టుకోవాలి? వాళ్ళ వ్యక్తిత్వం వారి సొంతం. నాది నాకు. కుక్కది కుక్కకు. ఉడతది ఉడతకు. తనేవరితో మాట్లాడితేనేం, తానెవ్వరితో తిరిగితేనేం అది నాకేమి. నాతో కోరుకున్నాను, కాలేదు, అయితేనేం తన్ని చూస్తాను. తన చేష్టలను, తన పరుగుని, తన నవ్వుని. అదే నాకు కావాలి. నేనేదో ఒంటరయినట్లు నువ్వు నన్ను వెక్కిరిస్తున్నావ్. నేనెక్కడ ఒంటరి. సాయంత్రపు చిరుగాలిలో, చంద్రుడి తలంపైన, నక్షత్రాల దారుల్లో నేనెందరి చైత్యన్నానో అనుభవిస్తున్నాను. అక్కడే మౌనికని ముద్దాడాను, జానకితో మాట్లాడాను, రాజేశ్వరిపై పూలు చల్లాను, మేరీతో సంభోగించాను, సీతకు కన్నుకొట్టాను, మాసిడోనియాపై దాడికి సిద్ధమయ్యాను. ఎన్ని కలలు కంటానో నేను. వాటిని నా నుండి తస్కరించేదెవరు. అనంతత్వాన్ని నా నుండి దోచుకునేదెవ్వరు?

జానకి విషయమై ఎన్నో ఊహలు చిత్రించుకుంటాను. ఒకదానికొకటి సంబంధం లేకుండా అన్ని రకాల రంగులు కలిపి ఎంత అద్భుతంగానో. పొద్దున విషయం తలుచుకుంటే నవ్వొస్తుంది. గుడి ముందు ఆటో ఉంది. అందులో రోజూ పూజలు చేసేవాళ్ళంతా కొత్త కొత్త బట్టలతో. అంత కలిసి మంత్రాలయం యాత్రకు వెళ్తున్నారంట. వాళ్ళనే చూస్తూ నేను బసిరి చెట్టు కట్ట మీద కూర్చున్నాను. నాకు పక్కన రామంజి. నా కంటే పదేళ్ళు పెద్దోడు. నా దగ్గరకొచ్చి నేను గుడి కట్ట మీద రోజూ కూర్చోవడం గమనిస్తున్నట్లు చెప్పాడు. అది జానకి కోసమేనని కూడా ఖచ్చితం చేసాడు. నా విషయం అతనికి తెలవడం అంటే ఇంకెంత మందికి అర్థమయ్యిందో. నేనన్నాను కేవలం పేపరు చదవడానికే వస్తుంటానని. కానీ వినడు. చెబుదామా! వొద్దా! చెప్పేయ్, వొద్దు, తెలిసిపోతే పోనీలే. ఏమవుతుంది.

జానకి కోసమేనని అనేసాను. అతడన్నాడు జానకిని పడగొట్టడం కష్టమని, తను ఎవ్వరికీ పడదని. లేదు, తను నాకు పడిందని, నాతో మాట్లాడుతుందని ఇద్దరం కలుస్తుంటామని చెప్పేసాను. ఎందుకు చెప్పాను? అబద్ధం చెబుతున్నావన్నాడు. నిజమన్నాను, కానీ నమ్మడు. ఎంతకీ నమ్మడు. జానకి ఆటో పైన కూర్చుంది. మా ఇద్దరివైపే తిరిగింది. తను నన్ను గమనించినట్లే, తిరిగి గమనించనట్లు. రెండు మూడుసార్లు అలానే చేసింది. యాదృచ్ఛికమో, నా అదృష్టమో. చూశావా, మొదట నన్ను చూసి నువ్వున్నావని పక్కకు తిరిగిందని అన్నాను. నమ్మేశాడు. పెండ్లి కూడా చేసుకుంటాం అన్నాను. కులం వేరు అన్నాడు. అయినా ఎదురిస్తానని, నాకేం భయంలేదని అన్నాను. నాకు తను సరిజోడి అవుతుందని చేసుకోమని చెప్పేసాడు. నమ్మేశాడు. నేను చేసుకుంటానంటా? హా.

ఆ యాత్రకు పోయిన బులెరో ఇప్పటికి ఎంత దూరం వెళ్ళుంటుందో. రాత్రి లోగా వచ్చేస్తారు. నేనూ వెళ్ళింటే బాగుండేది కానది ఆడవాల్లకు. ఒకవేళ వెళ్ళి ఉంటే జానకి వొచ్చేదా. అది అపనమ్మకమే.

ఎద్దు ముట్టే మీద కాకి వాలింది. చిన్న మట్టి పెడ్డ తీసుకొని దానిపై విసిరాను. కాకి ఎగిరింది, పెడ్డ ఎద్దుకి తగిలింది. ఎద్దు తోకతో నడుముని కొట్టుకుంది. మరో ఎద్దు గాట్లో నుండి తల ఎత్తడం లేదు. యెనుము పడుకుని మేత అందుకుంటుంది. బయట చెత్తలో పడుకున్న కుక్క దొడ్లోకొచ్చింది. దొడ్డి మాది, మా కుటుంబంది. నాకు సంభందమైంది. దీనిపై మాదే హక్కు. కుక్క నీకిక్కడ స్థానం లేదు. రాయి తీసుకొని విసిరాను. కుక్క అరుచుకుంటు బయటకెళ్ళింది. నేను బయటకొచ్చి ఇంటి బాట పట్టాను. వెనక్కి తిరిగి చూస్తే కుక్క మళ్ళీ దొడ్లో ఉంది.

రాత్రి, సమయం చూస్తే పదిన్నర అవుతుంది. కిరాణం పక్కనున్న గుండుపై కూర్చున్నాను. ఈ సమయంలో ఇలా కూర్చోవడం ఎవరైనా చూస్తే. చూడనీ, నిద్ర పట్టక అంటాను. బులెరో ఇంకా రాలేదు. ఇక్కడే ఈ కట్ట దగ్గరే ఆగాలి. సాయంత్రం మంత్రాలయం నుండి కదిలిందని కిరాణం ఆయన ఫోన్లో మాట్లాడుతుంటే గమనించాను. ఈపాటికె వచ్చిండాలి, కానీ రాలేదు. తిరుమల్, అంజీ, సుధాకరం పదికే పడుకున్నారు. వాళ్ళకి వస్తానని చెప్పి ఇట్లే ఉండిపోయాను.

పదకొండు,

సౌండ్ వినిపించింది. అది బులెరోనే. నాకు కొద్దీ దూరంలో ఆగింది.

నవ్వుకుంటూ,

తుల్లుకుంటూ,

దిగుతున్నారు అందరూ. వాళ్ళు నావైపు చూసి చూడనట్లు నటిస్తున్నారు. ఇలా ఈ సమయమందు ఒంటరిగా కూర్చోవడం ఎందుకోసమని వాళ్ళు అనుకునేవుంటారు. లక్ష్మీ జడకున్న మల్లెపూలు ఒక్కొక్కటిగా కిందకు రాలుతున్నాయి. ఎవరెవరు ఎవరెవరికి ఎంతెంత ఇవ్వాలో మాట్లాడుతున్నారు. జానకి నన్ను చూసిందో లేదో తెలీదు. ఆటో వెనక నిలబడి ఏమేమో అంటుంది? ఆ మాటలు అస్పష్టంగా, స్పష్టమై కానట్లుగా. ఎప్పుడు చీరలు కట్టని వాళ్ళు చీరలో మెరుస్తున్నారు. ఆటో ముందుకెళ్ళి పోయింది. ఎవరెవరు వాళ్ళ వాళ్ళ వీధి వైపు వెళ్తున్నారు. వెళ్తూ జానకి నా వైపు వెనక్కి చూసింది. ముందుకెళ్ళింది. మళ్ళీ వెనక్కి చూసింది.

తను నన్ను అసహ్యించుకోని,

భయపడనీ,

తిరస్కరించనీ,

కోప్పడనీ

నాకు తెలుసు తన చైతన్యపు నీడలో నేను కూడా భాగమేనని. కుక్క నావైపు చూస్తూ మాటికి అరుస్తుంది. దీని చైత్యన్యంలో నే కూడా భాగమయ్యానని ఆనందించక ఓ రాయిని దానిపైకి విసిరాను.

# 10

పక్షవాతం తో మంచంపై ఉన్న నేను. తమ సంతోషాన్ని పణంగా పెట్టి సేవలందిస్తున్న కొడుకులు. కాళ్ళు, చేతులు వస్తాయో రావో తెలీదు. జానకి ఏడుపులు. ఓపిక, చిరాకు, భారమైన బాధ్యత. ఇంకెన్నాళ్ళని బతకాలని ఆశ. వాళ్ళ జీవితాన్ని నాకై తాకట్టు పెట్టడం? మాటలు, అరుపులు, కోపాలు, గొడవలు, వాళ్ళని కట్టేసిన దోషం, నాలో నాపైనే అసహ్యం. నేను చావాలి. నేను చస్తేనే వాళ్ళకి విముక్తి.

చావడం అంత సులువా? ప్రాణంపై తీపి. ఆరాటం. నీకి నువ్వుగా చచ్చేందుకు ఎంత ధైర్యముండాలి? అనుకుంటాం కానీ ప్రాణాలు తీసుకోలేం. చచ్చాక ఏముంటుంది? దెయ్యంగా మారితే బాగుండు. దెయ్యంలో నా చైతన్యం కొనసాగుతుంది. దెయ్యం లేకపోతే. భయంకరం. నేను ఉండను. నేను...నేను లేని నాడు జానకి లేదు, దేశం లేదు, కమ్యూనిజం లేదు, ప్రేమ లేదు, ఆకాశం లేదు, పోరాటం లేదు, స్వాతంత్ర్యం లేదు. స్వేచ్ఛకై ప్రాణాలు పెట్టమంటారూ! ప్రాణం పోతే స్వేచ్ఛకు ఏం విలువుంటుందో అర్థం కాదు. జీవచ్ఛవంలా బతికేయ్. బలవంతుడి ముందు అణిగిమణిగి ఉండు. లేకుంటే ఏ అడవుల్లోకో పారిపో. విముక్తి కోరేవాళ్ళు అక్కడే బతకాలి.

చీకటి ఆకాశాన్ని అత్త చూడలేదు. వెన్నెల రాత్రులని, కాలువలని, చెట్లని, పక్షుల్ని దేన్ని అత్త అనుభవించలేదు. ధౌర్భాగ్యం. ఒక వీల్ చైర్ తెచ్చి తనని నెట్టుకుంటూ అంత తిప్పాలని ఉంటాది, కానీ ఎట్లా? డబ్బులు. ఇంటివాళ్ళని అడిగితే తిడతారు. నేనే ఎట్లాగో తెచ్చినా దాన్ని ఉండనిస్తారా! సాకు! నాకు నేను తప్పించుకునేందుకు సాకు. పిరికివాడను. వెదవను. పిచ్చివాడను. మంచం మీదే నలిగి, అనిగి, కృంగి, కృశించి. దేవా! తనకు చావుని ప్రసాదించు. సుఖమైన చావునీ. తను చస్తేనే అమ్మకు విముక్తి. తన ఆస్తిపై విముక్తి. తనకై గొడవలు పడే మా ఇండ్లకు బంధువులకు విముక్తి. నాకూ, నాక్కూడా విముక్తి. ఒకరి చావుని కోరడం. ఏంటి ఇలా అవుతున్నాను. హంతకుడా!! పాపాత్ముడా.

"లే, శివ రాలే. యాటికి ఫోయింటివి సీకట్ల. "

వెంకటప్ప కట్ట మీద కూర్చున్న వీరేశ్ బాబు కేకేశాడు.

"యాటికి ల్యా. ఫోను వొచ్చింటేనే అట్లే మాట్లాడుకుంట ఫాతి రోడ్డెంబడ. "

"ఫా, గుడి కాటికి ఫోదాం. "

గుడి దగ్గరకు. ఈరోజు ఈ రాత్రి అక్కడ సంబరం. పూజలు చేస్తున్న ఆడాళ్లు, భజన చేసే మొగాళ్ళు రాత్రి మొత్తం జాగారం చేస్తారు. నేనూ చేస్తాను. జానకి ఎదురుగా కూర్చొని నేను ఏదో ఒక పాట పాడతాను. అక్కడున్న ఆడవాల్లకు, అందరికి నేనూ పాడగలనని, నే పాడిన వాటి గురించి అంతా మాట్లాడుకుంటూ నా ఉనికిని గుర్తించాలనే తాపత్రయం. ఎలా పాడినా సరే. ధైర్యం చేయాలి ముందు. అందరిలా పాడితే అందరిలో ఒక్కరం అవుతాం. కొత్తగా, ప్రత్యేకంగా. అయినా మొదటిసారిగా నే పాడటమే కొత్త అవుతుంది. మొన్న పౌర్ణమి రాత్రి జాగారం రోజు కూడా పాడాలనే చూసాను కానీ,

ఎక్కడ అవకాశం. రాత్రి మొత్తం ఉంటారనుకుంటే పన్నెండుకే వెళ్ళి పోయారు. అదీకాక జానకి ఉంటుందనుకుంటే తను రాత్రి రాలేదు. అందరూ ఆడవాళ్లతో పాటే ఉంటుందనుకున్నాను. ఏది! ఎందుకు రాలేదు? తాను మాత్రం తొమ్మిదికె గుడిసెకి పోయింది. ఈరోజు కూడా తాను ఉంటుందన్న నమ్మకం కలగడం లేదు. ఉంటుందా. ఉండాలి. ఇదే చివరి రోజు కార్తీక మాసంకు.

వీరేశ్ బాబు తాను వేసుకున్న అంగీ, నాగేంద్రమ్మ ఈనాడు కట్టుకున్న చీర ఒకే రంగులో ఉందని పొంగిపోతున్నాడు. వాడు తన విషయమై అన్ని గొప్పలు కోస్తుంటాడు. నాగేంద్రమ్మ రోడ్డు మీద ఎప్పుడు వెళ్ళినా తనవైపే చూస్తూ వెళ్తుంటుందని, తనని ఇష్టపడుతుందని చెప్పుకుంటుంటాడు. ఈరోజు పొద్దునైతే ఇంకో అడుగు ముందుకేసి నాగేంద్రమ్మని ఒంటరిగా కలిసి తన్నెందుకు మాటికి చూస్తున్నావని అడిగేశానన్నాడు. దానికి తానేమంది అనడిగితే తరవాత చెప్తానని వెళ్ళిపోయిందంట. నమ్మేలా లేదు. నాగేంద్రమ్మ వాడివైపు చూడటం నేనెప్పుడూ చూడలేదు. తన ధ్యాస ఎవరిపైన ఉండదు. వాడు ఊహిస్తున్నాడు. నాకు లానే, నా కంటే ఇంకా ఎక్కువో.

గుడి చుట్టూరా అక్కడక్కడ దీపాలు. నలుగు పిండితో చేసిన దీపాల కాంతులు. కొన్ని ఆరిపోయాయి, ఇంకొన్ని కొనప్రాణాలతో కొట్టు మిట్టాడుతూ, మరికొన్నైతే ఇప్పుడే వెలిగించినట్లు. బసిరి చెట్టు కట్టమీద కొందరు మొగవాళ్ళు, కుర్రాళ్ళు. ఏవేవో మాట్లాడుకుంటున్నారు. నవ్వుతున్నారు. ఒకరిపై ఒకరు పడుతున్నారు. గుడి పైని చిన్ని బల్బులు, ఒక చోటనంటు కుదురుగా లేకుండా అవి అటుఇటు పరిగెత్తుకుంటూ. వాటికెప్పటికి అలుపొచ్చేలా లేదు. పిల్లలు రోడ్ల మీద పరిగెత్తుతున్నారు. మొఖాలకు చెమటలు. కేకలు. అరుపులు. పూజలు చేసే ఆడాళ్లు బయటకు లోపలకు పరిగెత్తుతున్నారు. దీపాలు పెట్టేవాళ్ళు ఇంకా అక్కడక్కడ కనిపించే దేవుళ్ళకు పెడుతున్నారు. ఇంకొందరు ఊరికే తిరుగుతున్నట్లు అనిపిస్తుంది, కానీ ఏదో పని మీదేసుకున్నట్లు పరుగులు. ఎవరూ ఎవర్ని గుద్దుకోరు. అటు ఇటు పరిగెత్తడం. మొగవాళ్ళని చూసి ఏం ఎరగనట్లు ఆడాళ్లు. ఆడాళ్లను చూస్తూ తమకేం తెలీదన్నట్లు మొగవాళ్ళు. పెళ్ళైన్న వాళ్ళు, పెళ్ళి కానివాళ్ళు. ఎవరు ఎవరికి ఆత్ర పడుతున్నారో. అంతా ఆటలు! దొంగలు పోలీసులు! దాగుడు మూతలు!

ఎక్కడ---

ఎవరెవరు ఎక్కడ.

ఏ చూపులు ఎవరికి?

దొరకరు, చిక్కరు!

జానకి కనబడడం లేదు. పొయ్యుంటుంది. ఉంటుందేమో లోపల. పూజలు చేసే వాళ్ళు జాగారం, ఉపవాసం ఉండాలి. పుణ్యం, పొద్దున పూజారి మైకులో చెప్పాడు. తను ఉండాలి. ఏదన్నా పని మీద ఇంటికెళ్లుంటుంది. మళ్ళీ వస్తుంది. పుణ్యం. ఇన్నాళ్ళు పూజలు చేసిన పుణ్యం అంత ఈ ఒక్కరోజే. పెళ్ళి కాని వాళ్ళకైతే మంచి మొగుడు. జానకికి మంచి మొగుడు. మరి పెళ్ళైన వాళ్ళకి? పెళ్ళైన వాళ్ళకి ఏం పుణ్యం? సౌభాగ్యవతి, సుమంగళి అదే చెప్పింది. చచ్చేంతవరకు అదే మొగుడు. మొగుడి కంటే ముందే చావు. ముందే చావా? మొగుడే ముందు చావరాదా? అది పాపం. మరైతే పూజలు చెయ్యనోళ్ళకి. మొగుడి మరణం వాళ్ళకంటే ముందే. చావాలి! మొగుడే ముందు చావాలి. అప్పుడైతేనే పెళ్ళాన్ని మనం చూడొచ్చు ధైర్యంగా. ప్రయత్నిస్తే మనకు పడొచ్చు. సుఖం, శృంగారం, కామం,

మొగుడు అడ్డు లేడు. వస్తారు అప్పుడు సులువుగా. కామం ఊరికే ఉండనిస్తుందా. సులువుగా పడిపోతారు.

వీరేశ్ బాబు చిన్నగా పుకార్లు చెబుతున్నాడు. ఆడపిల్ల ఇంటి దగ్గరే ఉండాలని, తనకు పెళ్ళైయితే పెళ్ళాన్ని గడప దాటనివ్వనని, ఇలాంటి పూజలకైతే అస్సలు పంపనని చెప్పాడు. పిచ్చోడు. పూజలకు పంపకపోతే పుణ్యం రాదు. వాడు పెళ్ళాం కన్నా ముందే చస్తాడు.

భజన భక్తాదులు లోపలికి రావాలని మైకులో శబ్దం వినిపించింది. ఆడవాళ్లు తిరగడం ఆపేశారు. కట్ట మీద ఉన్నవాళ్ళు కొందరు లోపలికెళ్ళారు. వెల్దామని వాడు తొందరపెట్టాడు. చూడాలి, గుళ్ళో దీపాలను, దీపాలను పేర్చిన ఈగలను. స్థంభం పక్కన స్థలం చేసుకొని ఇద్దరం కూర్చున్నాం. భజన చేసేవాళ్ళు ఎదురెదురుగా రెండు వరసల్లో అటువైపు శివుడి గర్భగుడి నుండి ఇటువైపు ఆంజనేయ స్వామి గర్భగుడి వైపు ఎల్ ఆకారంలో. భజన దినాల్లో ఎప్పుడైనా ఆ వరసల్లో అంతా మొగవాళ్ళే ఉంటారు, కాకపోతే ఈరోజు ఆంజనేయస్వామి గర్భగుడి వైపు ఓ వరసలో చివరన ఆడపిల్లలు ఉన్నారు. మొగవాళ్ళకు వెనక ముసలివాళ్ళు, ఆడాల్లు. వాళ్ళు పాడరు, పాడేవాళ్ళ గాత్రనికి దిష్టి పెడుతుంటారు.

మా ఇద్దరి చేతుల్లో తాళాలు లేవు. మా ఇద్దరికే కాదు, అక్కడ చాలామంది వరకు తాళాలు లేవు. ఊరికే చేతుల్తో చప్పట్లు కొడుతున్నారు. మధ్యలో కొన్ని తాళాలున్నాయి. అవి దారం లేనివి, పగిలినవి, సరైన సైజులో లేనివి. కళ్ళు మూసుకొని తల అటు ఇటు తిప్పుతూ హార్మోనియం వాయిస్తున్నాడు పాండయ్య. ఆయన పక్కనే ఓ వైపున పెదాలను పంటితో పట్టుకొని రెండు తబలాలను దంచుతున్నాడు లక్ష్మన్న. అవి తబలాలు కాదు, తల కాయలు. అక్కడున్న తలకాయలన్ని తబలల్లాగే అనిపిస్తాయి. బాదుతున్నాడు. జాలి లేదు, చంద్రన్న తలపై ఒకటి, వీరేశ్ బాబు తలపై ఒకటి. మారెమ్మత్త తలపై ఒకటి. నాపై ఒకటి. నాపై కూడానా? కొట్టు! కొట్టు! మాడు పగలాలి, ఇంకా ఇంకా గట్టిగా.

పాటలకు సరైన రీతిన కోరస్ ఇవ్వాలి, కానీ పాటెక్కడ? పదాలు అర్థం కావు. కాస్త గట్టిగా పాడాలి. హార్మోనియం తల ఊపు, కొట్టు, ఊరికే కాదు, కాస్త పదాన్ని అర్థం చేసుకొని కొట్టు. కళ్ళు మూసుకొని పాడితేనే భక్తి, కళ్ళు తెరిస్తే ముక్తి కాదు రక్తి. తెరవాలి కళ్ళు, ఎన్ని రంగులు కనిపిస్తాయి. పూలు! తలల్లో పూలు. కనకాంబరాలు, మల్లెపూలు. వాసన చూడాలి. వాసన చూస్తే కామం పెరుగుతుందంట! కామం, ఆ పూలు రెచ్చగొడతాయా? పూలు, పూలతో పాటు శరీరాలు. సన్నులు ముఖ్యంగా. బరువుగా కనిపించాలి, లావుండాలి. పని చేస్తుంటే పైకి కిందకి ఊగులాడాలి. చీరకి, నడుంకి సందుల్లో రవిక పైన, బాగున్నాయి కదా అవి. ఆ రవిక లేకుంటే ఇంకెంత బాగుంటాయో. ఎదలు, పిర్రలు, పెదాలు అంత మాంసం! లోపల ఆస్తి పంజరం. రక్తం, గుండె, తిన్న జిడ్డు... యాకు! యాకు కాదు, అందం! అనుభవించాలి... చేతుల్తో తాకాలి. భ్రమ, అబద్ధం, నిజం, అనుభవం నిజం! ఆ పెదాలు దోరగా చూస్తున్నాయి. తాగేయ్యాలి! సన్నులు పిసకాలి! వొద్దు... పాటపై ధ్యాస పెట్టు. ఏం చేస్తున్నారు ఆ పిల్లలు. ఆడపిల్లలంత తల దించుకొని చేతుల్తో దేన్నో చేస్తున్నారు. దీపాల బద్దెలు. ఒత్తులు కూడా. వెలిగించారు కదా! అప్పుడే మళ్ళీ ఎందుకో? ఇంకా వెలిగిస్తారా. వెలుగు దీపం. కార్తీక దీపం. దీపం కాంతి! జానకి మొహం మరింత కాంతి. తనెక్కడ? రాదా ఇంకా? మంచి మొగుడు అక్కర్లేదా?

అంజీ బయట కడ్డీల దగ్గర నిలబడి నన్ను పిలుస్తున్నాడు. వీరేశ్ బాబుకి చెప్పకుండ బయటకు వెళ్ళాను. అలా చీకట్లో నడుచుకుంటూ ముందుకెల్దామన్నాడు. వాడితో పాటు తిరుమల్ కూడా కలిసాడు.

రేవతి వేసుకున్న చీర బాగుందని అది రేవతిని మరింత అందంగా మార్చిందని చెప్తున్నాడు అంజీ. ఈరమ్మది అంత బాగోలేదన్నాడు. గుళ్ళో ఉన్న ఆడపిల్లలంత నీటుగా ఉన్నారన్నాడు. వాళ్ళ సంగతి సరే, మరి మాది. నాదేమో లూజ్ అంగీ, కళ్ళ జోడు, గడ్డం, రేగిన జుట్టు. అంజీ, తిరుమల్ నీటుగా లేకపోయినా చూడ్డానికి బాగున్నారు. తిరుమల్ కన్నా అంజీ ఆకర్షణీయంగా కనిపిస్తాడు. ఇద్దరు చేతులకు గోరింటాకు. అది మధ్యాహ్నం ఈరమ్మ పెట్టినేది. పిలిచి మరీ పెట్టింది. ఇద్దరు ఈరమ్మ ఇంటివాళ్ళతో మాట్లాడుతుంటారు. ఈరమ్మతో మాట్లాడుతారు. అది వాళ్ళ పరిచయం. ఎర్రగ పండిన గోరింట. నా చేతికి గోరింట లేదు. ఆడపిల్లలే గోరింట పెట్టుకుంటారు. మగవాళ్ళు కాదు. అంజీగాడు అయితే ఆడపిల్ల.

ఏవేవో మాటలు చెబుతున్న అంజీ స్వరం మృదువుగా మారిపోయింది. వేసుకున్న అంగీ స్థానంలో పంజాబీ డ్రెస్. చేతులకు గాజులు. కింద వరకు జడ. కింద వరకు అంటే పిర్రలవరకు జానకి లాగా. జల్లో పూలు. అంజీ, నా కలల రాకుమారి. ఎందరి హృదయాలనో కొల్లగొట్టిన సుకుమారి. ఎన్నాళ్ళుగా వేస్తున్నా నేను నీ కోసం. చిన్ననాటి నుండే ఇద్దరం స్నేహితులం. ఇద్దరం ఆడుకున్నాం, పాడుకున్నాం. నువ్వు గడుగ్గాయివి. నాకు వరసవుతావు. నన్ను కోరుకుంటావు. కోరుకుంటాడా? దగ్గరి ఇల్లు అయినంత మాత్రాన నన్ను కోరేవాడా? ఏమో? ఎందరిని కోరేదో? అసలు ఇంత వయసు వొచ్చేవరకు ఇలా ఊర్లో ఉండేవాడా? ఎప్పుడో పెళ్ళి చేసేవాళ్ళు. పెళ్ళి, వొచ్చే ఆ మొగుడు. ఆ మొగుడి పక్కన అంజీ. రాత్రి మొగుడితో అంజీ. గడ్డం చూసి మొగుడు బయపడతాడు.

ఈరమ్మ ఇంటి దగ్గర ఆడపిల్లల శబ్దాలు. అంత ఇక్కడే ఉన్నారు. గుళ్ళో నుండి ఎప్పుడొచ్చారో. మెట్ల దగ్గర కూర్చొని ఏవో మాట్లాడుకుంటున్నారు. అప్పటివరకూ మౌనంగా ఉన్న నేను కావాలనే నా స్వరాన్ని పెంచాను. వాళ్ళు చూస్తున్నారా? నావైపు. పట్టించుకోడం లేదా? ఏమైనా అనుకున్నారా! మంచో చెడో ఏదొకటి అనుకోవాలి.

బసిరి చెట్టు కట్ట మీద పడుకోబెట్టిన ప్రవతో కుస్తీ పడుతున్నాడు రామకృష్ణ. దాన్ని రేపు బండిపై నిలబెట్టి లాగుతారు. మేం వాడి దగ్గరికి వెళ్ళాం. ప్రవకి నీళ్ళని చల్లి, నీటుగా తుడిచాం. దానికి నీలం రంగు వార్నీస్ పూశాం. ఆడపిల్లలు గుళ్ళోకి వెళ్తున్నారు. అందులో జానకి వుందేమోనని చూసాను. పూజలు చేసే వాళ్ళంతా ఉన్నారు, తనే లేదు. రాలేదు. రాదు. ఎందుకో? తనకి భక్తి ఎక్కువే. అయినా రాలేదు. జాగారం చేసే పుణ్యం తనకి అంటదు. ఏమో, గుడిసె దగ్గరే ఉండి జాగారం చేస్తుందేమో. వెళ్దామా, ఇప్పుడే వాళ్ళ గుడిసె దగ్గరకి. ఆ వీధుల్లో కుక్కలుంటాయి, అయినా భయం లేదు. అంత చీకటి. అందరూ నిద్రలో ఉంటారు. గుడిసె ముందు వేసుకున్న మంచం మీద జానకి కూర్చోనుంటుంది. దేన్నో ఆలోచిస్తుంటుంది. నేను పోగానే నన్ను పక్కన కూర్చోమంటుంది. ఇద్దరం ఆకాశంవైపు చూస్తూ జాగారం చేస్తాం. ఇలానే జరుగుతుందా? లేదు. నన్ను చూడగానే కెవ్వుమంటుంది. ఆ వీధుల్లో ఉన్న వాళ్ళంత మేల్కొంటారు. ఏం పనిరా, ఎందుకొచ్చావ్ అంటారు. ఎందుకొచ్చాను? నేనేం చెప్పలేను. నా వీపుపై దెబ్బలు. అచ్చం తబల వాయిస్తున్నట్లు. డమీ డిమి డిమి డిమి. డిమి డిమి డమీ డమి. కొట్టు. తబల పగలిపోవాలి. మా తలలు పేలిపోవాలి.

లక్ష్మన్న రెచ్చిపోతున్నాడు. పాండయ్య తల ఊపడం ఆపడం లేదు. ఈసారి నాతో పాటుగా అంజీ, తిరుమల్ కూడా గుళ్ళోకొచ్చారు. స్థలం మరింత ఇరుకయ్యింది. వీరేశ్ బాబు సర్దుకుంటున్నాడు.

పదాల్లో ఆర్ధ్రత ఉంది. ఆశ ఉంది. ఏ వ్యక్తి ఏ శోకంలో కూర్చాడో వాటిని. మా అత్తకు మైక్ నుండి ఇవి వినిపిస్తూనే ఉంటాయి. తన కాళ్ళల్లో సత్తువ ఉండి ఉంటే చూడ్డాని కొచ్చిండేది. బాధ, నిస్సహాయత. తమల్ని ఈ స్థితి నుండి పైకి లాగమని లింగంకు వేడుకోలు. ఏదీ మా చేతుల్లో లేదు. అందరం చీకటి అరణ్యంలో చిక్కుకున్నాం. ఎక్కడి నుండి ఏ పామొస్తుందో, ఏ పులొస్తుందోనని భయం. కాపాడుతాడని ప్రార్థిస్తున్నాం. ఎప్పుడు చస్తామో, రేపేమవుతుందో ఏది తెలీదు. బలహీనులం, దుర్బలులం. నాకు తెలుసు ఆ లింగంకి శక్తి లేదు. ఉండే ఉంటే పిల్లల చావులు, ఆకలి ఏడుపులు, ఇంత అన్యాయంకి భూమిపై చోటుండేది కాదు. పిచ్చోళ్ళం మేమంతా. మేమే లింగాన్ని తయారుచేసుకున్నాం, మేమే లింగానికి కథలు అల్లుతం, మేమే లింగం పేరున నీతులు రాస్తాం.. పోరాటమంటం. వ్యక్తుల్ని అణుచివేస్తాం. ఆత్మని అమ్ముకుంటాం. మనుషుల్ని చంపుతాం. రక్తాన్ని తాగేస్తాం. తిరిగి మేమే అందమైన ప్రపంచానివ్వమని లింగాన్ని ప్రార్దిస్తాం. లింగం ఉలకదు, పలకదు. చరిత్ర పొడవునా ఆయన చూస్తాడని పరిస్థితుల్ని మారుస్తాడాని పూర్వీకులు ఎన్ని పదాలు అల్లారో. భయం. మాపై భయం. ఆశగా ప్రాణం లేని లింగం. పిచ్చోళ్ళం. పిచ్చిగా పాడేస్తున్నాం. రోగం, పిచ్చి, నవ్వు.

వీరేశమ్మ నవ్వుతుంది, నన్ను చూసే. నా గొంతు గట్టిగా వినిపిస్తున్నట్లు ఉంది. పదాలను పట్టుకోవడం, చేతుల్తో చప్పట్లు కొడుతూ దొరికిన పదాల్ని గట్టిగా పాడటం. ఇదే నే చేస్తుంది. పక్కనున్న మీనాక్షి ఆంటీ కూడా నవ్వుతుంది. నేనింకా స్వరాన్ని పెంచేస్తున్నాను. చూస్తూ కొందరు నవ్వుతున్నారు. చెవుల్లో చెప్పుకుంటున్నారు. మారేమ్మత్త పళ్ళు కనిపిస్తున్నాయి. పళ్ళ సందుల్లో నశం పొడి. మా అమ్మకు అలవాటు నశం తిక్కడం. పళ్ళు పాడైపోతాయి, అయినా వినరు. కొట్టు, పళ్ళు కాదు తలలు పగలగొట్టు. డమి డిమి డిమి డిమి. లింగం మమ్మల్ని కాపాడు. మా పిచ్చిని మరింత పెంచు.

పక్కనున్న కుంటి మల్లికార్జున నన్ను పాడమన్నాడు. పాడటం, అందుకేగా నేను కూర్చున్నది. మొహమాటం. ఒకసారి పాడితే అన్ని ఎగిరిపోతాయ్. ఏది పాడాలి. నిన్న రాత్రి నేనూ, రంగస్వామి ఇద్దరం గుళ్ళో పాడటానికని మూడు పాటలు రాసుకున్నాం. వాడు పక్కనుండి ఉంటే ధైర్యం. బసీరి కట్ట మీద ఉన్నాడు వాడు. పాడు, ఏదొకటి! ఒక్కటైన.

మైకు నావైపు తిప్పాడు మల్లికార్జున. ఇదే నే మొదటిసారి పాడటం. మారెమ్మత్త పళ్ళు చూపిస్తుంది. పాడమని, పాడాలని పక్కనున్న వాళ్ళు రెచ్చగొడుతున్నారు. గొంతు తెరిచాను. హడావిడి గుండెలో. రాగం పోతుందనుకునే దగ్గర మల్లికార్జున అందుకుంటున్నాడు. పళ్ళు చూపేవాళ్ళు చూపుతున్నారు. చెవులు కొరుక్కునే వాళ్ళు కొరుక్కుంటున్నారు. పాడు, లోపలి పేగులని మెలిపెట్టి పాడు. అన్ని రత్నాలని నీకే సొంతం చేసుకునేలాగు పాడు. రేవతి అంజీని మాటికి చూస్తుంది. తిరుమల్ రేవతిని కోరుతున్నాడు. జయలక్ష్మి కళ్ళు ఆకాశంలో ముంచుతున్నాయి. రాజేశ్వరీ దిగాలుగా కనిపిస్తుంది. చూడు మీనాక్షి ఆంటీ మొఖంపై మచ్చ. పెద్దది. నల్లది. వీరేశమ్మ నవ్వుతుంటే బుగ్గలు లోపలికి. అరె ఎలా పోతాయి అలా. బీరప్ప కళ్ళార్పకుండా ఈరమ్మ వైపు. వాడికి భయం లేదు. ఇక్కడ ఇంతమంది ఉన్నారు. చూస్తే ఏమవుతుందనే భయం లేదు. అలా ఉండాలి. నాకే భయం. చీరలు

బాగున్నాయి. అంగీలే ఒకే రంగులో ఉన్నాయి. వీరేశ్ బాబు అంగీ, నాగేంద్రమ్మ చీర ఒక్కటే రంగు. అలా కలిసొచ్చింది అంతే. పాడు, గొంతు అరగాలి. వాయించండి. మీ చేతులు నొప్పెట్టాలి. నేనే పాడేది. నావైపు చూడండి. నవ్వండి, పొగడండి. ఏదో ఒకటి అనేసుకోండి. జానకే లేదు. నేనంటే తనకి భయం. లేదు సిగ్గు. పుణ్యం అక్కర్లేదు తనకి. ముసలవ్వ నోట్లో పళ్ళు లేవు. నశం తిక్కలేదు. నశం మానెయ్యండి, పళ్ళు కాపాడుకోండి. కొట్టు పళ్ళు కాదు తలలు. పాడండి నాతో పాటు. పదాలు అందుకోండి. నా గొంతు ఇంతే. గట్టిగ ఉంటుంది. రాగం కుదరకపోయిన పర్లేదు. నా సొంత రాగం అందుకుంటా. పాడండి నాతో. పదాలు పట్టుకోండి.

విరామం. భజనకి కొద్దిసేపు విరామం. బయట బసిరి చెట్టు కింద టీ పొగలు కక్కుతుంది. తాగుదాం. నిద్ర మత్తు వొదిలించుకోవాలి. నేను బసిరి చెట్టు కట్ట మీదకొచ్చాను. నాతో పాటు అంజీ, తిరుమల్, వీరేశ్. కొందరు పెద్దవాళ్ళు కూడా కట్ట మీదకొచ్చారు. టీ గిన్నె దగ్గర ఆడపిల్లలు. చెంబులో నించుకుంటు గోల. గుళ్ళో ఉండే మొగాళ్ళకి ప్లాస్టిక్ గ్లాసుల్లో చెంబులోని టీ పోయడం వాళ్ళ పని. నన్ను బాగా పాడావని మెచ్చుకున్నాడు కుంటి మల్లికార్జున. మారెమ్మత్త దగ్గరకొచ్చి నవ్వుకుంటూ బా పాడావంది. బా పాడితే నవ్వాలా. పాట అందుకున్నాను. నోటికొచ్చింది పాడుతున్నాను. అక్కడున్న వాళ్ళంతా నవ్వుతున్నారు. నే పాడిందే పాట. ఇంకో రాగం లేదు.

జయలక్ష్మి కట్ట మీద ఉన్నవాళ్ళకి టీ తీసుకొచ్చింది. ఒక చేతిలో చెంబు, మరో చేతిలో ప్లాస్టిక్ గ్లాసులు. మళ్ళీ తాగాలి. తను పెళ్ళి కూతురు. కట్ట మీది వాళ్ళంతా నా బంధువులు. నే పెళ్ళికొడుకుని. సిగ్గు పడుతూ తను నాకు టీ అందిస్తుంది. నేను తనవైపు చూస్తూ అందుకుంటాను. సడెన్గా తల ఎత్తుతుంది. ఇద్దరి కళ్ళు కలిసిపోతాయి. ఆ తరవాత పెళ్ళి, శోభనం, పిల్లలు. పిల్లలకు ఏం పేరు పెట్టాలి. జానకి...! మరి మగ పిల్లాడైతే? తను వరసగా నా దగ్గర కొచ్చింది. ప్లాస్టిక్ గ్లాసు వైపే చూస్తూ అందులో టీ పోసి నా చేతికి అందించింది. అంతే, తను నావైపు చూడ్డానికి ఆగలేదు. ఎంత త్వరగా వచ్చిందో అంతే త్వరగా వెళ్ళిపోయింది. ఓ దేవకన్యా ఆగిపో. నన్ను చూడు. ప్రేమించు.

ఇంకో పాట పాడమంది మారెమ్మత్త. ఎత్తుకున్నాను. వినేవాళ్ళు ఉంటే నాకు ఎన్నైనా పాడేందుకు ఉత్సాహం. ఇక్కడ భయపడ్డానికి ఇంటివాళ్ళు లేరు. భజన మళ్ళీ మొదలు. పరుగులు. డమి డిమి డిమి డిమీ

బయట కుక్కలు అరుస్తున్నాయి. బయట కుక్కలు, లోపల మేం...! రేపే ఈ రంగుల విందుకు చివరిరోజు. ప్రవ లాగడం అయ్యాక కార్తికాలు ముగిసినట్లు. జానకి వొచ్చుంటే. మళ్ళీ చూస్తానా. రేపు ప్రవ దగ్గరికొస్తుంది కానీ, ఈ రాత్రి మొత్తం జాగారం లో ఉండుంటే. ఎంత జిడ్డులా మారాను ఈ మాసం మొత్తం తనకి. పూజలు ప్రశాంతంగా చెయ్యనిచ్చే వాన్నా? పేపర్ చదువుతున్నట్లు, ఎవరితోనో మాట్లాడుతున్నట్లు, ఏదో పని మీదున్నట్లు కట్ట మీద కూర్చొని మాటికి తన వైపు.. పొద్దున తన్ని చూడకపోతే రోజంతా ఎంత రోధ. పొలానికి మందు కొట్టడానికి వెళ్తేనే పొద్దున తన్ని చూడలేను. కనిపిస్తుందేమోనని దొడ్లో నుండి చూస్తాను. పనికెల్లుంటుంది. అర్థం కాదు. తప్పించుకున్నట్లే ఉంటాది. చూస్తున్నట్లే అనిపిస్తది. అర్థం కాదు. భయమో, చిరాకో, అసహ్యామో, సిగ్గో. రోడ్డు మీద వెళ్ళేప్పుడు జానకి నావైపు చూస్తోందని వీరేశ్ బాబు కోస్తాడు. ఆ మాట అమృతం కానది వొట్టి కోత. నిజం కాదు. నిజమా? వెంకటప్ప కట్ట మీద కూర్చొని దూరంగా ఉన్న వాళ్ళ గుడిసె వైపు చూద్దునా. తాను బయట ఉంటే వెంటనే గుడిసె వైపు కనబడకుండా వెళ్తుంది. ఎంత అందమైన ఆట. దొంగ పోలీసు. దాగుడు

మూతలు. చిక్కదు దొరకదు. ఎవ్వరూ చిక్కరు. రేవతి చిక్కదు. తానేమో ఓసారి అంజీ వైపు, మరోసారి తిరుమల్ ఇంకోసారి నేనూ(?) చిక్కరు. అది మాకొక్కరికే దక్కాలని ఆరాటం. అందరికి అంటే గుండె పగులుతుంది. తబల పగులుతున్నట్లు. అది పగలదు. ఎంత కొట్టినా పగలదు. కొట్టు. అందరూ కొట్టండి తాళాలు. వీరేశమ్మకి భయం లేదు. నన్నే చూస్తూ నవ్వులు. నేను చూడాలా? వొద్దు. చూడు. తాను బాలేదని, లావుందని కదా చూడనిది. ఎంత వివక్ష? చూడు. చూస్తే ఏమవుతుంది? తనకి ఈ కాసింత సంతృప్తి. వొద్దు. చూద్దాం. కాసేపు ఓదార్పు. చూడు. పాడు. పదాలు పట్టుకో. కొట్టు. కొట్టు. ఇంకా గట్టిగా. శ్రీలతని మొగుడు కొట్టినట్టు. తను అక్కన్నుండి పారిపోదు. ధైర్యం ఎక్కన్నుండొస్తుంది? ఆడాళ్లు అలానే ఉండాలి. తప్పదు తనకి. తాగోస్తాడు మొగుడు. పక్కన పడుకుంటే మందు వాసన. బీడీల వాసన. మారెమ్మ అత్తది నశం వాసన మొగుడికి. మొగుడికోటే కాదు రెడ్డికి. ఎంత ధైర్యం మారెమ్మత్తకి. అందరి ముందే భార్యలేని రెడ్డి ఇంటికి వెళ్ళొస్తాది. పనులు చేస్తది. ఆడాళ్ళ కంత తనంటే జెలసి. మొగుడికి ఏదో మందేసింది అంటారు. అలాంటి మందు ఉంటుందా? ఒకర్ని వశం చేసుకునే మందు. ఉంటే మీనాక్షి ఆంటీకి ఎలాగైనా తాగియ్యాలి. ఆ ఎదలు ఎంత లావు. పిర్రలు ఊపుకుంటా పోతాది. రెండు పిర్రలు, రెండు తబలాలు. కొట్టు పగలగొట్టు తబలలను. ఉషా, నువ్వింకా చిన్నపిల్లవు. మొగపిల్లలు వైపు కన్నార్పకుండా చూస్తావ్. వొద్దు. ఎంతుంటాయి నీకి. పద్నాలుగు. చిన్నపిల్లవు. వొద్దు. ఇంకేం పిల్ల. చూడు నువ్వొచ్చే లోపే తనకి పెళ్ళవుతుంది. పెళ్ళి, పెళ్ళి, పెళ్ళి... పెద్ద మనిషి అయితే చాలు ఇక పెళ్ళికి ఆరాటం. చదువు ఆపెయ్యాలి. పని నేర్వాలి. డబ్బులు కూడబెట్టాలి. సంబంధం కుదిరితే పెళ్ళి చేసేయ్యాలి. చదువు, అది ఆడపిల్లకు అవసరం లేదు. జానకి చదువుకొని ఉంటే ఈ పాటికి ఎంతుండేది? ఇంటర్ సెకండ్. అదేనా కాదు డిగ్రీ ఫస్ట్(?) పద్దెనిమిది అంటే అదే. తనాకింకా ఏ పదనాలుగులోనో పెళ్ళి కాలేదు. అయ్యింటే తాను నాకు కనిపించేది కాదు. తను నాకే రాసుంటే ఎవరేం చేస్తారు? రాసుందా? ఎవరు రాసారు? ఎలా రాస్తారు? ఎట్లా లెక్కేస్తారు? పాడండి, ఏయ్, ఇదే ఆఖరి. మళ్ళీ శివరాత్రికి భజన. అరె, మాదిగామేకి ఆధార్ తేలేదే. చదువుకొని వేస్ట్ నేను. ఆధార్ కావాలంటే రేషన్ కార్డ్ కావాలాంట. రేషన్ కార్డ్ కావాలంటే తను పుట్టింటికెళ్ళాలి. వెళ్ళలేదు. అమ్మవాళ్ళు తను చచ్చిందని చెప్పేశారంట. పరువు కావాలి వాళ్ళకి. మొగుణ్ణి పెట్టుకొని మా ఊరి ఆయనతో లేచి రావడం తన తప్పు. ఆ లేపుకొచ్చినోడికి అప్పటికి పెళ్ళాం పిల్లలు. మాటికి తాగుతాడు, కొడతాడు, కూలి డబ్బులు గుంజుతాడు. ఎంత నమ్మించాడో. ఆ మగాడి పెళ్ళాం తరిమిస్తే గుడిసె వేసుకుంది. ఆధార్ కావాలి తనకి. తన్నెవరు చూడగలరు? చూస్తే తిరిగి ఈ లేపుకొచ్చినోడి పౌరుషం, గర్భవతి. ఆధార్ లేకపోతే ఆసుపత్రిలో తీసుకోరు. అలా ఏం ఉండదు. మానవత్వం ఉండదా డాక్టర్ల కి. "చక్కనైన రామచంద్ర ఎక్కడున్నావ్? నీవు లేక దిక్కులేని పక్షులైనాము". అరె పాట ఎంత కరెక్ట్ రాశారో. ఆయన లేడు. లేడు కాబట్టే మేమంత దిక్కులేని పక్షులం. మాదిగామే పాపం దిక్కులేని పశ్చి. పెద్దత్త ఏం చెయ్యలేదు. శ్రీలత ఎదిరించదు. మగాడు కొడతాడు. ఎంత కొట్టిన వాడికే అంత సపోర్ట్. చట్టం తెలీదు జనాలకి. నాకి తెలిసి ఏం లాభం. ఏం చెయ్యలేను. ఎన్ని జరిగినా చూస్తూ ఉంటాను అంతే. బలం లేదు. ధైర్యం లేదు. పొలం పాసు బుక్కుకి లంచాలు తింటాడు విఆర్వొ గాడు. ఉన్నోళ్ళు ఇచ్చుకుంటారు, లేనోళ్ళు. బలమైనోడిదే రాజ్యం. నేనూ అంతే. అవకాశం ఉంటే అన్యాయం చేస్తా. బలముంటే అందర్నీ ముంచుతా. లేదు, అలా ఏం కాదు. చాలు,చేతకాదు కాబట్టే కమ్యూనిజం అంటావ్. నువ్వు కూడా అంతే. ఒప్పుకో.

అంజీ పదాలను పట్టుకోకుండా తనే సొంతగా కొత్త పదాలు కోరస్ గా పాడుతున్నాడు. వాడి చుట్టూ పిల్లలు ఒకరి నెత్తిపై ఒకరు మొట్టికాయలు వేసుకుంటూ ఏడుస్తున్నారు. ఒకదాని తరవాత ఒకటి. ఎన్ని పాటలు. ఒకరి తరవాత ఒకరు పాడుతునే ఉన్నారు. అంజీ నిద్రొస్తుందని వెళ్ళిపోయాడు. తిరుమల్, వీరేశ్ బాబు ఇద్దరు వెళ్ళిపోయారు. ఆడాల్లు కూడా చాలమంది వెళ్ళి పోయారు. ఇక్కడ ఉన్న మొగవాళ్ళ పెళ్ళాలే కనిపిస్తున్నారు చాలావరకు. మారెమ్మత్త మాత్రం అలానే ఉంది. నేను వెళ్ళలేదు. నాకు తోడుగా రంగస్వామి ఉన్నాడు. అసలు ఎవ్వరూ లేకపోయినా పర్లేదు. వెళ్తే అందాన్ని, కాలాన్ని కోల్పోతాను. అందరి మొఖాలు వసంతాన్ని వర్షిస్తున్నాయి. దాన్ని నేనేందుకు వొద్దంటాను.

నేను పాడేందుకు మళ్ళోసారి అవకాశమొచ్చింది. ఈసారి పక్కన రంగస్వామి ఉన్నాడు. పాడాను, నాతో పాటుగా రంగ. ఇద్దరం కలిసే పాడుతున్నాం. నవ్వుతున్నారు. ఆడపిల్లలు నవ్వడం చూసి వాడు ఆపేశాడు. నేను ఆపలేదు. నవ్వుకోండి. నవ్వుకునేందుకే పాడుతున్నాను. నవ్వు నుండే అమృతాలు పుడుతున్నాయి. వాటిని నే జుర్రుకోవాలి.

మాటికి లోపలికి బయటకు తిరుగుతున్నారు గుళ్ళోని వాళ్ళు. బసీరి చెట్టు కింద టీకి పెట్టిన మంట దగ్గర కూర్చున్నాను నేను. ఓ గ్లాసులో టీ పోసుకున్నాను. రాజేష్ నా ముందుకొచ్చి వాడో గ్లాసులో టీ పోసుకొని నా పక్కనే కూర్చున్నాడు. పాడటం రాకపోయినా ఎందుకు అలా పాడుతావని నవ్వాడు వాడు. జెలసి. వాడు పాడెప్పుడు ఎవ్వరూ వాడివైపు చూడరని, నే పాడుతున్నప్పుడు ముఖ్యంగా ఆడాల్లు నావైపు చూస్తున్నారని జెలసి. నేనేమనలేదు, ఊరికే పళ్ళు చూపించాను.

ఆడపిల్లలు కరెంట్ స్థంభం వెలుగుకి కో కో ఆడుకుంటున్నారు. అంత చిన్న పిల్లల్లాగే అనిపిస్తున్నారు, పెద్దవాళ్ళలాగా చీరలు. ఇప్పుడు కలిసి నవ్వుకుంటున్నా వీళ్ళంతా రేపటి ఏడో ఆ తరవాత ఒక్కొక్కరు ఒక్కో దిక్కుకు వెళ్ళిపోతారు. ఎవరికి ఏ సంబంధం లేకుండా జీవితాలు గడిపేస్తారు. ఆ వయసులోనే భార్యగా బాధ్యతలు మోయటం. ఆడటం మరిచిపోతారు. ఇప్పుడున్నంత కాస్త స్వేచ్ఛగానైనా ఏ అబ్బాయితో నవ్వుకోరు. అన్ని దాచుకుంటారు. జీవచ్ఛవంలా. అన్ని కోరికలను త్యాగం చేసి బతకడం. బరువనిపించదు. నలుగురికి భయపడుతూ తమని తాము నియంత్రించుకుంటు గౌరవంకై మొండిగా బతికేస్తారు. జానకికి కూడా పెళ్ళవుతుంది. తను ఒక్కనాడు కనబడకపోతేనే ఎంతో వ్యధ చెందే నేను తను లేకుండా ఉండటం! పెళ్ళి చేసుకోనా? ఇద్దరం పెళ్ళి చేసుకుని ఆ గుడిసెలోనే కాపురం పెట్టడం. చందమామలను, నక్షత్రాలను చూసుకుంటూ జీవితం గడపటం. తన్నే ఎందుకు? బాగుందనా? రాజేశ్వరిని చేసుకో. లావుగా ఉందనే వీరేశమ్మ. లేదు, అందంగా ఉండే జానకే నీకు కావాలి. నాకు తెలుసు. అందం కావాలి. శరీరం కావాలి. అందంగా లేనోళ్ళు అనర్హులు. ఎక్కువ, తక్కువ!

ఆ కరెంటు స్థంభం వెలుగులోనే ఇంకో వైపు నాకెదురుగా అంజీ వాళ్ళ ఇంటి ముందు ట్రాక్టర్. అది అంజీ వాళ్ళదే. తెచ్చి పదేళ్ళయుంటుంది. నలుగురు నిక్కరేసుకున్న పిల్లలు ట్రాక్టర్ ట్రాలీలోకెక్కారు. అక్కడే పడుకున్నట్లున్నారు. కనిపించడం లేదు. రాజేష్ లేచి గుళ్ళోకెళ్ళి పోయాడు. పొయ్యి కిందకు రెండు కట్టెలు తోసి ఇంకో గ్లాసులో టీ పోసుకున్నాను. టిప్పిరి గాడు ట్రాలీ వెనక కింద చెంబుతో కనిపిస్తున్నాడు. ఏం చేస్తున్నాడు? చెంబులోని నీళ్ళను ట్రాలీలోకి విసిరి పరిగెత్తాడు చీకట్లోకి కనిపించకుండా. ఇద్దరు పిల్లలు లేచారు. అంగీపై పడ్డ నీళ్ళని తుడుచుకుంటు ఎవరు చల్లారని చుట్టూ చూసారు. నా వైపూ చూసారు. నేనే అనుకున్నారా? ఏమో! మళ్ళీ పడుకున్నట్లున్నారు. తిరిగి టిప్పిరి

గాడు నీళ్ళ చెంబు తీసుకొని ట్రాలీ వద్దకు వచ్చాడు కొద్దిసేపుకి. ఈసారైనా చిక్కుతాడా? నీళ్ళని చల్లి పరిగెత్తాడు ముందుకు. ట్రాలీలో ఓ పిల్లాడు లేచాడు. వాడి అంగీపైనే అన్ని నీళ్ళు పడినట్లున్నాయి. వాడు రేవతి తమ్ముడు ఆనంద్. ముందుకురుకుతున్న టిప్పిరి గాడు కుక్కని తొక్కినట్లున్నాడు. అవి అరుస్తుంటే చెంబుతో గుడి దగ్గరికే వచ్చాడు. ఆనంద్ గుర్తుపట్టినట్లున్నాడు. దిగి వాణ్ణి పట్టుకొని నెత్తిపై మొట్టికాయలేశాడు. ఈసారి చేయనంటేనే విడిచిపెట్టాడు. మళ్ళీ ట్రాలీలోకెళ్ళాడు. టిప్పిరు మళ్ళీ కొద్దీ సేపుకి ట్రాక్టర్ దగ్గరకు. ఏం చేస్తాడో ఈసారి. చేతిలో చెంబు లేదు. ముందున్న హారన్‌ని వొత్తి పట్టుకున్నాడు. అదీ కీ అనుకుంటూ. ట్రాలీలో ఉన్నవాళ్ళు లేచారు. ఆ ఇంటి ముసలవిడ తిట్టుకుంటూ బయటకొచ్చింది. ట్రాలీలో ఉన్నవాళ్ళని చూసి కర్రను చూపితే వాళ్ళు ట్రాలీ దిగి పరుగు. నవ్వుకుంటున్న నా ముక్కు ముందు రెండు దోమలు. చేతితో ఓ దెబ్బేశాను. ఆడపిల్లలు ఆడుకుంటున్న వైపు టిప్పిరి గాడు పరిగెత్తుతున్నాడు. వాడి వెనకాల ఆనంద్. ఎన్ని తిప్పలు పెడ్తున్నాయి ఈ దోమలు.

గుళ్ళో కొచ్చి మళ్ళీ తాళాలు తీసుకున్నాను. అలుపు లేదు లక్ష్మన్నకి. కొడుతూనే ఉన్నాడు. కళ్ళు భారంగా మూస్తూ తెరుస్తూ పాడుతున్నాడు కుంటి మల్లికార్జున. రాజేష్ ఇంకో పాట అందుకున్నాడు. నా కంటే మూడేళ్ళు చిన్నోడు. పాటలు సొంతగా ఎన్ని పాడాడో? పది వరకే చదువాపి ఊర్లోనే పొలం పని చేస్తున్నాడు. వాడి చెల్లెలే బీరప్ప పెళ్ళాం. బీరప్ప గాడికేమో ఈరమ్మ పిచ్చి. వాడు చూస్తున్నాడు, తనూ చూస్తుంది. ఆ ఈరమ్మ కళ్ళు చూడాలంటే నాకెప్పటికి భయం అనిపిస్తాయి. ఏదో హెచ్చరిస్తున్నట్లు, బెదిరిస్తున్నట్లు. బీరప్పకి తన పెళ్ళాం కూడా తనలా మరొకరిని కోరుతుందని చూస్తుంటుందని తెలిస్తే ఏం చేస్తాడు. నిజమో కాదో ఏది ఆలోచించకుండ తన వీపులు వాయిస్తాడు. రాజేష్ కూడ చెల్లిదే తప్పు అనేస్తాడు. ఇప్పుడు చూస్తున్న బావని మాత్రం ఏం అనలేడు.

నవ్వుతున్నాం. అరుస్తున్నాం, ఏడుస్తున్నాం. కొడుతున్నాం. రాత్రి మూడు వరకు ఉండగలిగాను. సొంతగా పెద్ద స్వరంతో పాటలు పాడాను. కళ్ళు బరువెక్కాయి. కాసేపు పడుకొని మళ్ళీ వద్దామని బయటకొచ్చాను. జయలక్ష్మి, రేవతి ఇద్దరు రెండు చేతుల్ని ఒకరికొకరు పట్టుకొని తిరుగుతున్నారు. జయలక్ష్మి మనిద్దరం పెళ్ళి చేసుకుందాం. జానకి వద్దు నాకు. తను నన్ను చూడదు. నువ్వైతే అప్పుడప్పుడైన చూస్తావ్. నీ కళ్ళలో అమృతం. అటువైపు పింక్ చీర, ఇటు వైపు పసుపు పంజాబీ. ఈసారి ఇటువైపు పంజాబీ, అటువైపు చీర. గిర గిర గిర గిరా. రంగులవలయం గిర్రున తిరుగుకుంటు. పైనున్న బల్బులకు అలుపు రాదు. రంగులు మార్చుకుంటూ ఎడతెరపి లేకుండ పరిగెత్తుతుంటాయి. ఓసారి నీలం, ఇంకోసారి ఎరుపు, నలుపు, మళ్లోసారి పసుపు. గిర గిర గిర. పరిగెత్తు. కొట్టు డిమి డిమి డిమి. మా ఇంటి మిద్దె మీదకొచ్చాను. అమ్మ, నాన్న ఇద్దరు మిద్దమీది రూమ్ లో పడుకున్నారు. మూలకున్న పరుపు తీసుకొని నేను రూమ్ బయట వేసుకున్నాను. గుడి గోపురం బల్బుల వెలుగులు మా మిద్దె మీదకు పడుతున్నాయి. ఆకాశం నుండి మీనాక్షి ఆంటీ దిగి నా పక్కనే పడుకుంది. పిర్రల ఆంటీ. నాకు స్ఖలనం అయ్యేంతవరకు ఉండి మాయమైంది.

ఊర్లో రెండు చోట్ల రెండు వైపుల నంది విగ్రహాలున్నాయి. మా దొడ్డిని దాటి ముందుకు మా పొలానికి పోయే దారిలో. ఇంకోటి బురాన్‌దొడ్డి వూరి దారివైపు రోడ్డు పక్కన అంజీ వాళ్ళ పొలంలో. ప్రవ ప్రతి యేడు ఏదో ఒక నంది విగ్రహం దగ్గరికి లాగుతారు. చివరి యేడు బురాన్‌దొడ్డి వైపుకి లాగారు కాబట్టి ఈసారి మా పొలంవైపే లాగించాలని అటువైపు పొలాలుండే వాళ్ళ కోరిక. కానీ బురాన్‌దొడ్డి

వైపు ఇండ్లు, పొలాలున్న వాళ్ళు మా వైపే లాగించాలని పట్టు పట్టారు. బసిరి కట్ట మీద పది గంటలప్పుడు పంచాయితీ నడిచింది. ఈసారి మా పొలంవైపే లాగాలని సయోధ్య కుదిరింది.

ఇద్దరు కొత్త పూజారులు ఊర్లోకొచ్చారు. గుళ్ళో కొత్తగ తెచ్చిన శివ పార్వతుల బొమ్మలకు పెళ్ళి చేశారు. భజన నుండి నేరుగా ఇంటికెళ్ళి పడుకున్న నేను లేచే లోపు మధ్యాహ్నం అయ్యింది. గుడి దగ్గర హడావిడి. రామకృష్ణ అప్పుడే పెళ్ళి చేయబడ్డ విగ్రహాలను పట్టుకొని బయట నిలబడున్నాడు. వాడికి ముందు ఇద్దరు పూజారులు రకరకాల విన్యాసులు చేస్తున్నారు. అవి సర్కస్ ఫీట్ల లాగున్నాయి. పూజారులు అలా చేయడం నేనెప్పుడూ చూడలేదు. నిమ్మకాయలని నోటితో కొరుకుతూ టెంకాయలని రెండు చేతుల్తో పగల గొడుతూ ముందుకి వెనక్కి అటు ఇటు డాన్స్ వేస్తున్నట్లు. ఆ పూజారులు వాళ్ళ వెనకాల విగ్రహాలని పట్టుకున్న రామకృష్ణ ముందుకు కదుల్తుంటే వాళ్ళ ముందు చీర బట్టల్ని పరుస్తుంది చాకలమ్మ. వాళ్ళ వెంట కొంత మంది జనం. కాసేపైన నిద్రపోయారో లేదో జాగారం చేసిన ఆడపిల్లలు కూడా వీళ్ళ వెంట ఉన్నారు. జయలక్ష్మి అదే పంజాబీ, అదే నవ్వు. నా కళ్ళు జనాల్లో జానకిని వెతికితే తానేది?

ఆ విగ్రహాలని మధ్యలో ఆపుకుంటు సర్కస్ ఫీట్లు చేస్తూనే ఉన్నారు పూజారులు. చూడానికొచ్చే జనాలు వాళ్ళకి దక్షిణ వేస్తున్నారు. అవి మా దొడ్డి వైపుకి కదిలాయి. మారెమ్మ గుడి దగ్గర జానకి వస్తుందనుకున్నాను, రాలేదు. విగ్రహాలు మా దొడ్డిని దాటేప్పుడు కనిపించింది జానకి. వాళ్ళక్క, అమ్మ, తాను రోడ్డు మీద నిలబడి నంది విగ్రహంవైపు కదులుతున్న మా పరివారాన్ని చూస్తున్నారు. నన్ను తను చూడలేదు. పాత పంజాబీ, వెంట్రుకలు దువ్వకోకుండ మెడలో టవల్ వేసుకోనుంది. ఉమక్క తల గుండు ఎందుకో. రాజేశ్వరి నవ్వుతూ జానకి దగ్గరికెళ్ళింది. ఇద్దరు చేతులో చెయ్యిని వేసుకొని జనాల్లో కలిశారు. నేను పూజారులకు అడుగినప్పుడల్లా టెంకాయలు అందిస్తున్నాను. వెనక శివపార్వతుల విగ్రహాలు, శివ జానకులు కాదు. వాటికి వెనక జనాల్లో ఇద్దరు ఏవో మాట్లాడుకుంటూ జానకి రాజేశ్వరులు. తను టెంకాయలు అందించే నా వైపు చూస్తోందని ఆశించాను. లేదు, తన ధ్యాసలో తానుంది. ఆ పరివారమంత నంది విగ్రహం దగ్గరికొచ్చారు. పూజారి నంది విగ్రహానికి పూజ చేస్తున్నాడు. విగ్రహం ముందు పూజారి పూజ చేస్తుంటే నేను పక్కనే ఉన్నాను. పూజారి ఊది కడ్డీలను అంటించడానికి నన్ను అగ్గిపెట్టె అడిగాడు. నేనేం బీడీలు తాగుతానా అగ్గిపెట్టె నా వెంటే ఉండటానికి. అదే మాట అన్నాను. అందరూ నవ్వారు. జానకి నన్ను చూడగలిగింది, తన కళ్ళు అలసటగా కనిపిస్తున్నాయి. తాను జాగరణ చేసిందా! అయితే పుణ్యమెక్కడికి పోలేదు.

సాయంత్రం బండిపై నిలబెట్టిన ప్రవని చూడ్డానికి చాలామంది జనాలొచ్చారు. నేను బసిరి కట్టపై నిలబడున్నాను. ఇన్ని రోజులు పూజలు చేసిన ఆడపిల్లలు ప్రవ ముందు కంచెలు పట్టుకొని నడిస్తే వాళ్ళ వెనకాల ప్రవ లాక్కొని రావాలి. ఒక్కొక్కరుగా చేతులో పళ్ళాలతో కొత్త చీరల్తో ప్రవ ముందుకొస్తున్నారు ఆడపిల్లలు.. కొత్త కొత్త తలకాయలు. ఇంతకు ముందు ఊర్లో చూడనివి. జానకి ఆకుపచ్చ అంచు తెల్ల చీరతో నిలబడింది. తల్లో తెల్ల రిబ్బెన. చేతిలో కంచంతో అటు ఇటు చూస్తుంది. నా కోసమేనా? నేనంటే తనకు అంత ఇదా? ఆశపడకు, పిచ్చోడా!

ప్రవ ముందుకు కదిలింది. ఆడపిల్లలంత మా దొడ్డి వైపున్నారు. ఆశ్చర్యంగా ప్రవ ఇటువైపు తిరగకుండా బురాన్ దొడ్డి వైపు మళ్ళింది. మా నాన్న వెంటనే ప్రవ ముందు కెళ్ళి ప్రవను ఆపించాడు. పొద్దున మా పొలం వైపు లాగలని సయోధ్య కుదిరినా ప్రవ అటువైపు ఎలా లాగుతున్నారని నాన్న

అడిగాడు. ఆ ప్రవ లాగేవాళ్ళలో ఖడ్డి రామంజిని, లక్ష్మన్న ఇటువైపే మళ్ళారని ఇటే తిప్పమని అన్నారని లాగేవాళ్ళ మాట. గొడవ మొదలైంది. అటువైపు ఇళ్ళున్నవాళ్ళు మా వైపే లాగలని, ఇటు వైపు పొలాలున్నవాళ్ళు ఇటువైపని. శివుడు తన వొంట్లోకి వొచ్చిన ఓ ఆడామె మగాళ్ళని తోసుకుంటూ ప్రవ ముందుకు గంతులు వేస్తూ వొచ్చింది. ప్రవ బురాన్‌దొడ్డి వైపే లాగాలని అంది. ఎవరు వింటారు? ఇప్పుడు సమస్య పరువు వైపు మళ్ళింది. ఇటువైపు మా నాన్న సైన్యం. అటువైపు ఇంకో సైన్యం. ఎవరు ఎవరి మాట వినరు.

ఎటు వెళ్ళాలో తేలిక అమాయకంగా చూస్తున్నారు కంచాలతో పిల్లలు. గొడవతో నాకేం పని, జానకిని వెంటాడం కన్నా గొప్ప పనుంటుందా! చేతికి గాజులు మెరుస్తున్నాయి. చీరలో జానకి పెద్దదిగా అనిపిస్తుంది. పెళ్ళైన ఆడామెకి లాగా. నేనూ జానకి తప్ప మిగతా జనాలు అంత గడ్డకట్టుకొని అలానే నిలబడిపోవాలపించింది. నేను జానకి ముందుకెళ్ళి నిలబడతాను. జానకి వెనక ముందు చూసుకుంటుంది. ఎవ్వరూ ఉలకరు, పలకరు. కంచంని కింద పారేసి నానుండి పారిపోవాలని చూస్తుంది. నేను తన్ని పట్టుకొని హత్తుకొని బుగ్గలపై ముద్దు పెట్టేస్తాను. పారిపోయేందుకు గింజుకుంటుంది. మొఖం పక్కకు తిప్పుతుంది. తన బుగ్గలని పట్టుకొని తనవైపే చూద్దునా, నా బలం ముందు ఎటుపోలేని నిస్సహాయతతో భయంగా ఆ కళ్ళు. వదులు దుర్మార్గుడా, నువ్వంటే ఇష్టం లేదు, ఎందుకు మాటికి నన్నే వెంటాడుతావ్. వదులు, వదులు. నే వెళ్ళిపోవాలి.

అరిష్టమని ప్రవని ఐదు అడుగులు గుడి ముందుకు లాగి వెనక్కి నెట్టారు. ఇక ప్రవ ఎటువైపు వొద్దని ఇండ్లకు వెళ్ళిపోతున్నారు జనాలు. నాన్నపై కోపమొచ్చింది. తను అడ్డు పడకుంటే ప్రవ కదిలేది. ఇంత అందంగా తయారై వొచ్చిన ఆడపిల్లలు ఇంటివైపు కదుల్తుంటే బాధనిపించింది.

జానకి వెళ్ళిపోయింది. కార్తికాలు ముగిసిపోయాయి. నేనూ హైదరాబాద్ వెళ్ళాలి తప్పదు. ఇంటి పోరు పడలేకపోతున్నాను. పొద్దున అత్త దగ్గరికెళ్ళాను. నన్ను పట్టుకొని ఏడ్చింది. ఊరికొచ్చి త్వరగా పెళ్ళి చేసుకోవాలని నేనే తన కొడుకునని తనకింకెవ్వరు లేరంది. ఎంత దుర్మార్గంగా కర్కశంగా తన్ని వదిలి నే పోతున్నాను. ఇక నుండి ఆ బకిటను గుడిసెని ఎవరు కడుగుతారు? తన్ని బయట ఎవరు కూర్చోబెడతారు? తన మాటలు వినేదెవ్వరు? అన్నం పెట్టేదెవ్వరు మధ్యాహ్నాం? రెండు వేల రూపాయల నోటు నా చేతికిచ్చింది. అది పింఛన్ కొచ్చిన డబ్బు. నే చేసిన పనికి కూలిగానో, ప్రేమగానో ఇస్తున్నట్లుంది. నేను తన్ని ఎన్నో మార్లు గమనించాను, అత్త అన్నింటిని డబ్బుతోనే లెక్కేస్తుంది. నే వెళ్ళిన ప్రతిసారి నన్ను తన దగ్గరి రూపాయలు తీసుకోమనేది. నేనెక్కడ తీసుకుంటాను? పట్టు పట్టింది. నేనూ పట్టు పట్టాను. చివరగా అమ్మవాళ్ళతో అత్త డబ్బులిచ్చిందనే చెప్తానని నాకు మాత్రం వద్దని తన సంచిలో పెట్టేసాను. మళ్ళీ ఎప్పుడొస్తావంది. ఎప్పుడొస్తాను? ఏం చెప్పగలను?

జానకి కనిపిస్తుందని దొడ్డి వైపుకెళ్ళాను. లేదు, ఎక్కడికెళ్ళిందో. మళ్ళీ ఇంకెప్పుడు చూస్తానో. నా మదిలో ఓ ప్రశ్న. జానకిని వొదిలి నేనుండగలనా? నన్ను ఆకర్షించిన ఎందరినో వదిలి ఉండగలిగాను కానీ, ఇది మరింత భారం అనిపిస్తుంది. నా కోసమే తనని సృష్టి పని కట్టుకొని తయారుచేసినట్లు నేను తనకోసమే మలచబడినట్లు.

బ్యాగ్ తగిలుంచుకొని పులకుర్తి వైపు వెళ్తున్నాను. చేతిలో చద్ది బకీటతో రేవతి తనతో నాగేంద్రమ్మ నాకెదురొచ్చారు. ఆ చూపులు నన్ను ఇక్కడే కట్టివేయాలని చూస్తున్నాయి. కానీ

అవకాశం? మీనాక్షి ఆంటీ ఇంటి ముందు బట్టలుతుకుంది. తను వొంగినప్పుడు ఆ రవిక సందుల్లో ఎదలు కనిపిస్తాయని ఆశపడ్డాను. చీర టైటుగా ఉంది. వీరేశ్ బాబు వెంకటప్ప కట్ట మీదున్నాడు. నా దగ్గరకొచ్చి క్షేమంగా వెళ్ళి రమ్మన్నాడు. వాడేసుకున్న అంగీ, నే ఇప్పుడే చూసిన నాగేంద్రమ్మ ఓణీ రెండు రంగులు మ్యాచ్ కాలేదు. ఊరు దాటుతున్న నాకు బడి దగ్గర పిల్లలు టాటా చెప్పారు. నేను నవ్వుతూ టాటా చెప్పాను..

ఆగాలనుంది.

ఆగి వెనక్కి వెళ్ళి జానకి ముందు నిలబడి

నిలబడి,

ఏం చేస్తాను??

పళ్ళు ఇకిలిస్తాను.

ఇకిలించి,

నేను తనవైపు,

తను నావైపు.

ఆ చూపులో అన్ని ప్రశ్నలే.

సమాధానాలు అడగడం అర్థం లేని పని.

# మూడవ అధ్యాయం

## 1

పిల్లలు అటు, ఇటు పరిగెత్తుకుంటూ ఆడుకుంటున్నారు. ఓ చోట జానకి ఇద్దరు ఆడాళ్లతో మాట్లాడుతూ కనిపిస్తుంది. ఓ చిన్న పిల్లాడు పరిగెత్తుకుంటు వస్తూ జానకి జడ లాగాడు. జానకి వెనక్కి తిరిగే లోపు అదే వేగంతో ముందుకు. నవ్వింది జానకి. ఆ నవ్వు మొఖంతోనే ఆ ఆడాళ్లతో మాటలు ఆపేసి తన సైకిల్ దగ్గరకొచ్చింది. పరిగెత్తుతున్న ఆ పిల్లాడు నాకెదురుగా వచ్చేసాడు. నేను ఆ పిల్లాడి బుగ్గలు గిల్లి నవ్వాను. వెనక్కి తిరిగి నేను నవ్వడం చూసింది జానకి. ఇప్పుడు తన పెదాలపై నవ్వు లేదు, బిర్రుగా చూపులు. నేనే ఆ పిల్లాన్ని పంపానని అనుకుందా! అనుకోని, కోప్పడనీ, నా దగ్గరకొచ్చి నన్ను తిట్టనీ. సైకిలెక్కి వెళ్ళిపోతుంది. కాళ్ళు పైకి కిందకీ. అటువైపు ఇప్పుడు తను నవ్వుతుందో కోప్పడుందో అర్థం కాదు, నా పెదాలపై మాత్రం ఇంకా నవ్వు.

చేతిలోని ఒక్కో రాయి నీటిలో అనేక అలల్ని పుట్టిస్తూ మునిగిపోతుంది. నాకెదురుగా ఓ ముసలాడు తన గేదెను కడుగుతున్నాడు, మరో వైపు అదే చెరువులోనే బోటు సాయంతో అటు ఇటు కదుల్తూ వలతో కుస్తీ పడుతున్నాడు ఓ కుర్రాడు. ఇప్పటికి వాడికెన్ని చేపలు దొరికాయో. కడుపుకి ఆకలి గుర్తొచ్చింది. వెనక్కి తిరిగాను. రెండు గువ్వ పిల్లలు నా సైకిల్ క్యారియర్ మీదకూర్చున్నాయి. వాటిని వెళ్ళగొట్టడం ఇష్టం లేదు. చెరువు కట్ట కింద రావి చెట్టు నీడలో కొందరు వాలీబాల్ ఆడుకుంటున్నారు. ఆ చెట్టు చుట్టూరా కట్ట. ఆ రావిచెట్టు, దాని ముందుటి ఈ చెరువు ఇవే ఇప్పుడు నాకు దొరికిన ఆప్త మిత్రులు. కొత్త కొత్త కలల్ని అవి ఊహల లోకం నుండి నాకోసం తీసుకొస్తాయి. వీటి సమక్షంలో నాలోని అశాంతి, ఆవేదన అన్ని విప్పేసి వాటి నుండి కావాల్సినంత ఓదార్పుని నేను పొందుతుంటాను. గువ్వలు ఎగిరాక సైకిల్ మీద కూర్చొన్నాను.

ఊరి నుండి హైదరాబాద్‌కి వొచ్చిన మొదటినుండి నే పూర్తిగా పట్టు తప్పిపోయాను. జ్ఞాపకాలు నన్ను కలవరపెట్టేవి. వెలితి, ఆందోళన, శూన్యం నన్ను పూర్తిగా ఆక్రమించేసాయి.

తిరిగి నే ఊరికెళ్ళే లోపు జానకికి పెళ్ళవుతుందేమో. పెళ్ళయితే, తనకి మొగుడొస్తాడు. అతన్నే జానకి ప్రేమిస్తుంది, అతడికే జీవితం ధారపోస్తుంది. అదే పెళ్ళి ధర్మం. మరి నేను. తన్ని ఆట పట్టించే నా అవకాశాలు కనుమరుగవుతాయి. నేనో ప్రత్యేక ఆత్మగా, తాను మరొక ఆత్మగా మిగిలిపోతాం. నేను తన చైతన్యపు నీడ నుండి దూరంగా కొట్టుకపోతాను. ఊరు విడిచే ప్రతి ఆడపిల్ల మరిచిపోతుంది, కానీ జానకి ఉనికే మరింతగా భయపెట్టింది. అందరికన్నా తన మౌనంతోనే నేనెక్కువ మాట్లాడాను, తన నిశ్శబ్దంలోనే నేనెన్నో రాగాలను కూర్చగలిగాను. తనెళ్ళిపోతే నా పాటలన్నీ నిస్సారం. నేనెక్కడ నాట్యం చేయాలి?

కాలం పరిగెత్తుతుంది,

దానితో పాటే పరిస్థితులు.

అన్ని కొన్నాళ్ళైనా ఆగాలనుకుంటాం.

ఏది మన చేతిలో ఉండదు. కానీ ఇప్పటికీ మించింది ఏముంది?వీణ గుర్తొచ్చింది. నా ఆవేదనని అర్థం చేసుకుని సాయం చేసే స్నేహితగా తనే నాకు అవకాశం. తనతో మాట్లాడి ఎన్ని నెలలయ్యిందో.

తానిప్పుడు మా ఊరి పక్కనూరిలో సచివాలయం జాబు తెచ్చుకుంది. రోజు ఇంటి దగ్గర్నుండి తిరుగుతుంటుంది. చాలా రోజులకి చేశానని, ఎలా ఉన్నావని అడిగింది.

"అక్కా! నాకో సాయం జేస్తావా?"

"ఏంది. "

"అక్కా! జానకి, బోయోళ్ళ పాప. మాటికి గుర్తొస్తుంది. పెళ్ళి సేసుకోవాలనుకోండ. " నవ్వింది.

ఎగతాళనిపించిందా?

"మల ఆ ఫోట్టిని ఆడిగినావా ?"

"యాలెక్క. నాను హైద్రాబాద్లో ఉన్నా. నువ్వే అడుగక్క. పెళ్ళి సేసుకుంటానని సెప్పక్క. "

"అడుగుతుల్యా శివ. "

"ఒప్పుకుంటుందా అక్కా"

"యే, బయపడొద్దు. నానే ఒప్పిస్తాల్యా. నువ్వు మాత్రం ఆ పిల్లని సేసుకున్నంక మంచిగ సూసుకోవల్ల సుడి. "

మంచిగా చూసుకోవడం అంటే ఏమిటి? తాను కోరేవి నేను నెరవార్చడమా. కోరే బట్ట, తిండి, నగ నట్ర తెచ్చివడం. అవసరం అనిపిస్తే తెచ్చిస్తాను మరీ వాటినే మాటిమాటికి కోరితే. చేతనవ్వదు, సాధ్యం కాదు. ఉన్నంతలో నా స్థితిని అర్థం చేసుకునే జానకి కావాల్సింది. అదే నే కోరింది.

హైదరాబాద్కి చివరన ఇస్నాపూర్ గ్రామంలో ఉన్న ఓ ఇండస్ట్రీలో ప్యాకింగ్ జాబుకి జాయినయ్యాను. బ్యాచిలర్ అనే నెపంతో నాకు రూం దొరకక పోతే మొదటి నెల హాస్టల్లో ఉన్నాను. ఆ తరవాత బీహార్ నుండి వచ్చిన పనివాళ్ళు ఉంటున్న రేకుల షెడ్డులో నాకూ ఓ షెడ్డు దొరికింది. షెడ్డు మరీ చిన్నగా అనిపించింది. రెండు షెడ్లకు ఒకే బాత్ రూం, నీళ్ళు రోజుకి ఒక్క పూట అది నేను కంపెనీలో ఉండే సమయంలోనే. బయట బకిట పెడితే ఎవరో ఒకరు పట్టి ఉంచేవాళ్ళు. వంట సామాన్లు కొత్తవి కొనుకున్నాను. ఇక్కడ నాతో మాట్లాడేందుకు, నే చెప్పేవి వినేందుకు ఎవ్వరు లేరు. జ్ఞాపకాలు భారంగా గుండెని పిండేసేవి. జానకి ఉంటే ఇద్దరికి తక్కువ రెంట్లోనే మంచి రూం దొరుకుతుంది. ఇలా ఎలుకలు, ఆ బాత్రుం కంపు బాధ ఉండదు. తను నాకు రోజూ వండి పెడుతుంది. ముద్దులు పెడుతూ, నవ్వుకుంటూ జాబుకి నన్ను సాగనంపేది. ఆ తరవాత---ఆ తరవాత ఏంటి?

పెళ్ళి చేసుకొని జానకిని హైదరాబాద్ తీసుకురావడం కంటే తన్ని చేసుకోకపోవడమే మేలు. నే చూసింది, కోరేది గుడిసెలో బతికే జానకిని. చెండు పూలని, తీత పాటల్ని, కొంగ పరుగుల్ని, పైరు నవ్వుని తనలో నింపుకున్న జానకిని. నా భాగానికొచ్చే ఆస్తిని తీసుకొని పొలం పని చేస్తూ తనతో ఆ గుడిసెలోనే ఉండిపోతాను. తను తోడుంటే పొలం పనిని కూడా సవ్యంగా నేర్చుకోగలనిపిస్తుంది. ఒకరిపై ఒకరం నీళ్ళను చల్లుకుంటూ బావిలో ఈదులాడుతాం. పచ్చని పైరుల్లో అలసట లేకుండ పాటలు పాడుతాం, వెన్నెల్లో ఇద్దరం పుకార్లు చెప్పుకొని నవ్వుకుంటాం, నక్షత్రాలెన్నున్నాయో అన్ని లెక్కలు రాసిపెట్టేస్తాం. నాకూ ఒకవేళ ఆస్తి లేకపోయుంటే ఏం చేసేవాన్ని? కూలికెళ్ళే వాడినా? ఊర్లో నన్నెవరు కూలీకి పిలుస్తారు? పిలిచినా నే చెయ్యగలుగుతానా? తిరిగి జాబే గతి. ఆస్తి ఉన్నందుకే జానకితో ఊర్లో కలల ప్రపంచం. అప్పనంగా వచ్చిన ఆస్తి. ఆస్తి లేకుంటే దురదృష్టం. లేదు, సొంతగా నేనే ఏదొకటి ఊర్లో చూసుకోవాలి. అప్లై చేసిన పోస్టల్ ఫలితాల్లో నాకు జాబు రాలేదు. వొచ్చే ఉంటే

ఊర్లో ఉండేందుకు నాకింక ఏ అడ్డు ఉండేది కాదు. సచివాలయం జాబు రాయడానికి నాకు డిగ్రీ లేదు. ఊర్లో ఉండి పెళ్ళి చేసుకొని డిగ్రీ చేస్తే, డిగ్రీ అయ్యాక సచివాలయంలో ఖాళీలు లేకపోతే. ఉన్నా నాకు దొరకపోతే. ఓపిక, సమయం అన్ని వ్యర్థం.

రేవతికి

ఈరమ్మకి

నిశ్చితార్థం అయ్యిందని, జానకి కూడా సంబంధాలు చూస్తున్నారని వీరేశ్ బాబు ఫోన్లో చెప్పాడు. వీణ నుండి నాకింకా సమాధానం రాలేదు. మెసేజ్ చేస్తే తానింక చెప్పలేదని, ఖచ్చితంగా చెప్తానని అంది, నమ్మకం లేదు. ఊరికొస్తానని, అక్కడే ఉండిపోతానని అమ్మకు చెప్పాలనిపించేది. నేను ఊరికి రావడం, అక్కడే స్థిరపడ్డం అమ్మకు ఇష్టం లేదు. ఇన్నాళ్ళు నా గురించి గొప్పలు చెప్పుకున్న వాళ్ళకి నేను అందరిలానే ఊర్లో ఉండటమంటే పరువు సమస్య. ధైర్యం తప్పదు. ఎటొకటి తేల్చేకోవాలి.

ఆదివారం మా రూం నుండి ఏమి తోచక నడుచుకుంటూ అలానే ముందుకెళ్ళి పోయాను. ఇస్నాపూర్‌ని దాటేశాను. ఎక్కడ చూసినా పరిశ్రమలు. పొగలు, అరుపులు. ఇక్కడి గాలికి త్వరగా రోగాల పాలవుతామనిపించింది. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా జాబ్ మానేసి నగరంలో మరొకటి చూసుకోవాలి. చిట్కూల్ గ్రామాన్ని దాటేశాను. కొన్ని పొలాలు కనిపించాయి, ప్రాణం లేచొచ్చినట్లనిపించింది. అలానే ముందుకెళ్తే పెద్ద రావిచెట్టు, దానికి పక్కన చెరువు, చెట్టు చుట్టూరా కట్టిన సిమెంట్ కట్ట మీద కూర్చున్నాను. రావి చెట్టు నన్నే పలకరిస్తున్నట్లు నే చెప్పేవి వినేందుకు సిద్ధమవుతున్నట్లు అలజడి. ఒక్కో జ్ఞాపకాన్ని విప్పసాగాను. నేను బరువనుకున్న జ్ఞాపకాల భారాలు అమృతంలా కనిపించాయి. పెదాలపై నవ్వు. గుండె మొత్తం తేలికగా ఎగరడం. గగనతలం నుండి ఏ దేవతో నా కోసం దిగొచ్చి నన్ను లాలిస్తున్నట్లు భావన. నేను ఈ రావి చెట్టు వేరు కాదనే భ్రాంతి. ప్రతి రోజు పనికి వెళ్ళే ముందు అక్కడికి రావడం మొదలెట్టాను. దానికోసమే సైకిల్ కూడా తీసుకున్నాను. ఆదివారాలైతే ఇక అక్కడే పగలంత ఆవాసం.

పెళ్ళి, ఇదే కావాలా నాకు. జానకినే పెళ్ళెందుకు? రాజేశ్వరి, వీరేశమ్మ, నల్ల మచ్చల భాగ్య... చేసుకోలేను. అందం కావాలి. శరీరం కావాలి. వ్యామోహం. అందం చూసే వెంటపడ్డాను. వివక్ష! ఓ వ్యక్తిని సొంతం చేసుకోవడం కొందర్ని వేరనే పరిస్థితి సృష్టిస్తోందే. నేను ఊర్లోని మూగోడిలాగా ఉండుంటే, లేకుంటే మొఖం వంకరగా ఉన్న కృష్ణ, బిక్షగాడిగా, అది కాకుండ ఏ ఆస్తి లేకుండా... వేషం ఓ పిచ్చోడిలా ఉండుంటే! తన ముంద నేను, ఆ అనర్హులు ఉంటే జానకి ఏం చేస్తుంది? ఖచ్చితంగా వాళ్ళని వదిలేసి నన్ను కోరుకుంటుంది, వాళ్ళెంత గాఢంగా ప్రేమిస్తున్నా కూడా. నేను, అంజీ ఇద్దరిలో అవకాశాలు ఇస్తే అంజీని ఎన్నుకుంటుంది, నన్ను వదిలించుకోడానికి కారణాలు చెప్పేస్తుంది. సొంతమనేది వివక్ష, అది అనాగరికం. అయినా జానకిని చేసుకుంటే అదేదో అందమైన ప్రపంచమని ఊహిస్తున్నాను. చేసిన ఊహాలు, కలలు అన్ని అబద్ధంగా కనిపిస్తే. ఊహించిన జానకి, పెళ్ళాడే జానకి వ్యక్తిత్వాలు అన్ని వేరు వేరైతే. ఎందుకోసం పెళ్ళి? తను పూర్తిగా నాదై పోతే చచ్చిన తనని, ఆ పిప్పిని నేనేం చేసుకుంటాను? పిప్పి... అందులో జానకి లేదు. రాజేశ్వరి ఉండదు. ఎవ్వరూ ఉండరు. భ్రాంతి. మాయ. నిన్న ఈరోజు రెండు వేరు వేరు.

చెరువులో నీటి ప్రవాహం ఒకవైపు నుండి మరో వైపుకి వెళ్ళిపోతుంది. హెరాక్లిటస్ ఏమన్నాడు, ఒకే ప్రవాహంలో రెండు సార్లు మునకలు వెయ్యలేమన్నాడు. అంత మార్పు! ఇక్కడే కాదు, సమస్త సృష్టి మొత్తం ఏ క్షణానికి ఆ క్షణం కొత్తగా మారిపోతుంది. ప్రవాహంలో అవీ కొట్టుకు పోతాయి. మార్పే సత్యం. జరిగేది జరుగుతుంది, అనుకున్నది జరగక పోయినా పోయేదేమి లేదు. ఏది శాశ్వతం కాదు. ఇప్పటి దుఃఖ క్షణాలు కూడా వెళ్ళిపోతాయి. మళ్ళీ వెనక్కొచ్చి బాధించనంత దూరంగా కొట్టుకు పోతాయి.

చైనాలో బయటపడ్డ ఓ వైరస్ ప్రపంచాన్ని మొత్తం అతి వేగంగా చుట్టేసింది. మహానగరంలో ప్రవేశించిందని తెలిసిన రెండు రోజులకే కేసులు పెరగడం మొదలైంది. ఆఫీసులు, స్కూల్స్, కాలేజీలు, అన్ని పబ్లిక్ శాఖలని మూసేశారు. దేశం మొత్తం నెల రోజులు లాక్ డౌన్ ప్రకటించారు. వార్తల్లో ఆ వైరస్ తీవ్రత చూస్తుంటే అది నెల రోజులకు తగ్గుముఖం పడుతుందన్న నమ్మకం లేదు. వైరస్ బారిన పడి చచ్చినవాళ్ళ శవాలను ఇంటికి కూడా పంపించరు. నేను రూమ్‌కే పరిమితమైపోయాను. బయటకు వెళ్ళాలంటే భయం, మాస్క్, శానిటైజర్ వాడాలని సూచనలు. భయం, చావు భయం. వార్తల్లో బయట గుంపుగా తిరుగుతున్న జనాలను చూస్తుంటే అది ఈ మహానగరాన్ని శవాల గుట్టగా మార్చేందుకు ఎంతో సమయం పట్టదని అర్థమవుతుంది. ఊర్లో ఉంటే భద్రంగా ఉండేవాన్ని, అందరి ముందు గడిపేవాన్ని. రోగనిరోధక శక్తి తక్కువుండే నాకే రోగం వచ్చినా అది అంత త్వరగా విడవదు. తిరిగి ఈ వైరస్ నన్ను అంటుకుంటే చావు అనివార్యమయ్యే స్థితి. చచ్చాక శవం ఇంటికెక్కాడ వెళ్ళిపోదు. అనాథగా చావడం. చచ్చే ముందైనా ఒక్కసారైనా జానకిని చూడలేకపోతున్నానే. నే చచ్చిన విషయం ఏదోనాడు ఇంటికి తెలుస్తుంది. జానకికి కూడా తెలుస్తుంది. కొద్దీ సేపు తలుచుకుటుంది, ఇక మానేస్తుంది. నన్నే పట్టుకొని వేలాడదు. అందరూ మరిచిపోతారు. మార్పు అదే సత్యం. ఒకనాడు ఎవరైనా పిల్లాన్ని పట్టుకొని శివ ఎవరని అడిగితే ఏమో అంటాడు. భయంకరం, చావు కన్నా భయంకరం జ్ఞాపకం నశించటం. చావుతోనే నా చదువులన్ని వ్యర్థమవుతాయి. నే పాటించే నీతులు నవ్వుల పాలవుతాయి. జ్ఞానం, కర్మ, జ్ఞాపకం, ఆలోచన అన్ని సమస్తం నాతోనే ముగిసిపోతాయి. నేననుకుంటాను, నా చావు నాతో తిరిగేవాళ్ళంతా, నే ప్రేమించిన వాళ్ళంతా చచ్చాకే రావాలని. ముందే చావడం, వాళ్ళు మరవడం. ఏది శాశ్వతం. అన్ని బోగసే... చస్తాను, అయ్యో! జ్ఞాపకాలను భద్రం చెయ్యలేకపోయానే!

ఊరు కెళ్ళేందుకు ఏ అవకాశం ఉన్నా ఉపయోగించు కోవాలనుకున్నాను. తెలంగాణలో ఉన్న ఆంధ్ర స్టూడెంట్స్‌ని వాళ్ళ ప్రాంతం వెళ్ళేందుకు పర్మిషన్ ఇస్తున్నారని ఫోన్లో వార్తని చూసాను. అది కూడా ఈ ఒక్కరోజే. అప్పటికే సమయం సాయంత్రం ఆరవుతుంది. పర్మిషన్ తీసుకోడానికి పోలీస్ స్టేషన్ నా రూం నుండి నాలుగు కిలోమీటర్లు. ఏ లగేజి తీసుకోకుండ ఖాళీగా రూమ్ నుండి బయటకొచ్చాను. పర్మిషన్ దొరికినా, దొరక్క పోయినా వెళ్ళిపోవాలి. బయట రోడ్లమీద పర్మిషన్ ఉన్న వెహికల్స్ మాత్రమే తిరుగుతున్నాయి. వైరస్ భయంతో ఎవరూ లిఫ్ట్ ఇవ్వలేరని తెలుసు. సమయం గడిచిపోతుంది, స్టేషన్ మూస్తారనే భయం. త్వరత్వరగా నడుస్తుంటే నాలాగే ఇంకో స్టూడెంట్ నాకు దొరికాడు. కొన్ని బైక్ రైడ్స్ తిరుగుతున్నాయని, ఫోన్ చేసి బైక్ రప్పించాడు. మాములు రైడ్ తీసుకెళ్ళడమే ఇప్పటి స్థితిలో నేరం, అదీ కాక ట్రిపుల్ రైడింగ్. తక్కువ దూరమే కాబట్టి ఆ దారిలో ఎక్కడా పోలీసులు కనిపించలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే మధ్యలో దింపేసే వాడే. పోలీస్

స్టేషన్‌కి బైకోడు ఇద్దరికి ఆ కాస్త దూరానికే వంద తీసుకున్నాడు. పోలీసు పర్మిషన్ ఇచ్చాడు. నాతో వచ్చినవాడు వాళ్ళ స్నేహితులతో కలిసి కార్లో విజయవాడ వెళ్ళిపోయాడు. నేనిప్పుడు ఎలా వెళ్ళాలి? కర్నూల్ కి ఏం తిరుగుతున్నాయని ఊర్లోని ఒకరికి ఫోన్ చేస్తే హైవే మీదకెళ్ళమని, అక్కడినుండి ఏ లారైన వస్తుంటే ఎక్కి రమ్మని చెప్పాడు. అకౌంట్లో ఉన్న మూడువేలు ఏటిఎంలో తీసుకున్నాను. అక్కడినుండి హైవేకి పది కిలోమీటర్లు. గూగుల్ మ్యాప్‌ని పట్టుకొని వెళ్ళిపోయాను. హైవేకి దగ్గర్లో పోలీసులు నన్ను ఆపి ఎక్కడికెళ్తున్నావని అడిగారు. కర్నూలుకని పర్మిషన్ చూపించాను. ఆ పోలీస్ ఆ పేపరుని చింపి లాఠీతో కొట్టి వెనక్కి వెళ్ళమన్నాడు. వెనక్కి మళ్ళేంత వరకు దెబ్బ మీద దెబ్బేసాడు. ఇలా వాళ్ళే పర్మిషన్ ఇచ్చి వాళ్ళే కొట్టడం. ఇప్పుడు వెనక్కి వెళ్ళలేను. హైవేకి మరో దారిని వెతుక్కొని హైవే మీదకి చేరుకున్నాను. అక్కడ నాకు లానే ఎందరో జనాలు. కొన్ని సుమోలు కర్నూల్‌కి వెళ్తున్నాయి. ప్రతి సుమో ఇష్టమొచ్చినంత అమౌంట్ డిమాండ్ చేస్తున్నారు. సుమోలో కిక్కిరిసి జనాలు. వీళ్ళలో ఒక్కరికైనా ఆ వైరస్ ఉంటే, నన్ను అంటుకుంటుంది. అనవసరంగా వచ్చానా? రూమ్ లోనే అట్లే ఉండి ఉంటే ప్రాణాలైనా నిలబడేవి. నా పక్కనోడు నాలుగైదుసార్లు తుమ్మినట్లు గుర్తు. మొఖానికి మాస్క్‌ని మాటికి సరి చేసుకుంటున్నాను..

అంత సాఫీగా జరుగుతుందన్న ప్రయాణం ఆంధ్ర– తెలంగాణ చెక్ పోస్ట్ దగ్గర ఆటంకమైంది. ఆంధ్ర వైపు వస్తున్న వెహికల్స్‌ని బారికేడ్లు పెట్టి అడ్డగించి పోలీసులు లాఠీలతో బాదుతూ వెనక్కి పంపిస్తున్నారు. సుమోకి మాట్లాడిన డబ్బులు సుమో ఎక్కేప్పుడే ఇవ్వడం మా తప్పు. ఆయన డబ్బులు ఇవ్వకుండా మమ్మల్ని దించి వెనక్కి వొచ్చేవాళ్ళు రమ్మన్నాడు. నేను తిరిగి సుమో ఎక్కలేదు. విస్తారంగా అనాథలైన జనాలు, ముసలివాళ్ళు, పిల్లలు, బీదలు బిక్కలు. దారిద్ర్య భారతం మొత్తం ఇక్కడే ఉంది. అందరూ రోడ్ల మీద మూటాముళ్ళెతో పోలీసుల పర్మిషన్ కోసం చూస్తున్నారు. వాళ్ళని ఆంధ్రకి పంపిస్తారన్న నమ్మకం నాకు లేదు. ఇక్కడే ఉంటే ఈ జనాల్లో వైరస్ స్ప్రెడ్ కావడానికి అవకాశాలు ఎక్కువ. ఏదైతే అదవ్వనియ్యని, మ్యాప్‌లో కర్నూల్ కి ఎంత దూరమో చూసాను. యాభై కిలోమీటర్లు. మొత్తం గంటకు ఐదు కిలోమీటర్లు వేసుకున్నా కర్నూల్ చేరేలోగా పది గంటలో, పన్నెండు గంటలో. పోలీసుల కళ్ళు కప్పి బారికేడ్లని దాటేశాను. చీకట్లో కనుమరుగైపోయాను.

రోడ్డు మీద అప్పుడప్పుడొస్తున్న వైవికల్స్ ని సాయం అడగలేను. అయినా ఈ గడ్డు పరిస్థితుల్లో ఎవరు సాయం చేస్తారు? చెయ్యి పెట్టి రెండు మూడు కార్లని ఆపడానికి చూసాను కానీ, ఏవి ఆగలేదు. భయం, అందరిదీ అదే. అందరివీ ప్రాణాలే, ఎవర్ని ఏమనలేం. నాకు వైరస్ ఇప్పటికే సోకే ఉంటే.

ఇప్పటికే నాకు సోకే ఉంటే నేను ఊరికి పోతే నా వల్ల మా ఊరిలో వ్యాపిస్తుంది. ప్రశాంతంగా ఉన్న ఊరు రోగాల మయం. శవాల గుట్టలు. ఇటలీని చూడు. రోజుకి వెయ్యికి పైగా మరణాలు అంట. లక్షణాలు పదహేడు రోజుల వరకు బయట పడవంట. తప్పు చేస్తున్నానా? ఊరికి రోగం అంటించేందుకే నే పోతున్నానా. కర్నూలు ప్రభుత్వ ఆసుపత్రిలో వైరస్ టెస్ట్ చేయించుకొని నెగిటివ్ వస్తేనే ఊరికెళ్ళాలి. పాజిటివ్ వస్తే, హాస్పిటల్ లోనే చికిత్స. బతుకుతానో చస్తానో అర్థం కాదు. చావు భయం. దాని ముందు అన్ని సమస్యలు చిన్నవై పోతాయి. జానకి సమస్య కాదు, ఇన్నాళ్ళైనా బతికిన అత్త సమస్య కాదు, నేనే సమస్య. నా ఉనికే సమస్య.

పొద్దున పన్నెండులోపు కర్నూల్ చేరుకున్నాను. ఆకలి, నిద్ర, అలసట. ఛాయ్ తాగి హాస్పిటల్ దగ్గరికెళ్ళాను. హాస్పిటల్ మొత్తం బ్లీచింగ్ వాసన. వాచ్ మెన్ దూరం నుండే ఎందుకొచ్చావని, సమస్య

ఏంటని అడిగాడు. కరోన టెస్ట్ అన్నాను. మరింత దూరం జరిగాడు. టెస్ట్ చేసే రూమ్ కి అసహనంగా దారిని చూపించాడు. గర్భవతులు, పిల్లలు, జనాలు, శవాలు. వైరస్ పరీక్షకు వొచ్చిన వాళ్ళని ఒకే రూమ్ లో ఉంచుతారంట. లక్షణాలు బయటపడేంత వరకు ఏ టెస్టులు ఉండవు, అప్పటివరకూ అదే రూమ్ లోనే జీవనం. పద్నాలుగు రోజులుకు కూడా లక్షణాలు లేకపోతే అప్పుడు విముక్తి. ఒకవేళ నాకు వైరస్ లేకపోతే, రూమ్‌లో నాతో పాటు ఉండే వాళ్ళలో ఒక్కరికైనా వైరస్ ఉంటే. వాళ్ళనుండి ఆరోగ్యమైన నాకు కూడా వొచ్చే స్థితి. వొద్దు! ఇక్కడే ఏదైనా బయటి రూమ్ లో ఒంటరిగా పద్నాలుగు రోజులు ఉండాలి. లాక్ డౌన్ ప్రకటించిన రోజే కర్నూల్‌లో రూమ్‌లలో ఉండే స్టూడెంట్స్, ఉద్యోగులు అంత సొంత ఊర్లకు వెళ్ళారని తెలుసు. కర్నూల్ రూమ్‌లో ఉండే బసీర్ కూడా మా ఊరికి పోయుంటాడు. వాడికి ఫోన్ చేస్తే ఆ రూమ్ తాళమెక్కడుందో చెప్పాడు, పద్నాలుగు రోజులు వాడుకుంటానని నేను అన్నాను. వాడి రూమ్ దగ్గరికెళ్ళాను. తిరిగి కూరగాయల కోసం బయటకెళ్ళాను. మళ్ళీ కిరాణం పొయొచ్చాను. ఏ ఆసరా లేకుండా క్వారెంటన్ ఉండటం అసాధ్యం. నేను కూరగాయలకో, కిరాణంకో వెళ్ళినప్పుడైనా నానుండి స్ప్రెడ్ కావొచ్చు, లేకుంటే వాళ్ళ నుండి నాకు రావొచ్చు. ఇక్కడ ఉండటం తెలివిలేని పని. ఉంటే హాస్పిటల్ లో ఉండాలి, లేదంటే ఊరికెళ్ళి ఎవర్ని కలవకుండా ఉండిపోవాలి.

రూమ్ లో పడుకొని మరుసటి రోజు పొద్దునే మళ్ళీ నడక. ఊరికి ఇక్కడి నుండి ముప్పై కిలోమీటర్లు, తప్పదు. ఎవర్ని లిఫ్ట్ అడగలేను. అడిగినా ఇవ్వడం కష్టం. చావు, అదే నడిపిస్తుంది. అదే నిర్ణయాలని మార్చేస్తుంది. అదే జ్ఞాన్నాన్ని అవసరాలకు ఉపయోగించమటుంది, నీతులని గంగలో కలిపేస్తుంది. చావు అన్నింటిని అపహాస్యం చేస్తుంది.

మా ఇంటి మేడ మీద రూమ్‌లో ఉంటున్నాను. మొదటి రెండు రోజులు స్నేహితులు నన్ను బలవంతం మీద కిందకు తీసుకెళ్ళారు. నేర భావన. నేనే మా ఊరిని వల్లకాడుగా మారుస్తునని కలలు. నా ఆత్మకి నేను సమాధానం చెప్పలేను. వొద్దు, కఠినంగా మిద్దె మీదే ఉండిపోవాలి. మూడోరోజు నుండి నే మిద్దె దిగలేదు. అమ్మ దిగమని మాటికి అంటుండేది. నేను మిద్దె మీదే ఉండం వలన నాకు వైరస్ సోకిందని అందుకే ఉంటున్నానని నాద్వారా మా అమ్మవాళ్ళని కూడా జనాలు అనుమానంగా చూస్తున్నారంట, అయినా తప్పదు. అప్పటికి అప్పుడప్పుడు ఇంట్లోకెళ్తుండటంతో నాద్వారా ఇంట్లోవాళ్ళకి వచ్చింటుందేమోననే సందేహం. మా మోహన్, రూపా, అత్త దగ్గరికైతే అస్సలకే పోలేదు, తను ముసలిది. నా ద్వారా తనకి అంటింతే ఇక అంతే సంగతులు.

బతికితే,

ఇంకా అంతే చాలు. పిరికితనాన్ని వదిలేస్తాను. నా జీవితాన్ని నేననుకునే స్థితిలో నడిపిస్తాను. ఎంత చిన్నది జీవితం, తప్పదు ఏదో నాడు మరణం. ముందుకురుకు. పోరాడు. ఇష్టాన్ని బతికించుకో. నీతి సంగతి తరవాత, జరిగేది జరగక మానదు.

# 2

మిద్దె మీద ఊరికే అటు ఇటు తిరుగుతూ కృష్ణదొడ్డి ఊరెళ్ళే దారివైపు చూస్తున్నాను. ప్రతి సంవత్సరం ఇదే రోజు ఇదే సమయానికి ఆ రోడ్డంత కోలాహలం కొత్త బట్టలతో, కొత్త నవ్వులతో. ఈ

పాటికే ఎద్దుల బళ్ళు సిద్ధమయ్యేవి. పరిగెత్తు, చల్ చల్! తుర్ తుర్ మంటూ ఆటోలు, మోటార్లు. ఉపాయాలు. ఎవరెవరు ఎలా వెళ్తున్నారో, తాము ఎలా వెళ్ళాలో, వెళ్ళాకా అక్కడేం చేయలోనని మంతనాలు. రాత్రంతా జనాల్లో ఇరుకుగా తిరుగుతూ, గిచ్చుతూ గిల్లుతూ కొండను పదే పదే ఎక్కుతూ ఆ ఒక్క అమ్మాయి కోసమని, ఆ ఒక్క అబ్బాయికోసం వెతుకుతూ, తిప్పలు పడుతూ, చూడు నీకోసం మేమెంత వెతుకులాడమో. నువ్విక్కడ కనిపించావు. పద, ఈ జనాల్లో మనమెక్కడ ఉన్నామ్మో నీవాళ్ళు, మా వాళ్ళు కనుక్కోవడం కల్ల. అలా పరిగెత్తొద్దాం. చీకట్లో కూర్చొని మాటలు, శృంగారం, ఆ పైని సృష్టికర్తకి అదే సహాయం.

ఈనాడు చూస్తే రోడ్డంతా ఎక్కడో అక్కడక్కడగా జనాలు. లాక్ డౌన్ ప్రభావంతో కొండ దగ్గర ఉత్సవం ఆపేశారంట పోలిసోళ్ళు. కొండ కిందున్న రథంకి టెంకాయ్ కొట్టేందుకు మాత్రమే పర్మిషన్ ఉందంట. అది కూడా జనాలు గుంపుగా ఎక్కువ కనిపించినట్లు అనిపిస్తే పోలీసులు వెనక్కి పంపిస్తున్నారంట. మా ఊరి నుండి ఎవరో అప్పుడప్పుడు కొందరు టెంకాయలు కొట్టేందుకు వెళ్తున్నారు. ఉత్సవమే లేదనప్పుడు ఈ టెంకాయల పిచ్చెన్టో. వైరస్ అంటుకుంటే ఊర్లో దాని ఆటలకు ఇంకేం అడ్డుంటుంది. దేశం మొత్తం గగ్గోలు పెట్టిస్తున్న వైరస్ మా ఊరిలో ఎటువంటి అలజడి పుట్టించ లేదు. ఎక్కడ చూసినా గుంపుగా బాతాకానీ పెడుతూ జనాలు. లాక్డౌన్‌తో వలసెళ్ళిన పక్షులు, స్టూడెంట్స్ అంత ఊర్లో కనిపిస్తున్నారు. ఏ పని లేకపోవడంతో తేనెలకు, ఈతలకు, చెరువుల్లో చేపలకు పరుగులు. ఆడాల్లు ఇండ్ల దగ్గర అష్టాచెమ్మలో, టీవీలో సీరియళ్ళో, ముసలాళ్ళతో కబుర్లో. ఒక్కసారి ఆ వైరస్ మా ఊరిలో ఒక్కరికి సోకినా అది తేలికగా ఊరు మొత్తం ఒక్కరోజులోనే చుట్టేసుకోగలదు. పరిస్థితులన్నీ ఇబ్బడిముమ్మడిగా తలకిందులు కాగలవు.

మిద్దె మీద నుండి కిందకొచ్చాను. జానకి, తనతో పాటుగా రేణుక. చేతుల్లో టెంకాయ్ ఊది కడ్డీల కవర్లు. మల్లెపూలు, పకపకలు. ఎక్కడికెళ్తున్నారు. అంతగా ముస్తాబై ఈరోజు ఎక్కడికెళ్తారు? కొండ దగ్గరకు. అక్కడికే. పోలీసుల భయం లేదు, అక్కడికెళ్ళాకా ఎక్కడెక్కడి ఏ ఊరు నుండో వచ్చిన జనాల్లో వ్యాప్తికై కాచుకున్న వైరస్ భయం లేదు. అరె, తనకి నా మనసులోని నిజం చెప్పాలి. జానకి, రేణుక ఇద్దరే. చిక్కింది అవకాశం, వాడుకో! ఇంకెంతసేపు.

పరిగెత్తాను. అడ్డదారిలో వెళ్ళి తనకంటే ముందుగానే ఒక చోట ఉండాలని, తను దారిలో వస్తుంటే తనకెదురుగా వెళ్ళి మనసులోది చెప్పాలని. తపన. ఆరాటం. తన పక్కన రేణుక తప్ప ఇంకెవ్వరు ఉండరు. చెప్పొచ్చు. నా కథ ఈనాడు సుఖాంతంగానో, ఆవేశంగానో మలుపు తిరగొచ్చు. తనేమంటుంది? ఒకవేళ ఏమనకుండా సిగ్గుతో తలవంచుకొని ముందుకెళ్తే... కోపంతో చెప్పు తీసుకొని కొడితే అవమానం. అలా కొట్టేంత పనేమీ చెయ్యదు. కొట్టినా ఏమవుతుంది, అన్ని అవమానాలు కాలంతో పాటే మరిచి పోబడతాయి. రేపన్నది లేదు, నేడుని వాయిదా వెయ్యకు. జరిగేది జరగని, అయ్యేది అవ్వనీ.

ఓ తుమ్మ చెట్టు కింద నిలుచున్నాను. నా చుట్టూ జనాలెవ్వరు లేరు, కానీ ముందు రోడ్డుకి అటువైపు తుప్పల్లో మూడు కుక్కలున్నాయి. అవంటే బొత్తిగా భయం, పట్టించుకోవాలనే లక్ష్యమేమి నాకు లేదు. జానకి, తనతో పాటుగా రేణుక. ఇద్దరే అనుకున్నాను కానీ, వాళ్ళతో పాటుగా మరో ముగ్గురు. ఇద్దరు మగవాళ్ళు. అరె! ఎవరు వీళ్ళు. ఆ చీర కట్టిన మూడో అమ్మాయి మొగుడేమో ఒకడు. ఆ మూడో అమ్మాయిది మా ఊరే, రెండేళ్ళ క్రితం పెళ్ళైంది తనకి. ఇంకొడు ఆ అమ్మాయి తమ్ముడు.

వీళ్ళేందుకొచ్చారు వాళ్ళతోటి! జానకికి దూరపు చుట్టాలా వాళ్ళు? జానకి, తాను ఆ ఆడపిల్లల ముందు కొట్టినా తిట్టినా అదేం ఫరక్ పడదు. మరి ఆ మగవాళ్ళు కొడితే. పగ, ప్రతీకారం.. మగాళ్ళకి అర్థం చేసుకునే తెలివుండదు, ఆడాళ్ల ముందు ప్రతాపం చూపేందుకు పరిగెడుతారు, అవకాశం కోసం కాచుక్కూచుంటారు. వొద్దు! ఆ చుట్టాల ముందు, అది ముఖ్యంగా మగాళ్ళ ముందు నేనెట్ల అడగగలను, జానకి కూడా ఎట్లా బదులిస్తుంది? ఇంకోసారి చెప్పొచ్చు. ఇంకోసారి అంటే ఎప్పుడు? సమయం లేదు.

నా ముందే నన్ను దాటేసి వెళ్ళిపోయారు. జానకి కాళ్ళని చూస్తుంటే నేను హైదరాబాద్‌లో ఉన్నప్పుడు తను ఆటో నుండి కింద పడ్డ విషయం వీరేశ్ బాబు ఫోన్లో చెప్పడం గుర్తొచ్చింది. బ్రేక్ వేసిన ఆటో ట్రాలీ నుండి తను రాజేశ్వరి ఇద్దరు కింద పడ్డారంట. జానకి కాళ్ళు బెనికాయని తెలిసిన ఆరోజు నాకు అన్నం సయించలేదు కానీ, ఆ దెబ్బ మీద నెపంతో పెళ్ళి సంబంధాలు కొన్నాళ్ళు ఆగిపోతాయని మరోవైపు సంతోషం. నేను తిరుణాలకి ఊరికి వస్తానని, తాడో పేడో నేనే స్వయానా తేల్చుకోవాలని అప్పటివరకు తనకి ఏ సంబంధం కుదరకూడదని నా కోరిక. రోజు ఫోనులో ఆడిగేవాన్ని. దెబ్బలు తగిలిన రాజేశ్వరి పెళ్ళి కూడా వారం ఆగి పోయిందంట. ఇప్పుడు చూస్తుంటే ఏ దెబ్బ ఎరగనట్లు పరుగులు. ముందుకెళ్తున్న జానకి నావైపు చూడలేదు. ఇంటివైపుగా వెళ్తూ మరోసారి వాళ్ళవైపు చూసాను. తను వెనక్కి చూస్తుందేమోనని ఆశ. జానకి, రేణుకతో కలిసి నవ్వుతుంది. తన చెంపలు, ఆ చెవులకు కమ్మలు, పరిగెత్తి ముద్దాడొచ్చు. మార్పు ఎంత త్వరగా నా దరికొచ్చింది. నెల క్రితం రావి చెట్టు కింద కూర్చుని అయ్యో! జానకికి నిజం చెప్పలేనంత నిస్సహాయుడినైననే అని ఏడ్చిన ఏడ్పులు. ఊర్లోనే నే బతికేందుకు అవకాశాలు ఏంటనే గింజులాటలు. తనకు దెబ్బలు తగిలి పెళ్ళి సంబంధాలు ఆగిపోవడం, లాక్డౌన్‌తో నేనూ ఇంత త్వరగా ఊరికి రావడం. వైరస్ సాకుతో నేనిక ఊర్లోనే ఉండిపోయే అవకాశం, పొలం పనులకు వెళ్తూ ఇదిగో నేనూ చెయ్యగలనని అమ్మవాళ్ళకు నిరూపించుకోవొచ్చు. జానకిని పెళ్ళాడి ఆ గుడిసె, ఆ మంచం. మార్పు ఎలా సంభవిస్తుందో ఎవరూ ఉహించలేరు. నాకు అనుకూలంగా పరిస్థితులన్ని మారిపోవడం. బలమైన సంకల్ప శక్తి ఉంటే సృష్టి యావత్తు మనకై తోడు ఉంటుందని, సాయం చేస్తుందని ఎక్కడో చదివాను. ఎంత థౌర్భాగ్యమైన మాట. నాకు ఊర్లో బతికేందుకే అవకాశం ఇవ్వడానికి సృష్టి తాను ఒక వైరస్‌ని సృష్టించి వేల మంది బతుకుల్ని నాశనం చేస్తుందా? నాశనం అయ్యేవాళ్ళకి కోరికలు, సంకల్పాలు ఉండవా? పోనీ నాకే ఆ కరోనా రేపే సోకి నేనే నాశనమైతే... అబద్ధం! అన్ని సిద్ధాంతాలు, అన్ని మాటలు అబద్ధం. ఈనాడే నిజం, రేపేమవుతుందో ఎవరూ పట్టలేరు. మార్పుని ఊహించడం కల్ల.

నేను క్వారెంటన్ లో మిద్దె మీదే ఉండిపోయిన రోజులు ఇవే నా జీవితంలో చివరి క్షణాలుగా భయభయంగా ఉండేది. జానకి ఇక అనవసరం అనుకున్నాను. నేను ఎంత వద్దని వారించినా స్నేహితులు అప్పుడప్పుడు నాకోసం మిద్దె మీదకొచ్చే వాళ్ళు. ప్రమాదం వాళ్ళకి అర్థం కావడం లేదని నేను మొబైల్లో ఆ వైరస్ ప్రభావం ద్వారా చూసిన చావులని దీనత్వాన్ని చెప్పేవాన్ని. అయినా వినరు, పైగా యువకులం మాకేం కాదని ధీమా. వాళ్ళకేం కాకపోవొచ్చు, వారి ద్వారా వాళ్ళింటి ముసలివాళ్ళకు, పెద్దవాళ్ళకు. జరిగే ప్రమాదాన్ని ఎంచక మూర్ఖత్వాన్నే స్నేహ ధర్మాన్ని పాటిస్తే ఎట్లా? నాకు ఒంటరిగా ఉండటం కన్నా వాళ్ళు రావడమే చిరాకు అనిపించేది.

ఏ లక్షణాలు ఇంకా కనబడకపోవడంతో స్వేచ్ఛగా పదనాలుగో రోజే బయటి గాలి పీల్చుకున్నాను. అందరితో పాటు ఈతలకెళ్ళాను, తేనెలకు వెళ్ళాను. ఊర్లో ఇంకెవ్వరికి లేదని, నాకూ రాదని భరోసా,

పక్క ఊర్లకు పోవడానికి మాత్రం జంకేవాన్ని. బయటికొచ్చిన క్షణమే జానకి అక్కరకొచ్చింది. ఇన్నాళ్ళు ఊర్లో తన్ని చూడలేదు. చూస్తానో పోతానో అనుకున్నాను. చావు భయం నన్నెంత మార్చింది. నేను చస్తే నా అస్థిత్వాన్ని గుర్తించుకొనేవాళ్ళు ఒక్కరైనా ఉంటారా? అదే నాకు పెళ్ళయితే? నా భార్య, నా పిల్లలు! వీళ్ళయినా తలుచుకుంటారు. ఎంత ఊరట ఇది. ఇక పెళ్ళి చేసుకుంటే జానకే కావాలి. తన్ని కాదనే అన్ని ఆలోచనలకి సమాధి కట్టేసాను. చావు అనివార్యమైనప్పుడు సమానత్వం, ఆస్తి కాదనే నిస్వార్థం ఇవన్నీ దేనికి? జీవితం కొన్నాళ్ళు. ఈ కొన్నాళ్ళు కోరిన వాళ్ళ చెంతనుండటం, దక్కింది అనుభవించడం అదృష్టం. వివక్ష కి గురికావడం, ఆస్తి లేకపోవడం అది వాళ్ళ కర్మ. సాయంత్రం దొడ్లో నుండి చూస్తే వాళ్ళ గుడిసె దగ్గర కొత్త కొత్త మొఖాలు. జానకి బయట ప్యారేంగ చెట్టు కింద వేసుకున్న మంచంపై రేణుకతో కూర్చొని ఏవేవో చెప్పుకుంటుంది. రేణుక, తాను కర్నూల్ నుండి ఇప్పుడెందుకొచ్చుటుంది ఊరికి. జానకి వాళ్ళ నాన్న చెల్లి కూతురు తను, జానకికి ప్రియనేస్తం. జానకి రహస్యలన్ని తనకీ తెలిసే ఉంటాయి. నా గురించి రేణుకకి చెప్పే ఉంటుందా? ఏం చేశానని చెప్తుంది? రేణుక చేతిలో ఆండ్రాయిడ్ మొబైల్. దానికి వాట్స్ అప్ ఉంటుంది. ఆ నంబర్ తెలిస్తే తనతో నేను జానకిని ప్రేమిస్తున్న విషయం, పెళ్ళి విషయం చెప్పేసి జానకిని అడగమంటాను. మరి ఆ నంబర్ ఎలా కనుకోవాలి?

రాత్రి నేనూ, అంజీ, తిరుమల్ ముగ్గురం కిరాణం వెనక రాళ్ళ మీద కూర్చోనున్నాం. జానకి రోడ్డు మీద మా వైపుగా వస్తూ కనిపించింది, ఒంటరిగా. అక్కడక్కడ జనాలు ఉన్నారు. అయినా ధైర్యం, ఆ జనాలేం మాకు అంత దగ్గరగా లేరనే మంకు.

"నాను ఇక్కడే ఊర్లనే బోయొళ్ళ పాపనే పెళ్ళి సేసుకుంటా. "

అనేసాను,

తను మమ్మల్ని దాటుతుంటే తనకి వినబడ్డట్టే అనేసాను. జానకి బోయ కులం పాప, అందుకే అలా అన్నాను. సందర్భం లేకుండా నేనలా ఎందుకన్నానో అంజీకి, తిరుమల్ కి జానకిని చూశాక అర్థమై ఉండొచ్చు. వాళ్ళకి అర్థం కావడం ఎవరికి కావాలి? జానకికి అర్థమైందా? బోయొళ్ళ పాప అంటే బోయ వీధిలోని నాగేంద్రమ్మని అనుకోని ఉండొచ్చు, సురేఖని అనుకోవొచ్చు. ఆస్కారం ఉంది. కానీ నమ్మకం! తననే నేను అన్నానని ఖచ్చితంగ అర్థం చేసుకుంటుందన్న నమ్మకం. కిరాణం కెళ్ళి మళ్ళీ ఆ దారిలోనే వచ్చింది. ఇంకో మాట ఈసారి దాపరికం లేకుండ డైరెక్టుగానే అనేద్దామని నోరు తెరిచా. పరిగెత్తుతున్నట్లు త్వరత్వరగా నడక ముందుకు, నాకు నోరు పెగల్లేదు. జానకి కోపంగా లేదు, మొఖంలో సిగ్గు కూడా లేదు.

"నాను గూడ ఊర్లోన కురువొళ్ళ పిల్లగాన్నే సేసుకుంటా "

అలా జవాబు చెప్పేందుకూ తనకి అవకాశమేది?

ఆదివారం జానకి చర్చ్ కెళ్ళిందని విన్నాను. లోపలికి వెళ్ళడం, ప్రార్థన అయ్యాక తిరిగి రావడం చూశామని ఒక్కరు కాదు, ముగ్గురి నోటి నుండి విన్నాను. జానకేంటి? చర్చ్‌కి వెళ్ళడమేంటి? ఏం చర్చ్ కి వెళ్ళరాదా? వెళ్ళొచ్చు, కానీ ఇంత అర్థాంతరంగా తన భక్తి క్రీస్తు వైపు మళ్ళడమేంటి? యేసుని మా ఊర్లో మాదిగ దేవుడు అంటారు. యేసుని నమ్మడం, చర్చికి పోవడం కులంని చూసినంత చులకనైన విషయం. తన్నీ ఏ ప్రోద్బలం చర్చి వైపు నడిపిందో అర్థం కావడం లేదు. రేణుకా, తనేనా? తను కర్నూల్ నుండి వచ్చిన పిల్ల, తనకి ఈ పిచ్చి ఉండే ఉండవచ్చు. తనే తీసుకెళ్ళిందా?నాకు జానకి విషయం చెప్పిన

వాళ్ళెవరు రేణుక కూడా వెళ్ళిందని చెప్పలేదు. కానీ, జానకి చర్చ్ కెళ్ళడం ఓ తిరుగుబాటు లాంటిది. ఏ హిందు అమ్మాయి ఇంత ధైర్యంగా ఇంటివాళ్ళ నమ్మకాన్ని కాదని అందరి ముందే చర్చికి వెళ్ళడం నేనిప్పటివరకు ఊర్లో చూడలేదు. మగవాళ్ళు వెళ్తారేమో, కానీ ఆడాల్లు? అలాంటి జానకి, నేను కోరిన జానకి అదే తను. పెళ్ళైనా కూడా ఏ నిబంధనలకు లొంగకుండ తన ఇష్టప్రకారం తను ఉండగలగాలి. నేను ఉంచుతాను. ఎవరు తెలుసుకోలేనట్టి, చూడనట్టి ఆదర్శ దాంపత్యం తనతో గడిపేస్తాను. తనలో నే ఇష్టపడ్డ స్వేచ్ఛను, అందాన్ని ఏ మాత్రం తన నుండి లాక్కోకుండా చెండు పూల జీవితాన్ని మరింత ఆకర్షణీయంగా తీర్చుదిద్దుతాను. ఈ సమాజంలో పెళ్ళి చేసుకోవడం అనివార్యం, చేసుకోకుండ బతకలేనట్టి అన్ని పరిస్థితుల్ని గుంపు తెలివిగా నిర్మించింది. గుంపు నుండి బయటకు వొచ్చిన స్త్రీ అయితే నేను పెళ్ళిని కాదని, అందాన్ని ప్రేమని అద్భుతాన్ని అన్వేషించగలను. సంప్రదాయాలు, గౌరవాలు, గొప్పతనాలు ఇవన్నీ విలువైన విలువలుగా స్త్రీని పుట్టిననాటి నుండే పెళ్ళికై సిద్ధం చేసి అసలైన వజ్రాన్ని వదిలేసిన ఈ జనాల్లో నుండి అటువంటి స్త్రీ ఎలా బయటకొస్తుంది?

మాదిగ దివాకరం,

నువ్వెట్ల ప్రయత్నించావు.

అప్పటికే నిశ్చితార్థం అయిన నీకెట్ల తను పడింది?

జానకి దివాకరంను ప్రేమిస్తుందంట. జానకి చర్చికి  వెళ్ళడానికి కారణం అదేంట. నే విన్నది వొట్టి పుకారు. నేను నమ్మను కానీ, నిజాన్ని ఎదుర్కొనే సత్తా నాకు ఉండాలి. దివాకరం వాళ్ళ దొడ్డి, మా దొడ్డికి పక్కనే. వాళ్ళ దొడ్డి నుండి జానకి వాళ్ళ గుడిసె మరింత స్పష్టంగా కనిపిస్తుంటుంది. నేను పొద్దున మా దొడ్లో ఎద్దుల బండిపై కూర్చోనున్నప్పుడు పక్క దొడ్లో దివాకరం దొడ్డి చివరన ఉన్న గుండుపై కూర్చొని ఆ గుడిసెల వైపే చూస్తూ కనిపించాడు. మా గడ్డి వాము దగ్గరకొచ్చి నేనూ ఆ గుడిసెవైపు చూశాను. జానకి, అటు ఇటు తిరుగుతుంది, దివాకరం వైపు చూస్తోంది, దివాకరం తనవైపు. దివాకరంకు భయం లేదు, దివాకరంను అట్లే చూసేందుకు జానకికి భయం లేదు. సిగ్గు, పరువు అనే జనాల గుంపు విలువలన్ని వదిలేసి వాడికోసమే కాచుకున్నట్లు చూపులు. గుడిసె దగ్గర అవ్వ ఉంది కానీ, జానకి చేష్టని తను గమనించిందా? గమనించినా తానేమీ చెయ్యగలదని. దివాకరం కర్నూలులో పిఈటీ టీచర్. ఎప్పుడో ఒకప్పుడు ఊరికొచ్చేవాడు కానీ, లాక్డౌన్ తో ఇప్పుడు ఇక్కడే ఉంటున్నాడు. ఈమధ్యే నిశ్చితార్థం కూడా జరిగింది. మరి ఎప్పుడు ప్రేమించాడు? నేను ఇంతకు ముందెప్పుడు ఇద్దరిని ఇలా గమనించలేదు, అంటే ఈ మధ్యనే. ఈ కొన్ని రోజుల్లోనే ఇద్దరి బంధం కలిసిపోయింది. ఈ మద్యే దివాకరం తను కోరేది జానకిని అడిగే ఉంటాడు. జానకి అవుననే ఉంటుంది. ఆకర్షణ. అరె నేనెన్ని రోజులు తనకోసం పడిగాపులు కాశానే.

నేనేం తప్పు చేశాను?

దివాకరం ఏం ఒప్పు చేశాడు?

ధైర్యం, అదే లేదు నాకు. ఒకరిని ఒప్పించే తెలివి, పడగొట్టే స్థిరమైన ఆలోచనలు నాకు లేవు. అవేనా, ఇంకా. దివాకరం చూడు, ఎంత బలంగా మరెంత ఆకర్షణీయంగ ఇంకెంత స్థిరంగా.  నేను అందరిలో ఉత్తమంగా తన్ని ఎన్నుకున్నట్లే తన ఆశతో ఉత్తమంగా జానకి దివాకరంని ఎన్నుకుంటుంది. నేనెట్ల రాజేశ్వరిని ప్రేమించలేకపోతానో తాను నన్ను అట్లానే ప్రేమించలేదు. దివాకరంకి వేరేవాళ్ళతో

నిశ్చితార్థం జరిగిందని జానకికి తెలుసే ఉంటుంది మరెట్ల ఒప్పుకుంది? ఇద్దరిలో ఉన్నది కేవలం శృంగారం కోసం తాపాత్రయమా? అదే అయితే బాగుండు. లేదంటే జానకినే పెళ్ళాడుతాడా? జానకినే పెళ్ళాడితే మరి నేనూ. తను, దివాకరం ఎంతవరకైనా ప్రేమించుకోనీ, ఎంతవరకైనా తిరగని, ఆనందించనీ. కానీ, జానకితో జీవితం. ఆ గుడిసె, ఆమంచం, ఆ చీకటి, ఆ నక్షత్రాలు.

చర్చ్ పక్కనే రోడ్డుకి అటువైపున్న ఇంటి కట్ట మీద కూర్చునున్నాను. నా పక్కనే ఆ ఇంటి ముసలావిడ, తన విషయాలన్నీ చెబుతుంది. నాతో పాటుగా వేప చెట్టు మీద వాలిన కాకి, ముడుచుకొని కూర్చున్న కుక్క తన మాటల్ని వింటున్నాయి. తనకు ఏడేళ్ళ వయసున్నా కాళ్ళు రాలేదని, అమ్మవాళ్ళు తన్ని బయట పారేశారని, మట్టిని తిన్నదని, రాత్రుళ్ళు నక్కలు తనవైపోస్తే ముడుచుకొని పడుకునేదాన్నని అంటుంది. ఎంత భయంకరమైన స్థితి. మరి ఎలా బతికావ్ అనడిగితే వాళ్ళ పెదనాన్న మళ్ళీ రెండు రోజులకి ఇంటికి తీసుకొచ్చాడని, ఓ పూజారి దగ్గరికి తీసుకెళ్ళారని ఆయన అంత్రం కట్టాకా తన పడన్నెండో ఏట తనకి కాళ్ళొచ్చాయని అంది. ఆ అవ్వ విధవ. తనకి పిల్లలు కాకపోతే మొగుడు తన్ని ఎప్పుడో పెళ్ళయిన ఏడేళ్ళకే వదిలేసాడంట. తమ్ముడి దయ మీద తన రెక్కల కష్టమ్మీద ఇన్నేళ్ళు బతికింది తాను. ఇప్పుడు పింఛన్ ఆసరా. తను చస్తే తనని ఎవ్వరూ గుర్తించుకోరు. తనకు నా అనేవి ఏవి మిగిలిపోవు. ఏ ఆశతో తను బతుకుతుంది? నేను అనేదే పోయాకా నా అనేవాళ్ళు నన్ను తలుచుకుంటే ఏంటి, తలుచుకోకుంటే పోయేదేంటి! ఆ అవ్వ ఇప్పటికి నవ్వుతుంది, అందర్నీ నవ్విస్తుంది. తనతో పోల్చుకుంటే నేనెంత బలహీనుణ్ణి.

నేను పదకొండు గంటలకు ఈ కట్ట మీదకు జానకిని చూసేందుకే ఇక్కడికొచ్చాను. చర్చ్ పదికే మొదలైంది. జానకి లోపలికెళ్ళిందో లేదో తెలీదు. కాస్త ముందొచ్చిన బాగుండేది, అయినా ప్రార్థన అయ్యాక తను తిరిగిరావడాన్ని నే చూసే అవకాశం ఉంది. జానకి, తనకెంత ధైర్యం ఆ దివాకరంని ప్రేమించడం, మోహించడం, కామించడం. ఇద్దరు ఎప్పుడైనా బూతు పని చేసుకొంటారా? లేదు కేవలం రొమాన్స్ లేకుంటే ముద్దులైనా. ఆ బుగ్గల్ని దివాకరం కొరికే ఉంటాడు. ఓవేళా నాకు జానకితో పెళ్ళైయితే తన జీవితంలో జరిగిన అన్ని బూతు పనులు తెలుసుకోవాలి. ఒకరి రంకు ఒకరు మాట్లాడుకుంటూ బూతు సాగించడం. ఎంత రంజుగా ఉంటుందో!

"శివా! లే. ఇంటి కాడ మీ అత్త గట్టిగ కూతలేస్తుంది. ఫోలే. "

కట్ట మీద నుండి లేచాను. ఆ అవ్వ మొఖంపై అదే చిరునవ్వు, నా స్థితిని వెక్కిరిస్తూ.

అత్త, నవ్వెంత విసుగు.

కొద్దిసేపు ఉండక పోతే కేకలేస్తుంది. నాకూ జీవితం ఉందని, ప్రతిక్షణం అక్కడే ఉండలేనని చెప్పినా వినదు. ఈమధ్య మరింత జిడ్డుగా మారింది. క్వారెంటైన్‌లో ఉన్న రోజులు నేనొచ్చానని తెలిసిన ఆ మొదటి రోజులు మాటికి కేకేసేది. నేనెళ్ళి నాకు రోగం ఉందని, జనాలు రోగానికి చస్తున్నారని కొన్నాళ్ళు దూరం ఉండాలని చెబితే అప్పుడు శాంతించిన్నట్లు కనిపించేది. ఎంత ఆశ, తనకి ఇప్పటికి బతుకు మీద. నేను స్వేచ్ఛగా తిరగడం గమనించాక, తను మళ్ళీ అరవడం మొదలెట్టింది. వెళ్ళి వచ్చాకా కూడా అదే అరుపులు. ఇంటి దగ్గరే అమ్మవాళ్ళు ఉండంతో ఆ గుడిసె వైపు వెళ్ళకుండా మాటికి అమ్మ తిట్లు, అత్తని కూడా తిట్టేది. అయినా అత్తెక్కడ వింటుంది? మాటికి నేనే కావాలి, నేనే తన దగ్గర ఉండిపోవాలి. ఎప్పుడూ తన పక్కనే ఉండాలి. ఎంతవరకు ఉండగలను. ఆ గుడిసె మరింత కంపు. కడిగేందుకు అవకాశం కూడా లేదు.

గుడిసె దగ్గరి కొస్తుంటే ఆ అరుపులు మరింత గట్టిగా వినిపిస్తున్నాయి. ఎందుకు ఇంతలా అరుస్తుంది, లేదు ఊరికే అరుస్తుంటుంది. ఇంటి దగ్గర ఈరోజు అమ్మవాళ్ళేవరు లేరు, తన్ని గద్దించడానికి. పిల్లల్ని తీసుకొని నాన్న ఎక్కడికెళ్ళాడో? గుడిసెని కడగాలంటే ఈరోజు నాకు అవకాశం.

అత్త మంచం మీద లేదు.

నులక దగ్గర కింద పడుంది. నిస్సహాయంగా సాయం కోసం అరుస్తుంటే చిరాకు పడ్డానే. ఇప్పుడు నే రాకపోయింటే అలానే అరిచి అరిచి దిక్కులు చూస్తూ ఉండిపోయేదే. నన్ను చూసి ఎక్కడికెళ్ళావని కోప్పడింది, అయ్యో అని అరుస్తుంది. గొంతు జీరబోయింది. ఎంత బరువు... ఆ వాసన, మొఖంలో ఏడుపు ఛాయలు.

రెక్కలు పట్టుకొని లేపడానికి ప్రయత్నించాను. తన ఎదలు రవిక నుండి బయటకొచ్చి ఆ ముచ్చికలు కనిపిస్తున్నాయి, నా రెండు చేతులకవి తాకుతున్నాయి. తన శరీరంలోని వాటిని చూడాలని తాకాలని ఒకప్పుడు ఆశ పడ్డ నాకిప్పుడు అవి అసహ్యంగ అనిపిస్తున్నాయి. కష్టమ్మీద తన్ని మంచం మీద కూర్చోబెట్టాను. మోకాలిపై రక్తం. బట్టతో తుడిచాను. నులకని అత్త చెప్పినట్లే తాళ్ళతో కట్టాను. కుర్చీ మీది నీళ్ళని తాపాను. మొఖంపై చెమటలు అత్తకి. ఎక్కడికెళ్ళొదని ఇక్కడే ఉండమని అంది. ఎలా ఉంటాను? అక్కడ జానకి అంతు తేల్చాలని పోరాటం. అన్నం తినిపించి కాసేపు పడుకోమని మళ్ళీ వస్తానని అన్నాను.

తను నా మాట వింటుందన్న నమ్మకం నాకు లేదు.

అప్పటికీ ఇప్పటికి నేను మారానని అత్త అంటుంది.

ఏం మారాను?

మార్పు అనేది నా చేతుల్లో లేదు,

అది సృష్టి స్థితి.

ఎవరో తెలీని ఆ అదృశ్య శక్తి నాటకాన్ని రంజుగా మార్చేందుకి మార్పులు చేర్పులు చేసి వినోదిస్తున్నాడు. సాకు, నా నుండి నన్ను కాపాడుకోడానికి, నా చేతకానితనంని కప్పిపుచ్చుకోడానికి అదృశ్యశక్తిపై నేరం మోపి సాకు.

# 3

దొరుకుతుంది,

చూడు,

చ్చా, ఎగిరింది.

కొద్దిలో మిస్సయింది. లేకుంటే దొరికేదే.

ఎగిరిన ఆ సీతాకోక ఓ ప్యారేంగ కొమ్మ మీద వాలింది. పిల్లాడు నిదానంగా అడుగులేశాడు. సీతాకోక రెక్కలాడిస్తుంది. పిల్లాడు చూపుని గురిపెట్టి రెండు వేళ్ళని ముందుకు పోనిచ్చాడు.

చ్చా, మళ్ళీ ఎగిరింది. దొరకదు. కనబడకుండ ఎక్కడికెళ్ళిందో.

"కువ్వా. "

పిల్లాడు చెట్టు పైకి చూస్తూ అరిచాడు.

అది కొమ్మల్లో ఎక్కడుందో, నాకూ కనిపించడం లేదు.

"కువ్వూ. "

కోకిల అరుపు.

"కువ్వూ. "

పిల్లాడి కేక.

"కువ్వూ---"

కోకిల

"కువ్వూ. "

కోకిలే

"కుహూ. "

ఎవరు అరిచింది, పిల్లాడా,కోయిలా?

పిల్లాడు మోకాలు వంచి కూర్చున్నాడు. వాడి ముందు ఓ కుక్క పిల్ల. ముందుకు చాచిన వాడి చేతిని వాసన చూస్తోంది. ఇంకో పిల్లాడు వచ్చాడు. వాడితో తాను ఆ కుక్క పిల్లని ఇంటికి తీసుకెళ్ళి పెంచుకుంటానని చెప్పాడు. ఆ రెండో పిల్లాడు తాను పొద్దున్నే దాన్ని చూశానని, ఆ కుక్కపిల్ల తనదన్నాడు. మొదటి పిల్లాడు వినలేదు, లేదు అది నాదే అన్నాడు. కాదు నాది, నేనే ఫస్ట్ చూశాను. కాదు నీకన్నా ముందు నిన్నే చూశాను. తంతే గూట్ల పడతావ్, ఒక గుద్దు గుద్దితే రక్తం కారి సస్తావ్ రాలే సూసుకుందాం. నా బలం సూడి.

" లేయ్, దాని తల్లొచ్చే లే. కోరుక్తాది. ఉరుకులే. "

రెండో పిల్లాడు పరిగెత్తాడు. మొదటి పిల్లాడు వెనక్కి చూసుకుంటూ వాడూ పరిగెత్తాడు. ఆ కుక్కపిల్ల, దాని దగ్గరకు ఓ కుక్క. తల్లి కుక్కేనా, అదేననే ఆ పిల్లలు పారిపోయారు. ఈ కుక్కలు మనుషుల్ని చూసి ఏమనుకుంటాయ్? అరుస్తాం, పశుల్తో పని చేయించుకుంటాం, అన్నమేస్తాం, బండ్లలో అటు ఇటు అందనంత వేగంగా తుర్రుమంటాం, శక్తి. పెద్ద శక్తి. దేవుడనుకుంటాయా? లేకుంటే సాటి కుక్కే, తోకలేని కుక్కనుకుంటాయా? తోకలేని కుక్క. బట్టలుసుకున్న కుక్క. మీకు బట్టలుండవు, మాకు బట్టలుంటాయ్. మాకు మీలానే బట్టలు లేకుంటే, ఊర్లో అందరి మగాళ్ళ మొడ్డ. ఆడాల్ల పూకు, ఎదలు, పిర్రలు. చూడు, వాడిదెంత పెద్దగుందో. వీడెం మగాడు, వీడిదస్సలు లెయ్యనే లేయదు. ఏలే, నా పెళ్ళాంని చూసి లేపుకుంటావ్, తంతా. నా కంట్రోల్లో లేదు, నీది లేవకుంటే నీదే సమస్య. ఛీ, ఏంటి అంత వెంట్రుకలు, శుభ్రంగా ఉండడం రాదు. ఏంటీమే, నా దిమ్మకెళ్ళే చూస్తుంది, లేవొద్దు, ఏమనుకుంటుందో. సారీ, కావాలనే లేపలేదు. తూ, ఇన్నాళ్ళు నిన్ని గొప్పగా అనుకున్నాను. అబ్బో ఎంత ఎర్రగుంది. చీమ, లోపలికి పోతుంది దులుపుకో. పెద్ద లంజ ఇది. చూడు, ఎట్ల ఉబ్బుతుందో, మాటికి వేలు పెట్టుకుంటుంది. ఏయ్, నేను వేలు పెట్టనా. నా మొడ్డ పెడతా. వావివరసలు లేవు. నీకు అక్కని, వొదినని, నన్ను చూసి లేపుకోకూడదు. గుడ్ మార్నింగ్ మేడం. నేను మీ టీచర్ ని, అందరూ అంతే. నువ్వొక్కడివే బుద్ధున్నోడవ్. ఏయ్, లేపుకుంటే మేడం కొడుతుంది, రాళ్ళు కట్టుకుందాం. బిర్రగా, బరువుగా, లేవదు. లెయ్యలేదు. ఎన్ని బంతులు... పైకి కిందకి, కిందకు పైకి. ఎంత లావున్నాయి. నా చేతులకు అబ్బవు. బంతిని పట్టుకో. బంతిని కాదు పిర్రని. జనాల్లో ఏంటి, కనిపెట్టలేదని నీ మొడ్డని తన వెనక నుండి ఎక్కడ పెట్టాలో వెతుకుతున్నావ్? అరె, కారుతుందే.

అందరిదీ కారుతుంది. ఎక్కడ చూసినా వీర్యం. రోడ్డు మీద, గోడల మీద, గుళ్ళో, చర్చిలో, ఇండ్లలో. పొలాల్లో, పిర్రల మీద, చేతుల మీద, తొడల మీద. తిరిణాలలో అయితే ఎవరి వీర్యం ఎవరిపై పడ్డదో అర్థం కాదు. ఎవరి వీర్యం ఎవరి పూకులోకో. ఎవరి కొడుకువి నువ్వూ??

ఓ ఆటో నేనున్న వెంకటప్ప కట్ట ఎదురుగా రోడ్డు పైనే ఆగింది. దాన్నుండి జనాలు, మాదిగ వీధివైపు వెళ్తున్నారు. ఎవరో, అన్ని కొత్త మొఖాలు. కట్ట మీది నుండి లేచి అక్కడే వెళ్తున్న కృష్ణని అడిగాను. మారెమ్మ గుడి దగ్గర రాణి పంచాయితీ జరుగుతుందంట. ఇప్పుడు ఆటోలో వచ్చినవాళ్ళు రాణి మొగుడి వూరిలోని పెద్ద మంచులు అంటా. రాణికి ఏడాది క్రితమే పెళ్ళయింది, ఇప్పుడు సంసారం చేయనని మొగుడి ఊరికి వెళ్ళకుండ ఇక్కడే ఉండిపోయింది.

పిల్లలు, పెద్దలు, కుక్కలు, కాకులు, తూనీగలు, పనేమీ లేదు ఎవ్వరికీ. ఆడాల్లు జనాలందరి వెనక. కొందరు నిలబడి, ఇంకొందరు ఇంటి కట్టల మీద కూర్చొని సుద్దులు చెప్పుకుంటూ, వాళ్ళ ముందు మగాళ్ళు. పద, తోసుకుని వెళ్ళు ముందుకు. జరగండి, నేనూ చూస్తాను.

మారెమ్మ తల్లి బయటి గుడి కట్టమీద మధ్యలో, ఓ వైపు మా ఊరి పెద్దమనుషులు. మరోవైపు ఆటోలో వచ్చిన పెద్ద మనుషులు. తెల్ల వెంట్రుకలు, తెల్ల అంగీలు, తెల్ల పంచెలు. పెద్ద మనుషులు కాబట్టే అన్ని తెల్లవి. ఓ చివరన రాణి, ఇంకో పక్క ఎవరు? మొగుడేమో? జీన్స్ పాయింట్.

ఒక్కో ప్రశ్నని గురి చూసి రాణివైపు విసురుతున్నారు పెద్ద మనుషులు. అన్నింటికీ తన నుండి భయం లేని జవాబులు.

"మొగుని కాటికి ఫోతావా ఫోవా. "

"ఫోను. "

"ఏంటికి"

"ఆ మంచి బుద్ధి బాలేదు. తాగి కొడ్తాడు. "

"ఇంగోపారి కొట్టడులే. ఎళ్ళు"

"ఆనికేల్లి సుస్తావు, ఈనికేల్లి సూస్తవ్ అనుకుంట ఉంటాడు. "

"ఈ పారికి అనుడులే. నువ్వు గూడ ఎవరికళ్ళ సూడకుండ మడసంగ ఇంట్లనే ఉండు. "

"నాకి నచ్చల్యా ఆమంచి. "

"ఏం ఎవర్నన్న పెట్టుకోవేనా?"

"ఎట్లనన్న అనుకోండి. ఆ మంచి మాట్లు నాను పడలేను. "

"ఆడిపిల్ల అంటే ఒర్శుకోవల్ల. ఏం మంది సంసారాలు సేస్తలేరా"

"నానేతే ఒర్శుకోలేను. "

లంజా వస్తావా రావా అనుకుంటూ ఎవరో కొత్త మొఖం రాణి చెంప మీద కొట్టాడు, అయినా రానంది. ఇంకొకరు లేచి టవల్‌తో కొట్టాడు, అయినా వినదు. మొండి పట్టు. ఓ ఆడామె, రాణి మొగుడి తల్లేమో రాణి జుట్టుని పట్టుకొని పళ్ళు కొరుకుతూ వీపులపై కొట్టింది. రభస రంజుకుంది.

కొడుతున్నారు,

ఎవరెవరో తెలీదు.

జుట్టు పట్టుకుని ఆడాల్లు, వాళ్ళకు తోడుగా కొత్త మొఖాలు. ఎవ్వరూ ఆపడం లేదు, కొట్టేవాళ్ళని మరింత ప్రోత్సహిస్తూ దెబ్బలు పడనీ అంటున్నారు కొందరు. అదే తగిన శాస్తి అంట. ఆ కొత్త మొఖాలే

కాదు, మా ఊరి వాళ్ళు కూడా అవే మాటలు. చూస్తూ మూగైపోయినారు ఆ పాప తల్లి దండ్రులు కూడా. అరె, కొట్టడం ఏంటి? అమానుషం. ఏమైనా ఉంటే చట్టం ముందు తేల్చుకోవొచ్చు. పాపం ఒక్కదాన్ని చేసి, అదే మగతనంగా పోజులిస్తున్నారు. ఆపొచ్చు కదా, నేనైనా ఆపొచ్చు కదా. ఆపితే నన్నూ కొడతారు. ఆ ఏడుస్తున్న రాణి మొఖంలో తిరగబడిన అక్క, శ్రీలత, ఉమ, మాదిగామే. నేనే వాళ్ళని కొడుతున్నాను, బలంగా దెబ్బేస్తున్నాను. గుద్దు, కొట్టు, కొరకు. ఇంకా గట్టిగా. తల పగలాలి, బుద్ధి రావాలి, సహనం ఉండాలి, ఓర్పు ఉండాలి. ఇదే ఆడవాళ్ళకు సహజం. ఏం, నీకవేమి ఒద్దంటావా. స్వాతంత్ర్యం కావాలంట, స్వాతంత్ర్యం. కొట్టండి, స్వేచ్ఛని కోరేవాళ్ళకందరికి ఇది హెచ్చరిక కావాలి. పిరికోడను, దద్దమ్మని. నన్నూ కొట్టండి, నరకండి.

కొట్టేవాళ్ళని ఒంటరిగా బూతులతో తిడుతుంది. ఎంత ధైర్యం తనకి. కొడితే కొట్టించుకోవాలి, ఇంకా పడాలి. బుద్ధి రావాలి, అయినా వెనక్కి తగ్గదు. చంపినా కూడా మొగుడి దగ్గరకు వెళ్ళనని అంటుంది.

ఆడాల్లోనైనా తనపై జాలుందా? అబద్ధం, జెలసీ, కసి. మాకు దక్కంది, తనకు కావాలంట. తిరగబడతావా లంజ? ఎవర్నైనా ఉంచుకొంటాది, అందుకే ఈ పాడుబుద్ధి. ఆపిల్ల లచ్చనమే మంచిది కాదు, పెళ్ళి కాకముందే ఆ పని. ఇంత మంది ఆడపిల్లల్ని చూశాం కానీ, ఇంత దిగజారిన దాన్ని నే చూడలేదు. మన ఊరికి మచ్చ ఇట్లాంటాళ్ళు. దీని మొఖం చూసి ఇంకెవరైనా మనోరి పిల్లని చేసుకుంటారా? సిగ్గులేని ముండ. దీని వెంట పోతే మన పిల్లలు కూడా చెడిపోతారు, ఎవర్ని పంపకండి. మొగుడు మంచోడు, ఎవర్నో పెట్టుకొని వదిలించుకోడానికి ఆ మాటలు అంటుంది. దానికి పడాలి, ఇంకా బా పడాలి.

ఏయ్ ఆడాల్లు అట్ల అనకండి. మీరే అక్కడ. రాణిలో ఉండేది మీరే. తిరగబడలేని మీరు. పిరికివాళ్ళైన మీరు. మీ అందరి అసలు మొఖం ఆమె. మాటలు అనకండి. బతుకు బతకనివ్వండి. న్యాయం తేల్చడానికి చట్టముంది. వదిలెయ్యండి. రేపొద్దున తానేమైన చేసుకుంటే అదే ఆత్మహత్య. మేమంత హంతకులమే. ఏమి ఎరగని వీళ్ళంత నిరపరాదులేమో, అన్ని తెలిసి ఆపలేని నేనే అసలైన నరహంతుకుణ్ణి. పిరికోన్ని, దద్దమ్మని. నేనేందుకు ఉన్నాను ఇక్కడ. వద్దు, నే భరించలేను.

రాత్రి మల్లేష్ గాడు తనకు మహేశ్వరిని ఇవ్వరని చెప్పాడు. ఎంత ప్రేమించాడో తనని. మహేశ్వరికి కూడా వాడంటే ఇష్టం. ఏ కారణం ఆపిందో పెళ్ళిని. జాఫర్‌ని అడిగాను. మహేశ్వరిని వేరే ఊరి వాళ్ళు అడుగుతున్నారంట. ఆ వేరే ఊరి అబ్బాయికి పదెకరాలు పొలమంట, ఇంకెక్కడ వీణ్ణి పట్టించుకుంటారు? నే హైదరాబాద్ లో ఉన్నప్పుడు మల్లేష్ ఫోన్ చేసి తనకి మహేశ్వరికి ఖచ్చితంగా పెళ్ళవుతుందని, మహేశ్వరి చిన్నాన్న ఎట్లాగైన కలుపుతాననే మాటిచ్చాడని చెప్పాడు. పాపం ఆ చిన్నాన్న నెల క్రితం చనిపోయాడు. ఆయనైనా ఉండే ఉంటే ఇద్దర్ని కలిపేవాడేమో. ఎంత చెడ్డ మార్పు. అయినా ఇప్పుడేం పోయింది, ఇంకా సమయం ఉంది, మార్పుకి అవకాశం ఉంది. మహేశ్వరి గట్టిపట్టు పట్టుకొని కూర్చుంటే మల్లేష్‌తోనే పెళ్ళి. నమ్మకం లేదన్నాడు మల్లేష్, ఆశలు వద్దన్నాడు జాఫర్.

మరి నా పరిస్థితి? జానకికి నాకు పెళ్ళవుతుందా? ఇద్దరం ఒక్కటవుతామా? మధ్యాహ్నం పంచాయితీ దగ్గర చూసాను తన్ని. అవ్వ చేతిని పట్టుకుని అటు ఇటు చూస్తూ. దివాకరం కోసం వెతుకుతుందేమో. రాణిని కొట్టడం తానూ చూసింది, ఆడాళ్ళ మాటలు తానూ వినే ఉంటుంది. ఏమనుకుంటుంది? రాబోయే భర్త తనని తిప్పలు పెడితే ఓర్చుకోవాలని, సహించాలని. అట్లే

అనుకోవాలి. ఏ ఒక్కరు, కనీసం నా అనుకున్నవాళ్ళే తనవైపు నిలబడరని తెలిస్తే ఏం చేస్తాం? బతుకు దరిద్రం. ఆత్మ గౌరవం, స్వేచ్ఛ అనేవి అమానుషం. జానకి మరో రాణి కాకున్నా పర్లేదు, జనాల్లో నిల్చున్న మరో స్త్రీ మాత్రం కారాదు. నేనుండగా జానకిని అలా చూస్తానా? అందరికి తను నాకు భార్యే అయితే నాకు తను స్నేహిత. చెండు పువ్వు, తీత పాట, ఉడత పరుగు, మా పల్లె ఆణిముత్యం. తన సంతోషాన్ని, స్వేచ్ఛని చూసి జనాలు కుళ్ళుకోవాలి. నన్ను చేతకానోడు అంటే అననీ, నే మగాన్నే కాదనే బిరుదుని తగిలిస్తే తగిలివ్వనీ, తన నవ్వు కన్నా మరేమీ ఎక్కువ నాకు.

మా దొడ్లో స్థలం లేనందుకు దివాకరం వాళ్ళ దొడ్లో కొర్రవామునేసుకొని కొర్రల్ని ఇంటివాళ్ళమంత కలిసి దులుపుతున్నాం. జానకి గుడిసె దగ్గర జనాలు, కొత్త మొఖాలు. రేణుక, అవ్వ, తాత, చిన్నమ్మ అంతా కనిపించారు అటు ఇటు తత్తురపాటుగా. అరె ఏంటి? రాత్రి జాఫరు చెప్పింది గుర్తొచ్చింది. ఈరోజు జానకిని చూడ్డానికి కనకవీడు నుండి వస్తున్నారంట. ఎంత భారమైన మాట. ఇది ఎలాగైనా విఫలం కావాలి. ఎలా విఫలం అవుతుంది? ఆ చందమామని ఎవరు కాదంటారు. ఆ కనకవీడు సంబంధం వాళ్ళు కట్నం మరీ ఎక్కువ అడిగెయ్యాలి, అట్లైయితే వీళ్ళే వద్దంటారు. ఆ వొచ్చేవాడు అసహ్యంగానో, వికలాంగుడో అయ్యుండాలి, జానకి చూడగానే తనకి నచ్చరాదు. ఏంటి, ఆ శరీరాలు అనర్హత అవుతాయా? వాళ్ళ స్థోమత అది కాదా. ఎక్కువ, తక్కువ. వివక్ష, అది వాళ్ళ కర్మ. దివాకరంని చూడ్డం అది నా కర్మ. నేనూ సుధారాణిని, సురేఖని, వీరేశమ్మని చూడక పోవడం వాళ్ళ కర్మ. ఒకరి కర్మలో ఇంకోరు. పెళ్ళనేది మురికి గుంత, ఆ వాసన మహా రుచి.

వొదిన మాటికి నేనేం చేస్తున్నానో గమనిస్తుంది. కారణం అక్కడ జానకికి జరుగుతున్న తంతు కాబోలు. నేనేం చేశాను? ఏం చెయ్యలేదు. అన్ని చూస్తూ ఉన్నాను అంతే. మార్పు అనేది సత్యం. ఈనాడు సత్యం అనుకున్నది రేపు అసత్యం కావొచ్చు. నేడు జానకితో పెళ్ళి సంసారమే గొప్ప అనుకుంటున్నాను, రేపొద్దున అదే విరక్తి అనిపిస్తే. ఎలా బయటపడడం? రావడం కష్టం. ఓ జానకి, అప్పుడు నువ్వంటే తెలీనప్పుడు ఇష్టముండేది కానీ, ఇప్పుడు ఇష్టం లేదు. వెళ్ళు, నీ దిక్కున్న చోట చెప్పుకో, నిన్ను వదిలేస్తాను. అనగలనా? పాపం, అమాయక జానకి. ఏ దిక్కు ఉంటుంది తనకి చెప్పుకోడానికి. కామరాహిత్యం పట్టి పీడిస్తుంది. శరీరం శుష్కిస్తుంది. నేను వదిలేశానని మాటికి ఏడుస్తుంది. తన బతుకు ఇంత చులకనయ్యిందేనని కన్నీళ్ళు. ఆపై ఆత్మహత్య చేసుకుంటే? వొద్దు, అంతపనా? అంతేం జరగదు. దివాకరం ఉన్నాడు, బీరప్ప ఉన్నాడు, కావాలంటే అంజీ ఉన్నాడు. తన అందానికి ఎవరు దాసోహం కారు? వాళ్ళంతా శరీరాన్ని వాడుకుంటారు, లంజని ఓ బిరుదు తగిలిస్తారు. చులకన, తనంటే అందరికి చులకన. స్వేచ్ఛ జీవితం. భరించలేదు. స్వేచ్ఛ ఎప్పటికి అమానుషమే. తోడు కావాలి, కానీ మిండగాడు కాదు. అలానే పెరిగింది తాను. ఒంటరిగా బతకడం కష్టం. అది చదువులేని తాను, చిన్నాటి నుండి పెళ్ళి, మొగుడు అనే పదాలనే మాటికి గొప్పగా చాటే ఈ పల్లెటూరులో. అంత నావల్లే. ఇంత చపలచిత్తున్ని నేనేందుకు తన్ని పెళ్ళి చేసుకోవాలి?

## 4

ఇద్దరు పిల్లలు బూతు పని చేస్తూ నాకంట పడ్డారు. నన్ను చూడగానే పరుగు. చేసే పని తప్పని వినేవుంటారు, అందుకేగా పరుగు. భయం. నేనెక్కడ పట్టుకొని వాళ్ళ అమ్మవాళ్ళకు చెప్తానని. బెదిరించే కొద్ది తెలుసుకోవాలన్న తాపత్రయం. అమ్మానాన్నలు చేస్తారు, అంతటా అవే తిట్లు, ఆ పదాల

అర్థమేంటి? వినేదానికి, చూసేదానికి పొంతనెక్కడ. ఆలుమొగుళ్ళు మాత్రమే చెయ్యాలి. పిల్లలు ఆలుమొగుడు ఆట, అంతా ఆటే వాళ్ళకి. దేవుడి భయం, పైనుంటాడు, కళ్ళు పిసికేస్తాడు. తెలివొస్తే తప్పు చేశామనే భావం, నేరం, తప్పించుకోలేం. రోగం, అసహ్యం, ఈసడింపు. అరె, నా పెళ్ళాన్ని చూస్తే తంతా, ఎన్టీ దానెమ్మ అంత బాగుంది. నీ పెళ్ళాం కసి, నా పెళ్ళాం పరువు. మగతనం. నేనెవ్వరి వైపేనా చూస్తా. ముందు ఆడాళ్ళకి సిగ్గుండాలి. లంజ,  బరితెగింపు అది. ఆడ, మొగ. ఎక్కువ తక్కువ. తిరగండి. గిరా గిరా గిరా. లంజల చుట్టూ, కోరికల చుట్టూ. మీరు కూడా, మీ మొగుళ్ళకి తెలీకుండా మిండగాళ్ళ చుట్టూ. తప్పనే కొద్దీ తాపత్రయం, గుప్పెట్లో ఏముందో చూడాలి, ఆ లంగిప్పు. తప్పించుకోండి. ఏం పర్లేదు. పతితులు, భక్తులు, మగాళ్ళు, మిండగాళ్ళు. ఆట, నాటకం. పాపం, పుణ్యం. అబద్ధం, నాటకం. నువ్వు నేను. తోడు దొంగలం, నాటక పాత్రులం.

"శివా...యాడేవే."

గట్టిగ కూతలేస్తుంది అత్త. పోవాలా? నిన్న సాయంత్రం నాన్న తిట్టాడు తన ఒంటి మీద బట్టలు సరిగుండవు, ఎందుకెళ్తావని? ఒక్క కొత్త చీర తనకోసం తీసుకరాలేరా. తెచ్చినా తన ఒంటి స్థితికి బట్టలు భారం? ఉన్న బట్టలన్నీ తనకి ముడ్డి తుడుచుకోడానికే చింపబడుతున్నాయి.

"ఏమత్త."

గుమ్మం దగ్గర్నుండే అడిగాను.

"వొస్తివా నాయిన. ఏం పలకనే పలకవు ఎంతసేపు పిలిసిన."

"బయటికెళ్ళింటి. ఏంది సొప్పు."

కష్టం మీద పడుకున్నది, కూర్చోగలిగింది.

"ఈ సీర పక్కకను. దొడ్డికొస్తుంది."

తన ముడ్డి కింది చీర తప్పించడం, కింది చీర పైకి లేపడం. ఇన్నాళ్ళైతే తన బట్టల పని తనే చేసుకునేది, పని చేస్తున్న ఓ చెయ్యి ఆధారంతో. మరి ఇప్పుడు ఆ చెయ్యి కూడా లేపలేదు. మొన్న కిందపడ్డప్పుడి నుండి మొదలైంది ఈ సమస్య. గుడిసెలో చీమలు కొరికినా గీరుకోలేదు. ఒక్కోసారి నన్నే గీరమనేది. నేను మొగోన్ని, యువకుణ్ణి. తను ఆడది. ఒంటిపై సరిగా బట్టలుండని తను నన్ను పిలవడం అత్తదే పాపమని అమ్మ అంటాది, నాకైనా సిగ్గుండాలని నాన్న మాట. తన అసహాయత, నా పిరికితనం. ఇప్పుడు నే పిలవడానికి అమ్మవాళ్ళు కూడా లేరు. చూడు, ఆ ముడ్డిని, ఆ పూకుని. ఒక్కసారి చూస్తే సిగ్గు మొత్తం వెళ్ళిపోతుంది. తాకు, ఏం కాదు. అది శరీరం.

రమ్మని మళ్ళీ అడిగింది.

అంటి అంటనట్టు వేళ్ళు చీర మీద. జరుగు అత్త! ఇంకాస్త, కదలకు. వాసన! మల మూత్రాల వాసన. కీచుమని ఎలుక మూలకున్న సంచుల చాటు నుండి.

తనవైపు చూడకుండా బకిటను ఆ ముడ్డి కింద త్వరత్వరగా పెట్టేసి బయటకొచ్చాను. ఎక్కడికని అడిగింది? నేను వెనక్కి తిరగకుండానే పని కానీయి, వస్తానని. ఓనాటి రాత్రి తన పక్కన పడుకున్నప్పుడు ఆ పిర్రల్ని పిసకడం. స్వయం తృప్తి పొందడం. కామం, కోరిక, తృప్తి, పిర్రలు. మూత్రం, మలం, అసహ్యం. అసహ్యం అంటే ఏంటి? శరీరం అసహ్యం. ఇంకా నాలో ఆ నీతులు పోలేదు. శరీరం శరీరమే, అసహాయత అసహాయతే, కోరిక కోరికే. అన్ని వేరు వేరు. అన్ని కలపడం నాకలవాటు.

పని అయ్యాక మళ్ళీ కేకలు. బకిటను కడిగి చీరను సర్ది పడుకోమన్నాను. పడుకుంది. పైన పూకు మీద బట్ట సర్దుబాటుకాలేదు. పూకు అది సిగ్గు,శీలం, పరువు, మానం, ప్రపంచసమస్య. తల పక్కకు తిప్పి బట్ట దానిపై వేసి సర్దుబాటయ్యిందో లేదోనని వెనక్కి చూసాను. ఎక్కడికి మళ్ళీ అడిగింది? ఇక్కడే ఉండిపోవాలి, అది తన ఆశ. ఈ చీమలు ఎక్కన్నుండొస్తున్నాయో, బుద్ధి లేదు వాటికి. తన స్థితి ఆలోచించొచ్చు కదా. వెనక్కొచ్చి పరుపు తన గొంతు వరకు కప్పాను. వెళ్తుంటే నా చేతిని పట్టుకుంది. ఇంకేమీ? అన్నం, మధ్యాహ్నం తినిందా తాను. తిన్నావా అనడిగితే ఆకలి లేదంది. పెట్టుకొచ్చి తినిపిస్తానంటే వద్దంది. మరి ఇంకేమీ?మాటలు కావాలి తనకి. గడప మీద కూర్చుని తను చెప్పేవి వింటున్నాను.

చావు,

కొందరిని అర్ధాంతరంగా తీసుకెళ్తుంది.

ఇంకొందరిని పూర్తి వేధింపులకు గురిచేసి నవ్వుకుంటుంది.

ఇప్పుడు నేను మా అత్త చావుని కోరుకుంటున్నాను. విముక్తి. ఈ చీమలు, దోమలు తన్ని పూర్తిగా పీల్చకముందే, బయటి నుండొచ్చే ఆ ఎలుకలు తన శరీరాన్ని కొరకక ముందే. అత్త ఏమనుకుంటుందో? ఇంకా బతకాలని ఆశ? వైరస్ మూలంగా దేశంలో ఎందరో చస్తున్నారని వింటున్నాను, కుప్పలు కుప్పలుగా శవాలు. నేను చావొచ్చు. యాదృచ్ఛికంకు కొలతేంటి? భయం. బుద్ధి పుట్టిన ఆ మొదటి రోజు నుండే ఈ భయం. చస్తాం, ఆ తరవాత ఏంటి? ప్రశ్న! ఒంటరిగా ఆకాశం వైపు చూస్తూ అరుస్తున్నాం. చెప్పు, ఈ చావు మర్మమేంటి? ఎవరు చెబుతారు సమాధానాలు? ఏడుస్తున్నాం, కనికరం లేదు సృష్టికి. కుక్క చస్తుంది, పిల్లి చస్తుంది, పంది చస్తుంది, నేనూ చస్తాను. విలువలేదు నా బతుక్కి. గిల్గిమేష్ రాజ్యం వదిలేసి పర్వతాలు, అడవులు, నదులు దాటిపోయాడు అమరత్వం కోసం. నిరాశ, ఎక్కడుంది ఆ ఓషదం. నిరంతరం బతకడమంటే బాధేనని, చావు ఓ అద్భుతమని సోక్రటీస్ చెప్పినట్లు విన్నాను. మరీ అర్ధాంతరంగా చావడం? బతకడం యాదృచ్ఛికం ఇచ్చిన అవకాశం. ఏమో చావు ఇంకింత, మరింత అద్భుతమేమో. ఎవరు చూసారు? చూడని, తెలియని విషయాలంటే భయం. చావు భయం కాదు, రహస్యమనేది భయం. లోకం ఏవిధంగా ఉంటుందో, చచ్చాక నన్నెవరు గుర్తుంచుకుంటారనేది భయం.

జానకి,

ఎక్కడికెళ్తావ్?

ఇక్కడే ఉండిపోకూడదా?

కావాల్సినంత దినాలు ఇద్దరం ఆడుకునే వాళ్ళం. మీ అమ్మ గురించైనా కాస్త ఆలోచించు. నీ ఆసరతో ఉన్న తన్ని ఇప్పుడు ఒంటరి చేసి వెళ్ళి పోతున్నావ్? చెడ్డదానివి నీవు.

రాత్రి నేను, నాతో పాటుగా వెంకటప్ప కట్ట మీద వీరేశ్ బాబు కూర్చోనున్నాం. రోజు ఇదే సమయంలో పెరుగు పాకెట్ కోసం కిరాణం వస్తుండే జానకి, తన నిశ్చితార్థం రోజు నుండి రావడం మానేసినట్లుంది. ఇక్కడికే కాదు ఆ నిశ్చితార్థం నుండి తను బయటకే తిరగనట్లుంది. అయినా వస్తుందేమోననే ఆశ. వీరేశ్ బాబు నిజంగానే వస్తుందని ముందుకు చూపించాడు. జానకే. నా అదృష్టం. ఎవరు లేరు నా చుట్టూ. మేమున్న వైపుకి దగ్గరగానే ఉంది తను.

"ఇంకొన్నాళ్ళు ఆగే ఉంటే తన్ని నానే ఒప్పిచ్చి పెళ్ళి సేసుకునేవాన్ని."

నిజంగానే చేసుకునేవాన్నా? ఏమో. ఏదొకటి అనాలి, అది తననేనని తను అనుకోవాలి. నేనూ తన్ని చేసుకునేందుకు ఆత్ర పడ్డానని, సందర్భం కలిసిరాక ఆగిపోయాననైనా ఎప్పుడో ఒకప్పుడు గుర్తుతెచ్చుకోవాలి. తెచ్చుకుంటుందా? లేదు, మరిచిపోతుంది. మొగుడు, సంసారం, పిల్లలు. తీరిక ఉండని బతుకులు.

వీరేశ్ బాబు నవ్వాడు. జానకికి వినబడిందో లేదో అర్థం కాలేదు. తలదించుకొని త్వరత్వరగా మాత్రం నడిచెళ్తుంది. మళ్ళీ తిరిగొస్తుంది కదా, ఇంకో మాట అనేద్దామని పదాలు వెతుకుతున్నాను. మా పక్కనే వరసలో ఓ పెద్దాయన కూర్చున్నాడు. నా నోరు మూగబోయుంది.

మధ్యాహ్నం పిల్లల్తో కలిసి ఈతకెళ్తున్నాను. రోడ్డు మీద నుండి దర్గా వైపు చూసాను. వేపచెట్టు నీడలో దర్గా చుట్టూ కట్టిన కట్ట మీద పడుకొని తనే. జడ పై కట్ట మీద నుండి కింది వరకు వేలాడుతూ. చెవి దగ్గర ఫోన్ ఉంచుకొంది. ఎవరితో మాట్లాడుతుంది, ఇంకెవరు కాబోయే మొగుడు. నిశ్చితార్థం రోజు ఫోన్ నెంబర్ ఇచ్చిపోయాడంట ఆయన. అతనే ఉంటాడు. ఏం మాట్లాడుతుందో? గుడిసె దగ్గర ఇంటివాళ్ళు వింటారని దర్గా దగ్గరకొచ్చి మాట్లాడుతుందా? అయిపోయింది. ఇక నన్ను పట్టించుకోవడం కల్ల. అరె, మరుపు, నన్ను మరిచిపోతుంది. గట్టిగా ఓ అంటూ కూత పెట్టాను. నా చుట్టూ నడుస్తున్న వాళ్ళకి నేనెందుకు కూత పెట్టానో అర్థమయ్యిందో లేదో. పడుకున్న జానకి కూర్చొని మావైపు చూసింది. మరింత గట్టిగా అరుస్తూ ముందుకెళ్ళాను. చూడు జానకి, ఇది నేనే. నన్ను గుర్తించు. ఏదోనాడు ఏదోవిధంగా నీకు నేను గుర్తుకురాకపోతానా? అరె, నా వెంట పడ్డాడు, నాకోసం తపించాడు. పాపం, నేనే ఒంటరి చేసి వెళ్ళిపోయాను. ఏమైపోయాడో ఇప్పుడు? ఏం చేస్తున్నాడో?

జానకి వాళ్ళ రెండో అమ్మ అనుకుంటా, గుడిసె దగ్గర్నుండీ దర్గా వైపొస్తున్నట్లు కనిపిస్తుంది. నలుపు. శరీరం పూర్తి మత్తు. ఇంకా ప్రాయంలో ఉన్నట్లు సొగసు. రాత్రి జానకి నిద్రపోయాక మెల్లిగా మంచం మీద నుండి లేచి ఆ రెండో గుడిసెలోకి దూరుతాను. చిన్నత్త ఒంటరిగా నిద్రపోతుంటుంది. నేనెళ్ళి పక్కన పడుకొని తన పిర్రల మీద కాలేసి గట్టిగా వాటేసుకుంటాను. అత్తా, నేను నీ ముద్దుల అల్లుడ్ని నీ సవతి బిడ్డ మొగుణ్ణి. ఇకనుండి నీకూ మొగుణ్ణి. నాకు తెలుసత్తా, నీవెప్పటినుండో ప్రాయం వ్యర్థమవుతుందని ఒంటరిగా నీలో నువ్వే నలిగిపోతున్నావ్. శరీరం అడవి కాచిన వెన్నలయ్యిందని గోడలకు నీ గోడు చెప్పుకుంటున్నావ్. వొద్దత్తా! ఇక నీకు ఆ కన్నీళ్ళేమి అవసరంలేద్ధత్తా. చూడు, మనిద్దరి కాళ్ళ మధ్యన స్వర్గం. అందుకుందాం అత్తా. నువ్వు, నేనూ. నాతో జానకి. స్వర్గం, ప్రేమ, అంతిమ ఆనందం.

జానకి వాళ్ళ గుడిసె పక్కన రోడ్డుకి అటువైపున ఓ పెంకుటిల్లు. రోడ్డు మీద పోయేవాళ్ళని పిలుస్తూ, నవ్వుకుంటూ శేష జీవితం గడుపుతున్న ఇద్దరు ముసలాళ్ళు ఆ పెంకుటిల్లు ముందేసుకున్న మంచం మీద. ఆ మంచంకి వేప చెట్టు నీడ. ఓనాడు నేను జానకి గుడిసెని చూడాలని మల్లితో కలిసి అటువైపు నడుస్తూ వెళ్తుంటే ఆ ముసలాళ్ళు మమ్మల్ని పిలిచారు. మాటలు, సుద్దులు, కబుర్లు. అదృష్టం. రోజిక ఆ ముసలాళ్ళతో మాట్లాడే మీష మీదే సాయంత్రాలు ఆ పెంకుటింటి దగ్గరకు వెళ్తున్నాను. నాకు భయం లేకుండా నాకు పక్కన మల్లిగాడు. కబుర్లు, నవ్వులు. మాటికి నా చూపుల వెదుకులాట గుడిసె వైపు. నేనిక్కడ ఉన్నట్లు జానకి చూడాలి, రోజు తనకోసమే వస్తున్నట్లు అర్థం చేసుకోవాలి. ఇదే నా చింత. ఆ గుడిసె దగ్గర ఇప్పుడెంతోమంది బంధువులు. లాక్డౌన్ మొదలైనప్పటి

నుండే కర్నూల్‌లో ఉండే జానకి వాళ్ళ ఇద్దరు చిన్నాన్నాలు, మామ, వాళ్ళ పెళ్ళాం పిల్లలు, రేణుక ఇంకా గర్భంతో ఉన్న ఉమక్క అందరూ ఆ గుడిసెకే ఆవాసానికి వొచ్చేశారు. ఇన్నాళ్ళు నేనెప్పుడూ చూడని మొఖాలు. ఇంతమంది ఉన్నా వాళ్ళెవరు ఆ గుడిసెలో ఏ పని ముట్టుకోరంట, కర్నూలు నుండి వచ్చినామనే గర్వం కాబోలు. చివరకు ఆ బంధువులందరి బట్టలుతకడం, నీళ్ళు వేడిచేయడం ఇవి కూడా జానకి, అమ్మా ఇద్దరే చేస్తున్నారంట. జానకి ఏం చెప్పినా వింటుందనే అహంకారం, తను పనిపిల్లనే అలుసు. రేణుక చేయొచ్చుగా పనులు. చెయ్యదు. జానకి రెట్టెలు కొడుతూ ఉంటే తనకెదురుగా కూర్చొని ఏవో మాటలు చెప్తూ కనిపిస్తుంది. రేణుక చూస్తుంది కానీ, జానకి కంటే నే పడటం కష్టమవుతుంది. అయినా ప్రయత్నిస్తాను. పోయేదేముంది?

అమ్మ బయటి పొయ్యి మీద వంట చేస్తుంది. నేను, జాఫరు మెట్ల మీద కూర్చొని మాట్లాడుకుంటున్నాం. జాఫర్ నా భుజాలని తడిమి ముందుకు చూడమన్నాడు. మా అమ్మ ముందు నిలబడి జానకి. ఎందుకొచ్చిందో. తమల పాకుల కోసమంట, ఏ కిరాణంలో దొరకలేదంట. మా అమ్మని ఉన్నాయేమోనని అడుగుతుంది. అమ్మ తన దగ్గర లేవంది, వాసనవ్వని అడగమని సలహా ఇచ్చింది. నన్నేదో కోరుతున్నట్లుగా జానకి మావైపు చూసెళ్ళిపోయింది.

పద,

జాఫర్ నన్ను పిలిచాడు.

ఎక్కడికన్నాను?

ఇంకెక్కడికి, ఆకులకు.

అమ్మకి వినబడకుండ నిదానంగా చెప్పాడు.

తీసుకరావాలా? ఆకులు తెచ్చి నేనే తన చేతికిచ్చి. కృతజ్ఞతగా నా చేతి నుండి తీసుకొని ఒక్క మాట. ఆ ఒక్క మాట కోసం ఎంతగా తపిస్తున్నాను? ఓ ఒక్క మాట నా జీవితాన్ని సంపూర్ణం చేసే జ్ఞాపకం. మాట్లాడుతుంది, నా కళ్ళలోకి తన కళ్ళను గుచ్చి.

ఎక్కడ తెస్తావు, ఏ కిరాణంలో లేవంట.

వాళ్ళ బైకు మీద పక్క ఊరికెళ్ళి తీసుకొద్దామన్నాడు జాఫరు. నా దగ్గర పైసలు కూడా లేవు. తానే అప్పిస్తానని వాళ్ళింటికి తీసుకెళ్ళాడు.

వాడికి ఇంట్లో బైకు తాళాలు దొరకలేదు. ఇప్పుడెట్లా? కొట్టాల వీధి కిరాణాలు అడుగొద్దామన్నాడు. అక్కడ దొరక్తాయని నాకు నమ్మకం లేదు. జానకి ఈ వీధికి వొచ్చి ఆ కిరాణాలు కూడా అడిగే ఉంటుంది. అడిగిందా, లేదా? దూరం ఎలా వెళ్తుంది? సైకిల్ మీద వెళ్తుంది. సైకిలా? తను మా ఇంటి దగ్గర ఉన్నప్పుడు సైకిలేం లేదు. నిశ్చితార్థం నుండి తను సైకిల్ మీద తిరిగినట్లు నాకెప్పుడూ కనిపించలేదు, అసలు బయటకు రావడమే తక్కువ. అలాంటప్పుడు ఇంతదూరం ఒక్కత్తే నడిచెళ్ళడం?

నా అదృష్టం. ఆ కిరాణంలో జాఫరుకి ఆకులు దొరికాయి. ఇప్పుడు తనకి ఇవ్వడమే తరవాయి. ఎలా? ఎటునుండి వెళ్ళాలి? కొట్టాల వీధి నుండి మా దొడ్డికి అడ్డ దారిలో పోయాం. ఇవ్వాలా? నేనే ఇవ్వాలా? నేనే ఇవ్వాలి. ఎలా ఇస్తాను? భయం, మొహమాటం. అరె, గుడిసె దగ్గర అదే బంధుజనాలు. నేనెళ్ళి జానకిని పిలిచి, తన చేతికి ఆకులు అందివ్వడం. వాళ్ళంత ఏమనుకుంటారు? ఇప్పుడే ఇంటి దగ్గర అమ్మ లేవని చెప్పింది, నేనెళ్ళి ఇస్తే ఎవరిచ్చారనడిగితే ఆ మొగాళ్ళ ముందు అప్పటికే నిశ్చితార్థం

అయిన తనకి నే ఏమని సమాధానం వెతకాలి. జాఫర్ ఉన్నాడు, వాడే చూసుకుంటాడు. వెళ్ళు. ఇదే జ్ఞాపకం. ధైర్యం చెయ్. ఏం కాదు. తను ఇక వెళ్ళిపోతుంది.

నాకాళ్ళు ముందుకు కదల్లేదు. జాఫరుని ఒక్కణ్ణి ఇచ్చి రమ్మని చెప్పాను. నన్ను రమ్మన్నాడు. నే రాలేనని చెప్పేసాను. ఏ భయం లేకుండా వాడెళ్ళిపోయాడు. వాడికి నాలా మోహమాటలు, భయాలు లేవు. ఊర్లో పనికెళ్ళడం, ఆడాళ్ళతో కలిసిపోవడం ఇదేనా వాడి కారణం? ఏమో, ఏ ఆడపిల్లతోనైనా ధైర్యంగా మాట్లాడుతాడు. వాడు, జానకి ఇద్దరు ఒకే తరగతేనంట.

గమనించావా?

ఏంటి?

నీకు లేని ఆత్రం.

అవును. నే చెప్పకపోయినా ఆకులు తెద్దామని వాడే అన్నాడు. తన బైకే తీసుకెల్దామని చెప్పాడు. పైసలు వాడే ఇచ్చాడు. కిరాణం కెళ్ళి ఎట్లాగో ఆకులు వాడే తెచ్చి, ఇప్పుడు నే రాలేనంటే ఒక్కడే వాడే వెళ్ళాడు. గందరగోళంగా చుక్కలు.

జాఫర్ గుడిసె ముందుకెళ్ళగానే జానకి వాడికెదురుగా వొచ్చేసింది. వాడే పిలిచాడో, తనే వొచ్చిందో. జానకి చేతిలో పెట్టి ఏదో చెప్పాడు. గుడిసె ముందున్న వాళ్ళంత ఇద్దరివైపే చూస్తున్నారు.

"ఏం చెప్పావ్?"

తిరిగొచ్చాకా జాఫర్ని అడిగాను.

ఆకుల్ని మా వొదిన ఇచ్చి పంపించిందని చెప్పాడంట. అదే చెప్పాడా? ఆ మూకని తప్పించుకోవాలంటే అదే చెప్పుండాలి. తను వాడి మాటలు నమ్మినా నమ్మకపోయినా వాడివైపు కృతజ్ఞతగా చూసుంటుంది.

సాయంత్రం ఒంటరిగా బడిని దాటి అలానే ముందుకు వెళ్తుంటే ఎవరో నన్ను వెనకి నుండి పిలుస్తున్నట్లు వినిపించింది. గొర్లు కాచే శీనుగాడు, నన్ను దగ్గరకు రమ్మంటున్నాడు. వెనక్కి మళ్ళీ వాడి దగ్గరకొచ్చాను. వాడు నన్ను తన వెంట రమ్మన్నాడు. ఎక్కడికి? ఏం కారణం. ఆత్రుత. బడి కాంపౌండ్ దాటి లోపలికొచ్చాం. ఏమని అడుగుతుంటే, చెప్తాను రమ్మంటు ఊరికే నడక. బడి వెనక్కి తీసుకెళ్ళి గోడ మీద ఉన్నది చదవమన్నాడు.

జానకి&

శివ.

మధ్యలో హృదయం, అటు వైపు నుండి ఇటువైపుకొచ్చిన బాణం. అప్పుడెప్పుడో కార్తికాలప్పుడు ఓ రాత్రి మత్తులో రాయితో చెక్కింది. ఆ గోడ మీద ఇంకెన్నో పేర్లు కూడా అలా చెక్కినవి ఉన్నాయి.

జానకి ఎవరన్నాడు?

"హైద్రాబాద్. "

"నాటకాలాడొద్దు. "

"నాటకాలు గాదు, నిజం"

"బొయ్యేళ్ళ పాప గాదా!!"

"యాలే. హైద్రాబాద్"

"సెంప పగుల్తాది. ఆ పేరు కొట్టెయ్. "

"నాయిష్టం. నాను కొట్టేయను. "

చౌక్కా పట్టుకున్నాడు. నేనూ పట్టుకున్నాను.

"ఏంటికి కొట్టేయల్లా ?"

"ఆపాపాకి పెళ్ళైతుంది. ఎవరన్నా సూస్తే ---. మంచిగ సెప్తుండ, కొట్టేయి. "

"ఆ పేరునెవ్వరు పట్టించుకుంట్రూ. ఎవరన్నా సూసిన బోయేళ్ళ జానకేనని ఎట్ల గుర్తొస్తాది. "

"మాటలు సాలు ఇంగ. తుడిపేయ్. వారముంటే ఆ ఫోట్టికి పెళ్ళేదే. "

ఇంకొకడు అక్కడకొచ్చాడు. శీను చౌక్కా వదిలాడు. నేనూ వదిలేసాను.

"నువ్వు మా బొయ్యోళ్ళ పాపని సూసేది ఊరళ్ళ తెలుసు. మల్ల నాటకాలు ఆడుతూండావ్. పెళ్ళి ఐతున్న ఫోట్టిని ఇట్ల రాసినావని మీ ఇంటి కాడ సెప్తా. "

"ఆ ఫోట్టిని కాదని సెప్తుండ. ఆ ఫోట్టేనని నువ్వే ఆడిగినోళ్ళకళ్ళ సెప్పుకుంట నువ్వే గబ్బులేపుతుండావ్. "

"కొట్టేస్తావా కొట్టేయవ. ఏంటికి అవల్ల. "

వేలు చూపించాడు.

"ఎమ్. నానేం అనలేనని మింద మిందకొస్తావ్. నాను కొట్టేయను. "

కోపాన్ని నటించడం చాలా కష్టం. లోపలి నుండి నన్ను భయపెట్టడానికి వాడు, ఇటు నేనూ పడుతున్న అవస్థలకు నాకు నవ్వొస్తుంది.

"ఇడ ఈ మూలకున్న పేరుని సదువురాని మనూరి పెద్దోళ్ళు ఎప్పుడు ఏంటికి పట్టించుకుంట్రో. పట్టించుకున్నా పెళ్ళై వురు ఇడిసే ఆపాపని ఇంగేంతవరికి గుర్తించుకుంట్రో. సర్లా్య.. జానకి పేరు కొట్టేయను గాని, పక్కన రాముడని రాస్తా. "

"ఏంటికి రాస్తావ్ అట్ల. మొత్తం కనబడకుండ కొట్టేయి ఫస్ట్. "

"జానకి రాముడు అని ఉంటే ఇంగేం. జానకి కాదు గదా ఆడ ఉండేది. "

"జానకి రాముడు ఎవరు ఊర్ల. కథలు పడకు. "

"జానకి రాముడంటే మా బావ పేరు. మా బావ పేరు, కింద నాపేరు. ఇంగేమ్ నీకి. "

శీను ఊరుకుండిపోయాడు. నేను కిందున్న రాయిని తీసుకొని జానకి పక్కన రాముడు అని దిద్దుతున్నాను. ఆ కొత్తగా వొచ్చినవాడికి కొత్త విషయం తెలిసిపోయింది. శీను వాడితోనే బయటకు వెళ్ళిపోయాడు.

ఎంత అవివేకమైన మాటలు శీనువి. ఈ బడి దగ్గరకొచ్చి వెనకాల ఈ గోడ మీద ఉన్న పేరుని చూసి పెళ్ళిని ఆపుకుంటాడంట పెళ్ళికొడుకు. అలాంటి వాడయితే పెళ్ళి ఆగిపోవడమే మేలు. నేనదే కోరుకుంటాను.

జానకి రాముడు &

శివ.

హృదయం. మధ్యలో బాణం.

జానకి కోసం నన్నెవరు అడగలేరని ఇన్నాళ్ళు అనుకునేవాణ్ని. బోయ వీధిలో జానకికి బంధువులయ్యే వారందరితోనూ జానకి కుటుంబాలకి చల్లారని వివాదం ఎప్పటినుండో. తనకు వరుసకు అన్నవాలయ్యే తిరుమల్, సుధాకర్ వీళ్ళకంత నే చూసే విషయం తెలుసు, కానెప్పుడూ నాపై

కోప్పడలేదు. ఈ శీనేంటో? వీడిది ఆ కుటుంబానికెక్కడో బంధుత్వం, నాకైతే తెలీదు. నేను జానకిని కోరుతున్నాననే విషయం ఊర్లో అందరికి తెలుసని శీను అన్నప్పుడు నిజమేనా అనే సందేహం? అరె, నా పైన కూడా జనాలు మాట్లాడుతున్నారా? నా గురించి కూడా కథలు అల్లుతారా? అల్లికలో నేనూ, జానకి. పుట్టించాలి, కొత్త కొత్తవి మాట్లాడాలి. నేను చూడ్డం మాత్రమే కాదు, కలిసి తిరిగేవాళ్ళమనో ఇంకేమెమో చేసేవాళ్ళమేమోనని. చుట్టాలి. నాపై పుకారు, సాధించాను. నేనూ ఓ గుర్తింపుని సాధించాను. మీరు మాట్లాడుకునేందుకు, నాపై జెలసి పొందడానికి నేనూ ఓ విషయమైనాను. త్రుప్తి, జానకిని ఆ చిన్నత్తని ముద్దాడినట్లు కల.

తప్పట్లు,

మేళాలు

సందడి. పండుగ. పెళ్ళి కూతురుగా జానకి గుడి దగ్గరికొస్తుంది. చుట్టూ అంత వాళ్ళ బంధువులు. మనక్కదే పెళ్ళి, మా ఇంట్లోనే పెళ్ళి. రండి, చూడండి తలుకూలీనుతున్న నా బట్టలను, చూడు మాదెంత అందమో, సొల్లు కార్చుకోండి. బురద, చూసుకొని నడవండి. హై, రాయితో కొట్టు, రోడ్డు మీద అడ్డంగ ఉంది కుక్క. నేనూ వెళ్తున్నాను పెళ్ళికి, నువ్వోస్తున్నావా? లేదు, ఆ ఇంటోళ్ళతో మేం మాట్లాడం. పొద్దున వస్తాను తలంబ్రాలకు. రాత్రి చలి, ఎక్కడ పడుకుంటాం? ముందుగానే ట్రాక్టర్‌లోకెళ్ళి స్థలం చూసుకుందాం. పరిగెత్తు. కంచం ఎవ్వరు పట్టుకుంది. రేణుక వాళ్ళమ్మ. ఏముందిరా రేణుక? బాగా బలిసినాయి. లవరు ఉంటాడు కాలేజీల. ఇంత ఇరగబాట్లు ఉన్నప్పుడు లవరు ఎందుకుండడు? తిప్పు, తిప్పు పిర్రలని. ఓ ఫొటోలాయన, ఇంకో ఫొటో తియ్యి. జరగండి, కెమెరాకు అడ్డమున్నారు, పెళ్ళి కూతురు కనిపిస్తలేదు. అమ్మా, నీకే చెప్పేది. ఏడుస్తుంది పెళ్ళి కూతురు. వెక్కి వెక్కి ఏడుస్తూ నడుస్తుంది. ఏడవాలి, అదే సంప్రదాయం.

ప్రతేడు నీ పాదాలు ముద్దాడే మా పొలం, నీ జడకి పూజ చేసే దొమ్మి కాడి చెండుపూలు, నీ గాలిని పీల్చి నాట్యమాడే దర్గా వేప చెట్టు, ఇంకెన్నో ఊరి జ్ఞాపకాలు. అన్నీ నిన్ను మరిచిపోతాయి. అయ్యో మరుపు. ఏడ్చు. ఇదే కుక్కలు ఇకనుండి నువ్వు ఊరికొస్తే ఎవరో కొత్తామెనని నిన్ను చూసి మొరువడం మొదలెడుతాయి. నువ్వు ఇన్నాళ్ళు బుగ్గలు గిల్లి నవ్వుకున్న పసిపిల్లలు రేపటి నుండి ఎవరో జానకి, మాకేం తనతో అనేస్తారు. నీ చూపులతో మాకు, మా ఆశలతో నీకూ కాలం చెల్లిపోతుంది. నువ్విక పూర్తి పరాయిదానివి, ఆడబోయే ఆటలన్ని పరాయివే. కలలు, నవ్వులు, వయ్యారాలు, కబుర్లు, చూపులు అన్ని ఒక్కరివే. ఇంత విశాలమైన నువ్వు కుచించుకపోవడం. ఏడువు ఇంకా ఏడువు! ఇక నుండి మాట్లాడబోయే ప్రతి మాట, చేయబోయే ప్రతిపనికి అడ్డుగా ఇంకొకరు, దాన్నే నువ్వు పుణ్యంగా భావించడం. నీలో నీ భర్తుంటాడు. నీ మాటలో, నీ నవ్వుల్లో, నీ చూపులో, నీ ప్రతి చేష్టలో అతనే ఒక్కడిగా నిండిపోతాడు. నువ్వు నాశనమైపోతున్నావ్. నీ జ్ఞాపకాలిక ఎందుకూ పనికిరాక దిబ్బలో పారెయ్యబడతాయి. నీ శరీరాన్ని పురుగులు తింటాయి. మరుపు, చావు విడదీయలేని సాపేక్షాలు. చస్తున్నావ్. నీ ఆడంబరమైన ఆ అలంకారాలు చూస్తుంటే బలికి తీసుకెళ్ళే గొర్రెపిల్ల గుర్తొస్తుంది. మానవ పాప పరిహారార్థం బలికాబోతున్న దేవుని గొర్రెపిల్ల. ఏడవండి, మీరు మీకోసం మీ పిల్లలకోసం ఏడవండి.

ట్రాక్టర్లో అంతా జానకి వాళ్ళ చుట్టాలు, అంతా వాళ్ళే. మా వీధి పెద్దవాళ్ళు గానీ, కుర్రాడు గానీ ఒక్కడు కనబడలేదు. లేకుంటే నేనూ పెళ్ళికి వెళ్దామనుకున్నాను. నాగేంద్రమ్మ వెళ్తుంటే తన చీర రంగుని పట్టుకొని వీరేశ్ బాబు ట్రాక్టర్ ఎక్కాడు. నన్ను రమ్మని కోరితే, ఇంట్లో వాళ్ళకి చెప్పకుండా రాలేనని చెప్పేసాను. ట్రాక్టర్ వెళ్ళిపోగానే నేనేందుకు పోలేకపోయానని బాధ. కిరాణం దగ్గర నేను, నాతో జాఫర్ ఇద్దరమే ఉన్నాం. కొద్ది సేపుకు అంజీ, తిరుమల్ ఇద్దరు అక్కడకొచ్చారు. బైకు మీద జానకి పెళ్ళికి వెల్దామని చెప్పగానే ఉత్సాహం. వాడు రావడం నాకు కావాల్సినంత ధైర్యం. ఇప్పుడు ట్రాక్టర్ వెళ్ళిపోయాకా ఇంటి దగ్గరికెళ్ళి నేను బట్టలు మార్చుకొని అమ్మా పెళ్ళికి పోతానంటే ఎట్లుంటుంది? ఏ సంబంధం, మా కులం కాని పాపకోసం వెళ్ళడం? అంజీ తన బట్టలు ఇస్తానని అవే వేసుకొని రమ్మని ఇంటికి తీసుకెళ్ళాడు. అంజీ కొడుమూర్లో చేస్తున్న వ్యాపారం రంజుగా నడుస్తుంటుంది, డబ్బు సంపాదన మొదలవ్వగానే స్వాతంత్ర్యం, ధైర్యం. నాకెప్పుడూ ఇవన్నీనూ. ఇంట్లో అడిగితే పెళ్ళికని పొద్దునే వస్తానని చెప్పినా వాడి అమ్మవాళ్ళు ఏమనలేదు. నాకు ఓ జత ఇస్తే వేసుకున్నాను. బైకు తీసాడు. తిరుమల్ పెళ్ళికి రానన్నాడు. తిరుమల్ వాళ్ళ కుటుంబానికి, జానకి వాళ్ళ కుటుంబానికి పాత పగలు. జాఫర్ మాతో పాటే బైకు ఎక్కాడు. అంజీ ఫోన్ చేస్తే ఇంకో ముగ్గురు కుర్రాళ్ళు కూడా ఇంకో బైకు మీద సిద్ధమయ్యారు.

ఇలా బైకు మీద వెళ్ళి, మేమెవ్వరం పెళ్ళికి రాలేదనుకునే జానకికి కనిపించి, చూడు ఇక్కడ కూడా నిన్ను మేం వదలమని నువ్వెట్ల మమ్మల్ని అన్యాయం చేసి పెళ్ళి చేసుకుంటావో చూస్తామని పొద్దునే తలంబ్రాలు అయ్యేలోగా తన్ని లేపుకపోయి. మరుసటి రోజు ఉదయం సంచలనం. లేచిపోయిన పెళ్ళికూతురు, కులం కాని పిల్లని పెళ్ళి చేసుకొని ఇంటికొచ్చిన శివ. ఎక్కడ చూసినా నా మాటలే. కొత్త కొత్త పుకార్లు. మీకు తెలుసో లేదో ఆ పిల్ల, వాడు ఇద్దరు పెళ్ళికి ముందే బుంచిక్ బించిక్. సిగ్గులేని పిల్ల. బజారుది, బరి తెగించినేది. అన్ని పుకార్లని ఒక్కొక్కటిగా ఇద్దరం విప్పుకొని నవ్వుకుంటాం. గట్టిగా, కావాల్సినంత ఆనందంగా.

రేవతి పెళ్ళికి తానెట్ల వెళ్ళాడో, తనకోసం తీసుకపోయిన చీర బహుమతి గురించి చెప్పాడు అంజీ. నన్ను ఏదైనా బహుమతి తీసుకెళ్తే బాగుంటుందన్నాడు. ఏం తీసుకెళ్తావ్? చేతిలో చిల్లిగవ్వ లేదు, ఇవ్వడానికి ధైర్యం ఉండదు.

ఒకచోట పెళ్ళికి వెళ్తున్న ట్రాక్టర్ కనిపించింది. దాటేసేయ్. మనం కనిపించాలి. మనల్ని గుర్తించాలి. ట్రాక్టర్లో పెళ్ళికూతురు ఈ పెళ్ళికొడుకుని చూడాలి. ఇన్నాళ్ళు తన వెంటపడ్డ వాళ్ళేవరు రాకపోతే మరిచి పోయుంటారని బాధపడుతుందేమో. గుర్తు చెయ్. మేమింకా నీకోసం ఉంటామని. నీవే అన్యాయం చేస్తున్నావని గుర్తు చెయ్యి.

మేం బైకు మీద కూతలు పెడుతూ ట్రాక్టర్ని  దాటడం, ట్రాక్టర్ లోని వాళ్ళు మమల్ని చూసి కూతలెయ్యడం. వీళ్ళేందుకొస్తున్నారు అనుకుంటారా ఎవరైనా. అనుకోని, ఇంకేమైనా అనుకోని. ఇదే చివరి జ్ఞాపకం జానకితో. నేటితో అన్ని ముగిసిపోతాయి. ముగింపుని అన్ని అనుమానాలకు కేంద్ర బిందువు చేద్దాం.

మేం కనకవీడుకి వచ్చిన పావుగంటకి ట్రాక్టర్ వచ్చేసింది. అది ఏ గుడి దగ్గరైతే ఆగిందో అక్కడికొచ్చాం. రానని, ఏం ఇలా వచ్చావని వీరేశ్ బాబు నవ్వుతున్నాడు. వాడు మాత్రమే కాదు, అక్కడ పట్టపై కూర్చున్న జనాలో ఇంకొందరు ఏవేవో కారణాలు సంబరాలు తలచుకుంటూ

నవ్వుకుంటున్నారు. అందరి నవ్వుల్లో ఏం ఆశ్చర్యం? కానీ తానూ నవ్వుతుంది. ఒకచోట తనపక్కన రేణుక, నాగేంద్రమ్మ ఇంకెవరో ఇద్దరు యువతులు చుట్టూ. నన్నింకా చూసిందో లేదో? అసలు తను నవ్వడం ఏంటి? ఏడవాల్సిన సమయం కాదా ఇది?

ఇంతసేపు ఊర్లో ట్రాక్టర్ ఎక్కేంత వరకు తను ఏదో కోల్పోయినట్లు ఏడుపు, ఇంతలోనే నవ్వులు. నాటకం, అబద్దాలు. ఎంత నవ్వుకుంటుంది జానకి. నవ్వొద్దు, నువ్వు ఏడవాలి. నేనూ శివని ప్రేమించానని, వాడు అడిగి ఉంటే వాణ్ణే చేసుకునే దాన్నని వాడే ఆలస్యం చేసి చెప్పుకోలేదని తానూ ఆడపిల్లగా చెప్పుకుందుకు తనకి సిగ్గయ్యిందని, అందుకే ఇలా బలవుతున్నానని... ఏడు. నువ్వేడిస్తేనే నాకు తృప్తి. ఎందుకు నవ్వుతావు? నువ్వు నవ్వడం నాతలపై గొడ్డలి వేటు. ఏంటి? ఊరు వీడటం, జ్ఞాపకాల్ని చెత్తకుప్పలో పారేయ్యడం, మమ్మలందరిని వదిలెయ్యడం ఇవ్వన్నీ నీకు నవ్వు తెప్పిస్తున్నాయా? కనీసం మీ అమ్మని తలుచుకో--- అయినా నవ్వుతున్నావ్. ఎంత మాయ చేసుంటాడు ఆ పెళ్ళికొడుకు నీతో ఫోనులో? వాడికి పడిపోయావ్. కామం, ఇదే రెచ్చగొడుతుంది. ఇన్నాళ్ళు కలలు కన్న స్వర్గం నేడు సంప్రదాయ రీతిలో లభిస్తుంది. కోరిక, ఆశ, అబద్దాలు, మాయ, భ్రమ.

అంజీ ఒకచోట కూర్చొని లూడో కింగ్ ఆట మొదలెట్టాడు. వాడి చుట్టూ ఆడే నలుగురు పిల్లలు. నేను, నాతో వీరేశ్ బాబు ఊరికే జానకివాళ్ళు వైపు చూసుకుంటూ మాట్లాడుకుంటున్నాం. జానకి ఆ నలుగురు యువతులతో గుడి బయటకు వెళ్ళింది. మూత్రంకేమో. నేను, వీరేశ్ కూడా లూడో కింగ్ దగ్గర కూర్చున్నాం. బయటకు వెళ్ళిన యువతులు గుళ్ళోకొచ్చారు. జానకే, మిగిలిన వాళ్ళని తప్పించి మావైపు రావడం. చూస్తోంది, నిలబడి మేం ఆడేది చూస్తుంది. అందరూ తలలు ఎత్తగానే ఆడుకొండన్నా అనుకుంటూ నవ్వుతూ పరుగు. గలగల గజ్జలు. మా దగ్గరకొచ్చి నిలబడడం ఏంటి? పెళ్ళికూతురైన భయం లేకుండా. మోహమాటమేమి పెట్టుకోకుండా ఓ మాట అనేయ్యడం. జానకికి, మిగిలిన ఆ యువతులకు ఎంత తేడా? ఇష్టమైతే తను దైర్యంగా చర్చికి వెళ్ళగలదు, సైకిల్ తొక్కగలదు, ఊర్లో కుర్రాళ్ళతో మొఖం మీదే తిట్టేయ్యగలదు, చెంపలు పగల గొట్టగలదు, ఒంటరిగా ఒక్కత్తే ఆ బీరప్ప వెంట కూలికెళ్ళగలదు. ఆ సహజత్వం, ఆ నిస్సంకోచం, ఆ స్వేచ్ఛ అదేగా నన్ను ఆకట్టుకుంది. ఇకపై ఇవన్నీ తనలో నిలుస్తాయా? దేవుడా, కావాలంటే బంధాన్ని తెంచు, తనని చంపకు.

పెళ్ళికొడుకు ఇంటికి ముందుగా ఐదు మంది మగవాళ్ళు వెళ్ళాలని అక్కడే భోంచేసి పెళ్ళివాళ్ళు గుడి దగ్గర విడిది చేసిన విషయం చెప్పాలని. అదే సంప్రాదాయం. బైకుల మీద వొచ్చిన మేం ఆరుమందిమి, మాతో వీరేశ్ బాబు, ఇంకా శీను. ఈ శీను, ఇప్పుడు ఇక్కడ నన్ను చూసి ఏమనుకుంటున్నాడో, వాడికి నాకూ ఆ రోజు బడి దగ్గర సంగతి నుండి మాటల్లేవ్.

పెళ్ళికొడుకు ఎలా ఉన్నాడో చూడాలనుకున్నాను కానీ, ఇంట్లో నుండి బయటకు అడుగు పెట్టడే. శీను వరసలు కలుపుతూ బయటకు రా బావా, సిగ్గు పడకని గెన్నగింపులు. బావా అంటుంటే అది నన్నేమో అన్నట్లు. రాడు, ఆయన బయటకు రాడు. హంతుకుడు. జానకిని చంపబోయే కిరాతకుడు.

మేమంతా ఎలాగో ఓ మిద్దె మీద స్థలం దొరకబొచ్చుకొని పడుకున్నాం. పొద్దున నిద్ర లేచి చూస్తే పక్కన వీరేశ్ బాబు తప్ప ఇంకెవరు లేరు. అంజీకి ఫోన్ చేస్తే తాను ఊరికి వెళ్తున్నానని వొచ్చేట్లు ఉంటే గుడి దగ్గరికి రమ్మన్నాడు. తలంబ్రాలు అయ్యాక వెళ్దామన్నా వినడు. నేను రాననేసాను. వీరేశ్ బాబుని నిద్రలేపి మిద్దె మీద నుండి కిందకొచ్చాం. సమయం నాలుగవుతుంది. అప్పటికే ఆ ఊరి జనాలు బండ్లు,

సైకిళ్ళ మీద నీళ్ళకోసం పరుగులు తీస్తున్నారు. ఇంత పొద్దునే. రేపటి దినం జానకి ఇంతే. ఆ ఇంటి ముందు కసువు ఊడుస్తూ, సామాన్లు కడుగుతూ, ఆ మొగుడి పక్కన పడుకుంటూ. ఆ గోడలకు ఆనించి బూతు. ఆ జడ పట్టుకొని, ఆశరీరాన్ని నలుపుతూ, జానకి నోటి నుండి అరుపులు. ఆ నోట్లో వాడి బుల్లి. ఎన్ని భంగిమలో, చెమట, అలుపు, భావప్రాప్తి. ముందు వాడిదో, లేకుంటే తనదో.

తలంబ్రాలు ఏదో పాత గుడి దగ్గర అంటా, పొద్దున ఆరు గంటలకే అంటా. డప్పు మేళాలతో జనాల్ని ఆ పాత గుడి దగ్గరకు తీసుకొచ్చారు. నాగేంద్రమ్మని ఏదో విధంగా పలకరించాలని వీరేశ్ బాబు ప్రయత్నిస్తున్నాడు, కుదరట్లేదు. జానకి రెండో అమ్మ, మా చిన్నత్త తను పెళ్ళికి రాలేదంట. గుడిసె దగ్గరి స్థలం విషయంలో ఏదో గొడవై తను వాళ్ళ పుట్టింటికి పోయిందంట. వీరేశ్ బాబే చెప్పాడు.

జనాలను తోసుకుంటూ ముందు వరుసలో జానకి ఎదురుగా నిలబడ్డాను. ఆ పెళ్ళికొడుకెవ్వరో నాకు అనవసరం. జానకి నావైపు చూడాలని, అరె, నే శివను పెళ్ళాడే దానినని, విధి నన్ను ఈ మురికి కూపంలో తోసిందని ఆ కళ్ళలో బాధ కనిపించాలి. జరగవు, అనుకున్నవేవి నిజం కావు. తను ఆ మొగుడి పక్కన మాటికి నవ్వుతుంది. ఇన్నాళ్ళ మా అనుబంధం తనకు ఇంత చులకనై పోయిందా? పోయి ఓ పెద్ద రాయిని తీసుకొని తన తలపై వెయ్యాలి, అప్పుడైనా ఏడుస్తుందేమో? అప్పటికీ నవ్వితే, నా తలపై వేసుకుంటాను.

తలంబ్రాలకు రావాల్సినేది, తలంబ్రాలు అయ్యాక వొచ్చింది మా ఊరి నుండి ఇంకో ఆటో. అందులో మా అన్న కూడా వచ్చాడని తెలిసింది. నేను గుడి నుండి బయటకొస్తే బీరప్ప, ఇప్పుడే ఆటో మీద వచ్చాడంట, నన్ను కలిసి గుళ్ళోకి వెళ్దామని అడిగాడు. మళ్ళీ గుళ్ళోకొచ్చాను. బియ్యం చల్లుతున్న బీరప్పని జానకిచూసి, నవ్వు. తల ఊపడం, వాడు ఊపడం, ఏదో సందేశం. చుక్కలు. బీరప్ప వెంట ఒంటరిగా కూలీకి వెళ్తుండటం, వీధుల్లోకి వస్తే బీరప్ప పెళ్ళాన్ని మాట్లాడిస్తూ వాడితో ముచ్చట్లు పెట్టడం, కిరాణం దగ్గర ఆనాడు వాడు తన చేతినుండి ధైర్యంగా ఆ సొంగలు గుంజుకున్నా నవ్వడం. చుక్కలు---ఈ బీరప్ప ఒక్కడేనా, ఆ దివాకరం, ఇంకొడు ఆనంద్ అంటా. ఎంతమంది? నాకెందుకు చోటివ్వలేదు.

సెలవ్ మిత్రమా!!

నీతో నాకు,

నాతో నీకు.

నీ పయనంలో నాకెన్ని వజ్రాలు దొరికాయో. ప్రతి వజ్రం నన్ను ఆకాశానికి పరిచయం చేసింది. ఆ ఆకాశం నన్నెంత ముద్దు చేసింది. కోరగానే చెండు పువ్వు కలలు, నిశ్శబ్ద గీతలు.

నేస్తం,

ఆ ఆకాశం నీవు లేని నన్ను చూసి దూరం పెట్టేస్తే.

ఆ కలలు,

ఆ ఊహాలు

నేనెట్ల పొందాలి?

పొద్దునే వచ్చిన ఆటో వెంటనే తిరిగి వెళ్తుంటే దాన్లో ఎక్కేశాను. ఆకాశం మొత్తం నీలి మేఘాలు, వర్షం వొచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. ఈ ఆటో మెల్లిగా వెళ్ళట్లేదు. గుంతల్లో కూడా అదే వేగం. బురద ప్యాంట్ మీద. మెల్లిగా వెళ్ళొచ్చు కదా. అబ్బా, ఈ చీమ ఎట్లా దూరింది ప్యాంట్ లోకి. సరిగ్గా

బుల్లి మీదే కొరకాల. అక్కడ నేనెవ్వరికి చోటివ్వాలనుకున్నాను, నీకు కాదు. పగ, ఆ బుల్లి దగ్గర మూతి పెట్టేందుకు అవకాశమివ్వని జానకికి, ఈ సృష్టికి అందరికి నాపై పగ. నలిపేస్తాను.

# 5

॥వాయురనిలమమృతమథేదం భస్మాన్తగ్ం శరీరం ఓం

క్రతో స్మర కృతగ్ం స్మర క్రతో స్మర కృతగ్ం స్మర॥(ఈశావాస్యం)

ఈ శరీరం కాలి బూడిద అయిపోతుంది. ఈ శరీరప్రాణం మరణంలేని ప్రాణంతో కలిసిపోతుంది. ఓ మనసా! చేసినవాటిని విచారణ చేయి, విచారణ చేయి.

ఎంత నికృష్టమైన చావు. చేతులకి, కాళ్ళకి పుండ్లు. ఈగలు, పురుగులు. మా పెద్దమ్మ స్నానం చేయిస్తుంటే ఆ మోకాలి దగ్గరనుండి పురుగులు కిందకి రాలి పడుతున్నాయంట. నొప్పి అనిపిస్తే గోక్కో లేకపోవడం, పిలిచినా పలికేవాళ్ళు లేకపోవడం. రాత్రుళ్ళ పూట ఏమేమో అరిచేది. సంబంధం లేని విషయాలు, వింత వింత అనుభవాలు. ఆ అరుపులకు నాకైతే ఏ అర్థం సూర్పించేది కాదు గానీ అది తన ఆనందం. నిజాలన్ని భయపెట్టేవి అయిన ఊహలు, కలలు. ఈ కలలనేవే లేకపోతే ఈ బతుకంత మృగ్యం ఇంకోటి ఉండదు. ప్రతి మనిషి ప్రతి క్షణం చావునే కోరుకుంటాడు. కల అనేది జీవం, వరం, ఆనందం, ఈ నోటికి దొరికిన అమృతం.

చీకటిని చీల్చుతున్న పొగ. ఆ పొగలో ఎవ్వరిదో రూపం. దెయ్యమేమోనని భయపడ్డాను. ఎట్లాగో ధైర్యం చేసి ఎవరూ అనేసాను.

"నేను ఈశ్వరుణ్ణి. "

"ఈశ్వరుడికి నాతో యేటి పని?"

"నీ ఏడుపు విన్నాను. నీకేదైనా చెయ్యాలని వచ్చాను. "

"ఏం చేస్తావ్. కోరినవన్నీ చెయ్యగలవా"

"నాకు సాధ్యం కానిదేమి ఉండదు. "

"అయితే ప్రత్యామ్నాయ సృష్టి. "

"అంటే. "

"ఏం లేదు. కోట్ల ఏండ్ల క్రితం భూమిని ఓ శకలం ఢీకొట్టిందని చదివాను. అది ఢీ కొట్టకుండ ఆపడం. "

"తథాస్తూ..."

ఈశ్వరుడు వొచ్చినట్లు, నేనేదో తమాషా కోరిక కోరినట్లు. అంత కల. నిజం కాదు. నేనెక్కడున్నానో నాకర్థం కాలేదు. నా చుట్టూరా మొత్తం పొగలు. ఎక్కడ భూమి ఆనవాలు చిక్కట్లేదు. నేను ఓ పెద్ద బండ మీద కూర్చోనున్నాను. నాకు పక్కన ఎవరో? ఇంతకు మునుపు కనిపించినా అదే రూపం. ఈశ్వరుడు కదా ఆయన పేరు. అతను తన వేలుని చూపిన వైపు చూస్తున్నాను. అది భూ ప్రపంచం.

భూమిపై పెద్ద రూపాలున్న డైనోలు, భయంకరమైన పక్షులు. ఓ అత్యద్భుతమైన ప్రపంచాన్ని, మునుపెవ్వరు చూడని లోకాన్ని నే చూస్తున్నాను. ఓ భారీ శకలం వాటిని నాశనం చేసేందుకు భూమి

వైపు దూసుకొస్తుంది. వాటి జీవనం ఇంకెంత సేపు నిలిచుండలేదు. ఆశ్చర్యం, అంత దాకా భూమి వైపే దూసుకొచ్చిన ఆ శకలం దిశ మార్చుకోవడం... భూమిపై ఎటువంటి ఉపద్రవపు ఆనవాళ్ళేమి లేవు.

ఈశ్వరుడి సమక్షంలో కాలం పరిగెత్తుతుంది. భూమిపై ఎన్నో మార్పులు. అన్ని మార్పులకు అనుగుణంగా డైనోలు జీవన స్థితుల్ని మార్చుకుంటున్నాయి. కొన్ని పాత రకం బల్లులు పోయి కొత్త కొత్త రూపాల్లో బల్లులు కనిపిస్తున్నాయి. కొన్ని బల్లులకు తోకల్లేవు.

"ఇదే ఏ సంవత్సరం".

"నువ్వడిగేది అర్థం లేని ప్రశ్న. మాటలనేవే అర్థం లేనివి. మనుషులు భూమిపై లేరు కాబట్టి పదాలు లేవు. లెక్కకట్టే స్థితిగతులు, లెక్కకు కొలమానాలు ఏవీ లేవు. సమయం అనే దానికి ఆది అంతే లేనప్పుడు ఇది ఫలానా యేడు అని చెప్పుకోవడం అవివేకం. "

"మరి నీ మాటల్లో నాకర్థమవుతున్న పదాలు. "

"అవి నావి కావు, నీవి"

"ఈ ప్రత్యామ్నాయ సృష్టిలో నాకు బుద్ధున్ని చూడాలనుంది. "

ఈశ్వరుడు నా చెయ్యి పట్టుకొని ఓ పెద్ద అడవిలోకి తీసుకెళ్ళాడు. నేను ఇప్పటివరకు ఎరగని చెట్లు, పూలు. వాటిలో అందాన్ని కొలిచి చెప్పేందుకు నేను తప్ప ఇంకో మనిషి లేడు.

"ఇతడే బుద్ధుడు. "

భూమిలోపలి కలుగులోకి పరుగు పరుగునా వెళ్తున్న ఎలుక. దాన్ని బుద్ధుడని ఎలా పిలుస్తున్నాడు? పెద్ద ముక్కున్న భయంకరమైన పక్షి ఆ ఎలుకని ఎత్తుకెళ్ళింది.

"ఇది బుద్ధుడు కాదు, తనను తాను రక్షించుకోలేని చిట్టెలుక. "

"మానవ పరిణామం జరగనప్పుడు బుద్ధుడు మనిషిలా ఉంటాడని ఎలా అనుకున్నావ్. ఈ బుద్ధుడికి దుఃఖానికి కారణాలు వెతికేంత చైతన్యం, పరిస్థితులు లేవు. అలాంటి ప్రయత్నమే ఓ పిచ్చిపని ఎలుకల దృష్టిలో. "

మానవీయ బుద్ధా! ఇక నువ్వెట్లా ఆదర్శమవుతావ్ నీ జాతికి.

"వర్ధమాన జిన్నుడు. "

"పద, చూపిస్తాను. "

చిన్న చేపలను తింటున్న ఓ పెద్ద చేప... దాని మీసాలపై రక్తపు చుక్కలు. సమస్త భూతాల్లో తన ఆత్మని చూసుకున్న జిన్నుడు విచ్చలవిడిగా వేటాడే భయంకర చేప.

"సమస్త భూతాల్లో తన ఆత్మని చూసుకుంటున్నాడు కాబట్టే తనని మింగే తనకంటే పెద్దచేపని జ్ఞప్తికి ఉంచుకుని తను చిన్న చేపలను వేటాడుతున్నాడు. "

సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. మానవ అద్భుత కట్టడాల ఆనవాలు లేదు. భూమిపై రక్తపుటేరులు పారించిన చక్రవర్తులు లేరు... మతం లేదు, ఈశ్వరుడు లేడు, పూజలు లేవు. ఎపిక్యూరస్, జీసస్, కార్ల్ మార్క్స్, గాంధీ, చాప్లిన్. నేనెవ్వరినైతే ఆరాధించానో వాళ్ళంత అబద్ధాలై పోయారు. కమ్యూనిజం అబద్ధం, ప్రజాస్వామ్యం అబద్ధం. నేను ఇప్పటివరకు వల్లెవేసిన నీతులు, ధర్మాలు, సంస్కృతులు అన్ని అబద్ధాలే. కనీసంత బల్లుల జాతి అయినా మానవుడిలాగా పరిణామం చెందలేదు. కారణం అడిగాను.

"ఆ జాతికి హానిచేసే మరో జాతి లేనప్పుడు వాటి సంఘర్షణ కేవలం కొన్నింటికే పరిమితమైంది. తమని ఢీకొట్టే వాళ్ళేలేరని తమలో తామే గొడవలు పడతాయి. సంఘ జీవనం వీటికి బహుకష్టం. "

డైనోలు అంతరించే పరిస్థితి మారితే ఈ సమస్త ప్రపంచమే అర్థం కోల్పోతుందా?

"ఇప్పుడు ఇవి ఇలా బతకడానికి కూడా చాలా కారణాలు దోహదమయ్యాయి. అనంతమైన పరిస్థితులు ఇప్పుడు ఈ బల్లుల ప్రపంచానికి సహకరించాయి. ".

ఒక సంఘటన ఆధారంగా ఇంకోటి. మనుషుల జాడకి ఆనవాలు మరో రూపంలో వొచ్చినా బుద్ధుడు పుట్టేందుకు ఆస్కారం ఎప్పటికి వొచ్చేదో? నే చూసిన చరిత్ర మొత్తం తిరోగమనాలు. నీతులు, ప్రేమలు ఆకొత్త మానవుల్లో ఏవిధంగా ఉండేవో? ఏది నిజం? ఏది అబద్ధం? ప్రతి సంఘటన వేలరకాల ఫలితాలకు జన్మస్థానం. ఆ ప్రత్యామ్నాయ లోకంలోనే జానకిని కూడా చూసాను. బురద పురుగు, దీన్ని ఇప్పుడు నే ప్రేమించలేను, కోరుకోలేను, అసహ్యం. జానకెవ్వడికి కావాలి?

నా పక్కన ఈశ్వరుడు లేడు. నేను ఊరికే అటు ఇటు చూస్తున్నాను. నా పాదాలకు తడి అనిపిస్తే కిందకు చూసాను. ఓ పిల్లిపిల్ల నా పాదాలు నాకుతోంది. దాన్ని పక్కనే పెట్టుకొని దువ్వుతున్నాను, ఒద్దికగా కూర్చుంది అది.

అందం అంటే ఏమిటనే సందేహం పుట్టింది. బురదలో కుక్క, ఆ కుక్క చుట్టూ ఈగలు. నాకు బురద అసహ్యం. ఈగలు, బురద ప్రేమికులు. ఇయ్యి ఇయ్యి మంటూ. చచ్చిన పురుగుని లాక్కెళ్ళుతున్న చీమలు. సమిష్టి శ్రమ, కృషి. ఒకదాని చావు, మరోదాని తృప్తి. చెట్టు పై కొమ్మ నుండి ఆకాశానికి నిచ్చెనేస్తున్న గువ్వలు. వాటి నుండి కొత్త రాగాలు. పదాలు లేవు. అర్థం తెలీదు. సాయంత్రపు సూర్యుడి వెలుగుకి మెరుస్తున్న ఆకులు, వజ్రాలు, దోచుకోలేని ముత్యాలు, నిశబ్దం చెప్పే గీతాలు.

మరి శరీరం,

అదెలా ఉంటే అందం?

జానకిపై నా ఆకర్షణకు మొదటి కారణం తన శరీరం. ఓ కత్తి తీసుకున్నాను. తనలో నన్ను మొదటగా ఆకర్షించిందేంటో ఆలోచించాను. ముక్కు పుడక – తెంచేశాను. కళ్ళు – పీకేశాను. బుగ్గలు – లోపలికి కుట్టేశాను. ఇంకా? బారుగా జడ – కోసేశాను. ఇంకేం నచ్చింది? ఎదలు, పిర్రలు(?) లేదు, ఇంకా? తెల్ల తోలు. దానిపై కందెన పారబోశాను. ఇప్పుడు నేనెవరో! ఆ శరీరమెవరో! జాలి, సొంతం చేసుకోవాలనిపించదు.

అందమంటే?

కవులు,

పూజార్లు,

పెద్దలు, సినిమాలు

వర్ణిస్తున్న శరీర భాగాలు. అవే పరమసత్యంగా చాటింపు జరగడం. గొప్పతనంగా ప్రచారం. గొప్పతనం కాబట్టే సొంతం చేసుకోవాలనే ఆలోచన, దోచుకోవడం! పెళ్ళి, ఎక్కువ తక్కువ, వివక్ష!

ఏది సత్యం?

ఆత్మ విచారించు?

ఏది సత్యమంటావ్?

హృదయానికి రమణీయత కూర్చేది అందమైతే, ఆ రమణీయతకు ముందే కొన్ని కొలతలు నిర్దేశించుకోవడమనేది పెద్ద చిక్కవుతుంది. దాన్ని శరీరాలకు ఆపాదించి సొంతం చేసుకోవాలనే నిర్ణయాలు సృష్టించడం నాగరికత అస్తవ్యస్తానికి కారణమవుతుంది.

దోపిడీ సాధ్యం కాని స్థితిలో హృదయ నిజ రమణీయతను స్పష్టంగా చూసే అవకాశం. సత్యాన్ని దర్శించడం, ఆనందానికి దారి. అందం అనేది విశాలత్వం, సహజత్వం, కొలతకి దోపిడీకి లొంగని స్థిరత్వం. కొలతే లేకపోతే వికారానికి ఏమర్థం?

గొప్పతనాలు,
వాటికి నాటకాలు.
జీవితం సత్యమవుతే
లొంగడం నాశనమవ్వడం.
అందం ఆనందమైతే
దోపిడీ వికారం.
పదాలు,
కూర్చేందుకు ఎన్నో అర్థాలు.
ఎట్లయిన
అటు ఇటైన, ఇటు అటైనా.

మాయ మళ్ళీ నన్ను కమ్మేసింది. జానకి నన్ను శూన్యుడిగా మార్చిన బాధ. వీణ, రేవతి, మాదిగామే, అక్క, శ్రీలత, సునీత, రాణి, అలీం అందరూ గుర్తుకొస్తున్నారు.

ఎవరు వీళ్ళంతా? వీళ్ళంతా నాకేమవుతారు? నేనొకవేళ ఇక్కడ పుట్టకపోయి ఉంటే, జానకి చూపు నాకెంత దూరమయ్యేది? ఎవరో తాను? నేను ఇంకో చోట ఇంకెవణ్ణో? తనలోకం తనది, నాలోకం నాది. రాజేశ్వరి నవ్వు నన్ను కదిలించేది కాదు, నన్ను ఎత్తిపాడిచే మారెమ్మత్త నాకు తెలిసేది కాదు. వీళ్ళంతా ఆ శ్రీలత, సునీత, అక్క, అంజీగాడు ఎవ్వరో. నాలోకంలో అప్పుడు ఇంకా వేరేవాళ్ళు ఉండేటోళ్ళు. వేరే అనుభవాలు. పెద్ద బిలినియరో, కూటికే స్థోమత లేని బికారినో. నా ఆలోచనలు ఎలా ఉండేవో. దొంగనో, దొరనో. ఈ ఊహలన్ని ఎంత ఢౌర్భాగ్యంగా ఉన్నాయి? వీళ్ళంతా లేరంటేనే, వీళ్ళ చైతన్యం నాలో భాగం కాదంటేనే నేనెందుకో అనే భావన. వీళ్ళు కాకుంటే ఇంకెవరో? కానవి ఇంత అందంగా ఉండేవా? ఏమో, ఇంత కంటే అందమేమో. ఆనాడు విష్ణుప్రియ నా ప్రేమని ఒప్పుకుంటే కూడా నేనిక్కడే ఆగేవాన్ని. తనకోసం బా చదివి మంచి ఉద్యోగం చేసేవాన్ని. డబ్బు సంపాదించేవాన్ని. పేరు పొందేవాన్ని. ఆ ఆనందం వేరే ఉండేది. జానకి అప్పుడు ఉండేది కాదు, రేవతి చూపు అప్పుడు అంటేది కాదు. ఈ ఆనందం దూరమయ్యేది. అనుభూతుల్లో ఏది ఎక్కువ? ఇంకేది తక్కువ. కొలవడం దేనికి? జరిగేది, జరగబోయేది, జరుగుతుంది అన్ని సవ్యంగానే జరుగుతున్నట్లపిస్తున్నాయి. శారీరక రోగం, చావు తప్ప భయంకరమైన స్థితి అనేదే ఉందా? నవ్వు ఆ నవ్వుతో పాటు ఏడ్పు. ఏడ్పు, ఆనందం రెండు విడదీయలేని సాపేక్షాలు. ఒకదానికొకటి అన్ని ఇంకొన్ని అందమైన అద్భుతమైన అనుభవాల్ని తీసుకొస్తుంటాయి. నేనూ చేయాల్సింది జీవామృతాన్ని జుర్రుకునే శక్తిని పొందటం. ఊరికే చూస్తుండటమే కదా చేయాల్సింది.

ఇంత పెద్ద ప్రపంచంలో కలలు కనేందుకు ఎన్ని అవకాశాలో? జానకి రెండో అమ్మ, నల్ల బంగారం. తనకై ఆరాట పడుతున్నాను, ఆ శరీరాన్ని నే కోరుకుంటున్నాను. కొత్త పోరాటం. ఈసారి నే ధైర్యం చెయ్యాలి. ఆ ఎదలు, ఆ తొడలు. ఓ చిన్నత్త నీ పూకులో నా వీర్యం నింపుతాను. బయటకు నా బుల్లి తీసి చిన్నత్తతో శృంగారం చేస్తున్నాను. వీర్యం కింది పొదల్లో పడిపోయింది.

"జానకిని కోల్పోయాక నాకు వచ్చింది ఏంటి?"

"కోల్పోవడం ఏంటి?"

పిల్లి పలికింది.

"వదిలి వెళ్ళిపోయింది కదా. "

"వ్యక్తుల్ని బంధిస్తావా"

"నేనెందుకు అలా చేస్తాను?"

"అయితే ఆ ప్రశ్న ఎలా అడిగావ్?"

"జానకికై ఆత్రపడి నే సాధించింది ఏంటి? ఇదైనా చెప్పు"

"కలలు, జ్ఞాపకాలు. "

"ఇప్పుడు నేనేం చెయ్యాలి. "

"మరిన్ని వజ్రాలు పోగేయ్యడం. "

సాయంత్రపు సూర్యుడు నా హృదయానికి కొత్త శోభ తీసుకొస్తున్నాడు. ఎగిరే గువ్వలు నాకూ రెక్కల్ని తొడిగించి తమతో పాటే ఆకాశానికి తీసుకెళ్తున్నాయి. నేను పూర్తిగా తేలికగా మారిపోయాను. ఎటు గాలి వీస్తే అటు, ఎటు నవ్వు కనిపిస్తే అటు.

వింధ్య పర్వతాల్లో ఈ భరత ఖండంకు వలసొచ్చిన ఆర్యులు ఈ సాయంత్రపు సూర్యున్ని చూసి ప్రార్థిస్తున్నారు.

"సత్యం యొక్క ముఖం బంగారు తెరతో కప్పబడి ఉంది. ఓ సూర్యదేవా! సత్యనిష్ఠుడనైన నేను ఆ సత్యాన్ని దర్శించడానికి తెరను తొలగించు. "(ఈశవ్యాసం).

----

## ప్రేరణ

ఎన్నో నక్షత్రాలు నాశనమైపోయాయి.
ఎన్నో సామ్రాజ్యాలు, కోటలు, శాసనాలు పూర్తిగా కూల్చబడ్డాయి.
ఎందరో నియంతలు,
ఇంకెందరో ప్రవక్తలు కాల గర్భంలో మరిచిపోబడ్డారు.
సత్యమేంటంటే
ఈ విశ్వ అస్తిత్వంలో ప్రతిదీ విలువలేనిదిగా,
మరియు కొరగానిదిగా మిగిలిపోతుంది.
అలాగే నువ్వూ,
ఈ విశ్వంలో గొప్ప అస్తిత్వంగా నే భ్రమించే నువ్వు,
నీ నవ్వూ,
నీ చర్య కూడా ఏ మాత్రం నిమ్మిత్తం లేనట్లు అబద్దంగా మారిపోయింది.
ఇదే నాకు భరించడం సాధ్యం కాకుంది.